# ముళ్ళపూడి వెంకటరమణ

## సాహితీ సర్వస్వం

### ఐదవ సంపుటం

## కదంబ రమణీయం-2



# ముళ్ళపూడి వెంకటరమణ

## సాహితీ సర్వస్వం

## ఐదవ సంపుటం

## కదంబ రమణీయం-2



# ముళ్ళపూడి వెంకటరమణ
## సాహితీ సర్వస్వం

ఐదవ సంపుటం

# కదంబ రమణీయం-2

సంపాదకుడు: ఎమ్బీయస్ ప్రసాద్




**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

Mullapudi Venkata Ramana Saahithee Sarvaswam-5
KADAMBA RAMANEEYAM-2 - *Editor: M.B.S. Prasad*

ప్రచురణ నెం. : 2350/16

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : జనవరి, 2004

© శ్రీ ముళ్లపూడి వెంకటరమణ, చెన్నై.

ముఖపత్రం, లోపలి బొమ్మలు: బాపు

**వెల: రూ. 150/-**
**విదేశాల్లో వెల: $ 15**

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్, సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.

**హెచ్చరిక:** ఈ పుస్తకంలో ఏ భాగాన్ని కూడా పూర్తిగాగానీ, కొంతగానీ కాపీరైట్ హోల్డరు/ప్రచురణకర్తల నుండి ముందుగా రాతమూలకంగా అనుమతి పొందకుండా ఏ రూపంగా వాడుకున్నా, కాపీరైట్ చట్టరీత్యా నేరం.

అక్షరాలంకారం: ట్వంటీఫస్ట్ సెంచరీ, దిల్‌సుఖ్‌నగర్. ఫోన్: 24066986
ముద్రణ: **శ్రీ కళాంజలి గ్రాఫిక్స్**, హిమాయత్‌నగర్, హైదరాబాద్.



లోక కళ్యాణ సుజ్ఞానుడు
హాస్య సంగీత రస పోషకుడు
సహృదయుడు సన్మిత్రుడు
శాన్తా వర ప్రసాద రెడ్డి గారికి
గౌరవాభిమానంతో
— బాపు, రమణ

Mullapudi Venkata Ramana Saahithee Sarvaswam-5
KADAMBA RAMANEEYAM-2 - *Editor: M.B.S. Prasad*

ప్రచురణ నెం. : 2350/16

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : జనవరి, 2004

© శ్రీ ముళ్లపూడి వెంకటరమణ, చెన్నై.

ముఖపత్రం, లోపలి బొమ్మలు: బాపు

**వెల: రూ. 150/-**
**విదేశాల్లో వెల: $ 15**

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్, సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.

**హెచ్చరిక:** ఈ పుస్తకంలో ఏ భాగాన్ని కూడా పూర్తిగాగానీ, కొంతగానీ కాపీరైట్ హోల్డరు/ ప్రచురణకర్తల నుండి ముందుగా రాతమూలకంగా అనుమతి పొందకుండా ఏ రూపంగా వాడుకున్నా, కాపీరైట్ చట్టరీత్యా నేరం.

అక్షరాలంకారం: ట్వంటీఫస్ట్ సెంచరీ, దిల్‌సుఖ్‌నగర్. ఫోన్: 24066986
ముద్రణ: **శ్రీ కళాంజలి గ్రాఫిక్స్,** హిమాయత్‌నగర్, హైదరాబాద్.



లోక కళ్యాణ సాధకుడు
హాస్య సంగీత రస పోషకుడు
సహృదయుడు సన్మిత్రుడు
ఈశ్వర వర ప్రసాద రెడ్డి గారికి
గౌరవాభిమానంతో
— ము. రమణ

# డైవర్సిటీ... దై నేమ్ ఈజ్ రమణా!

ఈ సంపుటి గిరీశం లెక్చర్లతో ప్రారంభమవుతోంది. ప్రచురణ సమయంలోనూ, ఉత్తరోత్తరా తనకెంతో పేరు తెచ్చిన ఈ రచనను రమణ ఎస్. పార్థసారథి అనే పేరుతో రాశారని ఇప్పుడే తెలిసిన వారికి గుండెలు బాదుకో బుద్దేస్తుంది. ఇంత గొప్ప రచనను శుబ్భరంగా అసలుపేరుతో కాక, మారుపేరుతో రాయడమేమిటని! కానీ రమణ అప్పటికే (అంటే 1960) స్వంతపేరుతో బాగా పేరు తెచ్చుకున్నారు. 'అదే పేరుతో రాస్తే అలవాటుగా మెచ్చేసుకుంటారేమో, వేరే పేరుతో రాసి చూసి అప్పుడూ మెచ్చుకుంటే అది నికార్సైన మంచి రచన అన్నమాట' అని తనకు తానే క్వాలిటీ టెస్టు చేసుకోవడానికి రమణ మారుపేరు ఉపయోగించారు. అదీ ఎం.వి.ఆర్. అనో ము.వెం. అనో మరోటో కాకుండా వేరే వ్యక్తి కాబోలు అనుకునేట్టు, కలంపేరేమో అనే అనుమానం సైతం రాకుండా, ఇంటిపేరుతో సహా ఎస్. పార్థసారథి అనే పేరు సృష్టించి రచన సాగించారు.

తెలుగునాట గిరీశం పేరు తెలియని సాహిత్యాభిమానులుండరు. నూటపదేళ్లనాటి నాటకం 'కన్యాశుల్కం' ద్వారా ప్రవేశించిన కుహనాసంస్కారి గిరీశం. చదువుకుని సంపాదించుకున్న తెలివితేటలతో కపటం, జారత్వం కప్పెడుతూ ఇతరులను బోల్తా కొట్టించే వంచనాశిల్పం నేర్చిన అసలు సిసలైన విలన్‌ను కథానాయకుడిని చేసి నడిపించడం 'కన్యాశుల్కం'లో చమత్కారం. ఇంతటి ధూర్తుణ్ణి పాఠకులు ఏవగించుకోకుండా చేసేందుకు గురజాడ అప్పారావు గారు ఉపయోగించిన సాధనం - హాస్యం! గిరీశం మాటలు, తర్కం, వాదన పాఠకులను నవ్విస్తాయి. కన్యాశుల్క దురాచార దుష్ఫలితాలు, వితంతు వివాహం, యాంటీ నాచ్ ఉద్యమాలలో ఆషాఢభూతుల వ్యవహారాలు, అగ్రహారికుల లౌక్యాలు, దుస్తంత్రాలు - వీటన్నిటినీ ప్రజల దృష్టికి తేవడానికి గురజాడ ఎన్నుకున్న పాత్ర - గిరీశం.

'కన్యాశుల్కం'కు ప్రేరణ 'మృచ్ఛకటికం' అంటారు. కానీ గిరీశాన్ని శకారుడితో పోల్చడానికి వీలులేదు. శకారుడు తన సంభాషణలతో నవ్వు తెప్పించే దుష్టపాత్ర. విలనీ, కామెడీ కలగలిపిన పాత్రయే కానీ గిరీశంలా సంఘంపై విసుర్లు విసరలేదు. రమణకు సమాజపు పోకడల పట్ల ఒక విమర్శనా దృష్టి వుంది, అసహనం ఉంది. చికాకు ఉంది. వాటిని వెలిబుచ్చడానికి జంఘాలశాస్త్రి వంటి 'స్ట్రెయిట్' పాత్రను కాక ఆయన గిరీశం వంటి డొంకతిరుగుడు మార్గాన్ని ఎంచుకున్నాడు. గురజాడ పంథాలోనే ఒక దుష్టపాత్రద్వారానే సమాజంలోని దౌష్ట్యాన్ని నిరసింప జేశాడు. దరిమిలా 'రక్తకన్నీరు' నాటకంలో కూడా ఇలాటి ప్రయత్నం జరిగింది.

కథానాయకుడు దుష్టుడు, కానీ సమాజాన్ని ఘాటుగా విమర్శిస్తాడు. ఇక్కడ కూడా గిరీశం తన లెక్చర్లలో వింత వాదనను వినిపిస్తాడు. నిజమేస్మీ అనిపిస్తాడు. అక్కడున్న పరిస్థితులను సమర్థిస్తున్నట్లు కనిపిస్తూనే దానిపై పాఠకుడిలో ఆలోచనను రేకెత్తించి 'ఇది తప్పు, ఇలా ఉండకూడదు' అని మనసుకు తోచేట్లు చేస్తాడు.

ఇంత క్లిష్టమైన ప్రక్రియను గురజాడంత బాగా వంటబట్టించుకుని రమణ గిరీశం లైఫ్‌ను ఇంకో ఏభై యేళ్లు పొడిగించాడు. ఈనాటి సమస్యలపై ఉపన్యసింప జేశాడు. దీనికి గాను గురజాడ శైలి ఒకటే కాదు, భాష కూడా ముఖ్యం. గురజాడ యావదాంధ్రదేశాన్ని దృష్టిలో పెట్టుకోలేదేమో నాటకాన్ని విజయనగరం అగ్రహారికుల మాండలికంలోనే రాశారు. అర్థశతాబ్ది గడిచాక రమణ రాసేనాటికి ఆ మాండలికం అందరికీ అందుతుందో లేదోనని సందేహించాల్సిన పరిస్థితి ఉన్నా, శుద్ధ వ్యవహారికం వాడితే బాగుండేదేమోనన్న సలహాలు వచ్చే సందర్భం ఉన్నా, ఎలాటి జంకూ పెట్టుకోకుండా గురజాడ భాషలోనే రాసి, 'ఈ గిరీశం వేరే' అని ఎవరూ అనలేకుండా చేశాడు రమణ. కాలానుగుణంగా ఇంగ్లీషుమాటలు అవీ ఎక్కువగా వాడినా, 'గురజాడ వారి గిరీశం ఇప్పుడుంటే ఇలాగే మాట్లాడేవాడు' అని నమ్మేట్లుగానే రాసుకురావడంలోనే ఉంది రమణ ప్రతిభ. ఇక్కడ ఇంకో విషయం ప్రస్తావించాలి. గురజాడలాగే రమణ కూడా ప్రాచ్యులు! ఆయన ధవళేశ్వరంలో పుట్టినా, పూర్వీకులు బరంపురం వారు. ఉత్తరాంధ్రభాషపై పట్టు రావడానికి కుటుంబ నేపథ్యం తోడ్పడి వుండవచ్చు.

గురజాడవేమో అనిపిస్తూనే రమణ చేసిన 'పన్'లు కోకొల్లలుగా కనబడతాయి. టెలుగూస్, విద్యుచ్ఛాస్త్రకారుడు, వా నరమానవుడు, బ్రిలియంట్ల వెధవలు, కాళిదోస్, క్రిటీకా తాత్పర్యాలు, సినీచక్రపాణినీయసూత్రాలు, సెన్సారింగుసర్కస్, టెక్నికల్ హంగారమా, మిస్చీఫ్‌మినిష్టర్లు, కంట్రోళ్లూ రోకళ్లూ, కంఠశోషలిజం, శ్టాటిట్రిక్స్, పాలిట్రిక్స్, పొగరుమోతుబర్లు, కామన్‌ధేనువు, తెరవేలుపులు, గుంటతనప్పిక్చర్లు,... ఇలా! అంతే కాదు, వక్రీకరించి కాయిన్ చేసిన సామెతలూ బోల్డు కనబడతాయి - మీకు వంక బెట్టింది కా అష్టావక్రుడిక్కూడా చేతనవదు, తప్పులో కాలేశావోయ్, మోకాళ్ళా వేళ్లా పడ్డాడు, కిశోర్‌సాహూ షేక్స్పియర్ మీద చేయిచేసుకోవడం, బ్యూటీ (ఒక్కోప్పుడు రెస్ట్) ఫస్టన్నారు, సినిమా చూసేవాడి సొమ్మేం పోయింది పావలా అర్ధణా తప్ప! కొటేషను వాడి బాబు సొమ్ము గాదుగా...వాడి సొమ్మే, ఒక్క దెబ్బకి రెండు పిట్టలెగిరిపోయాయి, ఏమివాయ్, మైడియర్ షేక్స్పియర్! మా వెంకటేశంలా మొహం వేలవేసినావ్! బాకీవాళ్లు ఇవల్యూషన్‌లో అప్పులాళ్లయిపోయారు.

సినిమా పరిభాష - వెయ్యి పిక్చర్లాయుష్మ శత పిక్చర్ ప్రాప్తిరస్తు, నీ యిల్లు రా ఫిల్ముగానూ! నీ కెప్పుడూ ఒక్కలాటి వేషాలే దొరకా! నీ పిక్చరుకు ఒరిజినల్ మ్యూజికు జమపడా! దబ్బులేకుండా చూసి హీరోయిను కాల్షీటివ్వా! ఇవే కాదు, బుడుగులో లాగానే మాట్లాడినట్లు రాయడం ఇక్కడా కనబడుతుంది. ష్ హమ్మయ్య,

షమ్మయ్య, ఝువిటో సార్, కౌరంపించాడు, అద్ధాంత్రంగా, ఆమర్ఝున, డ్రై చేసి, పాండిచ్చెవూ.
ఝ

కొన్ని ఉత్తరాంధ్ర మాండలికం మాటలకు అర్థాలు తెలియకపోతే ఆస్వాదించడం చేయడం కష్టమని వివరణ ఇవ్వడం జరుగుతోంది. బ్రాకెట్లో కనబడేది లెక్చరు నెంబరు. అశనం (2) - భోజనం, అజ (2) - జాడ, గుంటడు, గుంటది (3) - పిల్లవాడు, పిల్లది, అగ్గురారం (3) - అగ్రహారం, మహలావు (4) - చాలా ఎక్కువ వెళ్లిపోచ్చీడం (6) - రావడం, అల్లవాడు (6) - అక్కడి (పరాయి)వాడు, ఊష్ణం (6) - జ్వరం, ఆబోరు (6) - పరువు, హస్తం - అయిదురూపాయలు, మారాముడి (12) - కపటం

కొన్ని వివరణలు:- రాయిటర్ (2) అంతర్జాతీయ వార్తాసంస్థ, సత్యజిత్‌రాయ్ తీసిన పథేర్ పాంచాలి (1954) కళాఖండంగా దేశంలో కంటె విదేశాలలో ఎక్కువ పేరు తెచ్చుకుంది. షేక్స్పియర్ నాటకం హామ్లెట్‌ను కిశోర్‌సాహు (8) సినిమాగా తీశాడు. వి. శాంతారామ్ (8) కాళిదాసు కావ్యం “శాకుంతలం” సినిమాగా తీశాడు. చంద్రలేఖ తమిళం, హిందీలలో (9) వాసన్ తీసిన భారీ హిట్ సినిమా. జగదల ప్రతాపన్ (9) చాలా పెద్ద తమిళ సినిమా. నలుగురు హీరోయిన్లు హంగామా. దీ ఆధారంగానే ‘జగదేకవీరుని కథ’ తీశారు. కె.ఎం.మున్షీ, మురార్జీదేశాయి, రాజగోపాలాచారి (10) సినిమాలను నియంత్రించాలని వాంఛించేవారు.

గిరీశం ప్రవేశం కంటె నిష్క్రమణే అందరికీ గుర్తుండేలా డైలాగు రాశారు గురజాడ. ‘టు బి ఆర్ నాట్ టుబి’ అనగానే హామ్లెట్ గుర్తుకువచ్చినట్టు ‘డామిట్! కథ అడ్డం తిరిగింది’ అనే డైలాగు వినగానే గిరీశం గుర్తుకురాక తప్పదు, అందువల్లనే దీనిలోని దాదాపు ప్రతి లెక్చరు ఆ ట్రేడ్‌మార్క్‌తోనే అంతమవుతుంది. చివరిలో గిరీశానికి ఏదో విధంగా జెల్లకాయ తగులుతుంది. సబ్జక్ట్‌ల వద్దకు వస్తే తొలి లెక్చర్లలో విమర్శించడానికి రమణ ప్రధానంగా ఎంచుకున్న సబ్జక్ట్ సినిమా. తరువాత తరువాత గిరీశం రమణ మాస్కట్ అయిపోయాడు. వ్యంగ్యంగా విమర్శించదలచుకున్నవాటిని గిరీశం అడ్డుపెట్టుకుని రమణ చెడామడా ఏకి పారేశాడు. అవతలి వాళ్లు సీనియర్ హాస్య రచయిత కావచ్చు, ఐకమత్యం లోపించిన ప్రవాసాంధ్రులు కావచ్చు, లిటిగేషన్లు నడిపే ప్రజానాయకులు కావచ్చు, ఎవర్ని ఏకడానికైనా గిరీశం అక్కరకు రాసాగేడు. చురకలు వేసే సందర్భాలను కూడా పొదుపుగానే వాడుకుంటూ రమణ గిరీశాన్ని ప్రజలమధ్యనే ఉంచుతున్నారు. అందువల్ల ఈ లెక్చర్లు ఇంతటితో సరి అనుకోవడానికి వీలులేదు.

దీనిలో తొలి లెక్చరు ‘పుస్తకాలు కొనడమా! బార్బేరియస్: వర్స్ దాన్ సెల్లింగ్ గర్ల్స్’ అంటూ తెలుగువారి పుస్తకాలు కొనే (లేదా కొనని) అలవాటుపై విసురు. “అసలే ఆంధ్రలో ప్రతిమూడోవాడూ కవి. అడ్డమైనవాడూ రాసేస్తున్నాడోయ్ అని

అడ్డమైనవాడూ ఏడ్చి నెత్తి మొత్తుకుంటున్నాడు... మరొహడి చెత్త చదవనపుడు డబ్బు పోసి కొండంవెందుకని ఎలాగూ కొనరు." వంటివి అతిశయోక్తులనడానికి వీలులేదు. ఓ రచయిత సాటి రచయిత పుస్తకాలు కొనే అలవాటు చేసుకుంటే వెయ్యి కాపీలు అమ్మడానికి ఏడాది పట్టవలసిన అవసరం లేదు. అర్థశతాబ్ది తర్వాత చూసినా దక్షిణభారతంలో అతిపెద్దదైన ఆంధ్రదేశంలోని పత్రికలు తక్కిన రాష్ట్రాల కంటె సర్క్యులేషన్ విషయంలో వెనకబడే వున్నాయి. ఆ పరిస్థితి మారేవరకూ ఈ లెక్చరు నిత్యనూతనమే! వసివాడని సత్యమే! అందుకే ఈ వ్యాసాన్ని ఈ సమీక్షకుడు ఇంగ్లీషులోకి తర్జుమా చేసి జూన్ 1997లో ఎ.పి.టైమ్స్ అనే దినపత్రిక సారస్వతానుబంధంలో ప్రచురించినప్పుడు అప్పటి పాఠకులూ చదివి ఆనందించగలిగేరు.

తర్వాతి లెక్చర్లలో గిరీశం మొదట సినిమా తీసిపెడతానని వెంటబడేవాడిలా కనబడతాడు. 7వ లెక్చరులో అసిస్టెంటు డైరక్టరవుతాడు. 12వ దాంట్లో నటుడవుతాడు. ఎక్కువగా మాత్రం స్టూడియో వరండాలో కనబడి హస్కు కొట్టేవాడిలా అగుపిస్తాడు. ఇక గిరీశం చేసే వ్యాఖ్యల వద్దకు వస్తే -

సమాజం మీద - మనవాళ్లు వట్టి వెధవాయలోయ్! అందుకనే మనవాడు ప్రతివాడూ ప్రతి రెండోవాడినీ వెధవాయి అంటాడు. (4) దేశవాళీ జనాభా గురించి మాట్లాడినప్పుడే బంగాళీవాడి ప్రజ్ఞను మెచ్చుకు మనం అక్షింతలేసుకోవాలి. (4) సంప్రదాయానికీ సెంటిమెంటుకీ వెతిరేకం అని మీరలా భయపడడం తగదు. భద్రాద్రిరావుఁడికే దిక్కులేదు. (7) మీరంతా ఓ యూనియన్ పెట్టుకోవాలి సార్. యూనిటీ ఉండి తీరాలని కాదు, పోట్లాడ్డానికైనా ఉండాలిగా (7) సాహిత్యాన్నేవన్నా అంటే సినిమావాళ్లలా పడూరుకోరుగదా (10) సినిమాలన్నీ జీవితంలా ఉంటే అసలే జీవితం అంటే మొహం మొత్తుతున్న జనం సినిమా కెందుకురా అని మానీగ్రలు. అంచేత జీవితాన్ని సినిమా దగ్గరికి జరపాలే తప్ప సినిమాని యంతమాత్రం ఇటు లాక్కూడదు. (10) నేతినేతి అంటూ మనవాళ్లు ఇన్ని సినిమాలు లక్షల ఖర్చుతో హైరాణతో లాగి అవతల పారేస్తూంటే, ఈ నేతి సినిమాల్ని పట్టుకుని, "మనదంతా నూనె సరుకోయ్" అన్న చెవలాయ యవడంట (12) అభిప్రాయాలేవిటి నాన్సెన్స్! అవి చాలా డేంజరస్ సరుకులు. చూస్తూ వుండగా అవే మూఢనమ్మకాలై కూచుకుంటాయి. (13) పెళ్లయ్యాక ఒహళ్ల నొహళ్లు ముట్టుకుందికి సెన్సారువాళ్లు పర్మిషనిచ్చినా ఆనందపడమంటే ఛస్తే పడలేరు. చల్లవణ్ణం తిన్న తరువాత పచ్చడో పప్పో కలుపుకున్నట్టు ఇపుడు రొమాన్సేప్టి సార్ ఛస్తుంటేను అంటారు. (17) పాలవాడు పాతబాకీ కోసం గుమ్మంమీద కూర్చున్నాడు. ఈ మెలోడ్రామా సీన్సు వినిపించాను. కదిలి కరిగి నీరైపోయి పాలలో కలిసిపోయాడు. (19) యుద్ధాలుండబట్టే కదా ఐన్‌స్టయిన్ పుట్టుకొచ్చాడు. యుద్ధం వద్దన్న స్విట్జర్లాండులో ఏవుంది? కుక్కూ క్లాకు! (22) చాలామంది దేశసేవకులకు డబ్బు చేసింది.

(23) మంత్రి కుర్చీ ఎక్కిన మర్నాడే అమెరికా చెక్కేసి ఒక హార్టాపరేషనూ, వాళ్లావిడకో కిడ్నీ బదలాయింపూ లాగించేశాడు. (24) గడసాని అయిదారు నిమిషాలు ఆకలిదప్పులు మరిపిస్తే బంగారప్పగారు ముఖ్యమంత్రి కుర్చీ మీద కసరజ్జేస్తూ అందరికీ ఆకల్దప్పులూ, అవసరాలూ మరిపించేదు గదా, వీడెప్పుడు పడతాడో ఎలా పడతాడో అన్న ఝూసే దప్ప ఇంతకన్నేం గావాలని... (25) గవర్నమెంటు అంటే... నోరు లేని మైనారిటీ వర్గాల్ని ప్రజాబాహుళ్యం అనే రాక్షసుల బారి నుండి కాపాడ్డం.. (26) లైసెన్సు రావాలేగాని కాలేజీల కన్నా స్కూళ్లు లాభసాటి... రూల్సులూ బాదరబందీలూ తక్కువ. సీటుకి అయిదు నుంచి పదివేలదాకా పలుకుతుంది (27)

సినిమారంగం మీద – ఇన్నీ చేసినా భలానా పాత్ర చాలా బాధపడుతోంది, గావున దేవుడా మనవున్నూ దుఃఖించాలి గాబోలు అన్న జ్ఞానం ప్రేక్షకులకు కలగటం లేదట – మరి అంచేతను గావును ఇటుపై సినిమాలో ఈ ఏడుపు సీనులూ గట్రా నడుస్తున్న సమయంలో అది చూస్తున్న ప్రేక్షకుల్ని కుట్టిందికి నల్లున్నీ, గిల్లీ రక్కీ బాధపెట్టిందికి కిరాయి జవానుల్నీ పెడతారట. (6) ఇక్కడ బ్రిలియన్సు పనికిరాదు. హైపవర్ ఫ్లడ్‌లైట్లతో జాగర్తగా లైటింగెరేంజి చేశాక నువ్వక్కడ నిలబడితే నీ బ్రిలియన్సు వల్ల ఎక్కడో గ్లేరు కొడుతుంది. ఎవడ్రా ఇక్కడెవరో బ్రిలియంట్లవెధవలున్నట్లున్నారు తన్ని తగిలీయండంటారు (8) అరవ పిక్చరుకి పాటలు చేసిన మ్యూజకు డైరక్టరు పేరుని, తెలుగులో రీరికార్డింగు చేసినవాడి పేరులోకి షోగ్గా తర్జుమా చేస్తున్నప్పుడు, అందులో శివాజీగణేశనూ పద్మినీ నటిస్తే పబ్లిసిటీలో రామారావూ అంజలీదేవి అవటాని ట్రాన్స్లేట్ చేసి అఘోరించవచ్చుగా! (11) ఈ విధంగా హౌ నాట్ టు మేకే ఫిల్మ్.. ఇత్యాది ప్రశ్నలకు జవాబులుగా ఒక్కొక్క చిత్రం ఒక్కొక్క క్లాసిక్కుగా తీసేస్తున్నారు. మనవారు (12) మళ్లీపెళ్లి లాటి పిక్చరొచ్చినప్పుడు విడోకి మళ్లీ పెళ్లి అవసరం అని అప్పుడేదో కూశారు. ఇప్పుడదేం లేదులెండి. చెంపలేసుకున్నారు. పవిత్రత గట్రా ఫాషనులో కొచ్చేశాయి. (13) అసలు టెలుగు పిక్చర్లెందుకూ? – మన అధోగతిని పట్టుకు తిట్టిపోసుగోడానిగ్గాపోతే! (14) అసలు టెలుగు సినిమా కాంపోజిషన్ మటుకు ఎందుకు మారాలీ అంట? నే జూసినంతలో నా చిన్నప్పటినుంటి ఒక్కడే సూర్యుడు మొహం చూపిస్తున్నాడు. రామాయణం ఎన్నిసార్లు ఎందరు వ్రాసినా రావణుడు సీతనే ఎత్తుకుపోతాడు తప్ప కైకనో కౌసల్యనో మందరనో వెరైటీకైనా ఎత్తుకుపోడు గదా! (15) తరిమేసీను చివరిలో హెలికాప్టరు మీద దర్శకుడు (నావెల్టీ) వచ్చేసి ఇది ఆఖరి రీలని, ఇంక రొండొందల అడుగులు కూడా లేదని చెప్పి, సెట్‌కు తెచ్చి పెళ్లి చేస్తాడు (19)

సినిమాకథ మీద – కథా కమామీషు అని ఊరికే వచ్చిందిషోయ్! సినిమాలో కమామీషుతోటే ఉంది మరి కథంతా. అసలు కథంతా కలిపితే ఎంతటా టెలుగు ఫిలింస్‌లో (2) ఇన్ని (డాన్సులు, పాటలు, పద్యాలు) ఉన్నాక ఇంక కథా కాకరకాయ కూడా పెడితే మొహం మొత్తిపోతుంది. (5) అసలు కథలకే దిక్కులేదు. పై పెచ్చు

తలాతోకా ఉన్న కథ తెమ్మంటె ఎలా తెస్తాడు? (6) సినిమా తియ్యకుండానే కథేవిటంటే ఎలా చెప్పగలం అవంటాని ఇండస్ట్రీలో అంతా నవ్వుకుంటున్నారు (6) కొత్తరకం కథలు రాస్తే నటులకు నటన కష్టం, డైరెక్టర్లకు డైరెక్షన్ కష్టం, ఎందుకంటే అంతా కొత్త గదూ (7) కథ ఊహాతామరలా పాకేస్తోంది. ఉన్న కారెక్టర్లనే చంపో, దేశాంత్రాలు తరిమేసో కథని ఆపుచేదామన్నా పాతికరీళ్లు దాకా పట్టేట్టుంది. (9) స్టార్లను తక్కువ పిక్చర్లలో వేయమంటే ఇంకా దుంప తెంపెయ్యరూ! కథ గురించి నిజంగా ఆలోచించెయ్యరూ! (11) సోదరప్రేమ వుండనే వుంది - అచ్చాలు కాసేపు అపోహలల్లుకుందికి (13) "అదిగోనయ్యా నీ అగ్గిపెట్టె బల్లమీద..అదేం.. కనబట్టంలా?" అనేసిందనుకోండి కోడలు. ఎంతడ్రామా మిస్సయిపోతాం? (16) అయికమత్యమ్మీద సినిమావాళ్లకున్న గురిలో నూరోవంతు మనందరికీ వుంటే దేశం ఎప్పుడో బాగుపడేదోయ్. సినిమావాళ్లు అందరూ ఎల్లప్పుడూ ఒకటే కథని సినిమాతీస్తారు. (18) మీరు గనక నవ్వితే రేడియో నాటకాలకీ, తెలుగుసినిమా కథలకి తలా తోకా ఉన్నాయనుకున్నంత ఒట్టు (20).

కళాఖండాల మీద - సత్యజిత్రాయంటే నాకు పగనుకొనేవు - యే రాయైతేనేం తల బద్దలు కొట్టుకోడానికి! (4) యింట నాలిగ్గీసుకునే తాటాకుబద్దలు నిండుకున్న రోజున సర్కారు వాళ్ల సర్టిఫికెట్టుకోసం కళాఖండవోఁటి తీయాలి. (4) అసలు కళాఖండాలనగా ఏమిటోయ్ - డబ్బురాని పిక్చర్లు...అంతే కదా (4).

నిర్మాతల మీద - ది ఇలెవెన్ కాజెస్ ఫర్ ది డిజెనరేషన్ ఆఫ్ టెలుగూ సినిమాలో మోష్టింపార్టెంట్ రీజన్, ఆర్టిస్టు మూడ్ ఫీడ్ చేయడానికి డబ్బు తొరగా ఇవ్వకపోవడం. (3), ప్రజలనగా ఉట్టి గొర్రెల మంద. ఆ మందకి ముందు గొర్రెలం మనవేఁ (5), బొంబాయిలో ఈ డైరక్టరుగాళ్ల బెడద పళ్లేక చాలా మంది ప్రొడ్యూసర్లే అందుకు వడికట్టారు. ఏవుంది, నాలుగురీళ్లు తిరిగేసరికి వాళ్లూ యేసు డైరక్టర్లయ్యారు. (8) జనం పాటలంటే చెవి కోసుకుంటారు. పద్యాలు కూడా తోసేసి రెండు చెవులూ కోసుగోమనండి (5).

ఆర్టిస్టుల మీద - ఇందాక షాటులో మీ యాక్టింగు సరిపోతుందా అని మీరు సందేహపడ్డారుగాని, కొల్లలు, రెండాటలకి సరిపడా వుంది. (7) మీరు గ్లామర్ డ్రెస్‌తోటి డ్యూయెట్లు రెండు చాలవని పంతం పట్టలేదుట. మీకెందుకో కోపం వచ్చిందనీ, పిక్చరు మీద యింటరెస్టు తీసుకోడం లేదనీ ప్రొడ్యూసరు గిలగిల తన్నుకుంటున్నాడు (7) దిలీప్‌కుమార్ ధోరణి నచ్చకపోతే భుజం తట్టి అబ్బీ ఇటు తిరిగి నటించమనొచ్చు (10).

టెక్నీషియన్లు మీద - ఫిలింఫీల్డులో ఇవాళ ఆరుకాన్లు తీసుకుంటాం, రేపు పిక్చరు హిట్టయితే అరవై వేలు గిట్టవంటాం. (5) రచయితలందరూ తమకు రేట్లు పెరగకపోతే ప్రాచీన తెలుగుసినిమా కథని రూపురేఖలు తెలీకుండా పరిమార్చవతల

పారేస్తామని బెదిరిస్తే సరి. హోలిండస్ట్రీ కాళ్లమీద పడుతుంది. (7) మనం పెట్టుకున్న బిజీరైటరు ధర్మరాజు లాటి వాడు - అందరికీ ఒకే డైలాగులు రాసిస్తాడు. అందికే అజ్ఞాతవాసం చేస్తాడనుకోండి. (16) హిట్ డైరక్టరయితే ఏడుపుగొట్టు సీన్లని ఏడిసినట్టు తీసి చక్కగా నవ్విస్తాడు. మళ్లీ నవ్వుకుందికీ, సరదాగా ఏడిచిందికీ జనం మళ్లీ మళ్లీ వస్తారు. (8) ఊరికే ఆడపిల్ల లెదట నోరెళ్లబెట్టుక్కూచోపోతే అదేదో కామెరా ఎదర అఘోరిస్తే సరిపోనుగా, డైరెక్షన్ చేసినట్టూ ఉంటుంది పిక్చరూ ఓటి తయారవుతుంది (9) కవిగారికి వీళ్ల పిక్చరుకి చెప్పిన కథ వైనం గాని, అసలు కథంటూ ఓటి చెప్పిన వైనంగాని యంతమాత్రం గుర్తులేదు. అంతా పరగడుపయి పోయింది. (9) పిక్చరు చివర నికార్సైన లెక్చర్లు ఏర్పాటు చేస్తున్నారని విమర్శిస్తున్నారు. సినిమా అంతా ఐపోయినా కథలో పాయింటేమిటో పట్టుకోలేని వాళ్లు కొన్ని లక్షల మందుంటారు. లెక్చర్లద్వారా వారికి కథను జ్ఞాపకం చేసి అబ్బీ నువ్వు దీనిద్వారా గ్రహించిన నీతి ఇదిస్మీ అని ఢంకా బజాయించినట్టు చెప్పిందికి సదుపాయంగా ఉంటుందది. (14) అలా అయితే పెదర్థాలొస్తాయి. ఇవేవన్నా పిక్చరులో డైలాగులైతే ఫరవాలేదు. సంతోషిస్తాం (7).

గిరీశం లెక్చర్లలో సగం భాగం 1960, 61లలో రాసినవి. అంటే ఆంధ్రపత్రిక వీక్లీలోంచి బయటకు వస్తూ, వచ్చాక రాసినవి. డిఫెన్సుభాణానికి గురయిన నరసింహారావుగారు మునిమాణిక్యం వారయితే, నమస్కారభాణంలో నవ్వని నరసింహారావుగారు, పి.వి. నమస్కారభాణాలు రాసేనాటికి రమణ సినీరంగంలో స్థిరపడిపోయారు. అదర్‌సైడ్ ఆఫ్ ది కాయిన్ కూడా చూసేశారు కాబట్టి, సినీరంగాన్ని హేళన చేసే ఆసక్తికూడా పోయినట్టుంది. ఆ భాణాలన్నీ రాజకీయాలపై ఎక్కుపెట్టబడినవే. వాటికి కాసిన్ని అడల్ట్ జోక్స్ కూడా కలిపి మోడర్నైజ్ చేశారు. అవి 1992లో కన్యాశుల్కం శతజయంతి సందర్భంగా రాసినవి.

బాపు వేసిన కన్యాశుల్కం బొమ్మలు యాడెడ్ ఎట్రాక్షన్. గిరీశం వయసు, ఆహార్యం గురించి బాపు పరిశోధన చేసి విజ్ఞులతో చర్చించి రూపకల్పన చేశారు. అదే ఇక స్టాండర్డ్ అయిపోయింది. శతజయంతి సందర్భంగా వేసిన బొమ్మల వల్ల మధురవాణి, ఇతరపాత్రలు కూడా బాపు కుంచెకు నోచుకున్నాయి.

రాజకీయాలపై 'రాజకీయ బేతాళ పంచవింశతి'లా సినిమాలపై 'గిరీశం లెక్చర్లు' ప్రౌఢ రచన అనడానికి ఏమాత్రం సందేహించనవసరం లేదు. దీని గురించి రాస్తూ ఏమ్వీయల్ 'భాషలోను, భావంలోను, శైలిలోను సెటైర్‌లోను యింత ముందడుగు చూస్తూంటే రవణ పుస్తకాలు చదవటమే ఒక ఎడ్యుకేషన్ అనిపిస్తుంది, కొందరి పుస్తకాలు చదవకపోవటమే ఎడ్యుకేషనయినట్టు' అని అన్నారు. ఈ పుస్తకాన్ని రమణ తన కిష్టమైన కథారచయిత, తననెంతో ప్రోత్సహించిన సహృదయుడు కొడవటిగంటి కుటుంబరావు గారికి అంకితం ఇచ్చారు.

కె.వి. రమణారెడ్డి 1962 మేలో విశాలాంధ్రలో 'గిరీశం లెక్చర్లు' తొలిముద్రణపై సమీక్ష రాస్తూ ఇలా అన్నారు - "నిజానికి అతన్ని ముళ్లవాడి వ్యంగ్యటరమణ అని పిలవవచ్చు. అల్లాటప్పా 'హాస్యం' అనిపిస్తూ, జీవితాన్ని ఘాటుగా పోట్లతో విమర్శించగలదు. హాస్యం ముళ్లపూడి వాని వేడి తాకిడికి ఈడేరింది. దానికొక సాంఘిక ప్రయోజనం ఏర్పడింది. వర్థి లెక్చర్లనుకున్నారేమో, ఇవి భాష్యాలు. వరి ఆస్సేమనుకుంటారేమో, ఇది జడ్జీగారి డిక్రీ. ఐతే ఎక్కడా గుచ్చుకొని నెత్తురునూ, నొప్పినీ వెలికిదీయనంతటి సున్నితమైన ఇంజక్షను సూది యిది. దీనికి చమత్కారమొక్కటే చాలదు. సూక్ష్మగ్రహణశక్తి కూడా కావాలి. హాస్యం ఒక్కటే చాలదు. అపహాస్యం కూడా కావాలి. నిందలు సరిపోవు, నిష్ఠురోక్తులు పనిచేయవు. వ్యంగ్యం ఒక్కటే విజయవంతం కాగలిగింది. పద్మవ్యూహంలో చిక్కుబడికూడా ఈ అభిమన్యుడు జయించాడు."

ఇంతకుమించి చెప్పనవసరం లేదేమో!

## పురాణ రమణీయం

ఈ శీర్షికలో కనబడుతున్న 'శ్రీకృష్ణలీలలు' సినిమాగా తీద్దామనుకుని రమణ రాసుకున్న స్క్రిప్టు. సినిమా ఆలోచన విరమించుకున్నాక కొన్ని సపలగా విడుదల చేశారు. మనోహరమైన బాపు బొమ్మలు శ్రీకృష్ణుడిని మనకు మరింత దగ్గరకు చేస్తాయి. బాపు రమణలు పురాణ గాథలను పిల్లలకు అందించడానికి ఎంతో శ్రమించారు. రామాయణాన్ని తేలికభాషలో రమణ రాయగా రంగుల బొమ్మల్లో బాపు వాటికి దృశ్యకల్పన చేయగా తెలుగులోనే కాక ఇంగ్లీషులో కూడా ప్రచురించారు. అంతేకాదు, అవి చూసి ఫ్రెంచ్‌వారు ముచ్చటపడితే ఫ్రెంచిభాషలో అనువదింపజేసి బి.ఎన్.కె. ప్రెస్‌లో ముద్రింపజేసి ఫ్రాన్సులో కూడా పంపిణీ చేయించారు. ఇంత కష్టమైన పనిని చేపట్టడానికి కారణం - ధనాపేక్ష కాదు, పురాణాల పట్ల గురి, మన సంస్కృతిని పిల్లలకు అందించాలన్న, చెప్పాలన్న తపన. ఇప్పుడా పుస్తకాలన్నీ మార్కెట్లో దొరకటం లేదు.

పురాణ గాథల విషయం చెప్పవలసివస్తే బాపు, రమణలు తీసిన సంపూర్ణ రామాయణం, సీతాకల్యాణం సినిమాలను ప్రస్తావించి తీరాలి. ఇప్పుడు ఈటీవీకై "భాగవతం" తీస్తూ నేటి తరమే కాదు; భావితరాల మనస్సులో కూడా సుస్థిరస్థానం సంపాదించుకుంటున్నారు. సంపూర్ణరామాయణం హిందీ డబ్బింగ్ కూడా సిల్వర్ జూబ్లీ జరుపుకుంది. "భాగవతం" సీరియల్ కూడా హిందీ వెర్షన్ ప్రారంభమయినప్పుడు భారతదేశమంతా బాపురమణల పేరు జపించడం జరుగుతుందని ఊహించవచ్చు. ఎంతో గహనమైన విషయాన్ని అతి తేలిక పదాలతో చెప్పగల రమణ నేర్పు కొట్టవచ్చినట్టు కనబడడమే స్క్రిప్టుకి బలం. అదే ఈ 'శ్రీకృష్ణలీలలు' లోనూ కనబడే అంశం. పిన్నలను, పెద్దలను ఆకట్టుకునే కథనం

ఆయన సొమ్ము. "భాగవతం" సీరియల్‌కై ఆయన కృష్ణుడిని ఉద్దేశించి చిన్న, చిన్న పాటలు రాస్తున్నారు. ఈ పుస్తకం చదివి కృష్ణుడిపై అభిమానం పెంచుకున్న బడిపిల్లలు ఆ పాటలను ఇంగ్లీషు నర్సరీ రైమ్స్‌తోపాటు నేర్చుకుంటే అంతకంటె కావలసినదేముంది?

## పీఠికా రమణీయం

ఈ విభాగంలో కనబడే రెండు పీఠికలు రెండు రకాలు. ఒకటి రమణ తన గురుతుల్యులైన వారి పుస్తకానికి ముందుమాటగా రాసినది. శిరోమణిగారు ఎంతటి మహానుభావుడో, ఆయన వద్ద తను ఏం నేర్చుకున్నారో తెలిపే పీఠిక అది. పురాణ అధ్యయనం రమణకు ఎలా పట్టుబడిందో చెప్పే పీఠిక అది కాగా రెండవది తన కంటె వయసులో చిన్న రచయితపై రమణ గౌరవాన్ని, వాత్సల్యాన్ని కనబరిచే పీఠిక. నిజానికి మహమ్మద్ ఖదీర్‌బాబు 'దర్గామిట్ట కథలు'కు ముందు రచయితగా పెద్ద పేరున్నవాడు కాదు. కానీ ఇవి రాయడంతో "మిట్టూరోడి కతలు"తో నామిని సుబ్రమణ్యం నాయుడుకి వచ్చినంత పేరు వచ్చేసింది. కింది తరగతి కష్టాలు, కడగండ్లను ఏడుస్తూ ఏకరువు పెట్టకుండా హాస్యం పూత రంగరించి నెల్లూరి మాండలికంలో వెలువరించిన ఈ కథలు చదివి రమణ పులకరించిపోయారు. ఒక రోజు తనంతట తానే పత్రికాఫీసు కెళ్లి రచయితకు పుష్పగుచ్ఛాన్ని అందించారు. ఆ కథలను పుస్తకరూపంలో తీసుకువస్తూ పీఠిక రాయమని కోరిన రచయితకు సలాములు చేస్తూ వయసేదైనా సరే ప్రతిభకు పట్టం కట్టవలసినదే అని చాటి చెప్పారు. "దర్గా మిట్ట కతల" భాషను అనుకరిసూ.

## వ్యాస రమణీయం

రావిశాస్త్రి తొలికథలంటే రమణకు, బాపుకు చాలా ఇష్టం. ఆంధ్రపత్రికలో ప్రచురణార్థం ఆయన పంపిన కథల మ్యాన్యుస్క్రిప్టులను అక్కడ ఉద్యోగిగా పనిచేసే రమణ ఇంటికి తెస్తే కాస్సేపు గోడకు పెట్టి దణ్ణం పెట్టుకునేటంతటి ఆరాధన ఉండేది వారికి. పోను, పోను రావిశాస్త్రి శిల్పం కంటె సబ్జక్ట్‌పై ఎక్కువ ధ్యాస పెట్టి కథలను కోర్టులో చార్జిషీట్సులా తయారుచేస్తున్నారని బాధపడిన సందర్భాలున్నా, కథకుడిగా, వ్యక్తిగా ఆయనంటే ఇష్టం పోలేదు. రావిశాస్త్రి అవార్డు రమణకు ప్రదానం చేసే సమయంలో ఆయన గురించి రాసిన వ్యాసం ఇది.

నాటక, కథా రచయిత, జర్నలిస్టు, సంపాదకుడు, నటుడు అయిన రావి కొండలరావు బాపు, రమణలకు మిత్రుడు. కొన్ని రోజులు రమణగారి రోమ్మేట కూడా (ఉద్యోగాల కోసం రోమింగు.) బాపు, రమణల సినిమాలలో నటించడమే కాక, వారు తీసిన 'పెళ్లిపుస్తకం' సినిమాకు కథ సమకూర్చారు. రావి కొండలరావు తెరపై అనేక పాత్రలు ధరించినా తెలుగుమేష్టారు పాత్ర ద్వారా ఆయన గుర్తుండిపోతారు. రమణ

గిరీశాన్ని ఉపయోగించుకున్నట్టు సమాజపు పోకడలను విమర్శించడానికి కొండలరావు తెలుగుమేష్టారు పాత్రను వాడుకుంటారు. "బాపురమణీయం" విడుదల సందర్భంగా విజయవాడలో ఆవిష్కరణ సభ జరిగినప్పుడు అందరూ తమను మెచ్చుకుంటారని ముందే పసిగట్టిన బాపు రమణలు దానికి 'యాంటీ-డోట్'గా కొండలరావుగారిని తెలుగుమేష్టారుగా వచ్చి 'అక్షింతలు' వేయమన్నారు. అందరినీ దుయ్యబట్టే తెలుగుమేష్టారు కొండలరావుగారి గురించి చెప్పవలసివస్తే ఎలా చెబుతారో ఊహించి కొండలరావుగారి స్టయిల్లో రమణ సాగించిన రచన ఇది. బుడుగు స్టయిల్లో కథారంభం చేసి రమణను మల్లాది రామకృష్ణశాస్త్రిగారు ఆశీర్వదిస్తే, తెలుగుమేష్టారి స్టయిల్ 'అడాప్ట్' చేసి కొండలరావుగారి పట్ల తన అభిమానాన్ని చాటుకున్నారు రమణ.

ఈ సంపుటానికే కాదు – ఏ సంపుటానికైనా, ఏ రచయితకైనా గర్వకారణమైన రచన 'కక్కిగారబ్బాయి'. ఎన్నిసార్లు చదివినా తనివితీరదు. గుండెలు బరువెక్కించే రచన. నవ్వో, ఏడుపో తెలియదు, లోపలినుండి పొంగుకు వస్తూంటుంది. చివరకు కక్కిగారు తన కుటుంబంలోనే కాదు. అనేక కుటుంబాలలో దీపాలు వెలిగించిందని తెలిశాక కళ్ల వెంబడి నీళ్లు కారతాయి. కరుణ, హాస్యం కలపడం చాప్లిన్‌కే తెలుసంటారు. కానీ చాప్లిన్ హాస్యంలో 'శ్లాప్‌స్టిక్' పాలు ఎక్కువ. ఇదిమాత్రం ఉదాత్తమైన హాస్యం. అక్షరాల ద్వారా అందించిన హాస్యం. అర్జంటుగా పొడుగులాగు కుట్టేయడం వంటి 'యాక్షన్' సీన్స్ కూడా ఉన్నాయి. 'మేమిద్దరం తినేవాడిని' వంటి అనుపమానమైన, అసమానమైన భావప్రకటీకరణలున్నాయి. అసలు మొత్తం ఒక వచన కవిత్వంలా సాగిపోతుంది. దారిద్ర్యాన్ని ఇంత రొమాంటిక్‌గా చూపగలిగిన మహానుభావు లెందరున్నారన్న ప్రశ్న వేసుకోబుద్ధేస్తుంది. "చితికిపోయిన ఉల్లిపాయలు చూట్టానికి అసయ్యంగా ఉంటాయి కానీ, రుబ్బి వడియాలు పెడితే ఎండకి పురుగులన్నీ ఛస్తాయి. – వడియాలు బాగుండేవి." అని రాస్తే నవ్వొచ్చి – అంతలోనే తమాయించుకుని నవ్వకూడదేమో, జాలిపడాలి కాబోసు అనిపిస్తుంది.

కానీ జాలిపడమని రమణ ఎక్కడా అడగలేదు. జీవితంలో అన్నీ చూసిన వేదాంతి నిర్వేదంతో తన జీవితాన్ని సమీక్షించుకున్నట్లుగా, ఉన్నదున్నట్లుగా రాసుకుపోయారు. డ్రమటైజ్ చేయవలసిన అవసరం లేకపోయింది. కావలసినంత డ్రామా ఉంది ఆయన కథలో. ఏ హీరోయిన్‌కీ తీసిపోనంత స్థైర్యం, ధైర్యం ఉంది వాళ్ళమ్మగారిలో. వాటితోబాటు చిన్నతనంలో వైధవ్యం కలిగిన వారికి సహజంగా కొడుకుపట్ల కలిగే "పొజెసివ్‌నెస్" ఉంది. తన పెళ్ళయిన కొత్తల్లో ఆవిడ కనబరచిన ధోరణిని ఏ మాత్రం దాచకుండా రమణ రాశారు. తల్లిపట్ల ఆరాధన ఉన్నా "మదర్ ఫిక్సేషన్"కు లోను కానివారే అలా రాయగలుగుతారు. చదివిన తర్వాత కక్కిగారికి జోహారు అర్పించని హృదయం ఉండదు. ఆవిధంగా ఆమె జీవితాన్ని చిత్రీకరించిన రమణకు, బొమ్మలతో ప్రాణం పోసిన బాపుకు నివాళు లర్పించాలనిపిస్తుంది.

ఈ వ్యాసం ఆంధ్రజ్యోతి వీక్లీలో 'అమ్మకు జేజే' అనే శీర్షిక తొలి వ్యాసంగా 1999లో ప్రచురించబడింది. నామిని సుబ్రమణ్యం నాయుడు కోరికపై పలువురు 'అమ్మ' అనే సబ్జక్ట్‌పై రాశారు. తొలివ్యాసం రమణది కాగా, మలి వ్యాసం బాపుది. ఆ తరువాత ఎందరో ప్రముఖులు తమ మాతృమూర్తుల గురించి రాశారు. ఆ వ్యాసాలన్నీ "అమ్మకు జేజే" అనే పేరుతో పుస్తకంగా ప్రచురించి నామిని ప్రస్తుతం స్కూలు స్కూలుకి వెళ్లి అతి తక్కువ ధరలో బడిపిల్లలకు అందిస్తున్నారు. ఈ వినూత్న మార్కెటింగు విధానం వల్ల లక్షలాది పిల్లలు జీవితంలో పైకి రావడానికి తల్లి పాత్ర ఎంతటిదో తెలుసుకుంటారు. ఆ పుస్తకంలో కనబడే తొలి వ్యాసమే 'కక్కిగారబ్బాయి' కాబట్టి జీవితంలో విషమఘడియలు వచ్చినప్పుడు ఎలా ఎదుర్కోవాలో నేర్పే ఆదర్శమహిళగా కక్కిగారు నిలిచిపోతుంది.

ఈ సంపుటం అంకితం అందుకుంటున్న వరప్రసాదరెడ్డిగారు కూడా తల్లిచే ప్రభావితమయినవాడు కావడం ఓ విశేషం. చదువురీత్యా ఎలక్ట్రానిక్స్ ఇంజనీరయినా తల్లి శాంతమ్మ పేర శాంతా బయోటెక్నిక్స్ అనే మందుల కంపెనీ నెలకొల్పి స్వదేశీ విజ్ఞానంతో హెపటైటిస్-బి వ్యాక్సిన్ కనిపెట్టి, అందుబాటు ధరలో దాన్ని లభ్యం చేసి ఎందరో తల్లులకు ఊరట కలిగించినవాడు. అంతేకాదు, హాస్యం మీద ప్రీతితో రమణగారు "జ్యోతి" పత్రిక పెడితే ఆ స్ఫూర్తితో "హాసం" అనే హాస్య-సంగీత పక్షపత్రికను ప్రచురిస్తున్నారు వరప్రసాదరెడ్డి.

శ్రీ ఫ్రెండూరిలో కనబడే నండూరి రామమోహనరావుగారు జర్నలిస్టుగా రమణకు ఉద్యోగంలోనే కాదు, సంపాదకునిగా, అనువాదకుడిగా, శాస్త్రరచనా నిపుణుడిగా, సినీ సమీక్షకుడిగా రమణకు అన్నిటా సీనియర్. 'జ్యోతి' మంత్లీలో సహసంపాదకుడు. అంతేకాదు, రమణపై అభిమానంతో తన చెల్లెలు శ్రీదేవిని ఆయన దేవేరిగా చేసిన మిత్రుడు.

"జ్యోతి" మాసపత్రికలో 1964లో రాసిన వ్యాసాలు పొగడ్త, ఉచ్చారణ కాగా, ఆంధ్రప్రభ వీక్లీకి 1993లో రాసినది "అన్నీ మీవి వెన్నే నాది' వేదాంతాన్ని హాస్యపరంగా ఎలా చెప్పవచ్చో చూపే రచన.

## స్త్రీ రమణీయం

కదంబ రమణీయం-1 పీఠికలో రాసినట్టు 1954 నుండి 1960 వరకు ఆంధ్రపత్రిక డైలీ, వీక్లీలలో సబ్‌ఎడిటర్‌గా చేసిన ఉద్యోగం రమణలోని రచయితను, జర్నలిస్టును బయటకు తీసుకొచ్చింది. సానబట్టింది. సహోద్యోగుల నుండి, పత్రికల నుండి, సినిమాల నుండి, సమాజం నుండి టీన్స్‌లో ఉన్న రమణ చాలా నేర్చుకునే అవకాశం, అవసరం ఆ ఉద్యోగం కల్పించింది. పండితుల కోసం 'భారతి' వెలువరించే ఆంధ్రపత్రిక గ్రూప్ తమ డైలీ, వీక్లీ భాష అందరికీ అందుబాటులో ఉండేట్లు జాగ్రత్త పడేది. అందువల్ల రమణ సులభంగా, సరదాగా ఉండే శైలిని

ఎంచుకుని ఎంతో గంభీరమైన విషయాన్ని కూడా తను ఇబ్బంది పడకుండా, పాఠకుడిని ఇబ్బంది పెట్టకుండా చదివించే శక్తిని అలవరుచుకున్నారు. ఈ విభాగంలో కనబడే రచనలు అప్పటివే! సి.వి.విజయలక్ష్మి, సి.వి.వి.లక్ష్మి అనే మారుపేర్లతో వాడి ఒక ఆలోచనాపరురాలైన యువతి రాసినట్లు ఇవి రాశారు. ఆ రాయడంలోనూ సరదా ధోరణిలోనే రాశారు.

## వైవిధ్య రమణీయం

దీనిలో తొలుతగా కనబడేది "లక్ష్మి" కథ. కథారమణీయంలో కనబడవలసిన కథ ఇక్కడెందుకు కనబడుతోందన్నదానికి కాస్త వివరణ అవసరం. అసలు ఇది రమణ రచనేకాదు, కానీ ఆయన పేర వచ్చిన తొలికథగా నమోదయిన రచనను ఆయన సాహితీ సర్వస్వంలో చేర్చకుండా ఉండడం ఎలా? ఆంధ్రప్రభ వీక్లీ 1953 జనవరి 7 సంచికలో 'రవణ' పేర ప్రచురించబడిన ఈ కథకు ఆయనకు ఘోస్ట్ రైటింగ్ చేసి పెట్టినది వేరెవరో కాదు - బాపు! "ఇలా తొలిరచనే ఘోస్ట్ చేత రాయించడమేమిటండీ బాబూ?" అంటే రమణగారి సమాధానం - 'నేను కథలు రాస్తానని బెదిరించడమే కానీ కాగితం మీద కలం పెట్టకపోవడంతో నాకు ధైర్యం చెప్పడానికి నా పేర బాపూయే కథ రాసి, బొమ్మ వేసి పెట్టాడు. సంపాదకులు వేసుకున్నారు."

ఇదే వీక్లీలో దీని వెనువెంటనే అచ్చయిన రమణ కథలు "ఛాయలు", "ఆకలీ-ఆనందరావు" కథల స్థాయిగానీ, బాపు 'లక్ష్మీనారాయణ' పేర రమణంత బాగా రాసిన 'మబ్బువానా - మల్లె వాసనా' (ఆంధ్రపత్రిక వీక్లీ 28-8-1957) కథ స్థాయి గానీ దీనిలో కనబడలేదని అనిపించినా ఆనాడు విరివిగా వచ్చే కథల తరహాలో వస్తువుంటూనే కథనం - శైలి మాత్రం కొత్తగా అనిపిస్తాయి. 'కూరలేం చేస్తారు?...తింటారు?", 'హోల్‌మొత్తం ఇండియా', 'మామయ్య ఏమంటాడోనన్న కంగారే తప్ప, కాస్తుంటే ములిగి చద్దునన్న ధ్యాసే లేదు' వంటి చెణుకులు బోల్డున్నాయి. ఇద్దరు ప్రతిభామూర్తుల ప్రగాఢస్నేహానికి ప్రతీకగా నిలిచిపోతుందీ కథ. రమణవంటి అరుదైన రచయితను అదను చూసి తనదైన తీరులో ప్రోత్సహించిన బాపుకి పాఠకులందరం ఋణపడివుంటాం.

ధన్యవాదాలూ - అన్యవాదాలూ అనేది ఇప్పటిదాకా ఎవరూ చేయని విలక్షణ ప్రక్రియ. 1993 జూన్‌లో రమణ పుట్టినరోజు సందర్భంగా ఆంధ్రజ్యోతి వీక్లీలో ఆరుద్ర "ముళ్లపూడికి మల్లెపూలు" అనే పేర ఓ అభినందనవ్యాసం రాశారు. దానికి ప్రతిస్పందనగా వెలువడిన రచన ఇది. పడికట్టు అభినందనలను వెక్కిరిస్తూ, తనను తానే వేళాకోళం చేసుకుంటూ రాసిన ఈ రచన రమణ అతిశయోక్తులను, హిపాక్రసీను ఎంత నిరసిస్తారో తెలుపుతుంది.

తెలుగుతనం ఉట్టిపడే రచనలు చేయడంలోనూ, తెలుగువారి అవగుణాలను అర్థం చేసుకుంటూనే సుతారంగా వెక్కిరించడంలోనూ బాపు, రమణలు సిద్ధహస్తులని మనందరికీ తెలిసినదే. అయితే ఈ విషయంలో వారిద్దరూ గౌరవించేది 'హాస్యబ్రహ్మ' భమిడిపాటి కామేశ్వరరావు గారిని. "జాతివికాసానికి కూడని లక్షణాలను గర్హించారు. అవి ఉన్నందుకు 'అన్నన్నా' అని బాధపడి లేచి, హన్నా అని కోప్పడి, నాన్నా అని లాలించారు." అంటూ కామేశ్వరరావుగారి గురించి రమణ రాసినది రమణకూ వర్తిస్తుందని ఆయన ఏ రచన చూసినా తెలుస్తుంది. 'చేదుసత్యాలకు మంచి నవ్వుల పంచదారపాకం పట్టించి, ఆ పత్యాలను అయినవాళ్లచేత తినిపించాలని తాపత్రయపడేవాడని' ఆరుద్ర రమణను ప్రశంసించారు. వాటికి కొన్ని మచ్చులు మాత్రమే ఈ సంపుటంలో కనబడతాయి. మన సినిమాలలో వుండే అవకతవకలను ఝాడిస్తూ, గొప్పవారిని ప్రశంసిస్తూ ఆయన చేసిన సమీక్షలూ, రాసిన వ్యాసాలూ రాబోయే సంపుటాలైన సినీ రమణీయం 1 & 2 లలో కనబడతాయి.

ఈ సంపుటిపై తమ అభిప్రాయాలు తెలుపదలచేవారు రచయిత (అడ్రసు - No. 4, Greenways Road Extn., Raja Annamalaipuram, Chennai - 600 028 Ph: 044-2493 7109) లేదా సంపాదకుడు (అడ్రసు - 502, Siri Enclave, 8-3-960, Srinagar Colony, Hyderabad-500 073 Ph: 040-2374 3567/5563 2764)కు రాయగోర్తాను.

- ఎమ్బీయస్ ప్రసాద్

# ఇదీ వరస...

పేజీ



మైగాడ్! పుస్తకాలు కొనడమా! బార్బేరియస్!!

వ్హాట్! బయింగ్ బుక్స్! మైగాడ్! వర్స్ దాన్ సెల్లింగ్ గర్ల్స్.... పిల్లనమ్ముకోడం కన్నా నికృష్టం. దిస్, మైడియర్ షేక్స్‌పియర్, ఈజ్ బార్బేరియస్... పుస్తకాలు కొండcవా? డబ్బు పెట్టా? నువ్వు స్టోన్ ఏజ్ మానవుడిలా ఉన్నావోయ్! ఇది ఆంధ్రదేశమనిన్నీ, నువ్వు టెలుగూస్ జాతివాడివనిన్నీ, ఇది ఫలానా యుగc వనిన్నీ మర్చిపోయావా? నా లెక్చర్లు, పఝ్ఝునివిcది డాక్టరేట్లకు సరిపడే నా థీసీస్‌లు అన్నీ ఇంతలోనే పరగడుపయి పోయాయటోయ్? వెధవది నాతో కలిసి చుట్టకాల్చటవేc చాలే. అలా చుట్ట కాల్చి జీనియస్సులై పోయినవాళ్లెందరున్నారో తెలుసా?

నోటుబుక్కు తీసి రాసుకో, పుస్తకాల గురించి శాస్త్రకారుడేవన్నాడు? గిరీశంగారి జీనియస్సు, కంఠశోష ఖర్చుపెట్టి గడించిన విచ్చు రూపాయల్ని పుస్తకాలు కొనడానికి తగలెయ్యవలసిందని ఎన్నడూ అన్న పాపాన పోలేదే? అసలు వాడన్న దేవిటీ? బెగ్, బారో ఆర్ స్టీల్. ఇదీ మార్గత్రయం. నీకంతగా పుస్తకాలు చదివేడవాలన్న అఘోరింపు మనసులో తగలడితే బెగ్--ముష్టెత్తి తెచ్చుకో. అది గనక పరువుతక్కువని తోచినట్టాయెనా, ఎరువడుగు. ఈ ఉభయ మార్గాలున్నూ లాభసాటిగాని పక్షంలో--స్టీల్, చోరీ చెయ్యి. గుట్టు చప్పుళ్ళేకుండా ఎత్తుకుపో. మరేవ్వీ తప్పు లేదు. “అఘము బొంద దధిప!” అన్నాడు ఆ శాస్త్రకారుడే.

అంతే తప్ప చచ్చీ చెడీ శాయంగల విన్నపాలన్నీ చేసి, గొప్ప గొప్ప విషయాల్తప్ప మరొహ టెన్నడూ ఆలోచించెరగని ఈ గ్రేట్-బ్రెయిన్‌ని--దిగి రాను

దిగి రాను దివి నుండి భువి కన్నదాన్ని దింపి మీ ఫాదరుకు సబ్మిట్ చేసేందుకు అంత పెద్ద పుస్తకాల లిస్టు వేయించి, దాన్ని తీరా రొక్కంగా ఫిరాయించాక డామిట్ ఇపుడా డబ్బు పెట్టి నిజంగా పుస్తకాలు కొనేస్తానంటావూ? మైడియర్ వెంకటేశం, డిసీజ్ బేస్ ఇన్‌గ్రాటిట్యూడ్, హిపోక్రసీ, సిగార్సుకీ దానికీ ఉంటుందని పుస్తకాల్లిస్టేస్తే, ఆ పవిత్రమైన డబ్బుని యిలా కర్కశంగా పుస్తకాల మీద తగలేస్తానంటావూ?

అసల్నినవాల్సిన పని లేదు. ఇది మీ వంశంలోనే ఉంది. మీ ఫాదర్ ఆడపిల్లల్నమ్ముతాడు. నువ్వు పుస్తకాలు కొంటావు. వ్హేర్ ఈజ్ ది డిఫరెన్స్? నీలో నాగరికత ఎక్కడున్నట్లు? డామిట్! అసలు నువ్వు తెలుగువాడివై యుండి పుస్తకాలు కొంటానని ఎలా అనగలిగావూ అంట!

మన దేశంలో ఇండస్ట్రీస్ పెరగలేదంటే, ప్రాజెక్టులు రాలేదంటే, అందుక్కారణ వేఁవిటీ? ఇదే. అక్షరాలా ఇదే. ఈ పుస్తకాలు కొనడవఁనే జబ్బే. ప్రతివాడూ పుస్తకాలు కొండవే? ఊరికోడు కొంటే చాలదూ? అదే నలుగురం ఎరువడిగి తెచ్చుకొంటాం. లేదా దొంగిలిస్తాం. క్రైమ్స్ అనగా నేరాలు, నెలకి రెండు వర్షాల్లాగా జరుగుతాయి. నాలుగు డబ్బులు తిరుగుతాయి. కోర్టులు వర్ధిల్లుతాయి. సివిలిజేషన్ ముందుకి నడుస్తుంది. ప్రతివాడూ పుస్తకాలు కొనేస్తే ఇదంతా స్తంభించి పోదూ? కోర్టులు, బందిఖానాలు, సిగార్సు వగైరా వర్తకవ్యాపారాలు అన్నీ ఆగిపోతాయి. ఆ తరువాత పుస్తకం వ్రాసుకుందుకి మటుకు మెటీరియలేం దొరుకుతుంది? నేరాలు జరక్కపోతే వేటి గురించి రాస్తాం? హత్యాసాహిత్యం హతం ఖతం అయిపోదూ? అన్యాయం హరించిపోతే ఏది నశించాలని రాస్తాం? యింకోటి కూడా నోట్ చేసుకో, అసలే ఆంధ్రలో ప్రతిమూడోవాడూ కవి. అడ్డమైనవాడూ రాసేస్తున్నాడోయ్ అని అడ్డమైనవాడూ ఏడ్చి నెత్తి మొత్తుకుంటున్నాడు. మర్నీలాంటివాళ్లు కూడా బుక్కులికి వందలూ వేలూ గుమ్మరించి కొనేస్తే బుక్కిండస్ట్రీ పెరిగిపోతుంది. రైటర్లు ప్రతిరోజూ తిండి తిండం మరిగి, బలిసి, రాయడం మానేస్తారు. ఆ పైన, యిది లాభసాటిరోయ్ భగవాన్లూ అని ప్రతి రెండోవాడూ కూడా రాయడం మొదలెట్టేస్తాడు. ఇహ నందరూ రైటర్లే, అప్పుడు ప్రతివాడికీ తన పుస్తకాలు చదువుకుందికి మటుకు తీరుబాటుంటుంది. మఁరొహాడి చెత్త చదవనపుడు డబ్బు పోసి కొండఁవెందుకని ఎలాగూ కొనరు. చివరికి ఆ విధంగా చూసినా నేడు కాపోతే రేపైనా మళ్లీ పాతపరిస్థితే వస్తుంది. బుద్ధిమంతులంతా బుక్కులు కొండం మానేస్తారు, చూశావా? ఇదీ సైకిల్ ఆఫ్ సివిలిజేషన్. అందువల్ల నువ్విప్పుడు నా సిగార్సు తాలూకు ఫండ్సని అక్రమంగా దుర్వినియోగం చేసి పుస్తకాలు కొన్నప్పటికిన్నీ దానివల్ల సివిలిజేషన్ గాని, బుక్ ఇండస్ట్రీగాని ప్రోగ్రెస్ అవుతుందనుకోకు.

హాయిగా---నీ కంతగా చదవాలీ అని దుగ్ధ వుంటే ఎరువడగవోయ్. దానివల్ల పరిచయాలు ఏర్పడతాయి. బుచ్చమ్మ లాంటి యంగ్ విడోస్‌తో ఏర్పడితే అవి స్నేహాలవుతాయి. ప్రేమగా వికసిస్తాయి. బుక్స్ ఆర్ ది బెస్ట్ కండక్టర్స్ అన్నాడు

విద్యుచ్ఛాస్త్రకారుడు. వాటి ద్వారా లవ్‌లెటర్స్ గట్రా అద్భుతంగా బట్వాడా అవుతాయి. ఎవరి పుస్తకం వారు కొనుక్కుని ఎరువడగడం మానేస్తే యింక ప్రేమ కలాపాలెలా సాగేట్టూ? అవి ఆగితే సృష్టి స్తంభించిపోతుంది.

అసలు పుస్తకాలు ఎరువు తెచ్చుకోవడమనేది మన ప్రాచీన సాంప్రదాయం. పూర్వం ఇన్ని బుక్కులుండేవా? బుక్కులు కాసినీ తాటాకుల మీద రాసుకున్నారు. కావ్యాలూ అంతే. ఎవడన్నా చదువుకోవాలంటే ఆ కట్టోసా రెరువడిగి తెచ్చుకొని చదువుకు వాపసిచ్చేవారు. ఐదేసారేసి మంది - ఈ కాలపువాళ్ళు పేపరు చదివినట్టు--దాని కన్నివేపులా మూగి నిలువునా అడ్డానా ఐమూలగా తలక్రిందులుగా చదివేసి తలో ముక్క చించుకుపోయిచదివి పరిపరివిధాల ఆనందపడేవారు. సంఘపఠనవఁన్న మాట. అలాగే పుస్తకాలున్నూ, పైగా ఇవి ఎరువడిగి తెచ్చిపడేసుకుంటే ఏదన్నా ఉపద్రవం వచ్చిపడి సిగార్సుకి యిరకాటఁ వైనప్పుడు మూర్మార్కెట్లో అమ్మి ఆపద గడుపుకోవచ్చు. ఎరువడగడం లాకాయి లూకాయి విద్య కాదు. ఎ గ్రేట్ ఆర్ట్. మార్క్‌ట్వేన్ అంతటి గొప్పవాడు ఈ విద్యని సాధన చేశాడు. ఒకమారో పెద్దమనిషాయనింటికెళ్ళి గదినిండా కుప్పపోసిన పుస్తకాల్చూసి 'ఏఁవిటి సార్, అలాపడేశా'రన్నాట్ట. "వాట్టుడూ పుస్తకాలెరువిచ్చిన వెధవలు బీరువా లెరువిచ్చారు కారు" అని మండిపడ్డాడు మార్క్‌ట్వేన్.

అంచేత, మైడియర్ వెంకటేశం, నా మాట విను. ఆ డబ్బు తగలెయ్యకు. సిగార్సు అయిపోవచ్చాయి. అవి కొని స్టాకు చెయ్యి. మిగతా డబ్బు నా దగ్గర దాచు. దుర్మార్గాలపడి సంస్కృతి సంప్రదాయాలనూ, మీ నాన్నిచ్చిన ఆ పన్నెండు రూపాయలనూ తగలెయ్యకు .... అడుగో మాటలో వస్తున్నాడు మీ నాన్న.... రండి సార్ రండి. ఇదిగో ఇపుడే మీ వాడికి మన సంస్కృతి, ప్రాచీన సంప్రదాయాలు, కోర్టులు, డబ్బు పొదుపు చెయ్యడం, సద్వినియోగపరచడం అనే విషయాలను గురించి బోధపరుస్తున్నాను. చిత్తం యేఁవన్నారూ? ఎంతమాట .... లేకేం .....

ఈ విషయాలన్నింటికీ సంబంధం ఉండకేం? కావలసినంత ఉంది. నిజానికన్నిటి సారాంశం ఒకటే. సిగార్స్ ఫన్డ్ అన్నట్టు. అయినా కాపోయినా దొరల్చదువు లదోమోస్తరు లెండి. వాళ్లెంతసేపూ బుక్స్ బుక్స్ అంటారు. మీవాడికింకా పుస్తకాల విలువ బాగా తెలీలేదు. యంత సేపూ పూత చుట్టలూ, చేగోడీలూ! బైస్కోపుకాలపు మంచి పుస్తకాలు కొని చదవాలన్న బుద్ధి బాగా పట్టుబళ్ళేదు. మీరు పదో పన్నెండో యిచ్చార్ట. పుస్తకాలకిది చాల్దా అంటాడు. మరేం లేదు, ఇంకో టెన్ రుపీస్....ఒక పదిరూపాయలు మంజూరు చేస్తిరా ఇహనీ యేడాదికీ పుస్తకాల్చాలు. ముఖ్యమైనవి మరికొన్ని కొనాల్లెండి....చిత్తం చిత్తం. అలాగే కానీండి, ఐదే చాలు అదే పదివేలు.

(పాఠకులు నా మాటలు నాకు అప్పగించేరు సుమా. నా పుస్తకాలు మటుకు తప్పక కొనండి. అన్ని శాస్త్ర నియమాలకూ అపవాదులంటూ ఉంటాయి కదూ మరి!)

❀ ❀ ❀




# డామిట్! కథ అడ్డం తిరిగింది!



డామిట్! కథ అడ్డం తిరిగింది. ఇక్కడ ఇంటర్వెల్ పెట్టి తరువాత అడ్డం తిప్పి టెంపో మౌంట్‌చేసి క్లయిమాక్స్‌కి తోలీదామనుకుంటే---దీం దుంపతెగ--ఇక్కడే కాళ్ళు బార జాపేసింది. షేక్స్ పియరన్నట్టు---వాట్ టు దూ--దట్, మైడియర్. వెంకటేశం, ఈజ్ ది క్వెశ్చన్!

ఏంవాయ్ క్వెశ్చన్‌మార్కు వాలకం పడింది?... అదంతేలే. షేక్స్‌పియర్ అన్నవన్నీ బైహార్టు చెయ్యడంకన్న అనని నాలుగు ముక్కలూ ముక్కున తగిలించేసుకోడం ఈజీగా ఉంది. స్ట్రాటజీ మార్చమని మేకియవిల్లీ ఊరకే అన్నాడుటోయ్! ఛస్తే అనడు. ఏదో లిటిగేష నుండబట్టే అన్నాడు.

గిరీశంగాడు కథ రాస్తున్నాడో లేదో చూస్చక్కా రమ్మని మీ మావఁ పంపాడన్నాకు తెలుసుగాని.... చెప్పేది విను. అసలు ఫిలిం స్టోరీ రాయడం మజాకా కాదు. మీ నాన్న రొండిలోంచి రూపాయలేనా సుళువుగా ఒళిపోస్తాయిగాని అయిడియా లలాక్కాదు. కథనలా ఒదిలీసి జీవితంలో అరితేరినవాడి అనుభవసారం విను. బాగుపడు... ఆ లోపల ఒక సిగారందుకో చెబుతా---

ఈ మధ్య యూరప్ నుండి రూరిటేనియా రాజావారొచ్చారు. గదూ. ఒక్కగంట మాట్టాడాడో లేదో పొలిటీషియన్ల ముఠాని వెళ్ల గొట్టేసి, మిస్టర్ గిరీశం! సేవ్ మి.....ఓ! సేవ్ మి ఫ్రమ్ పొలిటీషియన్స్. నువ్వే నికార్సయిన పొలిటీషియన్‌వి. నిన్ను విడిచి ఒక్క గడియ కూడా ఉండలేను అన్నాడు--వాట్ టు డూ-- సరే శ్రీవారితో రూరిటేనియా వెళ్ళి రెస్టు తీసుకొన్నాం. ఏవిఁ గార్డెన్సు--ఏవిఁ పాలెస్‌లూ--అంతా మన నెక్స్ట్ పిక్చర్‌లో డ్రీం సీక్వెన్సులా ఉందంటే నమ్ము. అక్కడే ఇందాకటి డిస్కవరీ చేసింది..... న్యూస్ పేపరు వాళ్ళన్నట్లు అందులో 'ఇన్ సైడ్ డోప్' యిస్తున్నా విను. మార్నింగ్ గార్డెన్‌లో ఆ పూట బ్రేక్‌ఫాస్ట్ చేస్తున్నాను -- నిన్నూ, బుచ్చమ్మనీ తల్చుకుంటూ--నువ్వంటే ఎంత ఎంజాయ్ చేసేవాడివనీ--చద్దివణ్ణం అనేది కొన్నాళ్ళయినా తిన్నందుకు షేమ్ షేమ్ అనుకునేవాడివి?

అంతలో వార్నింగ్ లేకుండా రాజావారు చక్కా వచ్చేసి కూచోబడి పోయారు. మిస్టర్ గిరీశం! యు హావే గెస్ట్ అంటూ. ఏఁవుంది, పెద్ద వాళ్ళతో మాట్లాడ్డం మజాకా అనుకున్నావా--మీ నాన్న దగ్గర మనిద్దరం గడగడా ఇంగ్లీషు మాట్లాడినట్టు కాదు. టాపిక్స్ హై లెవెల్‌లో ఉంటాయి. అంతా హై క్లాసాయె. వెధవది పరగడుపున టాప్ గేర్‌లో పడి దొరల భాషలో గుక్క తిప్పుకోకుండా ఫెడీ ఫెడీమని--సినిమా వాళ్ళా --డైలాగ్స్ విసిరేసుకోడం మాటలా? ఆ మాటకొస్తే మాటలేగాని, దాన్నిగదరగా ఆ హర్రి కొటేషన్‌లు దప్పళంలో గుమ్మడికాయ వంకాయ వగైరా ముక్కల్లా ఎగిరెగిరి పడ్డాయేమో--యేది గుమ్మడికాయో, ఏది వంకాయో కూడా మర్చిపోయి--అలా తెల్లమొహం పెట్టకు, సిగ్గుచేటు. ఇది కవిసమయంలే-- ఆ కొటేషన్లు ఒకరి వొకరికి తగిలించేశాం--అటు రాజావారు ఊహు సిగ్గు పడిపోతున్నారు... ఆ బట్లరు వెధవ రాజావారి వెనకాల తగలబడి ముసిముసి నవ్వులు నవ్వుతున్నాడు. ఇహ నాబోరు దక్కదని పసిగట్టి తమాయించుకునే సరికది పోనేపోయింది.

వెధవది ఎంతచెడ్డా అంత తెలీదుటోయ్, ఆ వెధవాయి ఆవలించకపోయినా పేగుల్లెక్కెట్టేశాను--హారినీ! గిరీశం! పరాయి దేశం వచ్చి తప్పులో కాలేశావోయ్. వాటెఫాల్ మై కంట్రీమన్ అనుకున్నా. సారీ...అదిగో అదిగో చూశావా--అనాటి దెబ్బ తడాఖా? మళ్ళీ రాంగ్ కొటేషన్ పడింది.

తరువాత, మైడియర్ వెంకటేశం--మీ నాన్న నీ చేతో పూట అశనం నాగా పెట్టిస్తే ఎలాటి ప్రొఫౌండ్ థాట్స్ వస్తాయి?....అలాంటి వొచ్చాయి. రిపెంటెన్స్‌తో బాధపడి నా గది అంతా రిసెర్చి చేశాను పచార్లు కొడుతూ. చివరికి 'గిరీశం? నో యూజ్... మెమొరీ పవర్ స్లిప్పవుతోంది. ప్లేటు ఫిరాయించు, ఛేంజి ది టాక్టిక్స్....') అని తీర్మానించుకున్నాను. షేక్స్పియరుగారుగానీ, ఆయన ఫాదరేగానీ యెవడైనాసరే కొటేషను వాడకు. ఊరికే అనవసరప్పబ్లిసిటీ అఘోరించకు. యిచ్చినా ఆథరు పేరు చెప్పకు. కొటేషను వాడి బాబు సొమ్ము గాదుగా--వాడిసొమ్మే. అంచేత మనిష్టం. కాక వాడి పేరిట జమపడ్డవి నూటికి తొంబయి ఉన్నపుడు ఆ మిగతా పదీ బైహార్టు చేసి పారేస్తే బెస్ట్ గదా, సేఫ్టీ ఫస్ట్ అన్నాడు. ఫస్టెయిదు వాడు గాబోలు--వీడు కాపోయినా ఫర్వాలేదు--కాదనడుగా. కాబోలుననుకొని సంతోషిస్తాడు ముందావాడు పాపం....

చెప్పొచ్చిందేవిఁటంటే, ఇదంతా కష్టపడి రీసెర్చిచేసి రాసి పారేసినట్టు ఏ రాయిటర్రిపోర్టరో ఇండియా చెవిలో ఊదేశాడు. మీ అంకులన్నట్టు వాడసాఘ్యెం గూలా అంతే ఏరోడ్రోములో దిగ్గానే యూనివర్శిటీల వాళ్ళు చుట్టుముట్టేసి మీ థీసిస్ మా కివ్వండంటే మా కివ్వండని పి.హెచ్.డీలు ఎర పెట్టారు.

మనం పుచ్చుకోలేదనుకో. నో అన్నాం ఖచ్చితంగా. షేమ్ అన్నాం ధైర్యంగా, సారీ అన్నాం క్రూరంగా.

ఇది నాకోసం కాదు. లోకకల్యాణం కోసం. మా బ్రదరిల్లా వెంకటేశంలాంటి వాళ్ళ కోసం, పాపం ఆ అమాయకులు తప్పుడు కొటేషనులు చెప్పి చెప్పుదెబ్బలూ, చీవాట్లూ తింటూ ఉంటే -- సినిమాలూ అవీ తీసి రాతాకోతా చేసి గూబ్బద్దలయేలా ఎడాపెడా ఫెడీ ఫెడీ విమర్శలు తింటూ ఉంటే-

వాళ్ళ సిస్టర్ బుచ్చమ్మ వెన్నలాటి సున్నితమైన హృదయం తమ్ముడి అవస్థ చూసి క్షోభపడిపోతూ ఉంటే నేను చూడలేను. చూసి భరించలేను. ఇంపాసిబుల్. అంచేత వాళ్ళకే ఈ థీసిస్ అంకితం చేస్తాను, ప్రచారం చేస్తాను, అని చెప్పి, ఆ జనం తెచ్చిన పి.హెచ్.డీ.లన్నిటినీ డీ డిక్కులు కొట్టుకోమని వదిలేసి చక్కా వచ్చా.

రేప్పొద్దున్న నువ్వు ప్రొడ్యూసరై, నేను డైరెక్టరై, మన డార్లింగ్ స్వీట్‌హార్ట్ బుచ్చమ్మ హీరోయినై పిక్చరు తీయబోతూఉండగా నేను ఇదంతా వదిలేసి, డిగ్రీలకోసం, సన్మానాలకోసం అలా ఊళ్ళ వెంట పడిపోడం-హౌ మాన్-హౌ ఇటీజ్ పాసిబుల్?

అంచేత అబ్బీ, అదీ కథ.

అన్నట్టు కథంటే జ్ఞాపకం వచ్చింది. ఇప్పుడు మనం నెక్స్ట్ పిక్చరు స్టోరీ మీంచేగా ఇంతదూరం వచ్చాం. వస్తే వచ్చాం గాని ఎంత ఎడ్యుకేషనోయి! దాన్నిగదరగ నీ మొహం ఎంత బ్రైటుగా ఉందో నీకేమన్నా అజ తెలుస్తోందా అని-- అసలు నాతో మాటాడ్డవేఁ ఓ ఎడ్యుకేషన్. కొందరితో మాట్టాడకపోవడమే ఎడ్యుకేషనైనట్టు. ఎవడు చెప్మా ఇంత బ్రిలియంట్ డైలాగన్నాడు! ఎవడేమిటి నేనే కాబోలు. అంతే నూటికి తొంభయి కొటేషనులు నావేగా. వాళ్ళు అవుటాఫ్ డేటై ఫేడౌటయిపోతున్నారు.

ఇంతకీ నీ బిక్కమొహం ఫేడౌట్ అయితేగాని కథ తెమలదు--కబుర్లు లేకపోతే పనెలా జరుగుతుందోయి. అసలు కబుర్లు ఉన్నాయి కాబట్టే పనిని పని అన్నారు. ఇంతసేపు కబుర్లు చెప్పాం గాబట్టే ఇపుడు పని చూడాలి అని తెలిసింది గదా.

కథా కమామీషూ అని ఊరికే వచ్చింది షోయ్! సినిమాలో కమామీషుతోటే ఉంది మరి కథంతా. అసలు కథంతా కలిపితే ఎంతటా టెలుగు ఫిలింస్‌లో-- వడ్లగింజలో ఆవగింజంత. మదరిల్లా అన్నట్టు -- యీ వెంపు మధురవాణి ఆ వెంపు బుచ్చమ్మా నిలబడితే రెండు కళ్ళు చాలవు. కావలసినంత కథ. పనిగట్టుకు రాయడమెందుకు వేరే? వాటీజిజె స్టోరీ! కథంటూ ఉంటే అడ్డమైనవాడూ దాన్ని దుయ్యబడతాడు. అంచేత మనకొద్దు. అజ్ఞానులంతా కథా కాకరకాయా అంటూ తన్నుకు చావనీ మనకేల?

ఇందులో ఒక గొప్ప సీక్రెట్ వుందిస్మీ. తెలుసుకో. అజ్ఞానులూ చాదస్తులూ ఉంటేనే మనం ధగా ధగా షైనై పోయేది, వాళ్లుంటేనే తిట్టేవాళ్ళు తిట్టగలిగేది.

తిట్లు తినిందికి ఎవడో ఒహడుంటేనే గదా తిట్టేవాడు ప్రతాపం వెలిగించి ప్రజ్ఞ పేల్చొచ్చు. సంస్కరణ జరపడానికి, పరిమార్చడానికి, మార్చడానికి చెత్తే గదా

ముఖ్యం. విడో మారేజెస్ ద్వారా సివిలిజేషన్ పెరగడానికి బాల్యవివాహాలు అవసరమైనట్టే, కళాఖండాలు కావాలని అఘోరించడానికి చెత్త సినిమాలు సాలుకు బోలెడు వస్తూనే ఉండాలి. నాలాగా బ్రిలియంట్ థింకర్స్ వాటి మీద లెక్చర్ దంచుతూనే ఉండాలి. ఆ చెత్తలో ఓ మోస్తరు వాటికి ప్రయిజులు వస్తూనే ఉండాలి. నాలాటి వాళ్ళు మళ్లీ వాటి మీద లెక్చర్లు దంచుతూనే ఉండాలి. ది సీక్రెట్ ఆఫ్ ప్రోగ్రెస్--దిస్ వరల్డ్--మైడియర్ వెంకటేశం--ఇన్ షార్ట్ ఈజ్--ఈజ్...."

అవునుగాని, ఒక చిన్నపని చేస్తావూ, నేను ఇందాకట్నించి ఒళ్లు లాగా ఓరకంట చూస్తున్నా. ఈ ఆర్టికల్‌కి మొదటి పేజీలో ఉన్న పోర్ట్రెయిట్ మన్దో కాదో కనబడి చావటం లేదు. ఈ కళ్ళ జోడు అంచోటి.... ఔట్‌ఫీల్డ్‌లో కిందని ఆ మడతలు అవీ చూస్తే పంచెలాగే ఉందిగాని, అది కోకన్నా కావచ్చు. దేరారాల్వేస్ టూ పాసిబిలిటీస్, ఎప్పుడూ రెండందాలా అవకాశాలుంటాయి--మొన్న అదేవిఁటా హాలివుడ్ పిక్చర్‌లో లావుపాటి మిలిటరీ వాడన్నట్టు....అంచేత నువ్వేదో పనున్నట్టు చూడు...మంది కాదా?...పోన్లే...యూ మస్ట్ బీ గ్రేస్‌ఫుల్ వెంకటేశం. ఇంకోలా ఉండిందికి వీల్లేపోతే మంచిగానే ఉండమన్నాడు కొంచెం సేపు మరి--అదుగో మీ అంకులొస్తున్నాడు. స్టోరీ ఎంతవరకైందంటాడు గాబోలు--డిస్ట్రిబ్యూటర్లకన్న అన్యాయంగా ఉన్నాడే--అరే అట్నించలాగే పోతున్నాడే--అడ్వాన్సు చెపాయించేస్తాననా? అక్కణ్ణించే ఎలా పసిగట్టాడూ!... ఇప్పుడు మరి కాపర్స్ లేవే! ఎలా చెప్మా సిగార్స్‌కి--డామిట్--



# ది ఎలెవెన్ కాజెస్ ఫర్ ది డీజెనరేషన్ ఆఫ్ టెలుగూ సినిమా



అట్టే అట్టే కదలకండి అలాగే నిలబడిపొండి... ఏం అదిలా... అలా ఇటు కేసి వోరకంట చూడండి... శభాష్! సింప్లీ వండర్‌ఫుల్. అచ్చు బైస్కోపులో అమ్మళ్ళాగే ఉన్నారు. వెంకటేశం! ఐయామ్ ప్రౌడ్ ఆఫ్ యువర్ సిస్టర్. చూడవోయి గార్బో, గాడర్డ్, డీట్రిక్ వీళ్లంతా ఎందుకు పనికొస్తారీ రూరల్ బ్యూటీ ముందు--కాంట్రాష్టు చూపెట్టడానికిగ్గాకా? అసలు వాళ్లకిలా పట్టిన ఇంత అతిలోకసుందరి రాటవుతున్న ఆచూకీ తెలిస్తే మరో మరో మామ్మతో బైస్కోపు తీదురా అని. నో వుయ్ కాంట్-- మిస్ బుచ్చమ్మ రాకపోతే మా కివన్నీ అనవసరం అని మానేద్దురు. అందుకే కదోయ్ నాలాంటి వాడింకా ఫీల్డులోకి జంప్ చెయ్యకుండా ఉన్నది.

ఎవడో ఒహ గుంటడూ, ఒహ గుంటదీ జతపడితే చాల్నని ఎగబడి పిక్చర్లు తీసేదామని ముందుకు దూకేసే వాళ్ళున్నందు వల్లనే గదటోయ్ ఈనాడు మరీ ఇంత గుంటతనప్పిక్చర్లు వొచ్చి పడిపోతున్నాయీ–

ఈ విషయమైఁ రీసెంటుగా ఇంటర్ నేషనల్ ఫిలిం సెమినార్‌లో 'ది ఇలెవెన్ కాజెస్ ఫర్ ది డీజెనరేషన్ ఆఫ్ టెలుగూ సినిమా', అన్న సబ్జెక్టుమీద ఒక్క బిగిన నాలుగు ఘంటలెక్చరిచ్చే సరికి అక్కడున్న యావన్మందిన్నీ దంగై పోయారు. మళ్ళీ వాళ్ళని మేల్కొలపడానికి స్మెల్లింగ్ సాల్టూ గట్రా పెట్టి నానాతంటాలూ పడవల్సొచ్చింది.

యస్. అసలే వెహిమెంట్ లెక్చర్--అసలెక్చరంటే నాకింక వొళ్ళూ పై తెలీదు. మహ నిర్దాక్షిణ్యంగా యనలైజ్ చేసి ఈక్కి ఈకా తోక్కి తోకా పీకి ఏకవతల పారేస్తాను. అఫ్‌కోర్స్,...ఐనో ఐనో...నాకు తెలుసు. చించుకుంటే కాళ్ళ మీద పడేనని, బట్ వాట్టూడూ?...డ్యూటీ ఫస్టన్నారు మరి.

చెప్పొచ్చిన మాట. మరి ఆనాడలా ఢంకా బజాయించి లెక్చరిచ్చేసరికి మీటింగులో పోగైన యావన్మందిన్నీ విరగబడి పోయి 'గిరీశం డూ మీ యే పిక్చరంటే

డూ మీ యే పిక్చర'ని కాళ్ళా వేళ్ళా బడ్డారంటే నమ్ము. నే నొప్పుకుంటానా. ఫస్. వల్ల కాదు పొమ్మన్నా. మదరిండియాలోని ఓ మారుమూల కుగ్రామంలో వరల్డ్ బ్యూటీ ఒకటి రాటవుతోందోయ్ వాజమ్మల్లారా--ఆవిడని ఎక్స్ప్లాయిట్ చేస్తూ మాదొహ టెలుగూ బయస్కోపు తీస్తేగాని మరొహటి--మీరు నిలువెత్తు ధనం పోసి నప్పటికిన్నీ యెడమ చేత్తో కూడా ముట్టనోయ్ అని చెప్పేశాను... బ్యూటీ ఫస్టన్నారు మరి.

పోనీ అయితే ఆవిణ్ణే హీరోయినుగా వేసుకొని తీసి పెట్టండి సార్ అని వాళ్ళంతా పాపం ప్రాధేయపడ్డారు. బట్ నో... బుచ్చమ్మా ఈజ్ బ్యూటిఫుల్ టెలుగు గర్ల్, పైగా విడో కూడా. ఎప్పుడూ మడీ మడీ అంటూ ఇదవుతుంది. టెలుగు తప్ప మరొహభాష ఛస్తే మాటాడదు అని చెప్పాను.

మహబాగలాగే కానీండి. ఆవిడ కసలు డైలాగే లేకుండా పిక్చరు తీదురుగానని బతిమాలారోయ్. ఆ మాటా రైటే.

ది బర్నింగ్ ప్రోబ్లెం ఆఫ్ ఆల్ టైమ్స్--విడో మారియేజ్ మీద ఫస్టు పిక్చరు లాగవతల పారెయ్యొచ్చు ననిపించింది... ఎవరూ కరటక శాస్త్రులవారా? దయచెయ్యండి, మీమాటే అనుకొంటున్నాం.

అబ్బే విడో మారేజస్--అనగా వింతతూద్వాహములు అను విషయమ్మై ఒక పిక్చరు తీయమని హాలీవుడ్ దొరల కంపిణీ ఆఫరు పంపింది--టెన్ థౌజం డాలర్లమీద, డాలరంటే వరహా అన్నమాట. చూశారా వాళ్ళేదో మహ ముందుకు పోయారనుకుంటున్నాము. మనం వరహాలు వదలి రూపాయిల్లెక్కలోబడి ఇంతకాలమాయె గాని వాళ్ళింకా వరహా వరహా అంటూనే పాకులాడుతున్నారు. విడో మారేజసూ అంతే. అక్కడా ఉంది ఈ ప్రాబ్లెము. బ్యూటిఫుల్ యంగ్ విడోస్ని చూసి గుండె తరుక్కుపోయి ఘొల్లున ఏడిసేవాళ్ళు అక్కడా ఉన్నారు. అక్కడేమిటి యెక్కడపడితే అక్కడే ఉన్నారు. ఇందుగల రందులేరని సందేహము వలదు... నాచ్చి కొశ్చన్లాగే ఇదిన్నీ, యూనివర్సల్ ప్రాబ్లెమ్, ఆల్ టైమ్ ప్రాబ్లెమ్, విడోని పెళ్ళి చేసుకోడం యెప్పుడూ మానవుడికి ప్రాబ్లెమే గాదండీ. ...అందికే నేనీ సబ్జెక్ట్ తీస్కున్నాను మన పిక్చర్కి. దీన్ని ముందు మన మాతృభాషలో తీసి ఆ మీదట, మీదటికో పైయేటికో వరల్డు లాంగ్వేజస్ అన్నిటిలోకి డబ్ చేసి అవతల పారేస్తే ఇహ మీరు అప్పుడొచ్చిపడే వరహాలు దాచుకునిందికి అగ్గురారం భూవులన్నిటా మహళ్ళు కట్టించీయాల్సిందే మరి--

అందికే నేను అహోరాత్రులు మొత్తుకుంటున్నాను. తమరు పాటిమట్టి దిబ్బలు రొండు తవ్వించి ప్రస్తుతానికాస్త రొఖ్ఖం గాదాయించి విసిరేస్తే దాన్ని నేను మళ్ళీ లక్షల్లోకి తర్జుమా చేసి దాఖలు చేసుకుంటానని.

మట్టిని బంగారం చేస్తానన్నాడు వెనకటికెవడో... మట్టి ఓ పట్టాన బంగారమవుతుందండీ దాం దుంపతెగ--అందులో ఏ గిరీశం జీనియస్సో, ఏ కరటక శాస్త్రులుగారి సహృదయమో కల్తీ అయితే తప్ప. యిదిగో యిలాగే

మార్చుకోవాలి మరి, వెధవది యెన్నాళ్ళు దున్ని దున్ని వడ్లమ్మి పోగేస్తే అయినట్టుటా– మరదే ఓ పిక్చరు తీసి పారేశాన్చూదండి, యిహ చాలు బాబోయ్ అని మొత్తుకునేదాకా వస్తూనే ఉంటుంది.

ఇదిగో ఈ ధర్మసూక్ష్మం మా బావగారికి యెన్నిసార్లు చెప్పబోయినా చెవిన బెట్టారు కాదు, దువంధువంలాడుతూ లేచ్చక్కాపోడవేఁగాని. మీరైనా సహృదయులూ, సరసులూ, నికార్సైన విలువలు తెలిసిన వారున్నూ గాబట్టే ఇందులో స్వారస్యం లాభం పసిగట్టారు మరొహాళ్ళకైతే పుఠం వేఁసినా పట్టుబడుతుందంటారా? మీరే చెప్పండి. నేన్చెబితే అడుగో గిరీశంగాడు ముఖస్తుతి చేశాడేమిటి చెప్మా ఎన్నడూ లేనిదీ––అనుకుంటారు. మీరే చెప్పండి...నా ఉద్యమంలో ప్రాశస్త్యం మీ క్కొరుకుడు బడ్డట్టు మరొహ వానరమానవుడి కౌనా అని...నిన్న చెప్పినట్టు మీరు, వారు ఆలోచించుకొని ముందర సాదర ఖర్చులకీ, కంపెనీ బిగినింగుకీ కొంత రొఖ్ఖం జతపరిస్తే నేనూ, వెంకటేశం స్క్రిప్టు మీద కూచుంటాం. అంతే, ఆనక మీరిస్తానన్నా ముట్టుకోం. కాండబ్బు కూడా కదపొద్దు, కదిపితే నా మీదొట్టు. డిస్ట్రిబ్యూటర్లే లారీలమీద తోలించుకొస్తారండీ డబ్బు. అన్నట్టు మర్చిపోయా. వెధవది నేనీ మారుమూల విలేజిలో యిలా ఆలోచన చేస్తున్నట్లపుడే పొక్కి పోయింది దేశమంతా. అప్పుడే న్యూస్ పేపరువాళ్ళు పబ్లిసిటీ ఆరంభం చేశారు. చిత్తగించండి.... అరే వెళ్ళి పోతున్నారేం?

డామిట్, మరీ ఇడియట్‌లాగున్నాడే మీ మావఁ! వెంకటేశం నోట్‌బుక్ తీసి రాసుకో.... రాసుకో చెప్తా. ది ఇలెవెన్ కాజెస్ ఫర్ ది డిజెనరేషన్ ఆఫ్ టెలుగూ సినిమాలో పదకొండున్నూ.... వన్, టూ, త్రీ, ఫోర్, ఫైవ్, సిక్స్, సెవెన్, యెయ్‌ట్, నైన్, టెన్ అండ్ దెన్ నెంబర్ ఇలెవెన్.... ఏవైతేనేంలే, ఇప్పటి కిది చాలు.

ఆర్టిస్టు మూడ్ ఫీడ్ చేయడానికి డబ్బు తొరగా ఇవ్వకపోవడం మోష్టింపార్టెంట్ రీజన్ అని––

అరె! మిస్ బుచ్చమ్మకూడా చక్కా పోతోందే––శాడ్‌సీన్‌లో హీరోయిన్‌లా ఫేసు పెట్టీ.

డామిట్, ఒక్క దెబ్బకి రెండు పిట్టలెగిరిపోయాయి!






**వెం**కటేశం! మనవాళ్ళు వట్టి వెధవాయిలోయ్! అందుకనే మనవాడు ప్రతివాడూ ప్రతి రెండవవాడినీ వెధవాయి అంటాడు. అది మనకు ఉగ్గుపాలతో పెట్టిన విద్దె. ఎదుటపడి ఆ మాటనిందికి దమ్ముల్చాలకపోతే ఏదో గుట్టుగా సంఝావందనం చెప్పుకుంటున్నట్టు లోపలనే అనుకుంటాడు. కాకపోతే--నక్క పుట్టి మూడాదివారాలు కాలేదన్నట్లు ఆ సత్రకాయగాడు సత్యజిత్రాయి ఏంవంత పొడిచేశాడని వాడికలా ఒఖ్క లాగ బ్రహ్మరథం పట్టిస్తున్నారూ అని. వాడు పేల్చినట్టి ప్రజ్ఞ, వాడు వెలిగించిన బ్రహ్మవిద్దె యేవింటీ అని. ముందూ వెనకా పెద్దంత్రం చిన్నంత్రం లేకుండా అడ్డవైనవాడూ ఎగబడి వాణ్ణి తెగ పొగిడెయ్యడమే. ఆపాటి ప్రతాపం ఈపట్టైన గొడ్డుపోయిందా.

మాస్టరు గారు ప్లేటు ఫిరాయిస్తున్నారనుకోకు. ఇంటర్నేషనల్ సబ్జెక్టు మీద లెక్చరిచ్చినప్పుడు బంగాళీవాడు పొడిచేసేదేమీఁ ఉండరాదు. దేశవాళీ జనాభా గురించి మాట్లాడినప్పుడే బంగాళీవాడి ప్రజ్ఞను మెచ్చుకు మనం అక్షింతలేసుకోవాలి తప్ప. ఇందులోమటుకు అందరం సగోత్రీకులమేఁ. అంతే తప్ప ఈ సత్యజిత్రాయంటే నాకు పగనుకునేవు--నాకంతా సమానవేఁ. యే రాయైతేనేం తల బద్దలు కొట్టుకోడానికన్నారు.

ఇంతకీ చెప్పొచ్చినముక్క ఆ పథేర్ పాంచాలీని వాడు తీశాడు. నేను తియ్యలేదు. అంతేగదా తేడా? ఇలా బాజాలు వాయించి పొద్దస్తమానం యెవార్డులు గుప్పిస్తారని వాగ్దానమిస్తే నేను తెల్లవారేసరికల్లా అరడజను కళాఖండాల్లాగవతల పడేస్తాను.

అసలు కళాఖండాలనగా ఏమిటోయ్--డబ్బురాని పిక్చర్లు... అంతే కదా. అసలే డబ్బులు గిట్టక నెత్తిన చెంగేసుకు పోయేవాడి బోడిగుండు మీదికి మల్లెచెండులా ఈ పేరు తగిలిస్తారు--మరెప్పుడూ ఇలాంటి ఓఘాయిత్యప్పన్లు చేయకుమీ అని సున్నితంగా మందలించి! వాడూ నా మాట దొరకబుచ్చుకునే

మాటాడుతున్నాడనుకో, మా యింట నాలిగ్గీసుకునే తాటాకుబద్దలు నిండుకున్న రోజున మళ్ళా ఈ సర్కారువాళ్ళ సర్టి ్రకెట్టుకోసం కళాఖండవోఁటి తీస్తానని. అలాగ్గాదు బాబ్బాబు నువ్వు తీసి తీరాలి ఏం చూసితీరాలి అని కాళ్ళా వేళ్ళా బడితే, తే డబ్బు అని దబాయించొచ్చు.

నేను హోలీడేమీద ఇక్కడికొచ్చే ముందేగదోయ్--ఓ కళాఖండం చూసొచ్చాం, నాయుడుగారు తీయించారు. ఎలావుంది గిరీశం గారు డబ్బులేవైనా వొచ్చేనా అన్నాడాయన బిక్క మొహవేఁసి--నువ్వు లేమన్నా జాగర్జేశారాస్వావీఁ అన్నా. అంతేనా అన్నాడు కుప్పకూలిపోయి. అంతే గాక మరేవిటయ్యా, ఇలా మాస్టరుపీసు తియ్యదల్చుకున్నట్టు ఓ ముక్క నా చెవిన పారేస్తే కక్కుర్తిరకం గాకుండా కడితేరా కళాఖండవేఁ తీసిపడేసిపెడుదును గదయ్యా అన్నాను. మరేందారి బాబూ అని ఇదయ్యాడు పాపం.

సరే ఇప్పుడైనా మించిపోయిందేవీ లేదూ, ఈ పిక్చర్లో డాన్సులూ, కామిక్కు వగైరా డబ్బు వాసనేసేవన్నీ తీసిపారేసి ప్రిస్టేజీ పిక్చరని పబ్లిసిటీ అఘోరించవయ్యా లేపోతే నెక్స్ట్ పిక్చరుకి డిస్ట్రిబ్యూటర్రాడు అని ఓ చిటకా చెప్పానన్నమాట. పాపం వెర్రిముండావాడు చచ్చి నా కడుపున పుడతానన్నాడు. దీంతరవాద్ధి ఈ లాగేసిన భాగాలన్నీ పోగేసి మాస్ పిక్చరు తీసి పెడితే మరిహ నేనీజన్మకి చెప్పులు కుట్టించుకోనక్కర్లేదనిన్నీ, తనే చర్మం కోసి కుట్టించి మరీ దాఖలు చేసుకుంటాననిన్నీ మొర పెట్టుకున్నాడు. వాడు మాటిచ్చాడని మనం జోళ్ళుకొనుక్కోడం మానేస్తే యెలాగ. ఇస్తే గిస్తే రెండు జతలు పడుంటాయి కాబట్టి నువ్వు ఓ కొత్తజోడు--ఫస్టుక్లాసు విలేజ్ మేక్ గురుదక్షిణగా అర్పించుకుందుకి సన్నాహాలారంభించవచ్చు. నేను ఎంత మాత్రం అడ్డుపడను.

వెంకటేశం, కొంచె విఁసింటా జరుగు, ఓ కబురు చెబుతా... చూడు, నేను వెనక్కి తిరిగిజూస్తే బావుండదు గాని, ఈ పక్కన మండపం మీద కూచుని మన కబుర్లాలకిస్తున్న చౌదరిగారు ఇంకా అక్కడే ఉన్నాడా లేచి వెళ్ళి పోయాడా.... ఆ మరేం లేదు. పట్నంలో ఓ బైస్కోపు కంపినీలో ఆయన పావలా వాటా పెడుతున్నాడని విన్నాంలే. నాలాటి వాడిక్కడున్నాడని పోల్చుగోలేక, మళ్ళా డైరెక్టర్ల కోసం వెతుక్కుని డబ్బు తగలేసుకుంటాడన్న జాలి కొద్దీ--నేను బొత్తిగా నివురుగప్పిన నిప్పులాటి వాణ్ణయిపోతున్నానుగదోయ్. వెధవది అదే చిక్కు, మోడెస్టీ మహలావు. ఆ మాట వాళ్ళు పోల్చుకోవాలి. కోటి నదులు ధనుష్కోటిలో నుండగ అన్నాడు త్యాగరాజువారు. అదే గమ్మత్తు. ఒళ్ళో బిడ్డణ్ణెత్తుకుని ఊరంతా వెతికినట్టు. నేనిక్కడే ఉండగా చౌదరిగారు డైరెక్టర్లకోసం వెతకడం ఏవిఁ ఘనం గనక--తరవాతాయన నాలిక్కరుచుకోలేక ఇదవాలి గదా.



# మనం తీసేస్తే కళాఖండాలు



ప్రజా పునస్కారాల్లేక బూజుపట్టున్నానుగాని నవేజ్జం పెడితే నా మహిమ చూపిస్తానన్నాట్ట వెనకటికో దేవుడు. ఎవడో జ్ఞాపకం రావటం లేదు, ఐనా కాకపోయినా ఒకడా ఇద్దరా. తెలుగువాడికి నాయకులెందరున్నారో దేవుళ్ళూ అందరున్నారు. అల్లాగ్గా ఎవడో ఒహ తలమాసినవాడు నాలుగెకరాలు నాదిగాదనుకుని యిల్లా పారేసినట్టాయనా, మళ్ళీ దాన్ని పదహారెకరాల పొలంగా ఫిరాయించుకునే వసతి చూపిస్తాను లేకపోతే ఈ జన్మకిహ ఈ టాలెంటంతా వృధాయే. అనక తెలుగువాళ్ళు యావన్మందిన్నీ సభజేసుకుని అయ్యో ఇంతటివాడు మన మధ్యనే తిరుగుతూ ఉండగా కానుకోలేకపోతిమే అని సమిష్టిగా ఖేదించాలి. అయ్యో గిరీశ వంతవాడుండగా ఒక గోల్డుమెడలిచ్చి మన్ని మనం గౌరవించుకోలేక పోతిమే అని ఆసేతుహిమాచలమున్నూ కుమిలి కుమిలి దుఃఖించాలి. హన్నన్నా! వాడిచేత ఒక్క పిక్చరు తీయించుకుంటే బాగుండేదే, ఎంత పొరబాటైపోయింది. ఈపాటికి అగ్గురారం భూవుఁలన్నీ కొనిపారేదుంగదా అని ఈ వూరనున్న అడ్డమైన వాడున్నూ నాలిక్కరుచుకు విలవిల తన్నుకోవాలి.

యేంజేతును వదినా, నాకు మటుకు యిష్టఁవాఁ ఈలా యావన్మందినీ దుఃఖ సముద్రంలో ముంచడం? ఛస్తే మనసొప్పదు--సర్వేజనాస్సుఖినో భవన్తు అన్నాడు శాస్త్రకారుడు. కాని ఎలా? ఏం దారి? అందరూ అజ్ఞానాంధకారంలో మునిగి నా ప్రజ్ఞ పోల్చుకోలేకుండా ఉన్నారాయిరి. వాళ్ళ కన్ను తెరిపించడానికయినా ఒక పిక్చరు నా అంతట నేను నష్టానికైనా త్యాగం చేసి తీసి చూపించడం ధర్మం. మీరే చెప్పండి ధర్మవాఁ కాదా!

అవునా?... అయినప్పుడు ధర్మపాలనకు ఈ వెధవ డబ్బు అనేది అడ్డుపడుతోంది. మరేవీఁలేదు. నేను పిక్చరు మొదలెట్టి రెండు రీళ్ళు అంటే--మీరు

స్నానం జేసిన బట్టలతోనే అలా మడిగా వనలక్ష్మిలా అలా...అలా పెరట్లో పాదులికి నీళ్ళోసి గుమ్మడేడీ పాటపెండి అంతలో పెరటి దోవన జొరబడుతున్న హీరో గిరీశాన్ని అలా అలా ఓరకంటజూసి దోరనవ్వు నవ్వి చెంగున లేడిలా గెంతేసి వంటింటోకి వెళ్ళి పోయేటంత మేరా బయస్కోపు తీసినట్టాయనా--అంతే ఇహ మరి మీ డబ్బులోది కాండబ్బు కదపనక్కర్లేదు. డిస్ట్రిబ్యూటర్లే--అంటే పెట్టుబడిదార్లు--వచ్చి పడిపోయి, గిరీశం గారూ... ఇహ మీరు కాణీ పెట్టడానికి వల్ల కాదు, పెడితే మా మీద ఒట్టేను--ఇందండి చిల్లర ఖర్చులికి ఈ లక్ష ఉంచండి. మీరూ మిస్ బుచ్చమ్మగారూ స్టూడియోకి రావడానికి ఖేషైన బగ్గీ తెప్పించాం, చిత్తగించండి అం వటాని కాళ్ళా వేళ్ళా బడతారు.

....ఎవరది ప్రొడ్యూసర్ చౌదరి గారా! వీడీ దారిన పోతున్నాడేవింటి చెప్మా! నన్నొహకంట కనిపెడుతున్నాడా లేక ఈ వెంపు న్యూ టాలంట్ల కోసం హంట్ చేస్తున్నాడా? వీడికో ఠస్సా వేసి చూద్దాం. మొన్నటి లెక్చరు వీడిమీద పనిచేసి ఉన్నట్టాయనా ఈ దెబ్బకి దారి కొస్తాడు. లేదా-నా లెక్చర్లు దున్నపోతుమీద వానే అనుకుంటే సరి. అయినా దున్నలున్నాయని వాన కురవడం మానుతుందా యేవిం టి? ఇదిగో వదినగారూ, నాకు రాచకార్యాలున్నాయి గాని మీ రిహ ఔట్ ఫీల్డులోకి- అనగా తెరలోనికి నిష్క్రమించి వేగిరం ఓగిరంబును సమకూర్పుడు...వాట్ మైగాడ్ డైలాగులు మహాపసందుగా పడుతున్నాయే అయాచితంగా. శుభశకునం గాబోలు! విష్‌యు గుడ్‌లక్ గిరీశం! నౌ, సినిమాలో రూజ్వెల్టన్నట్లు--చ్చార్జ్!

అయ్యా! చౌదరిగారూ, గుడ్‌మార్నింగ్, ఏవిటలా చురుగ్గా అడుగేస్తున్నారు... మీ పిక్చరు కప్పుడే అవుడ్డోర్ షూటింగారంభించారా యేవింటి...కాదా, మరేమిటీ హడావుడీ! ఏమో, మిమ్మల్ని చూస్తే అలా అనబుద్ధేసిందిస్మండీ. చూశారో లేదో ఒక్కడుగింటి కెళ్ళి అద్దం చూసుకోండి! మీ కప్పుడే యేస్ ప్రొడ్యూసరు కళ ఉట్టిపడుతోంది. కక్కొచ్చినా కళ్యాణం వచ్చినా మరాగదన్నారు. సినిమా కూడా అంతే! ఆ రోజు రాకనేపోవాలి, తీరా వచ్చి పడిపోయినా మరిహ దానినడ్డడానికి బ్రహ్మక్కూడా శక్యం కాదు. అర్జెంటు పనా, పదండి నేనూ నాలుగడుగులు వేస్తాను. బిఫోర్ సప్పర్ వాకెమైల్ అన్నాడు ఇంగ్లీషువాడు...చూశారూ ఏడడుగులు కలిసివస్తే వారు వీరవుతారన్నాడు. అంటే నేను చౌదరి, మీరు గిరీశంగా ఫిరాయింపై పోతామని గాదు, మన మిద్దరం ఏకమైపోయి ఏదో మహాఘనకార్యం--అనగా లక్షలు గుమ్మరించేసే బాక్సాఫీసు హిట్ పిక్చరు తీస్తామని తాత్పర్యం. బ్రహ్మదేవుడిలా రాశిపడేశాడు మనదేవుంది. మనం నిమిత్తమాత్రులం. కాపోతే నేను బొంబాయి వాళ్ళకి పిక్చరు తీసిపెడతానని మాటివ్వడవేంవిటి. తీరా అంతా సిద్ధమయ్యాక ఛస్ ముందు మాతృభాషలో తియ్యందే నేను మరో భాషకి రానని నేను దాన్ని కాలదన్ని చక్కా వెళ్ళిపోయి రావడవేంవిటి--అందాకా చోద్యం నా కోసం మీరూ, మీకోసం నేనూ వెతుక్కుంటూ ఇందమ్మట 13వ రీలులో హీరో హీరోయినుల్లా తిరగడవేంవిటి, అంతా ఘటన కాకపోతే.

మీకలా రాసిపడేసుంది నాయనా చౌదరీ కోటేశ్వరుడివి కమ్మని. వద్దంటే తప్పుతుందా...ఏదో సందేహం బాధిస్తోంది మిమ్మల్ని. జనాభాకి నచ్చే పిక్చరు వీడు తియ్యగలడా మనసా అని తర్కిస్తున్నారు కాబోలు. యంతమాటనుకున్నారు. అసలు ప్రజలనగా యవరండీ. ఉట్టి గొర్రెలమంద. ఆ మందకి ముందు గొర్రెలం మనవేఁ, మనఁవెలా నడిస్తే అవలా వెళ్ళిపోయొస్తాయి. కాకపోతే అవెలా నడిస్తే మనవలా నడిచి వాటివెంట పోతాం. ఇదీ ఇందులో ధర్మసూక్ష్మం. ఇహపోతే ప్రజలకి ఏది నచ్చుతుంది అన్నది పసిగట్టడం ఏ మాత్రవుఁన్నూ బ్రహ్మవిద్దె గాదు గదా. రీసెంట్ హిట్‌లు నాలుగు చూసుకుని అవే తిరగేసి మరగేసి వాళ్ళ యదాన కొడితే సరీ--అంథా గుఱ్ఱప్పందాల టెక్నిక్కేనంటే నమ్మండి.

మరోహటి-- ఈ ప్రజలున్నారే వాళ్ళంతా సుబ్బరమైన తిండికీ, గుడ్డకి, కొంపకీ మొహం వాచి ఉంటారన్నమాట. అంచేత అంట్లుదోవేఁ అప్పలమ్మకి కూడా అట్లా అంట్లు దోముతున్నప్పుడు జార్జెటు చీర చుట్టబెట్టండి. జోసపైనుచేత బర్మీస్ సిగ చుట్టించండి. హీరో రిక్షావాలా అయినా పోలీసు అయినా గుమాస్తా అయినా సరే సుబ్బరమైన గాబర్డీను సూట్లు కుట్టించి మొహానికింత పవుడరు మెత్తండి. జనం మంచి ఇళ్ళకి మొహంవాచి ఉంటారు గాన మన బాబు సొమ్మేగదా పోయేది--పెద్ద భవంతులు కట్టించేయండి. అందులో అద్దెకుండేది - ఎవడైనా సరే, ఇదిగో ఇలాటివేళ కొందరు దుష్టులొచ్చి ఎన్.జీ.వో. గాడికి ఇంత భవంతెలా వస్తుందంటారు. వాళ్ళ మొహం వాళ్ళకేం తెలీదు. జనం డాన్సులికి మొహం వాచి ఉంటారు. ఓ అరడజను డాన్సుల్లాంటివి గుప్పించెయ్యండి. జనం పాటలంటే చెవి కోసుకుంటారు. పద్యాలు కూడా తోసేసి రెండు చెవులూ కోసుగోమనండి. ఇన్ని ఉన్నాక ఇంక కథా కాకరకాయ కూడా పెడితే మొహం మొత్తిపోతుంది. ఈ విధంగా తీసి పారేద్దాం. అయితే ఏడుపుకీ కష్టాలకీ కూడా మొహంవాచి ఉండకపోయినా అవిమాత్రం బాగా ధట్టించాలనుకోండి.

ఆ తరువాతంటారా మందే రాజ్యం. నాలుగుడబ్బులు నొల్లుకున్నాక మనమాటకి అడ్డెక్కడ మనపేరుకి ఒడ్డెక్కడ. మనం తీసినవే కళాఖండాలు. మనం తీసినవే హిట్ పిక్చర్లు. మనవేఁ మహా ప్రొడ్యూసర్లం. మహాడైరెక్టర్లం. మహానటులం--కాదన్న కళ్ళన్న యవడండీ. దేవతావస్త్రాలని ప్రశస్తి చేసినట్టే ప్రతి అడ్డమైనవాడూ మనలోనూ మన చేష్టల్లోనూ స్వారస్యాలు తీసి ఒల్లిస్తాడు. ఇహనా తరువాత అన్నీ హిట్ పిక్చర్లే. అంతా డబ్బే. మిమ్మల్ని దారిలో పెట్టేశాక మీరే డైరెక్షనూ, డైలాగులూ, మ్యూజిక్కూ, యాక్టింగూ అవలీలగా లాగవతల పారేస్తారు, నేనానక పోలిటిక్సులోకి వెళ్ళి పోతాననుకోండి. నాలాంటివాడు ఒక్క ఫీల్డునే నమ్ముకొని అంకితమైపోతే మిగతా వాళ్ళు వూరుకోరు. అంచాత నాలుగూ చక్కబెట్టుకోవాలి. ఆలస్యం చేయక నన్ను బుక్ చేసుకుని అడ్వాన్సిచ్చి ఆకట్టేసుకోండి. ఒక ఘడియ ఆలస్యమైతే రేటు లక్షల్లోకి వెళ్లిపోతుంది...అంతే మరీ. ఏవిటనుకున్నారు. ఫీటు బట్టే రేటు. ఫిలింఫీల్డులో ఇవాళ అరుకాన్లు తీసుకుంటాం. రేపు పిక్చరు హిట్టయితే అరవై వేలు

గిట్టవంటాం--హఠాత్తుగా పెరిగింది గాబట్టి. అంచేత జాగర్త పడండి. అప్పుడే నేను ఫీల్డులోకి దిగుతున్నానని విని చాలామంది ప్రొడ్యూసర్లు ఎగబడి నాకోసం వేటాడుతున్నారట. ఏ నిమిషానికెవడొచ్చినా గెద్దలా తన్నుకుపోతాడు. వెనక విచారించి లాభంలేే...

అరే, వీడా! వీడెక్కడనించొచ్చి పడ్డాడోయ్ భగవాన్లూ.... డామిట్ సందు మళ్ళటానిక్కూడా సావకాశం చాలదే. ఆయ, నమస్కారం, అనెక్స్‌పెక్టెడ్ లక్! ఏవి అదృష్టం? సుబ్బయ్యగారూ, మిమ్మల్నిక్కడిలా కలుసుకుంటానని కల్లోకూడా అనుకోలేదు. మీ ప్రశస్తే చెబుతున్నాను చౌదరిగారికి....

❀ ❀ ❀ ❀

అలా పోయేటప్పుడు కాబోయిన హీరోయినొకర్తె కాదు కూడదని పట్టుబడితే ఆవిడ ప్రొప్రయిటరు తాలూకు హీరోయినని పసిగట్టలేక--రమ్మన్నాడు. బొంబాయిలో ఆలిండియా లెవెల్‌మీద పిక్చరు తీసి ఇంట్రడ్యూస్ చేద్దామని. తీరా ఆవిడ ఇంటర్నేషనల్ లెవెల్లో పిక్చరు తీయించి వేషం కడదామని అట్నించటే వెళ్ళిపోయిందనుకోండి, ఆ తరువాత గిరీశం చాలా క్షోభపడ్డాడు-ఎంతో పశ్చాత్తాపపడ్డాడు. ఆ వేడికి నిజంగానే ఉష్ణవొచ్చి వాడిలో దుష్టతనాన్ని కొట్టేసింది.

చిత్తం. ఒప్పుకుంటాను రైటే.... అక్షరాలా రైటే.... నేనే భోజకాళిదాసునైతే మీ తిట్టుకవితకు అక్షరలక్ష లిచ్చి పై పెచ్చు క్షమాపణ చెప్పుకొందును. ఇంకా రొఖ్ఖం జతపళ్ళేదు తప్ప.... యాస్. యువార్ రైట్. కొంత కాలం క్రితం గిరీశం అనే ఫూలిష్ యంగ్‌మాన్ వొకడు ఉండేవాడు. చాలా తెలివైనవాడు. ఒక్క మాటలో చెప్పాలంటే జీనియస్. అయితేనేమి, వాడి దురదృష్టంవల్ల కూడనిమాటలు విని తప్పుదారిన పడి మీ వంటి మహానుభావుల ఫిలింప్రొడక్షన్‌ను మధ్యలో వదిలేసి ఆవేళకి తన చొక్కాజేబులో కొంత కంపెనీ పైకం ఉన్న సంగతి కనుక్కోలేక దారి తప్పిపోయిన మాట వాస్తవమే. పరిశుద్ధ హృదయంతో తిరిగి కళారాధనకు జీవితాన్నంకితం చేయడానికి సిద్ధంగా ఉన్నాడు. ఇప్పుడు కొత్త ప్రొడ్యూసరు, బ్యూటిఫుల్ విలేజి బ్యూటీ హీరోయిను, చక్కని కథ సమకూర్చుకొన్నాడు. ఆ గిరీశవే ఈ గిరీశం. స్వర్గానికి ఒక చీడీ తరవాయిగా ఉన్న నన్ను తిరిగి పాతాళానికి లాగడానికి ఈ సుబ్బన్నగారు నా పురాకృతం వల్ల ఇక్కడ ఆవిర్భవించారు. నావంటి రిఫార్మ్‌డ్ జీనియస్సులను ఎంకరేజ్ చేసి పైకి తేవడం తమకు బిరుదుగాని నన్నూ అల్లవాడిగా చూసి డ్రాప్ చేయడం న్యాయం కాదు. ఐ క్రేవ్ యువర్ మెర్సీ చౌదరిగారూ, ఐ క్రేవ్ యువర్ మెర్సీ.... చిత్తం దాన్దేముంది, పశ్చాత్తాపం అన్నాక పశ్చాత్తాపవేఁ. ట్రూ రిపెంటెన్సుకి ట్వెంటీ ఫోరవర్స్ చాలదాండీ... వాట్... అంతే? లాభం లేదా?....

డామిట్ కథ అడ్డంగా తిరిగింది

❀ ❀ ❀

# బైస్కోప్ గురించి రెండు ముక్కలు



ఐరనీ ఆఫ్ లైఫ్ అంటే యిదేస్మీ వెంకటేశం--కాకపోతే ఏవింటి చెప్పు. లాస్టియరీ సీజన్‌లో నేనెక్కడున్నాను.... కోడంబాక్కంలోని పెలేషియల్ బిల్డింగులో, హోరున కురుస్తున్న వానచూస్తూ ఫ్రెంచి విండోపక్క నిలబడ్డ నాకో మంచి విడో పక్కనుంటే మహాకావ్యాలు రాయగల్ననిపించింది. తీరా ఈ రోజున రెండు వరాలూ, గ్రాంటు అయ్యాయి గాని... ఏవింలాభం. అన్నీ ఉన్నాయిగానీ ఐదోతనం తక్కువన్నట్లు....ఛ. అవాచ్య మప్రతిహతమగుగాక... దేవుడు వరమిచ్చాడు గాని పూజారిణి బుచ్చెమ్మ వదిన ఆమోదించటం లేదు. నాకేవింలే మధ్యన, లోకానిక్కాసిని మహాకావ్యాలు లభించకుండాపోతాయి... కాళిదాసు పిక్చరు చూశావోలేదో గాని అది చూస్తే అతగాడి కీలకం తెలిసింది. అంథా వైఫ్ వైపు ఇన్స్పిరేషన్‌నష. నేనప్పుడే అనుకున్నా. ఎంత కాళిదాసైనా ఒంటి చేత్తో ఇంత ఘనమైన బుక్కు లెక్కడ రాయగల్డులే ఆడచ్చెయిజేసుకోపోతేనూ అని...

చూశావూ చూశావూ కాళిదాసు పేరెత్తగానే కవిత్వం తన్నుకొస్తోంది. మైడియర్ వెంకటేశం! ఇప్పుడు నీకీ రెయిన్ అనగా, వర్షం యలా కనిపిస్తోందోయ్! భూలోకంలోని బ్యూటిఫుల్ యంగ్ విడోస్ కోసం దేవతలు హోరున దుఃఖాశ్రువులు రాలుస్తున్నట్లు కనబట్టం లేదూ? మీ సిస్టర్ మనసులో గాఢంగాను ఫేసులో లీలగాను గోచరించే భావాలను ప్రకృతే నటించి పెడుతోందోయ్, కాని ప్రదర్శించేందుకు భావాలుండి, ప్రదర్శించగల ప్రజ్ఞ కూడా ఉన్న మీ సిస్టరు నేటి సినిమా యాక్టర్లలా ప్రకృతినీ సెట్టింగునూ తోడుగా వాడుకోవడం శుష్కదండగ సుమీ.

మన సినిమా యాక్టర్లయితే బాధ, ఆవేదనవంటి మనస్థితులను గాఢంగా ప్రదర్శించవలసి వస్తే ఎన్నో హంగులు చేసుకుంటారు. కామెరా టిల్ట్‌లు చేయిస్తారు. గిర్రున తిప్పుతారు, సూపరింపోజులో రైళ్ళు పరుగెత్తినట్లు చూపిస్తారు. మొహంమీద గిర్రున తిరుగుతున్న పంకా నీడలు చూపిస్తారు. ఇవన్నీ చాలక అరవై వయొలిన్‌లు, ఇరవై క్లారినెట్ల నేపథ్యప్పాటలతో గొడవ చేయిస్తారు. ఇన్నీ చేసినా భలానా పాత్ర చాలా బాధపడుతోంది, గావున దేవుడా మనవున్నూ దుఃఖించాలి గాబోలు అన్న జ్ఞానం ప్రేక్షకులకు కలగటం లేదట-మరి అంచేతను గావును ఇటుపై సినిమాలో ఈ ఏడుపు సీనులూ గట్రా నడుస్తున్న సమయంలో అది చూస్తున్న ప్రేక్షకుల్ని కుట్టిందికి నల్లుల్నీ, గిల్లీ రక్కీబాధ పెట్టిందికి కిరాయి జవానుల్నీ పెడతారట.

అప్పటికీన్నూడా తెరమీద నటులబాధ చూసి జాలిపడలేని మొండి ఘటాలుంటే, వాళ్ళ అయినవాళ్ళో కానివాళ్ళో హరీమన్నారని వాళ్ళ చెవుల్లో వూది భోరున ఓ సారి ఏడిపించి కళ్ళు తుడుస్తారట. ఇది కూడా డైరెక్షను యాక్టింగు కళలో భాగవేఁ, కానీ గిరీశంలాంటి డైరెక్టరాక్టరూ, బుచ్చెమ్మలాటి బ్రహ్మాండమైన నటీ వడికడితే ఇవన్నీ శుష్కదండుగే. అసలపుడు మేం చూపించడానికి లోకంలో ఉన్న బాధంతా చాలదు. లోకంలో ఉన్న ఆనందం అంతా పోగేసినా మాకు ఒక ఎక్స్‌ప్రెషన్‌కి చాలదు, ఏవిటనుకున్నావో మరి...

యేవిటోయ్ వెంకటేశం, నేను ఎప్పుడూ మూడ్‌లోకి రాను, రాక రాక వచ్చి పుంజుకొని అక్షరలక్షలయిన ఉపన్యాసాలిస్తూ ఉంటే మీ సిస్టరలా వెళ్ళిపోతుందీ! విన్నది కాస్త కాస్త హరాయించుకొన్నాక మరి కాస్త విందావనా!....

యవరూ ఫాదరిన్లా గారా! అంటే పూజనీయులనిలెండి! దయచెయ్యండి-- హరాయించుకోవడం--అనగా డైజెషన్ గురించి మీవాడికి లెక్చరిస్తున్నాను. ఇది సైన్సులెండి, అబ్బో దొరల కళ్ళర్లేని విషయం లేదు... అదే అదే ఇలా మసాబుగా ఉన్న రోజున కాస్త తిండి, చిరుతిండి తగ్గించుకోవాలనిన్నీ లేకపోతే అరగదనిన్నీ చెబుతున్నాను.... తిండి చిరుతిండి సయిజుకి తగ్గాలి. మరి చిరుతిండి కూడనే కూడదనుకున్నారు ఎల్ఫిన్‌స్టన్ దొరవారు.

చిత్తం మీరన్నది విలువైన ముక్కే కానీండి. ఈ కాలప్పిల్లలలా హరాయించుకోలేరు. వీళ్లంతా కుర్రసజ్జు. వర్థి అర్భకులు....

...ఎవడండీ అంత మాటంటా, తమవంటివారింట ఆశ్రయం పొందుతూ వెధవ టెంటు సినిమా మానేజర్ని చేబదులడగడం నాకేం ఖర్మవండీ, ఏదో పొరబాటైయుండాలి, ఆఁ. ఏంకాదూ, నిన్నగామోసు అలా షికారు కెళ్తే వాడు గనబడి బలవంతాన టీ గట్రా పట్టించి ఈ గవర్నమెంటు యక్సయిజున్నూ, దానివల్ల హాలువాళ్ళకి పడే సుంకం గురించిన్నీ అడిగాడు. ఆ వేడిలో సర్కారువాడి చెమ్డా లెక్కదీసి మరీ నాలుగూ అనేశాను. ఎదట లేకపోయాడుగాని ఉంటే దంగై పోయేవాడు. ఆ పైన పన్నులూ ఒన్నులూ పడితే నీకేమయ్యా మహారాజాలా జనం నెత్తికి తోసెయ్. టిక్కెట్టు పెంచి పారేయ్. అటు సర్కారువాడి ముందు నీ ఆబోరు

దక్కుతుంది. ఇటు అడ్డమైన చెత్తసినిమాలనీ చూసి మన ఇండస్ట్రీని చెడుదారిలో నడుపుతున్న ప్రేక్షకులకి జుల్మానా వేసినట్టున్నూ ఉంటుంది అన్నాను.

అంతే, వాడానందం పట్టలేక ఉక్కిరిబిక్కిరైపోయి కాళ్ళమీద పడ్డంత పని చేశాడు. నా ఋణం తీర్చుకోలేనన్నాడు. ఆనక అయిదూ పదీ కావలిస్తే ఋణం పట్టికెళ్ళమన్నాడు. ఒద్దుమొర్రో అగ్నిహోత్రావధాన్లు గారు నీ డొక్క చీలికల్జేయిం చేస్తారని నేనూ, కాదు మొర్రో అని వాడూ, చివరికి నాకు తెలీకుండా నా కమీజు కేవన్నా అంటించేశాడు గావును. ఆ నోటలాగే నాతోబాటు వచ్చి ఉండాలి. ఇచ్చేద్దాం లెండి. మీ రిమ్మన్నారని పిన్నిగారి నడిగుచ్చుకుని వాడి యదాన కొడతానదెంతసేపు.

తరువాత మరొక్క విషయవండి, నిన్ననే మనవి చేద్దామనుకున్నాను. సర్కారువాళ్ళు నావంటి జీనియస్‌లు మంచి ఫిలిములు తియ్యడం కోసవఁని బాంకిలో ఇరవై లక్షల్జాగర్జేశారట, వచ్చి కావలసింది తీసుకుని అఖండవైన కళాఖండవోటి తీసుకోవలసిందని ఉత్తర్వైంది పై నించి. అంచేత బహుశా నేను రెండ్రోజుల్లో బయల్దేరాల్సుంటుంది. సర్కార్నించి మణియార్డర్రాగానే - మనియార్డరే వస్తుందో మనిషే రొక్కం పట్టించుకొస్తాడో చెప్పలేననుకోండి.

ఏవన్నారూ! అందరికీ ఇస్తారా అనా, ఆహాఁ వారనడం అలాగే అంటున్నారు. అయితే ముందస్తుగా తలాతోకా ఉన్న ఓ కథా, దాని కమామీషూ కాగితమ్మీద పెట్టి చూపించిన మీదటనే డబ్బు చేతిలో పడుతుందని షరతు. నావంటి పెద్దవాళ్ళక్కాదనుకోండి. ఏం, అంచేత డబ్బాశవున్న ఏ ప్రొడ్యూసరు ఆ పని చేయగల్డు. అసలు కథలకే దిక్కులేదు. పై పెచ్చు తలాతోకా ఉన్న కథ తెమ్మంటే ఎలా తెస్తాడు. నిజానికి నవ్వుకుంటున్నారు ఇండస్ట్రీలో అంతా. ఇదెన్నడేనా కన్నావాఁ విన్నావాఁ విడ్డూరం గాపోతే, సినిమా తియ్యకుండానే కథేవిటంటే ఎలా చెప్పగలం అవఁటాని.

అంచేత చెప్పొచ్చిందేవిటంటే, నాకా మనియార్డరొచ్చేలోగా తవరో హస్తం.....

చిత్తం.... చిత్తం.... దానికేం అలాగే, తర్వాత మాట్టాడదాం.






బాస్! బస్ బస్ బస్ బస్! చాలు. కొల్లలు! కటిట్, తెగ్గోశివతల ఫారీయొచ్చు, రేయ్ బాయ్! నాలుక్కుర్చీ లవతల వెయ్యి. వారూ వీరూ కూచుంటారు. హబ్బ థెగ ఉడకపోసేస్తుంది గదండి సార్! గుడ్డిలో మెల్ల ప్రొడ్యూసరుగారి చూపుల వేడి కూడా లేదు, మన్లో మనమాట. అది కూడా ఉంటే ఈ హై పవర్ లైట్లకి తోడై నాలాటర్భకుల్ని మాడిచ్చుంపేసును, పదండి సార్. ఒక్క నిముషం రెస్ట్ తీసుకుందాం, రెస్ట్ ఫస్టన్నాడు ఎవరెస్ట్ హీరో టెన్సింగ్ నార్కే.

చూడండి కామెరామన్ గారూ, ఇపుడు తీసిన షాట్ అలాగే ఉంచండి, బహుజాగ్రత్త సుమండీ, సెటప్ మార్చీకండేం, మరొ షాటు కూడా సరదాగా తీద్దాం, టెన్ మినిట్స్ రెస్ట్.

బాయ్.... గారికి కాఫీ, నాక్కాస్త 'గట్రా' పట్రా. ష్ హమ్మయ్య. ష్షమ్మయ్య. ఝెవిటో సార్, మా రోవింగ్ డైరెక్టరుగారింకా నెక్స్టట్ షాటు ఎలా తియ్యాలో ఫోన్ చేయనే లేదు. నాకు ఎక్స్పీరియన్స్ లేక్కాదుస్మండీ. ఆయనేదో వెయ్యిళ్ళ పూజారిగా తీరికలేక టెలిఫోన్ మీచ్చెబుతూ ఉంటా, బాబ్బాబు కాస్త రెండు కాల్‌షీట్లు సాయంపట్టమని మోకాళ్ళా వేళ్ళాపడ్డాడు. ఉపకారాని కొచ్చినపుడు మనవేల హద్దు మీరాలి. మీగ్గాబట్టి ఇందులో కిటుకర్థమైంది.

యావంటారు? ఇపుడు తీసిన షాట్ బాగుందా అనా? యంతమాట శలవిచ్చారూ, టెర్రిఫిక్‌గా అనగా భయంకరంగా వుంది. ఇంగ్లీషిడియం స్మండీ. ఆ నుడికారాన్ని తెలుగులో వెటకారంగా అర్థం చేసుకోగల్రు జాగర్త. వెధవ దిదో చిక్కొచ్చిందండీ, ఈ ఇంగ్లీషుని మాస్టరు చేసిన వాళ్ళందరూ తెలుగు పూర్తిగా మర్చిపోవడం చాలా అవసరం, అంతవరకు మనం బాగుపడం, వెధవది ఓ భాషలో సొంపు రెండో దాంటో కంపు గదా! పెడర్థాలొస్తాయి. ఇవేవన్నా పిక్చరులో డైలాగులైతే ఫరవాలేదు. పెడార్థాలొస్తే సంతోషిస్తాం. అసలవి లేకపోతే మజాయే లేదు

గదా! మనకి... ప్రమాణకప్పూర్తిగా చెబుతున్నాను. మీరు అన్యధా భావించడం వల్లనో, కాఫీ బాగులేనందు వల్లనో మొహం అదోలా పెడుతున్నారుగాని, మనసులోమాట చెబుతున్నాను. నాకసలు మాట దాచుకోవడం చేతగాదు. నిష్కర్షగా అనేస్తాను. అందికే ఇలా ఉండిపోయాననుకోండి, చెప్పొచ్చిం దిందాక షాటులో మీ యాక్టింగు బ్రహ్మాండంగా ఉంది. సరిపోతుందా అని మీరు సందేహపడ్డారుగాని, కొల్లలు, రెండాటలకి సరిపడా ఉంది.

సార్, దిస్ పూర్ బాక్‌వర్డ్ కంట్రీ కాబట్టి మీరింకా ఇలా ఉండి పోయారు గాని నిజంగా నేనే ప్రొడ్యూసర్నయితే ఆ యాక్టింగుకి రెట్టింపు రేటిద్దును. మిమ్మల్ని యాభైవేలకి బుక్ చేస్తే మీరు లక్షరూపాయల యాక్టింగు చేసివతల పారేస్తున్నారు. మీ కొంకబెట్టింది కా అష్టావక్రుడిక్కూడా చేతనవదు. ఏవంటారు. నామాటబద్ధమైతే మీ హీరోయినుగార్నడగండి. లేపోతే మీ ఆప్తమిత్రుణ్ణి కనుక్కోండి. మీలో ఉన్న లోపం వల్లా ఒహటే. నాలాగే మాడెస్టి మహలావు మీకూను. మరీ అంత వినయం తగదు. మీరు సెట్టుమీద కొచ్చాక యాభై అయిడియాలు కూడా ఇవ్వరు. మీకున్న అనుభవానికెన్ని చెయ్యొచ్చు... వెధవది ఈ డైరెక్టరుగాడి స్నిల్దీసడిగితే ఒక్కొక్కడు పది పిక్చర్లకన్న తీసుండడు. మీరు వీళ్ళని పాతికెట్టి గుణించినన్ని పిక్చర్లలో వేశారు.

అసలు హాలీవుడ్‌లో అయితే మీలాటి యాక్టరు యేంచేద్దుడు తెల్సా? ఒహ కథ పట్టుకుని--కథ అంటే అంతా ఉండి తీరాలని గాదు మాటవరసకన్నాను-- ఓ కథ పట్టుకుని ఓ డైరెక్టరుగాణ్ణి వెనకేసుకుని ఆవటా, "ఇదిగో ప్రొడ్యూసర్లా నేనున్నాను; ఆ పైన ఓ కథుంది, ఇదిగో ఓ డైరెక్టరున్నాడు. కావలిస్తే మా చేత పిక్చరు తీయించుకోండి. కాండబ్బివ్వద్దు. రిలీజయ్యాక వసూళ్ళలో నూటికి నలభై నాకు, పదో పరకో డైరెక్టరికీ ఇవ్వండి" అంటారన్నమాట. హాలీవుడ్‌లో అలాగే చేస్తున్నారు బాక్సాఫీసు స్టార్లు.

మీ బలం వల్లనే పిక్చరు హిట్టవుతోంది. గాబట్టి, ఏ పాతికలక్షలో లాభాలొస్తే, పదిలక్షలు మీ వాటా. ఈ విధముగా చేసి హాలీవుడ్‌లో స్టీవర్టు గ్రేంజరుండును, అచ్చోటనే గారీ గ్రూపరుండును గోటీశ్వరులైరి, ఆ నోమే మీరూ నోమవచ్చు....

పిక్చరు దెబ్బతింటేనంటారా?..... తిన్దుగా!

అదీ సంగతి, అలాటి బేరం ఉండి, లక్షలకి లక్షలు కురుస్తున్నప్పుడు, ఇందాక మనం తీసినలాటి షాటులో మీరు నటించినదానికి మరి నాలుగురెట్లు చేసినా తప్పు కాదంటాను. ఈ లోగా అంథటి హైరానపడి - ప్రొడ్యూసరిక్కళ్ళేదు గద - మరీ ఇంతగా యాక్టింగు చెయ్యడం శుద్ధ దండుగ. క్రిమినల్ వేస్టు--ఓ క్రిమినల్లాయరన్నట్టు.

అంచేత ఇపుడోటి చేదాం: ఇందాక షాటు మళ్ళీ ఓసారి తీద్దాం. అందులో మీరు యాభైవేల యాక్టింగే చెయ్యండి. వీలైతే అందులో బ్లాకు మినహాయించగా మిగిలిందే చాలు, ఇదీ ఇదీ రేపు ప్రొడ్యూసరికి చూపించి అబ్బాయ్ చూసుకో తేడా, లక్షరూపాయలిస్తే ఈ ఎక్స్‌ట్రా యాక్టింగున్న షాటు తీసుకోవచ్చు. కాదా యిదుగో

యాభైవేల రకం పుచ్చుకు సంతోషపడు అని నిష్కర్షగా చెప్పేస్తాను. ఈ గిరీశంగాడిలా అన్నట్టు మరెక్కడా అనమోకండేం? కొంపలంటుకుంటాయి. అవన్నీ ఎక్స్ ప్రొడక్షన్స్ వాళ్ళు షూట్ చేసుకుని మన పిక్చర్ మీద పోటీకి వదలి దెబ్బతీయగల్రు.

అమ్మా! మీ విషయవూఁ అంతే. మీ ముగ్గురివద్దా నాకు చనువుండి యటువంటి దాపరికవున్నూ లేకపోబట్టి ఇలా భయం విడిచి చెబుతున్నాను. మీరూ అంతే. హీరో వారితో కూడబలుక్కున్నట్టుగా, ఇప్పుడు చేస్తున్న దాంటో సగఁవే యాక్టు చెయ్యండి. వీళ్ళ మొహాని కిది చాలు. మీదాకా వచ్చిందో లేదో గాని - ఇప్పుడే ప్రొడ్యూసరు గిలగిల తన్నుకుంటున్నాడు మీకెందుకో కోపం వచ్చిందని. మీరు పిక్చరు మీద ఏమీ యింటరెస్టు తీసుకోడం లేదుట. కథ ఎండింగు గురించి పేచీ పెట్టలేదుట. గ్లామర్ డ్రెస్‌తోటి డ్యూయెట్లు రెండు చాలవనీ, మూడుండాలనీ, ఓ సోలో సాంగు పిక్చరైజు చెయ్యాలనీ పంతం పట్టలేదుట. అల్ల వారి పిక్చర్లో ఇవన్నీ కావాలనిన్నీ, లేపోతే రాననిన్నీ కబురంపిన ఆవిడ, మనతో పేచీలు పెట్టదేఁవీ? అంటూ ఆ వెర్రిబ్రామ్మడు-అహోరాత్రులూ ఒక్కలా మధనపడిపోతున్నాడు. ఇపుడు గనక మీరు యాక్టింగు కూడా తగ్గిస్తిరా దారి కొచ్చేస్తాడు.

బాయ్! షాట్ రెడీ అయితే అలా అరవద్దని చెప్పు ఆ కెమరామాన్‌తో, దీపాలు వెలిగిస్తూ ఉండమను. ఒక నిమిషంలో వచ్చేస్తున్నాం.

తరువాత, గురూజీ! మీతో కూడా ఒక్కమాట. ఈ మాటో తమాషా చేదామని ఉంది. మీరీ మాటాస్సెం జేసినపుడూ, మరీ ఆస్సెగాడిలా మొహం పెట్టకండి చెప్తా. పిక్చర్లో హాస్యానికీ, డైలాగులో విట్టుకీ మీకు నవ్వొచ్చిందన్న వైనం గుట్టుగా ఉంచేసి, ఏప్ఫీ యరగనట్టు యాక్టు చెయ్యండి. ఈసారి ఆడియన్సు జోక్ పట్టుకుంటారో లేదో, సొంతగా నవ్వగల్రో లేదో చూద్దాం. ఓ చిన్న పరీక్ష లాంటిదన్నమాట. దీన్ని గురించి పత్రికల్లో పబ్లిసిటీ యిప్పించొచ్చులెండి. సార్! మీరు కూడా హెల్పు చెయ్యాలీయనకి. ఈయన హాస్యగాడుగారని గాని, హాస్యెంచేస్తున్నాడని గాని హీరోకి తెలిసినట్టు మీరు 'క్లూ' ఇవ్వద్దు. హీరో ఈ ఆస్సెగాడితో మాటాడినపుడు వీడో జడ్డివెధవ అన్నట్టు చూడకండి, వీణ్ణి ఉద్ధరిస్తున్నట్టు మాటాడకండి, అంథా సీక్రెట్ సుమండీ, జనవేఁ వంటారో చూద్దాం. ఆనక వెనకనించి పబ్లిసిటీ యివ్వచ్చు.

లాష్టు బట్‌నాట్ లీస్టు--విలన్‌జీ మీతో కూడా ఖుట్ర చెయ్యాలనుకుంటున్నాం సార్.... అబ్బ అలా చూడకండి. నాకే భయం వేస్తోంది. మీ గెటప్పూ, యక్సుప్రెషను చూస్తే, చూడండీ ఇందాక షాట్‌లో విలన్ హీరోయిన్‌ని తీయకబుర్లతో మాయ జేసేదుంది చూడండి, అక్కడో ట్రిక్కు చేద్దాం. మీరావిణ్ణి మాయచేస్తున్నట్టు మాక్కూడా తెలియనివ్వకుండా చెయ్యండి, అంటే ఆడియన్సు కన్న మాట. ఆవిడ కెలాగా తెలీదుగా. ఝోవిటో ఇలా జోకులు పడిపోతుంటాయి--మరేం లేదు. ఇందాక చేసింది బ్రహ్మాండంగా ఉంది. ఎటొచ్చీ, అందులో నేను విలన్నిస్మీ అని క్లూ ఇచ్చే ఎక్స్‌ప్రెషన్‌లు రెండూ తీసేద్దాం. యవడు హీరోవో, యవడు కాడో జనాని కంతుపట్టకూడ దన్నమాట.

అంతకుముందర షాట్‌లలో మీరు దుష్టులని ఎస్టాబ్లిషు చేసే సీనులు రెండున్నాయిగా. అవే ఆధారాలన్న మాట జనానికి. ఒక వేళ ఆ సీనులు తీసేస్తే, మీరిందాకా చేసిన యాక్టింగుని మహారాజులా ఉంచుకోవచ్చు. సజెషన్‌లో పులితల కూడా తీసేదాం. బాగ్రౌండ్‌లో నాగిన్ మ్యూజిక్ తీసేద్దాం. నన్నడిగితే మనవైదుగురూ కూడబలుక్కుని పై జెప్పిన ప్రకారం చేసినట్టాయనా--త్రిల్లింగ్‌గా ఉంటుంది. జనాన్ని షాకు చేసవతల పారెయ్యొచ్చు. వెనకనించి పబ్లిసిటీ ఇప్పిద్దామనుకోండి "ఎ ఫిలిం విత్ గ్రేటెస్ట్ ట్రిక్స్ ఆఫ్టర్ హూడినీ" అంవటాని. మీ ఇష్టంస్మండీ. డైరెక్టరుక్కూడా మనం చెప్పొద్దు. టెలిఫోన్ యండ్ రోవింగ్ డైరెక్షనే గదా, నాల్రోజులు పోయాక నేనే బుకాయించి పారేస్తా, "బ్రదర్! అక్షరాలా నువ్వు ఫోనులో చెప్పిన అయిడియావేస్మి" అని.

ఇంకో రహస్యం, ఇది మహా రహస్యం. నేను కవిగారితో కూడా కుట్రచేసేను. పాపం వాళ్ళొహళ్లండీ, డవున్ ట్రాడెన్ పీపుల్... రాసిందే రాసినట్టే రాయలేక అవస్థ పడుతున్నారు పాపం. అక్కడికీ వెరైటీ కోసవని ఇంటి కెవరొస్తే వాళ్ల చేతో సీను రాయించి - మళయాళీ వచ్చినా సరే ఏదో వోటి అఘోరించమని ఆ తరువాద్దాన్ని తర్జుమాయించి-- ఇస్తున్నారు. మన కవిగారు మంచివాడు, ఎక్స్ ఫిలింస్ వాళ్ళ కథలో ఓ సీను మహాబావుందంటే మనక్కూడా రాసిచ్చాడది....మందాంట్లోనే ముందరొచ్చేస్తుందనుకోండి, మర్చిపోయి రాసినా ఇంతేగద. కాన దోషం లవలేశం లేదు.

ఆయా దయచేయండి, దయచేయండి. మీ మాటే అనుకుంటున్నది, మరో వెయ్యి పిక్చర్లాయుష్షు, శత పిక్చరు ప్రాప్తిరస్తు. హాలీవుడ్‌లో మీవంటివారుంటే ఎన్ని లక్షలొచ్చేదో, అందుమీద యంత టాక్సు పోయేదోగదా అని వాపోతున్నాం. అంతేగదండీ అక్కడ ఒక నాటకానికి లక్షలిస్తారు. ఓ పిక్చర్‌కి అంతకి పైబడిస్తారు.

మీరంతా చవగ్గా రాయడం మప్పారుగాని, నిజానికి నన్నడిగితే మీ రైటర్లంతా ఒక యూనియన్ పెట్టుకోవాలి సార్. యూనిటీ ఉండి తీరాలని కాదు. పోట్లాడ్డానికైనా - మరేవ్వీ కాదు. మాగ్గనక రేట్లు పెరగకపోతే, ప్రాచీన తెలుగు సినిమా కథని రూపురేఖలు తెలీకుండా పరిమార్చవతల పారేస్తామని బెదిరిస్తే సరి. హోల్ ఇండస్ట్రీ అంతా మీ కాళ్ళ మీద పడుతుంది. మీరు తెలుగు జీవితంలో కొత్తరకం కథలూ, డైలాగులూ రాసిపారేస్తే నటులకు నటన కష్టం. డైరెక్టర్లకు డైరెక్షన్ కష్టం. వెయ్యేల అందరికీ అన్నీ కష్టం. ఎందుకంటే అంతా కొత్త గదూ. ఒక్క చూసేవాడికి తప్ప. వాడి కిదేవి టదేవి టేదైనా చూసేస్తాడు. వాడి సొమ్మేం పోయె పావలా అర్ధణా తప్ప.

సంప్రదాయానికీ సెంటిమెంటుకీ అది వెతిరేకం అని మీరలా భయపడడం తగదు. భద్రాద్రిరాంవుడికే దిక్కు లేదు.





# విజయ రహస్యం

ఏమి వాయ్! మైడియర్ షేక్స్‌పియర్! మా వెంకటేశంలా మొహం వేల వేసినావ్! కిషోర్ సాహూ మళ్ళీ నీ మీచ్చెయి జేసుకుంటా నంటున్నాడా? శాంతారాము క్కాళిడోస్ మీద మోజు విరిగి నీ వేపు తిరిగిందా! చందాల సంస్థ లేవైనా నీ పుస్తకాల్ని-- "చదువూ సంధ్యా, పనీ పాటా లేకుండా తిరుగుతున్న మావాడోడున్నాడు" గాడి చేత తర్జుమా వేయిస్తారా? అలాంటిదేం ఉపద్రవం ఉన్నట్లు తోచదోయ్! మైనరు క్లాసిక్కులకి మంచి రోజులు కావు తప్ప, నీలాటి మేజర్రకానికేవ్వీ అపదున్నట్టు తోచదే. యావన్నావూ! నేనా? దౌ మీనెత్ మీ? ఓ మై రీమారీడ్ ఆంటీ! ఓ మైగాడ్! ఒట్టు. నేనలాటి ఉద్యమంలో లేనుస్మీ. కాపోతే ఒహటి. నా యొక్క ప్రజ్ఞ పేల్చే మహా యిది గూర్చి విన్న ప్రొడ్యూసర్లెవరేనా నాచేత నీ స్టోరీని పిక్చరు తీయించాలని దురాశపడుతున్నారేమో చాటుగా, నాకు మటుగు తెలీదు. ప్రమాణ పూర్తిగా చెబుతున్నాను. నేన్నీ జోలికి రానని అభయమిస్తున్నాను. మాట దప్పితే నినదభీషణశంఖము దేవదత్తమే... టెలుగు ఇడియంలే.

ఫ్రాంక్‌లీ స్పీకింగ్--మైడియరెస్ట్ షేక్స్‌పియర్, నీ స్టోరీలు అవుడ్డేటయిపోయాయి. ఇప్పటివి వేరు. అవి నీతికథలు కావు, అవినీతి కథలు. మీవి మాకు పనికిరావు. పైగా అంత బ్రిలియంటువాట్ని జనం హరాయించుకోలేరుష, నా అంత బ్రిలియంటువాణ్ణీ భరాయించుకోనూ లేరుష. అందికే నేనిలా గఘోరిస్తున్నా. బిట్వీన్ యు అండ్ మీ. మన్లో మన మాట. ఇక్కడ బ్రిలియన్సు పనికి రాదు. ఎందుకంటే స్టూడియోలో హైపవర్ ఫ్లడ్‌లైట్లతో జనవంతా కలిసి జాగ్రర్తగా లైటిం గెరేంజి చేస్తారుగదా. తీరా అంతా అయ్యాక నువ్వక్కడ నిలబడితే నీ బ్రిలియన్సువల్ల ఎక్కడో గ్లేరుకొడుతుంది. అంతా చెడుతుంది. ఎవడ్రా ఇక్కడెవరో బ్రిలియంట్ల వెధవలున్నట్లున్నారు తన్ని తగిలీయండంటారు.

లక్షల్తో వ్యాపారవా మాజాకానా, నామటుకు నేను, నాలాగే ఎందరో డిఫ్యూసర్లు వేసుకు నివురుగప్పుకు మరీ నిప్పులా తిరుగుతున్నాం. ఇక్కడ ఎవడి

మటుకు వాడు--ముఖ్యంగా డైరెక్టరుగాడు తన చిత్రం వచ్చినట్టు షయినయిపోతానంటే వల్ల కాదు. ఆర్కెస్ట్రాలో వాయిద్యాల్లా సెట్‌మీద లయిట్లలా దోసుమీరకుండా గడుపుకు రావాలి. చూసేవాళ్ళేనా అంతే. ఎగబడి పొగిడిందుగ్గాని, తెగిడిందిగ్గాని యంతమాత్రం వీల్లేదు దిస్, మైడియర్ షేక్స్‌పియరు ఇన్ షార్ట్.

అయ్యా ఆయ దయచేయండి రావుగారు. ఎన్నాళ్ళకెన్నాళ్ళకీ--షేక్స్‌పియరు గారూ మీర్తరవాతెప్పుడన్నా కనబడండి. సావకాశంగా కబుర్లు చెప్పుకుందాం--రండి--మీకోసవేఁ చూస్తున్నా సార్. మూడ్రోలాయి మీ స్క్రిప్టు మీదనే కూచుని అయిడియాలు పొదుగుతున్నా ఏదీ దయ లేదు. మీరేం చేస్తార్లెండి. అగ్నిహోత్రావధాన్లవారు డిస్ట్రిబ్యూషను తీసుకున్నారేగాని ఒక్క విదత గూడా దబ్బిచ్చినట్టు లేదు. అంతేనా, నాకు తెలుసుగా, పదండి ఇద్దరం వెళ్దాం. వారికి నామీద గురి వుంది. నేను డైరెక్టర్నంటే వెంటనే చెక్కు రాసిస్తాడు.... అంతేసార్. మీరలా షాకవకండి. అదే నా ప్రజ్ఞ. "వైలిన్‌రోమ్ బీయే రోమన్" అన్నాడు రోముడు. అలాగ్గా నేనున్నూ అలా ఊసరవెల్లిలా రంగు ఫిరాయించి ఇంటర్నేషనల్ క్లాసు నించి దిగి వచ్చాను. రావడవే గాక, "వీడు బ్రిలియంట్‌కాదు. మప్పురా. డైరెక్షనుకి బెస్టురా" అనిపించేసుకున్నాను. ఇందుగురించి బొంబాయిలో ట్రైనింగ యిచ్చాన్లెండి.

చిత్తం. ఈ సూత్రాలఁన్నీ ఇక్కడ చాలమంది పెద్దలు చెప్పగా విన్నాను గదండి. నిజవే. క్లాసు పిక్చర్లకి డబ్బు రాకపోవడాని క్కారణం భేషుగ్గా బోధపడిందండి. మీ మాటారైటే. ఏడుపుసీనులొస్తే క్లాసు డైరెక్టరు రెండు సైలెంటు షాట్లలో గుండె బద్దలయ్యేలా తీసవతల పారేస్తాడు. జనం ఏడ్చేడ్చి రెండోమారిహ వెళ్ళరు. ఎందుకు బాబూ ఏడుపొస్తుందని. వెళ్లాల్సిన అవసరఁవూ వుండదు. ఆ పిక్చరు చూసి నార్నెల్లదాకా కళ్ళముందాడుతూనే వుంటుంది. మనసులో మెదుల్తూనే వుంటుంది. ఇహనెందుకూ డబ్బు దండగనిపిస్తుంది. అదే హిట్ డైరెక్టరయితే ఏడుపుగొట్టు సీన్లని ఏడిసినట్టు తీసి చక్కగా నవ్విస్తాడు. జనం నవ్వుతో ఏడ్చి ఇవతలకొస్తారు. మళ్ళీ మళ్ళీ నవ్వుకుందికీ, సరదాగా ఏడిచిందికీ వస్తారు. చూసిందల్లా అరిటికాయకర్రులా మనసుకి పట్టుకోదు కాబట్టి, అందులో విషయం పట్టుగోవాలన్న పంతంతో కథను చెప్పగలఁగాలన్న సరదాతో జనం పదేసిమార్లు చూస్తారు.... నే చెప్పిందంతా రైటేనా? ఏవనుకున్నారు మరి. నేను ఏకసంతాగ్రాహిని సార్. బ్రిలియంట్ ఫెలోని ఐమీన్, కాను.

❀ ❀ ❀ ❀ ❀

అఫ్‌కోర్స్ నేనెప్పుడూ మీ సలహాని క్వెశ్చన్ చెయ్యను, అంత అవివేకినా? మీరే ఏవిటి, ఏ ప్రొడ్యూసరేనా సరే. ఆర్టు డైరెక్షను, మ్యూజిక్ డైరెక్షను, డైరెక్షనల్ డైరెక్షను, డైలాగుల దర్జీపని, దర్జీపని (ఎడిటింగు), సవుండు రికార్డింగు, మేకప్పు, ఈ అడ్డమైన విద్యలున్నూ ధరోగా, క్షుణ్ణంగా తెలుసుకునే వుంటాడు. లేకపోతే పాతికవేలు పెట్టుబడి పెడతాడా. ఏదో బద్ధకం కొద్దీ, పని తొందరకొద్దీ ఒక్కో

డిపార్ట్‌మెంటు కొక్కొక్కణ్ణి వేస్తాడు. అంతే తప్ప వారికి తెలీకనా ఇవేవన్నా బ్రహ్మవిద్యలా. అయినా ఈ ఆర్టిస్టులూ, టెక్నీషియనులూ స్వతంత్రం అంటూ రొదపెడతారు. వాళ్ళమొహాలు. ఈ అన్నిటిమీద ప్రొడ్యూసర్లు అథారిటీ కాదంటారు. ఏం పాపం ప్రొడ్యూసర్లు మటుకొప్పుకోటం లేదూ. అన్నిటిమీదా తమకన్న అథారిటీలు డిస్ట్రిబ్యూటర్లనీ! ఏదో హీరో హీరోయిన్‌లు విలన్‌జీల యాక్టింగన్నారు-- అది వదిలెయ్యొచ్చు. వాటిమీద మహా మహా ప్రొడ్యూసర్ డిస్ట్రిబ్యూటర్లే అథారిటీలు కావంటున్నప్పుడు ఈ డైరెక్టరు పొడిచేశాడా యేవిటి. అందికే నేను మొదణ్ణించీ అంటున్నాను ప్రొడ్యూసరే డైరెక్టరు కావాలని, వీలైతే రైటరున్నూ అని. బొంబాయిలో ఈ డైరెక్టరుగాళ్ళ బెడద పళ్ళేక చాలా మంది ప్రొడ్యూసర్లే అందుకు వడికట్టారు. ఏవుంది, నాలుగు రీళ్ళు తిరిగే సరికి వాళ్ళూ యేసు డైరెక్టర్లయ్యారు. ఇదేవన్నా బ్రహ్మవిద్యా. అంచేత నేను చెప్పేదేవిటంటే మీరు నన్ను డైరెక్టరుగానే గాక ప్రొడ్యూసరుగా కూడా చేసుకోండి. ఆ డబ్బేదో ఇలా నా మొహానపారేసి మీరు సుబ్బరంగా ఏ వూటీవో పోయి కాలుమీద కాలేసుక్కూచోండి. రాజేంద్రకిషనూ, ఆత్రేయ మూడ్సుకోసం ఎలాగా అటొస్తారు గాబట్టి అక్కడే వాళ్ళచేత నెక్స్‌ట్‌పిక్చరు ట్రిబుల్‌వర్షను సాంగులు రాయించెయ్యండి. స్టార్లు రెస్టుకోసం వస్తారు గాబట్టి ఆ పాటల్నక్కడే మంచి సీనరీలో పిక్చరైజు చేయించండి. వీలైతే రెండుమూడు లవుసీన్లు, ఓ కోయడాన్సు (ఊటీలో వుంటార్లెండి) లాగిపారేయించండి. తరువాత మనం పిక్చరు తియ్యకపోయినా వాట్ని విడిగా అమ్మేసుకోవచ్చు.

ఈలోపల్నేనిక్కడ లీలగా డబుల్‌వర్షను లాగి పారేస్తాను. ఎలావుందయిడియా. బ్రిలియంటుగా లేదు గదూ. అదే కావలసింది. మీ ఆశీర్వచనబలం.

మరొహటి. ఊటీలో మీకు గైడుగా కావాలంటే చక్కటి ఫామిలీ పిక్చరుక్కావలసిన సినీచక్రపాణినీయ సూత్రాలన్నీ ఓ బుక్కులో రాసిస్తాను. ఎవరికీ చూపెట్టకండేం. గుట్టుగా చదువుకున్నాక పంపెయ్యండి. మన పిక్చర్లు హిట్టయితే ఆనక 'సీక్రెట్ ఆఫవర్ సక్సెస్' అనే పేరుతో బుక్కులు రాసి పబ్లిషు చేదాం.

అసలీ చక్రపాణినీయం సర్వకాలాలకూ సర్వదేశాలకూ వర్తించే మహా వ్యాకరణం. అయినా, మహా గ్రంథాలన్నిటిలాగే దీనికీ కువ్యాఖ్యల, దుర్నిర్వచనాల బాధ పట్టింది.

కుటుంబంలో యావన్మందిన్నీ అనగా తల్లీ, తండ్రీ, కూతురూ, కోడలూ, కొడుకులూ, అల్లుడూ, పెళ్ళీడుపిల్ల, దాని తమ్ములూ, ఆ యింటి అవ్వ, ఇంటి నౌకరూ, వాడి నాయుడుబావా, అతని తాలూకా నారాయణమ్మ అందరూ కలిసి సినిమాకొస్తారని గుర్తుంచుకొని అందుకు తగ్గవిధంగా సినిమా తీయవలెను అని ఒక సూత్రం. అయితే సూత్రాధారిటీలు, దానికి అనర్థకాలైన అర్థాలు తీశారు. తండ్రిక్కావలసింది కొంత, కొడుక్కి కావలసిన సెక్సప్పీలు, బామ్మక్కావలసిన హరికథ, కోడలికీ కూతురికీ కావలసిన చీరెలూ, సారెలూ, నగలూ, నాట్యాలూ, పిల్లలక్కావలసిన అస్సెం, వయసువాడిక్కావలసిన రెండర్థాల మాటలూ, నగ్నసత్యాలూ, నాయుడుబావ,

నారాయణమ్మలకోసం జానపదప్పాటలూ, కోయడాన్సులూ అన్నీ సాధ్యమైనంత ఎక్కువ డోసుల్లో కలిపి ఒక్క పిక్చర్లోనే పెట్టేస్తున్నారు.

"వ్యాకరణసూత్రాలు టూకీగా ఉండి కొద్ది మాటల్లో గొప్ప అర్థాలు చెప్పేమాట నిజమే కాని మరీ ఇంతలేసి భావాలుండవు. కుటుంబంలో అంతా కలిపి చూసిందికి వీలుగా అసభ్యదృశ్యాలు జొరబడకుండా చూడమన్నారు తప్ప ఒక్కొక్కళ్ళకీ ఏవేం కావాలో అన్నీ రీళ్ళ కొద్దీ తోసెయ్యమనలేదు" అంటూ యిటీవల కొందరు విమర్శమీద విమర్శచేస్తూ క్రిటీకాతాత్పర్యాలు అఘోరించారు. మనం వీళ్ళని ఖండఖండాలుగా ఖండించాలి. పై జెప్పిన జాబితా ప్రకారమే అన్నీ అర్థం చేసుకోవాలనిన్నీ, ఇపుడు జరుగుతున్న దదేననిన్నీ, పడుచు వాడికి బాగున్నది తెరమీదున్నపుడు ఆడపడుచులు కళ్ళు మూసుకోవచ్చుననీ, రెండర్థాల డైలాగులకి రెండో అర్థం ఏమిటని పసిపిల్ల డడిగినప్పుడు వాడినోరూ చెవులూ మూసేయాలనీ ప్రేక్షకులు గ్రహించుకోవాలి. అంతేతప్ప ప్రొడ్యూసర్లు, డైరెక్టర్లు కాదు. యిలా వీళ్ళని శాసిస్తే కళ మలమల మాడిపోతుంది.

ముమ్మందు కావాలంటే, ఇందుకు యాంత్రికంగా సదుపాయాలు చేద్దాం. తండ్రి ముందుగా ఒక్కడూ వచ్చి సినిమా చూస్తాడు. తరువాత తన బలగాన్ని తీసుకెల్తాడు. అతని కుర్చీ దగ్గర కొన్ని మీటలుంటాయి. సినిమాలో అందరూ చూసే ఘట్టాలు అందర్నీ చూడనిచ్చి ఆ పైన భార్య చూడతగనివి ఆవిడక్కనబడకుండా వినబడకుండానూ, పిల్లలు చూడతగనివి వాళ్ళక్కనబడకుండా వినబడకుండానూ, కోడలూ కూతురూ సిగ్గుపడే సందర్భాలు వాళ్ళకి కనబడకుండానూ మీటలు నొక్కి ఏర్పాటు చేస్తాడు. అలాటిది హాలీవుడ్ వాళ్ళు కనిపెడతారు. కాకపోతే మనవే ఏదో నాటుపద్ధతి కనిపెడదాం. అంతే తప్ప మన పద్ధతులు మార్చుకుంటామా-- కుటుంబం అంతా కలిపి చూసారనీ! అంతగా కావలిస్తే విడి విడిగా చూడమనండి.



# కవిగారి కథ



డామిట్! కథ అడ్డం తిరిగింది. డిస్ట్రిబ్యూటరిచ్చిన ఇనిస్టాలుమెంటు డబ్బు కాస్తా ఆరోజు రాత్రి రన్‌మోరులో అయిపోయింది. అతనిస్తాడని మధ్యపెట్టి చేసిన అప్పుకూడా గల్లంతైపోయింది. వెధవది. ఇటు అసలు ప్రొద్యూసరుగ్గా నటు డిస్ట్రిబ్యూటరుగ్గా నిటు స్టుడియోవాడిగ్గా నటు హీరో సెక్రట్రీగ్గా నటు రికార్డింగువాళ్ళగ్గా నిటు కవిగాడిగ్గా నటు యింటివాడిగ్గా నటు పబ్లిసిటీవాడిగ్గా నిటు మరెవడిగ్గాని కనబడిందికీ వీల్లేకండా అష్టదిగ్బంధం అయిపోయింది. హొటేలు వెధవా సిగరెట్లపీనుగా కూడా సారనడం మానేశారు నిన్నట్నించి. నేడో రేపో మంచిరోచ్చూసి చొక్కా పట్టుకునేట్టున్నారు. ఆఖరికి బాకీలవాళ్ళు కూడా ఇవల్యూషన్‌లో అప్పులవాళ్ళయిపోయారు! యరక్క చిక్కడ్డాంవిందులో. వెధవది పద్మవ్యూహంవంటే ఇదే కాబోలు. జొరబడిపోడం మహ సుళూగాని ఊడవతలపడ్డంవే చిక్కు. ధర్మరాజు గడుసువాడు. అందికే అభిమన్యుణ్ణి తోలేశాడు నంగనాచిలా. నంగనాచేవింటి ప్రాక్టికల్ ఫెలో జూదవాడ్డం ఒహటి తెలివితక్కువ పని. ఆ మాటకొస్తే నేనాళ్లేదూ. ఏం చేస్తాం. ఎటికెట్ ఏట్లో కలిసిపోతుందాయె. పేకాట దగ్గిర వెనకాడితే పరపతి తిరపతెళ్ళి కళ్యాణమండపంలో తలొంచుక్కూచుంటుంది.

ఇప్పుడిహ నాబోరు దక్కాలీ అంటే, మనం కూడా స్ట్రాటజీ మార్చాలి. నెమ్మదిగా ఏ అభిమన్యుణ్ణో--కాస్త చురుకుపాలు, ఇంటి దగ్గర కాస్తంత తడీ ఉన్నవాణ్ని చూసి ఇందులోకి దింపేస్తే సరి. స్ట్రాటజీ మార్చకపోతే పొలిటీషియన్ కానేరడన్నాడు. ఈ వింటర్ హాలీడేస్‌కి వాళ్లూరే ఊటీ అనుకుని చద్దివణ్ణమే బ్రేక్ ఫాస్టూ, తరవాతే కాఫీ 'గట్రా' అనుకుంటే సరి. ఇక్కడ సద్దుమణిగేదాకా అక్కడే బిచాణావేస్తే కాస్త స్క్రిప్టు మీద కూచున్నట్టూ ఉంటుంది. పన్లోపని ఓ కొత్త ప్రొద్యూసర్ని రంగంలోకి దింపి అరంగేట్రాలు చేయించినట్టూ ఉంటుంది. ఏ పల్లెలో ఏ ప్రొద్యూసరున్నాడో ఎవడి కెరుక. "కొత్తధనం, కొత్తదనం" అన్నాడు మాటగారడీవాడు. అన్నిటికన్న ముఖ్యం దేశసేవ చేయడం అవుతుంది. వెధవధి ఉన్న

దబ్బంతా ఈ పల్లెటూళ్ళలో రాటయిపోతోంది నా టాలెంట్సులాగ. విలువైన నోట్లు అలా అక్కడ చిక్కడిపోమట్టే పాపం కోయంబత్తూర్లో మారునోట్లు తయారు చేస్తున్నట్టున్నారు--నాలాంటి టాలెంటెడ్ జీనియస్సులు రాటవుతున్నప్పుడు, ఇమిటేషన్ జీనియస్సులు దొంగనోట్లలాగే తయారింపయి పోతున్నట్టు. కాని దొంగనోట్లు తప్పట్టినవాళ్ళు ఇమిటేషన్ పిక్చర్లనీ, డైరెక్టర్లనీ, జీనియస్సుల్నీ పట్టుకోరు. వీళ్ళకి బొత్తిగా పబ్లిసిటీ ఇవ్వరు... ఇన్‌జస్టిస్! దై నేమ్ ఈజ్ జస్ట్ ఇన్‌జస్టిస్.

అడుగో గుర్నాథం వస్తున్నాడు. వీడు లాస్టు పిక్చరుమీద చంద్రలేఖలా బోల్డు లక్షలు లాభాలొస్తాయనీ, అవి దాచటానికి పెరట్లో పాతర్లు తవ్వించడంగాని లోగిట్లో పట్లికున గాదెలు కట్టించడం గాని ఆరంభించ మన్చెప్పి పాతికవేలట్టుకు చక్కా వచ్చాడు లాస్టియర్. పూర్ ఫెలో. నన్ను చూసి ఝుడుసుకుని హరీశంగాడి ఉచ్చులోపడి హరీమన్నాడు మూడు పూటల్లో--నాటికీ నేటికీ పిక్చరూ లేదు వీడి పిండాకూడూ లేదు. ఇంటికెళ్ళింది గ్గుండెల్బాలవు. పాండీబజారు తురాయిచెట్లకి ఊడలా వేళ్ళాడుతూ ఉండిపోయాడు. వీణ్ని కొంచెం ఉద్ధరించడం ఉత్తమం. వీళ్ళబాబుకి డబ్బు దాచిందికి చోటు చాల్లేదుట ఇంట. యేం చేస్తాడు. పసుపు, పొగాకూ కురిపించే లక్షల్ని బస్సు రూట్లకి మళ్ళించిందికిహ వీల్లేదాయె నేషనలైజేషన్ ఖర్మమా అని. ఇద్దాచింది కింకో లోగిలి కట్టించాలంటే ఎవరూ స్థలాలమ్మటం లేదట దగ్గిర్లో బాంకువాళ్ళు మేం దాచలేం బాబో అంటున్నారు. వేళయినా పాలుపితకని గేదిలా గిలగిల్లాడుతున్నాట్ట పాపం.

నేను కాస్త నోరుజేసుకొని ఈ అర్భకుడి వెంట వెళ్తే కాస్త ఒళ్ళు తేలిక చేయించొచ్చు.

హల్లో! ఏమి గురూ! మొహం వేలవెయ్యలేదు. ఏమి గిరాకీ, మనియార్డ రొచ్చిందా కాపోతే ఇంటికి రానిస్తానని మీనాన్న కబురంపాడా?.... నువ్వెలాగేనా గట్టివాడివిలే. ఆ భూమాత్తరవాత సహనానికి నిన్నే చెప్పుకోవాలి గురూ.

తెల్లబోకు నీ పేరు గురునాధమనే కాదు గురువనే భావనతో కూడా పిలుస్తున్నాను. ఏం జేస్తాం గురువు శిష్యుడాయె, శిష్యుడు గురువాయె. నామాట నువ్వినినికాడికి నీమాట నేనేనా వింటాను. నువ్వు చెప్పినట్టే ఈసారి వింటర్‌కి మీ యింట మకాం చేస్తాను.

ఏవిటీ, నామాటే నువ్వింటావా, యలాగేనా ఒహటే, నన్ను చెప్పమన్నా ఆమాటే అంటాను. కోటినదులు--కాదు కాదు ఆల్ రోడ్స్ లీడ్ టు రోమ్. నామాటా నీమాటా కూడా మీయింటికే నడవమంటున్నాయి. అయినా ఈ మాట నువ్వార్నెల్లక్రితం అఘోరిస్తే ఎంత బాగుండేది. పిక్చరు కాపోయినా, కనీసం ఎక్స్‌పీరియన్సేనా అఘోరించేది. నాతో మాట్టాడవే ఓ యెద్యుకేషనంటే విన్నావు కాదు. కనీసం ఆ హరీశంగాడితో మాటాడకపోవడం అంతకన్న ఘనమైన యెద్యుకేషనంటే అదీవిన్నావు గాదు. ఫరవాలేదు. 'బెటర్లేట్ దాన్నెవ్వర్.' మించిపోయిందేవీ లేదు.

మనవూరెళ్దాం పద. నా దగ్గిరో బ్రిలియం ఐడియా ఉంది. పూర్తిగా మన్దికాదనుకో, దాన్దేప్పుంది. చేసుకుంటే సరి. మరేం కాదు. ఎక్సుపిక్చర్సు వారి నెక్స్టట్ పిక్చరిక్కథ లేకుండానే ఏణ్ణర్థంనాడు షూటిం గారంభించేశారు ఏదో అవేళ మంచిరోజుగదా అని, హీరోయినూ అవేళ కాల్షీట్లు కాన్సిలై కాళీగా ఉన్నదనిన్నీ, అందుకు తగ్గట్టే దగ్గిరే వున్న స్టూడియోలో సెట్టొటి కాళీగా పడుందనిన్నీ గమనించి ప్రొడ్యూసరుగారు ఉత్సాహపడ్డాడు. వారి బ్రదరిల్లా ఇంజనీరు. సెలవులకొచ్చాళ్ళే. ఊరికే అలా బదుద్ధాయిలా ఆడపిల్ల లెదట నోరెళ్ళబెట్టుక్కూచోపోతే అదేదో కామెరా ఎదర అఘోరిస్తే సరిపోనుగా, డైరెక్షను చేసినట్టూ ఉంటుంది పిక్చరూ ఓటి తయారవుతుందీ అన్నాడు. అతనూ సరే అన్నాడు. సరే అంటే సరే అనుకున్నారంతా. వెంటనే ఓషియానికులో కవిగార్ని ఫోనులో పిలిచి అర్జంటుగా ఓ కథ చెప్పమన్నాం. వెయ్యి రూ॥లు అడ్వాన్సడిగాడు. మనిషికిచ్చి పంపాం. అదందుకోగానే ఇవాల్టికి లవుసీను తీసెయ్యండి రేపోమాపో కథ చెబుతాను అవటాని, అక్కడికి పనికొచ్చే డైలాగులు రెండు ఫోనుమీదే చెప్పేశాడు. సరే పిక్చరారంభమైంది. ఆ తరవాత అడపా తడపా కాస్తో కూస్తో కథ చెబుతూ రావడం, వీళ్ళు షూటింగు తీస్తూ రావడం జరిగింది. కథ ఊహాతామరలా పాకేస్తోంది. కారెక్టర్లు కుచేల సంతానంలా, బాల్నాగమ్మలో గందోళిగాడి పిల్లల్లా, డబ్బున్న వాడింట బంధుమిత్రుల్లా పెరిగిపోయాయి. పదిరీళ్ళయినా దారీ తెన్నూ లేదు. ఉన్న కారెక్టర్లనే చంపో దేశాంత్రాలు తరిమేసో కథని ఆపుచేదామన్నా పాతికరీళ్ళు దాకా పట్టేట్టుంది. జగదలప్రతాపనంత పిక్చరన్న మాట. ఏదిదారీ, అసలు నీ కథేమిటో దాని క్లయిమాక్సేవిటో చెప్పవయ్యా మగడా అని కంపెనీ జనాభా యావత్తూ కవిగారి కాళ్ళావేళ్ళా పడింది. ఆయన లోగడ చాలాసార్లు వీళ్ళ కాళ్ళా వేళ్ళా పడ్డాట్ట. అంచేత ఆ సరదా తీరేదాకా కాళ్ళు పట్టించుకున్నాడు. ఆ తరవాతేమో .దాన్దేముంది సార్. అంతా మీ యిష్టం, మీరెలా చేదామంటే అలాగే చేదాం. క్లయిమాక్సు గట్రా ఎలా వుండాలో మీరే చెప్పండి అనేశాడు కవి చల్లగా. లోగడ ఆయన అయిడియాలు వీళ్ళు తోసవతల పారేశారన్న కసీ వుందిగాని, అందుకోసం ఇలా చెప్పలేదనుకో. ఆ కవిగారికి వీళ్ళ దగ్గిర రెండువేలు అడ్వాన్సు పుచ్చుకున్న వైనంగాని, వీళ్ళ పిక్చరుకి చెప్పిన కథ వైనంగాని, అసలు కథంటూ ఓటి చెప్పిన వైనంగాని యంతమాత్రం గుర్తులేదు. అంతా పరగడుపై పోయింది. పోనీ జరిగిన కథేమిటో వీళ్ళనే చెప్పమన్నా వీళ్ళుగాని ఎవళ్ళుగాని చెప్పగలిగేదేవుందిట! అదీ కథ. అంచేతది డెడ్లాకులో పడింది. అనగా శాపగ్రస్తం అయిపోయింది. దాని రహస్యం ఈ గిరీశంగాడికొకడికే తెలుసు.

కావున ఓ గురూ! ఇపుడు నువ్వు గనక నాకు మీయింట వింటర్రి సార్టేర్పరిస్తివా ఆ కథ జ్ఞాపకం చేసుకుని డైలాగులు సహా అంతా రాసేసి తరువాయికథ, క్లయిమాక్సూ కూడా, దాన్ని మీ తండ్రిగారికి చూబిద్దాం. ఓ మంచి రోచ్చూసి చార్ని చెన్నపట్నం పట్టుకొద్దాం ఎక్స్ ఫిలింసు వారికి తెలీకుండానే. వాళ్ళు రషెస్ వేసుకునేటప్పుడు ఈయన్ని గుట్టు చప్పుడు కాకుండా లోపలికి తోసేసి ఆ

కాస్తా చూపించి, మళ్ళీ గుట్టు చప్పుడ్లేకుండా మనవూరు తీసుకుపోయి, ఆ తీసినఫిలిం మనదేననీ డిస్ట్రిబ్యూటరనే ఒకానొక రాక్షసుడి చేతుల్లో రాజకుమార్తెలా ఏడుస్తోందనీ, మీ నాన్నగనక ఓ యాభైవేలు పారేస్తే దాన్ని విడిపించి పిక్చరు పూర్తి చేసి లక్ష లొల్లుకోవచ్చుననీ చెబుదాం. తీసింది పనికిరాకపోతే దాన్నే చెరిపించి మరో కథగా మరో పిక్చరుగా రాయించొచ్చుననీ చెబుదాం. ఏవిఁటి? ఇంతవరకు తీసినట్టి పిక్చరు నిర్వాకవేననీ, నువ్వు పేల్చినట్టి ప్రజ్ఞేననీ చెబుదాం. ఎవడి కోసం ఇస్తారూ...వాట్.

థాంక్స్, థాంక్స్, మరేవిటనుకున్నావు గిరీశవంటే? రైట్. ఈ అయిడియా తాకట్టేసి రైలు ఖర్చులకో వంద చూడు, నేను స్టేషనుదగ్గిర కల్సుకుంటాలే. చూడు, స్పెన్సరు సిగార్సు ఓ పెట్టె, మస్తుగా టిఫిను, రెండు దస్తాల పేక, నాలుగు దస్తాల తెల్లకాయితాలూ ఆలోపల జతపడితే ఓ దస్తాపదిరూపాయలనోట్లూ జాగర్జెయ్యి. నాక్కొంచెం రాచకార్యాలున్నాయి. ఈలోగా చక్కబెట్టుకొస్తాను. నీచొక్కా చేతిమడతలో దాచుకున్న పదిరూపాయల్నో టిలా పారేయ్. తల్చుకుంటే నిమిషాలమీద పడుతుంది నీకు డబ్బు. థాంక్స్, వెయ్యేళ్ళకీ ఇలా నా కిచ్చేంత గడించు.... చూడూ ఈ ముక్క అదే 'మనం' కాంపెళ్తున్నట్టు - అప్పుకోసవేఁనా సరే ఎవరితోనూ అనకేం, అనవసర పబ్లిసిటీ, జనం కాళ్ళావేళ్ళా పడి ఆపేస్తారు.






నీ-యిల్లు రా ఫిల్ము గానూ! నీ కెప్పుడూ ఒక్కలాటి వేషాలే దొరకా! నీ పిక్చరికి ఒరిజినల్ మ్యూజికు జమపడా! డబ్బులేకుండా చూసి హీరోయిను కాల్షీటివ్వా! ఝెంత పన్జేశావూ! పొడుగు తగ్గించెయ్యడమే ఇంకేమన్నా ఉందా. నీకిలాటి పిదప కాలబ్బుద్ధులెలా పట్టుబడ్డాయయ్యా! ఇంతటి ఓఘాయిచ్చాని కెలా వడిగట్టావయ్యా! ఇంకా నయం, నాతో అన్నావు. ఇంకెక్కడా అనబోకు. నీ నెత్తిన కానీపెట్టి వేలం వేస్తే ఏగాణీగ్గానడెవడూను. ఆఖరికి నిడివి తెగ్గోస్తే దేశం బాగుపడుతుందని తెగ్గోస్తున్న మున్షీ మురార్జీ రాజాజీలు కూడా నీ కార్యాన్ని హర్షించరేవనుకున్నావో గాని.

సంస్కరణలంటే మజాకా అనుకున్నారా. ఇవాళ చెయ్యి అనగానే రేప్పొద్దున్న చేసి పారేస్తే ఏంగాను. అన్నిపన్లూ అలా చక చక తెవిలి పోయూరుకుంటే జనానికి మందకొండితనం వచ్చేస్తుంది. సంస్కరించడానికి దుబారాలూ, పరిష్కరించడానికి సమస్యలూ కూడా హార్తికర్పూరంలా హరించిపోతాయి. కలికంలో కూడా లేకుండా పోతాయి. అప్పుడు నాయకులంతా ఏంగానూ. గోళ్ళు కొరుక్కుంటేమటుకు అవి ఎన్నాళ్ళొస్తాయటా? వాళ్ళక్కాలక్షేపం ఉండదు. పత్రికలకి రాసిందికే వుండదు. జనానికీ చదివిందికే వుండదు. పెద్ద పెద్ద ప్రవక్తలు, కాదల్చుకున్న విమర్శకులూ, ఇతర అడ్డమైన వాళ్ళూ తలకిమాసినవాళ్ళు ఒంటి కాలిమీద లేచి తిట్టిపోసిందికి రెడీగా ఏ వుంటుందీ? కాంగ్రెస్ రాజకీయాల్ని, లంచగొండితనాన్ని, సమకాలిక సాహిత్యాన్ని ఎంతకని తిడుతూ కూచోగల్రు. వెధవది పాత సబ్జెటు. పైగా సాహిత్యాన్నేవన్నా అంటే సినిమావాళ్ళలా పడూరుకోరుగదా వెధవాయిలూ చెవలాయిలూ. మీరు వట్టి వెధవాయిలుస్మండి. మీకు మారాత బోధపళ్ళేదుస్మండీ. పుట్టిన వాళ్ళంతా బొడ్డూడని వెధవాయిలే గదా! పుట్టబోయేవాళ్ళంత ప్రజ్ఞ మీ కెక్కడేడిసిందంటా? మీకు మమ్మల్ని తిట్టిందికేగాక మెచ్చుకుంది గ్గూడా

తాహతులేదుస్మండీ, అని తిట్టి పోస్తారాయె. అంచేత సినిమానేనా దక్కించకపోతే యలా తిట్టుకుందికి. కనస్ట్రక్టివ్ క్రిటిసిజమ్ ఇహ దేని మీద అఘోరిస్తాం జెప్పు.

నీపాటి తెలివితేటల్లేకనేనా--మినిష్టర్లు గిల్లికజ్జాలు పెట్టుకుంటున్నారూ? వాళ్ళన్చూసి నేర్చుకోవచ్చు యంతైనా. రాచకార్యాలన్నీ ఒక్కపెట్టున చక్కపెట్టి నిజంగానే ప్రభుత్వం చేసే పనుల్జేసేస్తే పాలిటిక్స్‌లో డెడ్లా కొచ్చెయ్యదూ. వాళ్ళు చూడు ఎంత పొదుపుగా స్తిమితంగా చూడముచ్చటగా పోట్లాడుకుంటున్నారో. ఒక ఆర్డరు ప్రకారం వంతు వేసుకుని రోజు కొక్కటంటే ఒక్క స్టేటుమెంటు అంతే. ఉన్నాయిగదా అని అన్ని స్టేటుమెంట్లూ ఒక్కపూటే యిచ్చేద్దామనుకుంటే బాతూ, బంగారు గుడ్లూ కథలా అయిపోతుంది గదా!

అంచేత మైడియర్ వెంకటేశం, అదీ ఇందులో ధర్మసూక్ష్మం. పొడుగు తగ్గించమన్నారు గదా అని నువ్వు చటుక్కున తగ్గించేస్తే కొంపలంటుకుపోతాయి. మరేం భయంలేదు. ఇరవైవేల ఫుటేజికీ ఎన్నడూ మోసం రాదు. ఒక్కడుగు లోటు రాదు. పాతిక ముప్పైవేలు తీయదల్చుకున్న హేమాహేమీలున్నారు. వాళ్ళవెనక నిలబడు, మరేం ఢోకా లేదు.

❀ ❀ ❀ ❀

అంతేకాదు--మరొక ఉపద్రవాన్ని కూడా నువ్వు కనుక్కోలేకపోతున్నావు. ఈ నిడివి తగ్గిస్తివా, కథలో అక్కర్లేని పాటలూ, అణాకాణీ డాన్సులూ పోయి అవక తవకలూ అతుకులూ గట్రా లేకుండా నీట్‌గా ఉంటుంది. ఆపళంగా అది సహజంగా అమరిపోయి జీవితానికి దగ్గిర్సా వెళ్ళిపోయి అందులో కలిసిపోతుంది. ఆ పై నిహ చెప్పేదేవుంది.

ఇప్పటికీ మరో మరో విధాన గాపోయినా టెక్నికల్ హంగారమాల ధర్మవా అని పిక్చర్లు లైఫ్‌లైక్‌గా తయారైపోతున్నాయి సీనులో. స్మెల్లీసు వచ్చాక కంపుగొడు తున్నాయట. ఇహ నెప్పుడో అప్పుడు "ఫీలీస్" గూడా రాకతప్పదు. అనగా మధుబాల మొహం నీకు బావుందని తోస్తే సినిమా చూస్తూ చూస్తూ ఆవిడ బుగ్గమీద చిటికెయ్యొచ్చుట. దిలీప్‌కుమార్ ధోరణి నచ్చకపోతే భుజంతట్టి అబ్బీ ఇటు తిరిగి నటించమనొచ్చు. మరొహడూ మరొహడూ పేట్రేగిపోతూంటే నెత్తినో మొట్టికాయ మొట్టచ్చు. ఎవడన్నా ఏడుస్తూవుంటే వాణ్ణి కావలించుకుని భోర్న మనవూ యాడవచ్చు. ఈ విధంగా జీవితం, సినిమా ఏకమైపోతాయి.

ఒకపక్క ఇదిలా ఉండగా మరొహ పక్కనించి సత్యజిత్రాయి లాంటివాడున్న దున్నట్లు చూపించేసి ఫిలిమ్‌ని జీవితానికి దగ్గిర్సా లాక్కొచ్చేస్తున్నాడు.

అలాయితే మంచిదేగా అనేవు కొంపదీసి. వెనకటికి జర్మనీవాడూ రష్యావాడూ తగూలాడుకున్నప్పుడు రష్యా వాళ్ళు జర్మనీలోకీ, జర్మనీ వాళ్ళు రష్యాలోకీ వచ్చేసి రష్యా జర్మనీ, జర్మనీ రష్యా అయూరుకున్నట్టు జీవితం సినిమా, సినిమా జీవితం అయిపోగలవు. ఆ లోపలే డబ్బు నొల్లుకుందికీ ఛాన్సుండదు. సినిమాలన్నీ జీవితంలా ఉంటే అసలే జీవితం అంటే మొహం మొత్తుతున్న జనం సినిమా కెందుకురా అని మానీగల్రు.

అంచేత ఇప్పుడు సినిమా ఉన్నదున్న టుంచేయాలి. జీవితాన్ని సినిమా దగ్గరికి జరపాలే తప్ప సినిమాని యంత మాత్రం ఇటు లాక్కూడదు. ఇందులో శ్రమా లేదు. జీవితం సహజంగానే సినిమావేపు వెళ్ళిపోతుంది గదా. సినీమా కథలాగే తలా తోకా లేకుండా, అస్తవ్యస్తంగా అతుకుల బొంతలా తయారవుతూంది గదా. తెలుగు సినిమాలో కారెక్టర్లలాగే జీవితంలో మనుషులూ, పెద్దలూ, పిన్నలూ, అవకతవకగా మాటాడుతూ నడుస్తున్నారు గదా. అర్థంపర్థం లేకుండా పుడుతూ గిడుతూన్నారు గదా. సినిమాలో కామెడీ లాగే అన్ని రాజధానుల్లోనూ సర్కారు ప్రహసనాలు సాగుతున్నాయి గదా. ఛీవ్ మినిష్టర్లు, మిస్ఛీఫ్ మినిష్టర్లు నవరసాలు పోషిస్తున్నారు కదా. సినిమాలో డైలాగులాగే నాయకులు--రాజకీయాలవాళ్ళే అని గాదు--సినిమావాళ్ళే అని గాదు--సినిమావాళ్లు, సాహిత్యపువాళ్ళు డైలాగు స్టేటుమెంట్లిచ్చేస్తున్నారు గదా. డైలాగులాగే కృత్రిమంగా మాటాడుతున్నారు గదా.

సినిమాలో డైరెక్టరుగాళ్ళలాగే జీవితంలో సాహిత్యప్పర్వతాలు, పానకాలు, రాజకీయ మేరువులూ, నైతిక ఎవరెస్టులూ పాత్ర పోషణ గురించి బొత్తిగా పట్టించుకోడం మానేశారు - మరోడి మరోడి పాత్ర పోషణనికాదు. ఎవడికి వాడే శాయశక్తులా కారెక్ట రెశాసినేషన్‌లు చేస్తున్నారు. జీవితం ఇంత జోరుగా ఉత్సాహంగా సినిమా దగ్గరికీ జరిగిపోతూ ఉంటే మన సినిమా, జీవితానికి చాలా దూరం అన్న చెవలాయి ఎవడోయీ? అంట.....

ఆయ ఆయ దయచెయ్యండి. ఇందాకట్నించి ఒక్కలాగ ఆ యొక్క స్వాతి వానకి ముచ్చెపు చిప్పలాగా తవరి కోసమే వెయిట్ చేస్తున్నా. ఏవుంది... ఈ దిప్పకాయ కనిపిస్తే సొళ్ళుకబుర్లు చెబుతూ కూచున్నా, ధ్యాసంతా మీ మీదనే స్మండీ–





# సినిమాకు నీతి చంద్రిక

హారి మీ! మీ నికార్సైన అభిప్రాయాలు బజార్న పడా! ఎంతమాట సెలవిచ్చారు సార్. రైటేననుకోండి. సినీ లోకరీతిమీద జారీ అయినట్టి నీతి చంద్రిక ఇంటరెస్టింగానే ఉందిగాని, అచ్చుతప్పులున్నాయి గదూ! అదే... ఒక్కొక్క స్టారు సాలు కారు పిక్చర్లకన్న నటించకూడదని పడింది--26 బదులు, హౌ సిల్లీ? ఆరు పిక్చర్లలోవేస్తే ఇండస్ట్రీ బ్రతికినట్టేనా అంట. స్టార్లకి కాన్సెన్ట్రేషను జాస్తి అయిపోదూ! ఇపుడే కథలు అంతమాత్రంగా ఉంటున్నాయి, డైలాగులూ వీళ్ళ నిముద్చుకో లేక పిగిలిపోతున్నాయి. స్టార్లు అట్టే ఆలోచించకుండానే ఎన్నో సంస్కరణలు చేస్తున్నారు, రేప్పొద్దున్న తక్కువ పిక్చర్లలోవేస్తే ఇంకా దుంప తెంపెయ్యరూ! కథ గురించి నిజంగా ఆలోచించెయ్యరూ! వేషం రీలు కెన్నేసి ఫ్రేముల్లో ఉందో చూసుకుంది కీమాత్రమే తీరికున్న వాళ్ళు రేప్పొద్దుట్నించీ అడుగడుగునా మంచేవిటి, చెడ్డేవిటి, తలేవిటి, తోకేవిటి, కతేమిటి కమామీషేవిటని తగులుకోరూ. హమ్మో! కొంపలు మునిగిపోతాయి. అలాగే ఇంకో వెకిలిరాత కూడా ఉంది. స్టార్లు తమక్కావలసిన వాళ్ళచేతే మేకప్పు వేయుంచుకుంటామని పట్టుబట్టకూడదుష. ఇంకా నయం, క్యారెక్టరికి తగ్గట్టే వేషం వేయించుకు తీరాలన్నారు గాదు. ఏమో ఏం చెప్పగలం. రేప్పొద్దున్న లేవగానే "అంతేకాదు పాత్రకి తగి ఉంటేనే వేషం వెయ్యాలి" అని శాసించినా శాసిస్తారు, వాళ్ళ సొమ్మేంపాయె.

ప్రొడ్యూసర్ల గురించి మటుకు మీరు మంచి ముక్క చెప్పారు. తగినంత కారణం లేందే డబుల్ వర్షను తీయకూడదని.... సింగిలు వర్షను చిత్రాలన్నిటికీ తగినంత కారణాలుంటాయని ఎంత గడుసుగా ఒప్పుకున్నారు. చూశారూ, రచన అంటే అలా వుండాలి. ఒక్క వాక్యం చాలు గంగిగోవుపాలు అన్నట్లుగా. మెచ్చుకోవల్సించోట నేను కుండబద్దలు కొట్టినట్లు మెచ్చేసుకుంటాను. అది నా దుర్గుణం. ఏం చేస్తాం. పేచీ అల్లా ఇదో ఈ స్టార్ల దగ్గిరే. (క)

మరేం లేదు. ఒహపక్క నుంచి కొత్తవాళ్ళు రావాలోయ్ అంటూ మరొహపక్క ఉన్నవాళ్ళ కిలాటివి నూరిపోస్తే యలాగా అంటా. ఇవి నూరిపొయ్యడమూ, మరో పక్క నూరిపోయాల్సిన నూరు హంశాల గురించి అసలు మాటేనా ఎత్తకపోడవూఁను దారుణం గాదూ!

ఏదీ! కొందరు హీరోలూ హీరోయిన్లూ అయికమత్యానికి నామం పెట్టేసి, వేళకి షూటింగు కొచ్చేయడం తప్పని దుయ్యబట్టరేం? చక్కగా పదకొండింటికొచ్చి ఆకలేస్తోందని పన్నెండున్నరకి చెక్కేసేవాళ్ళ అడుగు జాడల్లో వీళ్ళంతా వెళ్ళరేవిటని నిల్దీసి అడగరేం? లావొక్కింతయులేదు అంటూ, చిక్కిపోతున్న వాళ్ళని పట్టుకు చీవాట్లెయ్యరేం?

యాక్టింగుకేం లెండి పేరుగురించిగదా అనేవాళ్ళ కసలీ శాల్తీల గురించి పట్టింపేల? డబ్బింగు సినిమావాళ్ళ పద్ధతులు అందరూ ఎందుకు పట్టుకు వేళ్ళాడరు? అహ తెలీకడుగుతాలెండి. డబ్బింగువాళ్ళు అరవ సినిమాకథ, మాటలు రాసినవాడి పేరుని ఎంత చక్కగా తెనిగిస్తున్నారు తెలుగులోకి? అసలువాడిగుట్టు మనకి తెలీనిస్తున్నారా? అలాగే అరవ పిక్చరుకి పాటలు చేసిన మ్యూజికు డైరెక్టరు పేరుని, తెలుగులో రీరికార్డింగు చేసినవాడి పేరులోకి ఎంత షోగ్గా తర్జుమా చేస్తున్నారూ? అక్కడితో ఆగిపోతారేవీ అని. అందులో శివాజీగణేశనూ పద్మినీ నటిస్తే పబ్లిసిటీలో రామారావూ అంజలీదేవి ఆవటాని ట్రాన్స్లేట్ చేసి అఘోరించవచ్చుగా? తిన్నగా తెలుగులో తీసేవాళ్ళుకూడా అంజలీ రామారావుల పేరు గురించేనా బెంగెట్టుకున్నదీ, వాళ్ళ ప్రజ్ఞని యలాగా వాడుకోదల్చుకోలేదుగా? అంచేతిలా చేస్తే చక్కహా ఫలానాదీ డబ్బింగు సినిమా అయినట్టు మూడో వాడికి తెలీదు. ఇటు తెలుగులో పేర్లూ ఉంటాయి.

ఇదే స్కీము టెల్గూ పిక్చర్లలో కూడా వాడుకోవచ్చు. కాల్షీట్లు ఇవ్వని, ఇచ్చినా ఆలీశంగా వచ్చి ఆర్కెస్ట్రా లేకుండా ఏడిపించేవాళ్ళనీ పేరుకోసం బుక్ చేసుకొని వాళ్ళకిచ్చే బ్లాకూ వైటూ కూడా పారేసి ఆ వేషాలకే పదో పరకో పారేసి కొత్త వాళ్ళని బుక్ చేసుకోవచ్చు. పెద్ద వాళ్ళ పేర్లుంటాయి, కొత్తవాళ్ళ మొహాలుంటాయి. ఉభయతారకం. స్టార్లు బెంగెట్టుకుంటారని బెంగక్కర్లే. ఈమధ్యనో తారన్నట్లు--వేషం ఎలా అఘోరించినా పట్టింపులే దావిడకి.

ఈ బాపతుపని కొంత ఇపుడు లాంగ్షాట్లో ఎలాగూ జరుగుతోంది స్టాండుబై యాక్టర్లద్వారా. ఇక మిడ్లాంగ్కీ, క్లోజప్కీ రావడం తరువాయి.

అలాగే తీరికలేని రైటర్ల సంగతీని. అండర్ గ్రవుండులో వుండి రాసే తీరికా, ఓపికాలేని గొప్ప రైటర్లందరికీ డబ్బిచ్చేసి పేరుకొనుక్కుని తరువాత వర్ధమానునికి పదోపరకో పారేసి రాయించుకోవటం--వాళ్ళ పేరూ వీళ్ళ రాతాను మోతగా ఉంటుంది ఒక టెనాలీ జంటిల్మన్ అన్నట్టు.

ఆమాట కొస్తే ఇదీ కొత్తగాదనుకోండి, జరుగుతున్న కథ గదా.

మ్యూజికు విషయంలో మాత్రం ఈ పద్ధతి రివర్సులో వాడాలి. ఒక్కొక్క టెలుగు పిక్చరులో ఐదారు హిందీ హిట్ సాంగులు గుప్పిస్తున్న ప్రొద్యూసర్లు ఆ రీరికార్డింగు పనికి కుదుర్చుకుంటున్న మ్యూజికు డైరెక్టరికి ఇంకో పది వేలు పారేసి, పేరు సంగతి మర్చిపొమ్మనాలి. ఆపైన తమ పిక్చరుకి మ్యూజికు డైరెక్టర్లు శంకర్--జైకిషన్, బర్మన్, రామచంద్ర అని పబ్లిసిటీ ఇస్తే బాక్సాఫీసు డ్రా ఇంకా బావుంటుంది. చిత్రగుప్త, రవి వగైరాల పాటలు పుచ్చుకున్నప్పుడు మాత్రం శంకర్ జైకిషన్, బర్మన్ అనే వేసెయ్యడం మంచిది. ఇదీ బుద్ధిమంతుల పద్ధతి.

❀ ❀ ❀ ❀

ఎక్సయిజు సుంకం పేరిట హాలువాళ్ళు ఆటకి రెండేసి రూపాయలు అచ్చుకోవాలని స్టూడియోలవాళ్ళూ, కాదు మీరేనని హాళ్ళవాళ్ళూ అంటున్నారు. ప్రొద్యూసరింకా ఏవీ అనకుండానే ఈ రెండు వర్గాలవారూ ఇలా వాదించుకోడం చూసి పెద్దతారలు కొంచెం ఖంగారుపడుతున్నారు-ఇది ఇటు తిరగదుగదా అని. మరేం ఫర్వాలేదు. తెర వేలుపుల జోలికి ఎవడూ పోలేదు. మహా అయితే చిన్న నటులు భరిస్తారు దానికేం.

"అయినా కాకపోయినా ఇదేవంత పెద్దమొత్తం గనకా వెధవ రెండు రూపాయలు, సముద్రంలో నీటి బొట్టంతా" అన్నాడు ఒక వర్గపాయన రెండో వర్గం వాళ్ళకేసి కోరగా చూసి.

"అదేంమాట. లిటిల్ డ్రాప్స్ జాయిన్ టుగెదర్ టు మేకె నోషన్. చిన్న చిన్న నీటిబొట్లు కలిస్తేనే సముద్రాలు తయారయేది" అన్నాడు నీటిబొట్ల విలువ తెలిసిన ధన సముద్రుడు.

మొత్తానికి మనం వీటి గురించి అట్టే చర్చించడం క్షేమకరం కాదు. వాళ్ళూ వీళ్ళూ కలిసి మన్నెత్తికి తోసీగల్రు.






# నేతి నేతి వాదం

డియర్ వెంకటేశం, హియర్ కమ్స్ గిరీశం.

ఫియర్ హిం న లేశం, మియర్ దిస్సె వేషం.

యవరూ, నువ్వేనా వెంకటేశం! రక్షించావు. ముందా నట్టింటి తలుపు జార్లావేసిరా ఎవరేనా చూడగల్రు. వచ్చేటప్పుడు నా ధోవతి, మీ నాన తాటాకు పెట్లోంచి యజ్ఞోపవీతం ఒహటీ పట్టుకురా చెప్తా....

....మరేమీలేదు. సింహద్వారం వదలి యిలా దొడ్డిదోవన ఈ వేషంలో జొరబడేసరికి మీవాళ్ళు యవరైనా చూసి యవడో దొంగాడు జొరబడ్డాడని పొరబడ్డారా ఒళ్ళు మళ్ళీ హూనం అవుతుందని, నాయొక్క మెసేజిని మంత్రబద్ధంచేసి జపిస్తూ వచ్చాను. ఏ యాయవారబ్రాహ్మ ణేతరుడో అనుకోబోరా అని.

మళ్ళీ హూనవేవిటి ఒహమాటయిందా అంటావా, నువ్వా అలా ఇగ్నొరెంట్‌గా మాటాడితే యాలాగోయ్, ఔగాని ఆ గొబ్బుర్నూని యిలా యీ వీపుమీద కాస్త పట్టించు. నొక్కి రాయకు. బులబులాగ్గా, మన సినిమా వాళ్ళు సంఘసంస్కరణ చేసినంత బులబులాగ్గా రాయాలిస్మీ....

ఆ....యేవీలేదోయ్. కాస్త డిఫరెన్సాపొపీనియన్ ఏర్పడింది. అంతలోనే వాళ్ళు వాళ్ళతప్పు తెలుసుకుని నాలిక్కరిచేసుకుని కాళ్ళాచేతులా బ్రతివిలాడారు.... ఏవన్నావూ, విరగ్గొట్టహొచ్చారనా, యవరంటూ ఆమాటన్న అయోగ్యుడు. మీమావ కరటకశాస్త్రుర్లే అయితే అతగాడి కెవరు జెప్పారో నాకు తెలుసు. ఆ మధురవాణి కూసుంటుంది. దానికి సరసవంటే మహచెడ్డ యిది. లేనివి ఊహించి ఉన్నట్టుగా చెప్పడం దాని ప్రజ్ఞె.

నీ దగ్గిర దాపరిక వేవుంది. ఆత్మస్తుతి చేసుకుంటున్నారు మాస్టరు గారని నువ్వనుకున్నాసరే చెప్పేస్తాను విను. చెప్పనిపాపం నాకేల. అదిగో ఆ బైస్కోపువాళ్ళు ఏడిశారుగా ఊరిచివర--అవుడ్డోరు షూటింగు చెయ్యడానికికొచ్చార్ట. తీరా దిగేసరికి,

గిరీశంగా రీశాయలే ఉన్నాడుస్మీ. ఒళ్ళు దగ్గరపెట్టుకు పన్చెయి, లేకపోతే ఏకేస్తాడని యవరో ఆ డైరెక్టరుగాడి చెవులో ఊదార్ట.

హమ్మయ్య వార్ని దర్శించకపోతే యలా అని యిదయ్యాట్ట. ఆనక మళ్ళీ నేను కోప్పడతానేమోనని కాకిచేతే కౌరంపించాడు. పొద్దున్న చూళ్ళే?--చుట్టాలొస్తారా గెంతెయ్యి అని నేననేసరికి పందిరిమీద కాకి చెంగున గెంతేసి కావుమని అరిచిందీ? చుట్టాలెవరనుకున్నావుటా.

సరే తీరా ఆ షూటింగు చూడబోయేసరికి, తవరు డైరెక్షను చెయ్యకపోతే మానె, వేషవైనా కట్టాలని అక్కడి జనాభా అంతా కాళ్ళా వేళ్ళాపడి యిదయ్యారు. మీ ముచ్చటేల కాదనాలని మేకప్ అయి కెమేరా యెదుట నిలబడేసరికి సినీజనమంతా దంగయిపోయారంటే నమ్ము.

మనవేఁసింది విలేజి రౌడీరోలులే, హీరోయిన్ని బలాత్కరించబోతాడు. అందులో హీరో అడ్డుపడి తన్ని--నన్నంటే నా వేషాన్నిలే--ఆ చిన్నదాన్ని కాపాడతాట్ట.

తీరా నేను వేషంకట్టి రెండెక్స్‌ప్రషన్‌లు అలా అలా విసిరేసరికి కథ అడ్డం తిరిగిపోయింది...ఇంకాసిని వేన్నీళ్ళందుకో బాబూ.

యేవుందిటా, ఆ హీరోగాడిగుండె బేజారైపోయి, నేను వీరిపక్కన నటించలేను, వీడు నటరాక్షసుడు బాబోయ్, నన్నూ నా సీన్లనీ మింగేస్తాడని ఒహటే గోల.

ఆవంకా ఆ హీరోయిను నన్ను చూడగానే, పెరుగన్నందగ్గిర మీ మావలా మొహవింత జేసుకుని కథ మార్చాలంది.

తనని నేను బలాత్కరిస్తున్నప్పుడు అడ్డుపడ్డ హీరో ఓడిపోవాలని ఆనక నేనే తనని రాక్షసవివాహమాడాలనీ పట్టుపట్టింది. అంటే విలనే హీరో అయిపోవడమన్నమాట.

ఏమిజేతువుఁదైవమా అని వాళ్ళు దిగాలు పడిపోయారు. నేను ధైర్యంజెప్పి, ఆ పిల్లనొప్పించి షూటింగు జరిపించాను.

యాక్టింగులోనే చిక్కొచ్చిందన్నమాట. బలాత్కారపు సీనులో నేను ఆ హీరోయినుమీద ఇమోషన్‌కొద్దీ కాస్త ధాటిగా నటించేసరికి--యవడో ప్రొడ్యూసరు బ్రదరిల్లాట--వాడు ఫైరయిపోయి వాట్ ఇంత నాచురాల్టీ అక్కర్లేదన్నాడు.

నాకా నువ్వు పాఠాల్చెప్పేదని, నేను మరింత దీనిగా నటించేసరికి వాడు దంగైపోయాడు.

అంత గొప్పగా నటించిన ఆ నా చెయ్యి తనక్కావాలని ఆటోగ్రాఫు వేయించి చక్కాపోతానని వాళ్ళ ఆఫీసులో నా స్మారకచిహ్నంగా అట్టిపెట్టుకుంటానని మారాముడిపెట్టాడు.

చెయ్యేల, నేనేవస్తానన్నా విన్నాడు గాడు. వాడిలాగే మరికొందరు కూడా ప్రేమకొద్దీ సొంతానిక్కావాలని ఈ చెయ్యోహరూ, ఆ చెయ్యోహరూ, ఈ కాలోహరూ,

ఆ కాలొహరూ, ముక్కొహరూ, చెవులొహరూ లాక్కోబోయారు. శిబిచక్రవర్తి నోమారు తల్చుకొని సరే, తీసుకు పొండందామను కున్నా గాని నాశాల్తీకోసం నువ్వూ ముఖ్యంగా మీ సిష్టరూ బెంగట్టు కిదౌతారని--

యూ ఇడియట్, నవ్వుతున్నావా? నువ్వూ లోకంతో పాటవుతావనుకోలేదు. జరిగింది కొట్లాటయితే వాళ్ళు మళ్ళీ నామాట వింటారా చెప్పు. మరి విన్నారు. తెలుసా?

ఆఫీసు అవుతూనే షూటింగాపేసి లెక్చరిమ్మన్నారు. ఏకబిగిని ఘంటన్నర లెక్చరు దంచేసరికి డంగైపోయారు రెండోమారు-

హౌరా! ఇంకానయం యీ శాల్తీ మర విప్పేసి స్వార్థబుద్ధితో ఏ ముక్క కా ముక్క పట్టుకుపోయి దాచుకుంటే యీలాటి లెక్చర్లు పోగొట్టుకునేవాళ్లంగదా అని కువ్వింలి కువ్వింలి యేడిచారు.

హౌరా మన ఆంధ్రులం వింతగొప్ప వాళ్ళవాం! గిరీశంగారు అరిటి పండొలిచినట్టు చెప్పేదాకా యీవైనం కనుక్కోలేకపోతివేం అని నొచ్చుకున్నారు. వారన్నట్టు మనం బహు దొడ్డవాళ్ళమని గర్వపడ్డారు. లాల్చీలున్నవాళ్ళు వినా తతిమాయావన్మందీ కాలరెత్తుకున్నారు.

కాదుటోయ్ మరి. తిట్టుకున్నప్పుడు తిట్టుకున్నా మన గొప్పతనం కూడా మనం చెప్పుకోవద్దుటోయ్. పబ్లిసిటీ ఈజ్ ది లైఫాఫిట్ అన్నాడు సీవంరొర. కాపోతే మనదేశం సంస్కృతిని సాంప్రదాయాన్ని ఇంత గొప్పగా అర్థంచేసుకుని ఇలా నష్టపోతూ సినిమాలు తీసినవాడెవడోయ్ తెలుగువాడు కాక. సత్యాన్వేషణను మన పూర్వులు యెలా సాగించారు? అందతా ఫిలాసఫీ అనుకో.

పెద్దలేవన్నారు? అబ్బీ. ఈ సత్యం అనేది ఓపట్టాన కొరుకుడు పడదురా.... పట్టుకు దొరకదురా. పెతీది సత్యంలాగే అవుపిస్తుందిరా. తీరా దగ్గిర్నా వెళ్ళి చూశాక అనుభవమైనాక యిది కాదురా సత్యం అనిపిస్తుందిరా, అది ఎండమావిలా పరిగెత్తిస్తుందిరా.

కావున మనవున్ను అలాగే వెళ్ళి నేతి నేతి అనుకుంటూ--నేతి అనగానే చేగోడీలు జ్ఞాపకం చేసుగోకు స్మీ--న యితి అనగా ఇది కాదు అని తాత్పర్యం. ఇదికాదు ఇదికాదు అనుకుంటూ పోతే అయినదేదో తెలీకపోయినా కానివన్నీ బోధపడతాయి గద. ఇపుడు నిన్ను మీనాన్న అద్దాంత్రంగా వచ్చిపడి అబ్బిగా పదమూడు పద్దానుగు లెంతరా అంటాడు. అరవైమూడు అంటావు నువ్వు అలవాటుచొప్పున. కాదు అని గూబ కదలేస్తాడు నాన్న. దెబ్బయి తొమ్మిది అంటావు. రెండోగూబ కదులుతుంది.

తొంభై నాలుగు కామోసు అంటావు. కాదు అంటూనే నీ చెవి మారువేషం వేసుకోబోతుంది, నూట యాభై ఆరా? అంటావు. కాదు. ఇలాపోగా పోగా పదమూడు పద్దానుగులెంతో చివరికి నీకు తెలీకపోయినా కానివేవో కంఠతా వస్తాయి గదా.

అలాగే విడో మారియేజెస్ తీసుకో. ఒక బ్యూటిఫుల్ యంగ్‌విడో బుచ్చమ్మకి–ఐమీన్ ఆమె విడో కాక ముందు ముక్కుపచ్చలారని పసిపిల్లగా వుండగా మీ ఫాదరు ఒక ఓల్డ్‌ఫెలోకి కట్టబెట్టేస్తాడు. కాని నిజంగా అది బుచ్చమ్మకు తగునా. యంతమాత్రం తగదు. అందువల్ల తక్షణం దేవుడేం చేస్తాడు. ఇది కాదు అంటాడు. అని ఆ బొట్టు చెరిపేస్తాడు. అలా కాకముందరే ఇదేమిటయ్యా గిరీశంవంటి జెమ్‌ని ఇచ్చి పెళ్ళిచెయ్యవయ్యా అంటే మీనాన్న వినడు గదా--దేవుడే దిగొచ్చినా లాభం లేదు గదా అంచేత ఆయనా అబోరు దక్కించుకోడానికని ఆ పైగానే ఉండి పదమూడు పద్ధానుగులకి నువుచెప్పే జవాబులన్నీ మీ నాన్న కాదు కాదన్నట్టే ఆ పెదనాన్నా మీ నాన్న పనుల్ని కాదంటూ ఉంటాడు. నువ్వేనా చూడు పదమూడవ యక్కంగూర్చి మరోసారి మీ నాన్న అడిగినపుడు ఇన్ని జవాబులు చెప్పవు. అపుడు సొంటిపిక్కల, తొడపాశాల, మొట్టికాయల సంఖ్య తగ్గుతుంది. అవునా సుఖపడతావు....అదే రహస్యం.

బాబూ మన తెలుగు సినిమావారు మహా గొప్ప వేదాంతులు అనడానికిదే ప్రబలసాక్ష్యం. ఈ నేతివాదం పట్టుగుని, ఒక్కొక్క సినిమా తీసి దెబ్బతిన్నప్పుడల్లా ఇది కాదు అని చెంపలేసుకుంటారు. వాళ్ళేకాక మరొకడు కూడా ఆ పొరపాటు చేయడు.

ఈ విధముగా 'హౌ నాట్ టు మే కే ఫిల్మ్'–అనగా ఒక సినిమాను ఏ విధముగా తీయరాదు, హౌ నాట్టు రైట్, యాక్టు. ఎట్లు వ్రాయరాదు, నటించరాదు అన్న ప్రశ్నలకు జవాబులుగా ఒక్కొక్క చిత్రం ఒక్కొక్క క్లాసిక్కుగా ఉద్గ్రంథంగా తీసేస్తున్నారు మనవారు. ఇంత అపారమైన అపురూపమైన గ్రంథసంపద వేదాల తరువాత మనకొచ్చిందేవిటి?

నేతినేతి అంటూ మనవాళ్ళు ఇన్ని మహత్తర సినిమాలు లక్షల ఖర్చుతో హైరాణతో లాగి అవతల పారేస్తూంటే, ఈ నేతి సినిమాల్ని పట్టుకుని, "మనవంతా నూనె సరుకోయ్" అన్న చెవలాయ యవడంట.






చూశారా! చూశారా! చూశారా బుచ్చమ్మ వదినా! ఇవన్నీ. ఈ పేపర్లన్నీ చూశారా? ఏం గనిపించింది? వాడ్డు యూ సీ? విడోస్ విడోస్ విడోస్. ఈ సీజను సీజనంతా అదే సబ్జెక్టు. బంపర్ క్రాప్! మైగాడ్! ఒక గిరీశానికే సింపతీ అనుకున్నారు గదూ ఇన్నాళ్ళూ? నేన్జెబితే నమ్మేరూ? ఆఁ పాఫోస్ ఈ గిరీశంగారు ఏవో కల్లబొల్లి కబుర్లు చెబుతారే తప్ప ఇవన్నీ నిజాలా ఏవిషీ విద్దూరంగాపోతే అనుకున్నారు. అంతేనా, ఇపుడైనా నమ్మండి. ప్లీజ్ బిలీవ్ మీ. నాక్కల్లాకపటం తెలీవు. మా నాయనమ్మ ముప్పూటలా మొత్తుకునే దదేగదా, హయ్యో నేనేం జేతునమ్మా ఈ గిర్రాడి క్కల్లాకపటం బొత్తిగా తెలిస్చచ్చాయిగాదేం దారమ్మా. వీడెలా బతికి బట్టకడతాడమ్మా అవటాని

మైడియర్ సిష్టరిల్లా! బిలీవ్ మీ. నాకే గనక మాయదారి కబుర్లూ కపటబ్బుద్ధులూ పట్టుబడుంటే ఈపాటికి మిమ్ముల్నున్నఫలంగా ఎగరేసుకుపోయి ఏ అయిఫిల్ టవర్ మీదనో కూర్చుని కులుకుతూ మిమ్మల్నానందపరుస్తూ ఉండేవాణ్ణి. ఏందారి మరి. మంచి గురించి మంచిగా చెబితే విన్నంటే, మాయజేసయినా దార్లో పెట్టవోయ్ అన్నారు పరబ్రహ్మశాస్త్రులవారు. నా కిన్నాళ్ళూ తెలీక అజ్ఞానం కొద్దీ ముద్దుగా చెబుతూ వచ్చాను. పోన్లెండి ఈసారికైనా తెలిసింది గద. లోకవంటే ఈ అగ్గురారవేఁ కాదనీ, ప్రపంచకవంతా మన కొంప పెరడవతలేదప్ప ఇవతల్లేదనీ ఇప్పటికైనా తెలిసింది గద. ఒక్క మీ నాయనగారే తప్ప మిగతా యావన్మంది ప్రజలున్నూ కోడై కూస్తున్నారు విడో మారియేజస్ జరగాలోయ్ అని. లేకపోతే ఇంతమంది ప్రొడ్యూసర్లు ఒక్కసారిగా ఈ యొక్క 'విడో' అను రెండక్షరాలమీద, ఈ సబ్జెక్టుమీద యిన్ని చిత్రాలు--అదిన్నీ లక్షలు గుమ్మరించి తీస్తారా? తీస్తారా మీరే చెప్పండి?

వీళ్ళంతా ప్లయిట్ ఆఫ్ ది విడోస్ అనగా మీ యొక్క స్థితి గురించి యంత దుఃఖం కలగకపోతే యింత కలిసికట్టుగా ముక్తకంఠంతో దుఃఖపడి మరీ పిక్చర్లు తీశారో మీరే చెప్పండి. అక్కడితో ఆగారా, పిక్చర్లు తీసిన్నీ వాపోతున్నారింకా.

చక్కహా నేన్చెప్పినట్టు విని, మీ[రం దొదినా అనగానే సరేనని నాతో బయల్దేరి, మె[డ్రాసెళ్ళిపోయొస్తే ఈపాటికి మీమీద నే[నెండు పిక్చర్లు లాగి పారేదును గదా.

వదినా మీరు చరచరా వంటింటో కెళ్ళిపోండి-కొంప మునిగింది, నాన్నగా రొచ్చేస్తున్నారు....

ఆయ చిన్నవాణ్ణయినా దమకు వెయ్యేళ్ళాయుష్షనక తప్పదు. మీ మాటే అనుకున్నాం అమ్మాయీ నేనూను. మాటలో దయచేశారు. సాక్షాత్తు అగ్నిహో[త్రులే తమరు. ఆయొక్క ముఖవర్చస్సలాటిది గదా. విశేషవేవిటీ అంటే అట్టి పవి[త్రత మీ బిడ్డలక్కూడా అబ్బడం. అమ్మాయి ఇప్పుదేవందో విన్నారూ! అయ్యా గిరీశంగారూ నలమహారాజు కథలో దమయంతికి రెండోపెళ్ళి ఆవటాని చాటింపేయించారుగదా- మరి అది అజ్ఞాతంలో వున్న భర్తను రప్పించుకునేందుకే అయినప్పటికిన్నీ--అట్టి ఊహ పోవడమే మహాపాపం గాదుటండీ, పరిహాసానికయినా అలా అనరాదుగదా అంటోంది. ఓహో అగ్నిహో[త్రావధాన్లుగారింట పుట్టినపడుచువి నీగ్గాపోతే మరెవరికింత గొప్ప ఊహాలు కలుగుతాయమ్మా అని ఇందా కట్నించొక్కలాగ ఉప్పొంగి పోతున్నాను. ఇదిగో మె[డ్రాసునుంచి డబ్బు రెడీ అని కబు[ర్రాగానే ఈ విషయమ్మీదనే ఒక బైస్కోపు ఆరంభించేస్తాను. తమరు తప్పక దైచేసి ఆశీర్వదించాలి.

ఏవన్నారూ ఇలాంటి ఊహల్ని బస్తీలో వింటారూ అంటారా! ఛంపేశారు. ఇంకా నయం. తమవంటి పెద్దలు ఈ దేశంలో ఓ మూలవుండగా అలాటి పొగరు ఎలా సాగుతుందండి. ఆ మర్జునేవో వెకిలి వేషాలు వేశారుగాని ఇపుడంతా మళ్ళీ దారికొచ్చేశార్లెండి. ఇపుడు తీస్తున్న బైస్కోపులన్నీ సాక్షాత్తు మీ నోట్లోంచి ఊడిపడ్డవే అంటే నమ్మండి. వెధవది ముఖ[ప్రీతి మాటలు చేతనై చావ్వుగాని ఈ పాటికి ఛెగపొగిడి పారేశేవాణ్ణి మిమ్మల్ని.

రైటేరైటే, మళ్ళీపెళ్ళి లాటి పిక్చరొచ్చినమాట రైటే అప్పుదేదో కూశారు. విడోకి మళ్ళీ పెళ్ళి అవసరం అని. ఇప్పుడదేం లేదులెండి. చెంపలేసుకున్నారు. పవి[త్రత గ[ట్రా ఫాషనులో కొచ్చేశాయి. ఇప్పుదు పిక్చరులో విడోకి మొగుడు పోగానే హయ్యో నాకూతురా యంత పన్జరిగిందే అంటారు ఒక నేపజ్జప్పాటపాడి. ఆపైన పోయినవాడితో నువ్వా పోక తప్పదు అనేంతవరకూ వచ్చేవారేమోగాని సహగమనమ్మీద సర్కారువాళ్ళ రూలోటి ఆహోరించింది చూడండి. అంచేత అంతమాట అన్లేకపోయినా, “ఏం చేస్తాం, ఎలాగో బతుకు వెళ్ళమార్చుకో” అని ఓదారుస్తూ పిక్చర్లు దీస్తున్నారన్నమాట. రెండో పెళ్ళంటే మనం - అనగా జనం - ముడిపడతామని వాళ్ళకెంత భయం అనుకున్నారూ. అంచేత అంతమాట చస్తే అన్రు. [ప్రేవంటారా? దానికేం సోదరీ [ప్రేమ వుండనేవుంది. అచ్చాలు--కాసేపు

అపోహలల్లుకుందికి. ఈ లోగా గడియారం ఆరూ కొట్టేస్తుంది. ఎవరిళ్ళకు వారు పోవచ్చు.

చిత్తం--అంతేనండి. మీమీదొట్టు. అక్షరాలా ఇంతకన్నా ఏం చెప్పటం లేదు. ప్రేవలూ గీవలూ జాంతానై. సెకండు మారేజి సెంటిమెంటుకి ఎగినెస్టయిపోయాక ఆ మాటెత్తడానికెవడికి దమ్ములుంటాయండి! అదే చెబుతున్నాను, తవరిలా దేశంలో ఓ మారుమూల ముక్కుమూసుకుని జపం చేసుకుంటున్నా తమ ప్రభావం అక్కడ చెన్నపట్నంలో కథలనిండా అలుపుకుని వుంది.

ఉప్పూకారం తింటూన్న మనుషులయినపుడు, వయసులో వున్న మొగాడూ ఆడదీ (విడోలనుకోండి) పవిత్రతంటూ పడేడవటవేవిటి నా శార్థవని ఒహ దుష్టుడు దూకుడుగా అనేశాడుగాని, వెంటనే నలుగురూ వాడిగ్గడ్డెట్టారు-అందికేనోయ్ పెద్దలు విడోస్‌కి చప్పిడిపిండి తిండిగా నిర్ణయించారూ అని. పిండి గిట్టకపోతే ఇంగ్లీషువాడి బిస్కత్తులు తిని యాడవచ్చుగా అనిన్నీ అన్నారు. దెబ్బకి దంగైపోయాళ్ళెం దా దుష్టుడు.

అయ్యా అదీ సంగతి. అంచేత మనం ఇంతకుముందనుకున్నట్టుగా, ఈ సబ్జెక్టుమీద ఓ పిక్చరు లాగిపారేదాం. మీకూ ఇందున ఒక శ్రద్ధాప్రపత్తి ఉన్నాయి గాబట్టీ మీయందు నాకున్న గురినిబట్టీ మిమ్మల్ని గూడా ఇందులో ఓపావలా వాటా తీసుకోనిస్తాను. అంతకన్న ఎక్కువ ఇవ్వడానికి వీల్లేదండి. అవతల మూడు లక్షలు రెడీ అయిపోయాయి, ఛాల్లెస్తురూ. ఈ పావలా వాటాకే, మీకు దాదాపు యాభైవేల కరుకులు దోసిట పడతాయి. ఐదుగురాడపిల్లల్నమ్ముకున్నా ఇంతరాదు. యావంటారు, చిత్తం అలాగే ఆలోచించండి సావధానంగా. చూశారూ, ఈలోగా యీ యొక్క కథా గట్రా ముందర ముసాయిదా రాసుకుందిక్కాయితాలూ గట్రా కొనాలి. మీ రొండినున్న దాంటోంచి ఒక్క హస్తం ఇటు పారేస్తిరా పని ఆరంభిస్తాను. యేవిటో సెంటిమెంటొహటేడిసింది. ఓం ప్రథమంగా శ్రీకారం చుట్టడానికయ్యే డబ్బు పవిత్రమైన మీ హస్తాల్లోంచి వస్తేనే రేపు లక్షలు కురుస్తాయని.

వ్వండర్‌ఫుల్ థ్యాంక్యూ.....

వాట్ మైడియర్ వెంకటేశం! నువ్వింతసేపూ ఆ ఘోషాణం వెనకే వున్నావా. ఏవిటి గురువుగారిమీదే స్పయింగు చేస్తున్నావా? డామిట్! గ్రాస్ యిన్గ్రాటిట్యూడు. కాపోతే మరేవిటి చెప్పు. యేవిటీ, నిన్న చౌదరిగారికి చెప్పిన స్టోరీ అంతా మార్చేశానంటావా. అవును మరి మార్చకుండా, ఆ కథ ఫాదరిల్లాకి చెబుతే చెమ్డాలెక్కదీసి తంతాడు. పైగా టెన్ రూపీస్ ఇచ్చేవాడా? నాన్సెన్స్ మనకి ఒపినియన్సేవిటోయ్. పీపుల్స్ ట్రెండ్ అని మనకి తోచిందాన్ని బట్టి పోతాం బిజినెస్‌లో, ముఖ్యంగా ఫిలిం బిజినెస్‌లో వున్నవాడు పొలిటీషియన్‌లా, పారిస్ పడతిలా, గ్లాసులో నీరులా వుండాలి. సమయాన్ని బట్టి స్ట్రాటజీ ఫిరాయించాలి. అభిప్రాయాలేవిటి నాన్సెన్స్. అవి చాలా డేంజరస్ సరుకులు. చూస్తూ వుండగా అవే మూఢనమ్మకాలయూరుకుంటాయి.

వాట్! ఇందులో షేరా! వెంకటేశం! అయామ్ అషేమ్డ్ ఆఫ్‌యు. దిస్ ఈజ్ గ్రాస్ క్రుయాల్టీ. ఈ కంఠశోషలిజవు కాలంలోను నువ్విలా వాదించకుండా కనీసం దబాయించకుండా, చేతిలో డబ్బులాగేసుకొని వాటా తీసుకోవడం ఏం బావులేదు. చూస్తూవుండు నా నెక్స్ట్ పిక్చరులో నీకు పదెండివేల అడుగుల్లో ఒక విడోతో రొమాన్సు పెట్టించి, చివర్న అంథా సిస్టర్లీ అఫెక్షన్ ఇచ్చి--అనగా సోదరీ ప్రేమయేనోయ్ చెపలాయ్ అని తేల్చి అవతల పారేస్తాను. ఏడుస్తూ హొరైజన్ లోకి పోతావు. అంతే.



# తెక్కర్లంటే మాటలా!



ఏవివాయ్ వెంకటేశం. ఎక్కడికి చెంగు చెంగున లేడిపిల్లలా గెంతులు వేస్తూ బయల్దేరావు?.... వాట్! పిక్చరుకా? దేనికి? టెంటు సినిమాకా. అంటే టెలుగు పిక్చరనేగానీ తాత్పర్యం. మనవూరు టెంటుసినిమాలో టెలుగు పిక్చర్సు కాక మరేవిఁ టాడుతాయిలే.

హారి నీ యిల్లు బంగారంగానూ, నీకు బ్యూటిఫుల్ యంగ్ విడోతో మారియేజ్‌కానూ, ఎంత ఓఘాయిత్యాని కొడిగట్టావు. కాస్తలో ఎంత ప్రమాదం జరిగేది. గిరీశంవంతవాడి శిష్యుడవై టెలుగు పిక్చరు--అదీ డబ్బు ఖర్చుపెట్టి చూస్తావటోయ్. ఇన్సల్ట్. అసలు టెలుగు పిక్చర్లెందుకూ? మన అధోగతిని పట్టుకు తిట్టిపోసుగోడానిగ్గాపోతే. మనం కూడా డబ్బు పెడితే ఈ పిక్చర్లు. ఇహ నీ జన్మకి బాగుపడవు. అదిన్నీగాక, మదరిల్లా ఆశపడుతున్నట్లు ఆవిడ మాటచలవని నువ్వు రేపొద్దున్న పరీక్ష యిచ్చి ఏ కనిష్టీపువో, సర్కిలువో అయితే ఊరికినే చూడొచ్చు. అదృష్టం నీకూ నాకూ జాస్తిగా ఉండి, నాకు బ్రదరిల్లావే అయే యోగం పడితే ఇహ చెప్పాలా. అప్పుడు నేనెలాగా లీడింగ్ ప్రొడ్యూసరు డైరెక్టరాక్టరు నౌతాను గదా.

అప్పుడు····

····వింటున్నారా వదినా! అప్పుడు మీరూ నేనూ మన ప్రయివేటు ఆడిటోరియంలో కూర్చుంటాం. అంటే మన సొంత సినిమా హాలన్నమాట. కేవలం మనకోసవేఁ పిక్చరాడు కుంటావన్నమాట. మన వెనకే ప్రొజెక్టరు. మన వెంకటేశవేఁ దాన్ని ఆపరేట్ చేస్తాడు... ఔనా. వెళ్లిరండి. పోపు మాడిపోతే ఆనక మీనాన్న వెంకటేశం మాడూడకొడతాడు మజ్జన--

ఊ. ఏవిటోయ్ వెంకటేశం. అయితే సినిమా కెళ్తానంటావు. నా మాట విని ఆ డబ్బులా తగలెయ్యక ఇలా తగలెయ్యి. సిగార్సుకి కాపర్సు అవసరమవుతాయి. వాటికి తగలేద్దాం. చూశావూ ఆ తగలేసేది కూడా సరైన పద్ధతిలో తగలెయ్యాలి.

ఇలా కూచో చెబుతా. నువ్వైతే మహా సినిమా చూడాలని ఎగబడుతున్నావుగాని ఆ తీసేవాళ్లకి ఏంవి బేహద్బీగా ఉందో తెలుసా? నువ్వూ నేనూ అసలు సినిమాలు చూసిందికి పనికిరావుట. మనంవిచ్చే డబ్బులు వాళ్ల కసలు కలికంలోకి రావుష, మనం క్లాసు వాళ్లంట. మనకి ఆ యోగ్యతా లేదుష మరి.

ఏ మాట కామాటే అనుకోవాలి, ఆ మాటా నిజవేఁ.. మర్నేనూ రేప్పొద్దుట్నుంచి ప్రొడ్యూసర్ డైరెక్టర్నవుతున్నాను గదా!

సినిమా చూసే అర్హత నీ కుందా అని. కలికాలం గాకపోతే పెతీవాడూ సినిమా చూస్తానని ఎగబట్టవేనా?

చూడొచ్చింది చాలక అడ్డుప్రశ్నలొహటా. డూ యు నో వెంకటేశం? మీ అడియన్సు సగటు వయస్సు పన్నెండేళ్లనీ, బుఱ్ఱ అంతకు మించి ఎదగలేదనీనూ. పాతికేళ్లనించీ అదంతేనని మేవంతా నమ్ముతుంటే, ఇవాల్టి రోజున -- మీరు కాదు -- వయస్సు పెరిగిందంటే చెల్లుతుందా? చెప్పు. చెల్లదు. ఔనా? అలాంటప్పుడు పెద్దంత్రం, చిన్నంత్రం లేకుండా మీరు -- మీ ప్రజలు -- మమ్మల్ని విమర్శిస్తే ఎలా?

ఈ మధ్య ప్రతివాడూ మన పిక్చర్లలో వాగుడెక్కువై పోయిందంటున్నారు. డైలాగులన్నీ ఉపన్యాసాలలా ఉండటవేఁకాక, అవి చాలవన్నట్టు మళ్లీ పిక్చరు చివర "ఫలానా రావు మెమోరియల్ లెక్చర్" అన్నట్టుగా నికార్సైన లెక్చర్లు ఏర్పాటు చేసేస్తున్నారనిన్నీ--కన్నాంబ... లేకపోతే హీరోయినో ఎవరో ఒకళ్లు పుంజుకుని చెవులు హోరెత్తించేస్తున్నారనీ--విమర్శిస్తున్నారు. బట్ వాడ్డు యు నో! ఆ లెక్చర్లే తమిళంలో అక్షర లక్షలు రూపాయలు కురిపించాయి. వాటికోసం జనం విరగబడి చూశారు. మజాకా అనుకున్నావా లెక్చరంటే.

ముందర డబ్బింగు సినిమాల ద్వారా శాంపుల్ చూసి మీకు నచ్చాయని పసిగట్టి కదా ఇపుడు ధారాళంగా ఏర్పాటు చేస్తున్నాం. పై పెచ్చు సినిమా అంతా ఐపోయినా కథలో పాయింటేమిటో పట్టుకోలేని వాళ్లు కొన్ని లక్షల మందుంటారు. లెక్చర్లద్వారా వారికి కథను జ్ఞాపకంచేసి అబ్బీ నువ్వు దీనిద్వారా గ్రహించిన నీతి ఇదిస్మీ అని ఢంకా బజాయించి నట్టు చెప్పిందికి సదుపాయంగా ఉంటుంది.

❀ ❀ ❀ ❀

పొడుగు డైలాగులేనా అంతే, రెడ్డొచ్చెనని మొదలాడడం సినిమాలో సాధ్యపడ్డం లేదు గదా! అంచేత అలా ఆలీసెంగా వచ్చేవాళ్ళు మళ్ళీ జరిగిన కథ చెప్పమని పక్కవాళ్ళ ప్రాణాలు తోడీకుండా మేమే పావుగంటకోసారి జరిగిన కథ టూకీగా డైలాగులో చెప్పిస్తున్నాం. ఇది మీ ప్రజల మేలు కోరే. అంతేకాని మీలో కొందరు గిట్టనివాళ్ళు ఆడిపోసుకుంటున్నట్టు ఇంటర్వెల్దాకా పాత్రలనీ కథనీ ఎస్టాబ్లిష్ చెయ్యడం చేతకాక కాదు. చాతకాకపోయినా మీరు ఇలా మంచి భావంతోనే ఎందుకు అపార్థం చేసుకోరాదూ?

అదిగో ఆ పొడుగోటి, ప్రతి అడ్డమైఁనవాడూ టెలుగు పిక్చర్లు పొడుగోయ్! అని ఆడిపోసుగోడవేఁ. అలా అని అనే చివరికి దిష్టితగిలి ఆ పొడుగూ చిక్కి సగమైపోయింది. పూర్వం పాతిక ముప్పై వేలుండే ఫిలుములన్నీ పదిహేనిరవై వేలకి తగ్గిపోయాయి. అయినా ఆ మురార్జీ దేశాయి వారికింకా ఇందుమీదే దృష్టి. ఫిలిమ్మీద పన్నేస్తే పొడుగు తగ్గుతుందనీ, అది తగ్గితే ఇహ ప్రెసిడెంట్ ఎవార్డు విన్నర్ క్లాసిక్సు కుప్ప తిప్పలుగా వస్తాయనీ ఆయన దురాశ.

ముతక సామెత జెప్పినట్టుంది. ఒక దేవత నెత్తిన కాలెట్టిన నాస్తికుడి నేవనలేక భక్తుడిని భయపెట్టిందట. వాడికి భయం జెప్పి ఆ కాలు తీయించి తగిలేస్తావా లేదా అని. అలా వుంది మురార్జీగారి పథకం.

ఒకటి చెబుతావిను వెంకటేశం. పొడుగు తగ్గిస్తే సినిమాలు బాగుపడతాయనుకోవడం వుట్టి భ్రమ. అయ్యో వున్నదే పదివేల అడుగులని డబ్బు రావడానికి మరి నాలుగు డాన్సులు, రెండర్థాల మాటలు పెట్టేసి జాగర్తపడతారు తెలివైనవాళ్ళంతా. మళ్లీ ఆనక సెన్సారువాళ్ళ మూలంగా కత్తెర్లకి డిమాండు పెరగడం, వాటిమీద ఇంపోర్టు కంట్రోళ్ళూ, రోకళ్ళూ దానికి ఉద్యమాలూ గట్రా వస్తాయి. ఎందుకొచ్చిన రభస....



# ఫర్ హూమ్ ది బెల్ టోల్స్ లేక మహా మంచి పన్జరిగింది లెండి!



అన్నట్టు మీరు విన్నారో లేదోగాని దెబ్బకి డంగై యూరుకున్నాడంత పెద్ద స్టారూను.... నమస్తే సార్ నమస్తే ఏం జేస్తాం నలుగురితో పాటే నారాయణా అన్నారు మరి. నాకు పట్టుబడుతోంది నమస్తే లాంగ్వేజి--ఏమిటి పబ్లికు మీటింగా! లేటెస్టు కళాఖండం తీసినాయనకి సన్మానమ్మాటేనా మీరనేది. ఇక్కడే. ఇదిగాదూ మీటింగూ? అదిగో ఆ పవరు హవుసు దగ్గిర్నించి ఈ చివర్న పార్కు దాకా పాండీబజారు పొడుగునా తురాయి చెట్లకింద జరిగేది బహిరంగసభ గాపోతే మరేవిటనుకున్నారు. అలా నవ్వుతారేం సార్. ఇదంతా ఒహటే సభ. మీకు తెలీందేవుంది, విశ్వగుణాదర్శపువా దన్నట్టు తెలుగువాడు కాస్త సందడయిన మనిషి గదండీ, పెద్దసభ పెడితే ఏ దజనుమందో మాటాడిందికి వసతుంటుంది. మిగతా ఐదొందలమందీ కూడా మాటాడదల్చుకున్నవాళ్ళే గదా, అందుకని లేటెస్ట్ ఫాషనేవిటంటే ఆ యొక్క పెద్దసభకి నూరు బ్రాంచీలు ఏర్పాటు చేసి పదెకరాల బజార్లో నూరు చిన్న మీటింగులు పెట్టుకోడం. ఒహొక్క దాంటో ఐదారుగురుంటారు. చక్కగా అంథా ఒక్కమారే మాటాడుకోవచ్చు. అదే రైటంటాను నేను. ఒహడు చెప్పే దేవిటండీ మనకీ. ఆ మాత్రం మనవూఁ చెప్పగలవుఁ. అంచేత మీదయ, మీ చిత్తం. ఈ రోడ్డు పొడుగునా సాగుతున్న నూటొక్క సభల్లోనూ మీ మాటొక్కటే చెల్లుతుందని గ్యారంటీ కనిపించిన ఎందులోకైనా వెళ్ళవచ్చు. అంతా ఒకటే నన్నాడు కవి. కోటి నదులు--అనిన్నీ అన్నాడు. వినడం మాత్రం పనిపెట్టుకుంటే ఇక్కడే నిలబడొచ్చు. పక్కదాంటో మీ స్పీచికి పాయింట్లు తక్కువైనా మోసిందికేవీఁలేక ఒళ్ళు తేలిపోతున్నా కూడా ఇక్కడే నిలబడొచ్చు. విషయాలు నచ్చకపోతే చేతికొచ్చిన వేషం చెయిజారినవాడిలా మొహం ముడుచుక్కూచోవచ్చు.

ఆహో, కళాఖండం గురించే మాటాడుకుంటున్నాం. ఏదో మీకు తెలుసుగా. మనకి మామూలుగా ఏడాదికి పాతిక పిక్చర్లొస్తే వాటిలో మూడు హిట్టయి, మరో మూడిటికి పెట్టిందబ్బొస్తే మిగతావి వెరసి మొత్తం పర్మొనిమిది కళాఖండాల్తేల్తాయి. అందులో ఏదీ అన్నది తెలుసుకుంటే మంచిది. సంగతులు బాగా బోధపడతాయి.

❀ ❀ ❀ ❀

మొత్తానికి మహామంచి పన్జరిగింది లెండి. లేపోతే ఏవిటిటా కొత్త.... వీడి బోడికొత్తా వీడూను. ఇన్నాళ్ళాయి దీన్ని కనిబెట్టుక్కూచున్న జేజెమ్మల్లాటివాళ్ళ క్కొరుకుడు పళ్ళేదు టెలుగూ ఆడియన్సు క్కావలసిందేవిటో. పెద్దపెద్ద జైంట్లు డీడిక్కులు కొట్టుకుంటున్నారు. ప్రాచీన సంప్రదాయాల్ని బూజు పోకుండా కాపాడు కొస్తున్న వాళ్ళు వాటిని ఎంత జూసినా తరుణోపాయం ఏవిటో పట్టుగోలేక పోతున్నారు. మజ్జిన వీడొచ్చి సావల్టీతో ఫిలింఫీల్డుని చెరిగవతలపారేస్తానంటే యలా, మజాకావా. అన్నీ కొత్తపద్ధతులు పట్టుగొచ్చి రుద్దేస్తానండానికి వీడేం రాజారామ్మోహన్రాయా, వీరేశలింగం పంతులా, మహామహావాళ్ళకే దిక్కులేదు. సత్యజిత్రాయికి దిక్కుందా--సీమదొర్లు విరగబడిచూసి ఊహు ప్రయిజులు గుప్పించేదాకా.

వీడు ముల్లంగిదుంపలా వచ్చేసి, సిసింద్రీలా ఒక్కమారు గోల్చేసి నెగ్గేసి పిక్చర్ని హిట్ చేసుకుంటే ఉన్నవాళ్ళకి ఇన్సల్టు కాదూ. అక్కడికి వీళ్ళంతా వట్టి చెవలాయలూ, వీళ్ళ బుర్రలు చవిటిపర్రలూ అయినట్టు గాదూ. సెల్ఫురెస్పెక్టున్న ఎవడు సహిస్తాడండీ....

ఏవిటో సెలవిస్తున్నారు మీ పక్కాయన చెవిలో. నావి పావుచెవుల్లెండి. ఔను ఒప్పుకుంటాను. మేవంతా ఆ పిక్చర్లో పనిచేసి డబ్బుచ్చుకున్నవాళ్ళవే... లేపోతే పుచ్చుకుందావని ఆశపడ్డవాళ్ళవే గావచ్చు. అయితే మటుకు పుచ్చుకున్న మేరకి మెచ్చుకున్నాంగా పిక్చరు తీస్తున్నపుడు... మరి మా మాటిలా అయితే ఏవ్వీ సంబంధం లేకపోయినా శక్తివంచన లేకుండా షూటింగులు కాన్సిలు చేసుకు మరీ ఊహు ఉప్పొంగిపోతున్న ఇతర మోతుబర్ల మాటేవిటిటా. వాళ్ళంతా పొగరు మోతుబర్లనేనా మీ తాత్పర్యం. వాళ్ళ ఆనందం అంతా అబద్ధవనేనా?

ఏమోలెండి. మీరు బిక్కమొహం పెడితే ఇందాక వొచ్చినాయన పార్టీయేమో అనుకున్నాను. ఆయన ధువధువలాడిపోయాళ్ళెండి. నోమాన్ ఈజె నైలెండన్నాళ్ళెండి. ఈ భూ ప్రపంచంలో ఎక్కడ ఏ జీవి చచ్చినా కాస్త చెక్కులేచినా మిగతా చరాచర జీవకోటి అంతటా ప్రతిప్రాణిలోనూ ఒక జీవకణం చచ్చిపోతుందనిన్నీ, అందువల్ల ఎక్కడో చర్చిలో గంట మోగితే ఎక్కడో హరహరా అంటూ పల్లకీలేస్తే ఎవడో పోయుంటాడనుకో రాదుట.

మనలో ఒక అణువు మరణించిందనటానికి ఖోర్న యాడవాలిట. మనందరిదీ కలిసి ఒక మహాశరీరంట....అయ్యా ఇదీ వరస. ఆయన్చెప్పొంచ్చిందల్లా ఇదే. ఒక పిక్చరు కళాఖండమై పోయిందని మనం ఆనందపడ్డం ఏవీ బాగులేదుట. ఒక ప్రొడ్యూసర్ జై పరమేశ్వరా అంటూ జెండా ఎత్తేసుకున్నందుకు చప్పట్లుకొట్టీ పార్టీలు ఇచ్చుకోకూడదుట. ఇండస్ట్రీలో ఏ ప్రొడ్యూసరు దెబ్బతిన్నా ఆ నష్టం అందరికీ తగుల్తుందిట. ఇండస్ట్రీలో తీస్తున్న పిక్చర్లన్నీ ఒక్కటే మహాపిక్చరుట. (కథా కమామీషుల విషయంలో ఈ ముక్క రైట్ అనుకోండి) అంచేత ఒక పిక్చరు దెబ్బతింటే అది మిగతా పిక్చర్లన్నిటికీనుట. ఒక ప్రొడ్యూసర్కి చిరాకేసి వెళ్ళిపోతే

పరిశ్రమకి లోటుట. ఇంక కొత్తవాళ్ళు రారని భయపడాలి. అంచేత మనం అలా క్రూరంగా మనిషి పేర్లమీద, పిక్చరు పేర్లమీద చవట జోకులు వేస్తూ నిద్రాహారాలు మానేసి హేళన సప్తాహోరాత్రులు చేస్తూ కూచోడం సిగ్గుచేటుట. మనం బాధపడాల్ట.

బాధెందుకంటే, నాకు తెలీకడుగుతాగాని, మంచిదేగా ఈ వెర్రి మొర్రి మనుషులొచ్చి పిచ్చి పిచ్చి పోకిళ్లుపోతే--అవి హిట్లయి వాటికి పతకాలూ గట్రా వచ్చి పేట్రేగిపోతే కొంపలు మునిగిపోవుటండీ. సనాతన భారతీయ చిత్రసంప్రదాయం సంక్షుభితం అయిపోదుటండీ. ఏవిటంటా వీళ్ళూ వీళ్ళ కొత్తానూ. సృష్టిలో ఏది కొత్తగా వుంటుంది. సూర్యోదయం తీసుకోండి. నే జూసినంతలో నా చిన్నప్పట్నించి ఒక్కడే సూర్యుడు మొహం చూపిస్తున్నాడు. అదే మొహం ఎన్నాళ్నుంచి చూసినా. ఎపుడేనా మొహానికింత కొత్తరకం మబ్బు పూసుకుంటాడు తప్ప. ఇహపోతే వాడు చేసే పని ఉదయించడం, అస్తమించడం. అంతేగదా? ఎన్నాళ్ళయినా తూర్పునే ఉదయిస్తాడు గదా! పువ్వులు పరిమళమే గుబాళిస్తాయి తప్ప గ్రాంఫోను పాటలు పాడవు కదా. రామాయణం ఎన్ని సార్లు ఎందరు వ్రాసినా రావణుడు సీతను ఎత్తుకుపోతాడు తప్ప కైకనో కౌసల్యనో మందరనో వెరైటీకైనా ఎత్తుకుపోడు గదా. రాముడు రావణాసురుణ్ణి చంపుతాడు తప్ప విభీషణుడిని ఖూనీ చేయడు గదా! అప్పారావు అప్పు చేస్తాడే తప్ప ఇవ్వడు కదా. మీరు బలవంతాన కాఫీ ఇస్తారేతప్ప నా చేత పుచ్చుకోరు గదా. బలవంతాన మనమంతా క్రొత్త ప్రొద్యూసర్లని, పిక్చర్లని ఎత్తిపొడుస్తావే తప్ప పైకెత్తి ఓహో అనిగాని అయ్యోఅనిగాని అనం గదా. అలాటపుడు టెలుగుసినిమా కాంపోజిషన్ మటుకు ఎందుకు మారాలీ అంట. చెప్పండీ, మాటాడ్రేం. డైలాగు మర్చిపోయిన డైరెక్టర్లా, పోర్షనయిపోయిన పరంధామయ్యలా మాటాడ్రేం?





## అథాతో చల్ల జిజ్ఞాసా, అథాతో చల్ల జిజ్ఞాసా
## తేక గొప్పగొప్ప పైలాగులు, గొప్పగొప్ప పైలాగులు!

అయ్యా వేయ్యేల, మొన్నీ మధ్య నా బైస్కోపదేవిఁటి చెప్మా--అందులో ఆ యొక్క నారదులవారూ ముక్కోటి దేవతలూ విష్ణుమూర్తితో అన్నట్లుగా చల్లకొచ్చి ముంతదాచనేల? వచ్చినపని చెబుతా.... చెబుతా చెబుతా యావన్నారూ నారదుల వారికి విష్ణుమూర్తి ఇంటికి చల్లకెళ్ళడం రివాజా? అంటారా. చెబుతా, చెబుతా. ఇది చాలా లోతైన విషయం లేదా పై వాడి గొడవ కాబట్టి ఎత్తయిన విషయం అనుకుందాం. తొందరపడకండి. ఇందులో ఓ పెద్ద ప్రశ్నోపనిషత్తు ఉంది. విష్ణుమూర్తికి చల్ల పొయ్యడం రివాజా, విష్ణువు దగ్గరే కొనడం రివాజా? ఇలా ఎన్నో ముందు మనం తేల్చుకొనవలసింది. నారదుల వారికి చల్లకోసం విష్ణుమూర్తి ఇంటికి వెళ్ళడం రివాజా? మరొహరింటి కెళ్ళడం రివాజా అనేదికాదు. దానికేముంది, రోజూ రివాజుగా ఆయన చిక్కటి మజ్జిగ పోస్తానంటే ఈయన రివాజుగానే వెళ్ళి తెచ్చుకోవచ్చు. బ్రాహ్మడా ఈపూట చల్లకుండ పిల్లి పడదోసినట్టుందయ్యా అనో, తోడుకోలేదనో, లేదా యాదమరచి పొరుగింటి చల్ల అనుకుని నేనే దాహం పుచ్చేసుకున్నానయ్యా అనో ఆయన చెబితే అప్పుడు మరో ఇంటికి పోతాడు. లేదా రోజు విడిచి రోజు ఒక్కొక్క ఇంటికో, రోజూ ఓ కొంపకో పోతాడు. దాని దేముంది.

ఆయన బ్రహ్మచారి గదా? కొంపలో తేడా? పాడా? అంచేత ఎక్కడో అక్కడ ముంతెడు చల్ల తెచ్చుకోక తప్పదు. ఇహపోతే అసలు నారదులవారు ఆయొక్క దేవతలూ మరి దేవతలు గదా--అనగా మానవులు కారు గదా. మరి అట్టివారు వణ్ణంలో చల్లపోసుకుంటారా? దానికోసం ఒహరింటికి ముంతపట్టుకు వెళ్తారా అనేది వేరే విషయం అది అలా వుంచండి, అలా అంటే అక్కడ కాదు. ఇంకొంచెం అసుంతా వుంచండి. అసలు నిజానికి ముంతపట్టుకు ఒహరింటి కెళ్ళక్కరలేదు నన్నడిగితే. అందరికీ కలిపి కామన్‌ధేను వుండనే ఉంది గదా! కావలసినంత పాడి.

మనక్కావలసింది నారదుడూ వాళ్ళూ చల్లపోసుకుంటారా అనేదే. అంచేత అథాతో చల్ల జిజ్ఞాసా....ఏం ఎందుకు పోసుకోరు? పోసుకోకపోతే వేడిచెయ్యదూ?

అదిన్నీగాక చల్ల 'దివ్య--పానీయానికి' విరుగుడు అని మన క్కూడా అనుభవం మీద తెలిసిందే. వాళ్ళు పుచ్చుకునేది 'అదే' గదండి. నా మొహం గాకపోతే దీనికి పెద్ద లాజిక్కేమిటి? ఎంత దేవతలయినా చారో పులుసో అఘోరించాక, చివర్ని మజ్జిగోసుకోకుండా యలా లేచిపోతారు బంతిలోంచి? అసలు వారంతా వణ్ణం తింఛారంఛారా? అని గదూ మీ సందేహం? ఎందుకు తిన్రు? తింఛారు. కంచాలక్కంచాలు లాగేస్తారుట. ఒహ పట్టుబడితే. దీనికి దాఖలాలు ఎక్కడో ఎందుకు? ఇందాక చెప్పిన బైస్కోపులోనే ఇమిడ్చి పారేశారు. మళ్ళీ మన్లాంటివాళ్లు ఎన్నడూ చావకుండా దేవత లందరినీ అన్నపానాలు లేకుండా మాడ్చిపారెయ్యవలసిందని ఒహ విలువైన ముక్కవుంది. ఇంతకన్నింకేం దాఖలాకావాలి దేవతలకీ తిండీ తిప్పలూ వుండేవనటానికంట. అసలు మనవూఁ లేదా--మేఁవూఁ వాళ్ళూ ఒకళ్ళవేఁ గద. వారు వేలుపులైన వీరు తెర వేలుపులు. అలాక్కాదు, వారు యన్నటికిన్ని మానవులు కారు. మనలా తిండీతిప్పలూ ఉండవు అంటారా? అనండి. వాళ్ళు మానవులు కాకపోయినా--మనం దేవతలం గదా "దిగిరాను దిగిరాను దివినుండి భువికి" ఆవటాంటే అయితే పట్టు నేనే పైకి వస్తా అన్నాం. "ఖగపతి యమృతము తేగా భుగభుగమని పొంగి చుక్క భూమిని రాలగా అది పొగచుట్టయ్ జన్మించగ....". అన్నాడు కవి. మనం అవి కాల్చి వారి ఛాయాలోకి వెళ్ళినందువల్ల అంతా యాకమై వూరుకున్నాం. అందువల్ల మన అలవాట్లూ, చుట్టలూ వారికీ వుండి తీరాలి. లేకపోతే అబ్బి తీరాలి. పాటలు డైలాగుస్థాయికి దిగొచ్చినట్టు.

ఇహనివన్నీ కాదు కూడదని కొట్టి పారేసినప్పటికిన్నీ, నారదుల వారికి చల్ల--ముంతల సామెతలు తెలీవని నిర్ధారణగా చెప్పిందికి వీల్లేదు. యావంటారా-- ఆయన త్రికాలజ్ఞుడు. ఆ యొక్క విష్ణుమూర్తివారు రేపు గాకపోతే "మాపైనా' కృష్ణావతారం ఎత్తి గొల్లవారింట నల్లపిల్లవాడై 'చల్లటి' నవ్వులు నవ్వుతూ తిరుగుతాడని ఆయనకి ముందే తెలుసు. ఉండబట్టలేక, అందులో గుట్టు సూచనగా రామావతారం ముందరే చెప్పాలన్న ఉబలాటంకొద్దీ, నువ్వు చేయదలచుకున్న పన్లన్నీ నాకు తెలుసు లేవాయ్ అని గడుసుగా తెలియజెప్పాలన్న ఆశకొద్దీ నారదులవారు ఆ సామెత వేసుంటారు. కృష్ణావతారంలో మరి గొల్లభావలంతా యశోదమ్మ ఇంటికి చల్లకొచ్చి అక్కడ నల్లటి అల్లరి పిల్లడిని చూసి, తల్లి చల్ల తెచ్చి పోసేలోగా ఈ పిల్లాడు ఈ ముంత బద్దలుకొడితే ఏమి జేతుము దైవమా అని అది దాస్తారు గదా. ఇదీ తాత్పర్యం.

అయ్యా! చూశారా తీగ లాగితే డొంకంతా కదుల్తుంది. మీరు ఒక్కడైలాగు ముక్క అడిగితే ఇంత భాగవతం బయటపడింది. మరి ముక్కలనుకున్నారా? మజాకా అనుకున్నారా? తెలుగు సినిమాలు--ముఖ్యంగా డైలాగులు థాట్ ప్రవోకింగ్ కావన్న చెవలాయ ఎవడయ్యా అంట. ఇంత విద్వద్గోష్ఠిని అది రెచ్చగొట్టిందే! ఇంత ఎద్యుకేషను ఇచ్చిందే-అసలు మాట్లాడ్డవేఁ ఎద్యుకేషననుకోండి. నాతో యవడు

మాటాడినా, నేనెవడితో మాటాడినా. ఏవిటో డిష్కషనంతా హైక్లాసు విషయాలమీదనే నడుస్తుంది. ఎప్పుడూ తారాపథంలోనే వుంటుంది. ఏం చేస్తాం అదలా ఉంచండి. నేనిక్కడ లేకపోయినా ఈ యొక్క విలువైన ముక్క పట్టుకు వేళ్ళాడితే పామరుల క్కూడా ఇంత పాండిచ్చేవూఁ రంగున అబ్బి వూరుకునేదే.

ఇది కానుకోక డైలాగుల్ని డైలాగులాడిపోసుకుంటున్నారు పండితజనం. ఒక్కొక్క డైలాగుని ఎంతెంతమంది ఎన్నెన్ని విధాల తెగలాగి చూస్తున్నారో వీళ్ళకసలేవేనా తెలుసా అంట. ఇలా పదిమంది పరిపరివిధాల కాచి వడబోసి వస్త్రకాళితం చేసిన ముక్కలు కాబట్టే--సినిమాలు కొత్తవేనా, కథలు మారినా డైలాగుముక్కలు యవళ్ళూ మార్చ సాహసించరు. ఏదో కాస్త వ్యాఖ్యానించి చకచక పది పుస్తకాలు రాసి అమ్ముకొని పేరూ డబ్బూ బావుకుందామని కూచుని అఘమేఘంతోనే లైఫంతా అయిపోయేట్టుందని వాపోయిన పెద్దమనిషిని ఇటుకేసొదిల్తే ఒక్క బుక్కు కూడా పూర్తిచెయ్యలేడు. నిజానికి లావుపాటి బుక్కుపాటి వ్యాఖ్యానాలు ఒరిజినల్ రైటరే రాసి పేర్చేస్తాడు డైలాగు కెడాపెడ. అయినప్పటికిన్నీ ఇంకా ఎంతో ఉంటుందది రాసి రాశిపోసుకుందికి.

అబ్బెబ్బె. అన్నీ అలా టీకాతాత్పర్యాలతో బట్టీపట్టి చెప్పినట్టు రాసుకుంటా రేవనుకుంటున్నారా? యంతమాట. అసలామాటకొస్తే టీకాతాత్పర్యాలు రాస్తామని ప్రకటించుక్కూచున్న వాళ్ళే కొన్ని పెద్దమాటల గుట్టు మాటుపెట్టి దాచెయ్యడం లేదూ? అలాగే మేవుఁన్నూ, అవసరమైన విషయాలు ఛస్తే బయటపెట్టం. అలాచేస్తే కథాగిపోదూ. ఒక్కటిక్కెట్టు శాల్తీ కిందపడిపోతే రైలాగాలని గొలుసు లాగినట్టు. వెధవది ఒక్క డైలాగు ముక్కకోసం అని కథని ఆపి పారేస్తాఁవుటండీ--ఏవో పాటలూ, కామిడీ డాన్సులూ పెట్టదలచుకున్నప్పుడు తప్పా? మచ్చుక్కావాలంటే మన పిక్చరులో ఓ సీను చూడండి. హీరోయిను హాల్లో కూచుని పేపరు చదువుతోంది. కారు డ్రైవరొచ్చి అటూ ఇటూ తిరిగి (ఈవిణ్ణి బలాత్కరిస్తాడా? రించకపోయినా ముగుడు కిటికీ చిల్లుల్లోంచి చూసి ఆశ్చర్యపడి లేచి చట్ట విరిగేలా అపోహపడతాడా? 20వ రీలుదాకా సస్పెన్సు)--ఏవన్నానూ--అదే అటూ ఇటూ తిరిగి బీరువామీద అగ్గిపెట్టె తీసుకు చక్కాపోతాడు బీడీ కాల్చుకుందామని. హీరోయిను చూస్తుంది. నవ్వుకుంటుంది క్లోజప్పులో--ఆ నవ్వుమీంచి కార్మికులు--శ్రమపడి పని చేసి అలసి బీడి కాల్చుకోవడం కమామీషు--ఒక -డాన్సు--అంతా ఇమాజినేషనన్నమాట-- లాగెయ్యొచ్చు మనకి డబ్బు సందర్భపడితే: ప్రోగ్రెసివుగా ఉంటుంది కూడా--ఏం? ఆ డ్రైవరు అలా అగ్గిపెట్టె పట్టుకుపోతాడా? తరువాత షాటులో మదరిల్లా వస్తుంది- హాల్లో అగ్గిపెట్టె వెతుకుతుంది. కనపడదు....ఆవిడ కెందుకంటారా....మీది బలే చురుకైన బుద్ధిస్మండీ. ఇట్టే పట్టుగున్నారు లొసుగు....దాన్ని కమ్ముకుందికి ఓ డైలాగు పెడదాంలెండి వంటింటిలో అగ్గిపెట్టె పోయిందీ అని. ఇలాటి వెన్ని పెడితే అన్ని మంచిది. ఎందుకంటే మనం పెట్టుకున్న కవిగారు బిజీ రైటరు. చూడండి. ధర్మరాజు లాటివాడు. అందరికీ ఒకే డైలాగులు రాసిస్తాడు. అందికే అఁ

చేస్తాడనుకోండి.... ఆయనకి తీరిక లేనందువల్లా, దొరక్కా, చాలామంది ప్రొడ్యూసర్ డైరెక్టర్లం మేమే రాసేసుకుంటున్నాం ఆపద్ధర్మపు డైలాగులన్నీ-- ఈ మధ్య ఒక ఎగ్రిమెంటు కూడా అయింది. పిక్చరులో మొత్తం డైలాగుల్లో కవిగారు స్వహస్తంతో గాని, శిష్యహస్తంతోగాని వ్రాయించి ఇచ్చినవి తీసేసి మిగతావి--అనగా మేము రాసుకున్నవాటికి మాట కణా చొప్పున లెక్కకట్టి వారి ఫీజులో మినహాయిస్తున్నాం. ఇప్పుడు మన పిక్చరుకి ఎగ్రిమెంటులో ఇంకో క్లాజుకూడా ఉంది డిటో డైలాగుల గురించి. అబ్బెబ్బే డిటో డైలాగులంటే క్రితం పిక్చరులో రాసినవాటికి డిటో అని కాదు. అవి ఎలాగా ఉండేవే. ఈ పిక్చర్లోనే రెండేసి మార్లొచ్చేవి అంటే - "అమ్మమ్మా నాక్కొంచెం చింతకాయ పచ్చడి వెయ్యి - క్కొంచెం చింతకాయ పచ్చడి వెయ్యి" అనీ. "నే నింతావకాయ వేసుకోను సుశీ, నే నింతావకాయ వేసుకోను" అనీ ఉంటాయే అవన్నమాట. ఇపుడవి ఫాషను లెండి. మందాంటో మూడేసి సార్లొస్తాయి." నీ రాక కోసం నే నెదురుచూస్తున్నాను. చూస్తున్నాను" ఇలా వుంటాయన్నమాట. ఈ రకం వాటన్నిటికీ ఒకటే డైలాగు చొప్పున లెక్కకడతామనీ, ఇవీ కవిగారికి టైములేక షాటువేళకి డైలాగు రాక (బట్వాడా కాక లెండి) మనవేఁ రాసుకునే లేదా ఆర్టిస్టులు సప్లయిచేసే డైలాగులకి రేటు కట్టి ఫీజులు మినహాయిస్తాం. తరవాత్తరువాత వారు, ఫలానా గిరీశంగారు నా డైలాగులకి ఇవ్వవలసిన నాలుగువేలు ఇంతవరకూ ఇవ్వలేదు అని చెప్పుకున్నప్పుడు-అందులో ఇవి మినహాయించి మరీ మాటాడుకోవాలన్నమాట.

ఇంతకీ చెప్పొచ్చిం దేవిటి చెప్మా? అగ్గిపెట్టె సీను గదూ! అదే హీరోయిను హాల్లో కూచుంటుంది. డ్రైవరు బీరువామీద అగ్గిపెట్టె పట్టుకుపోయి బీడీకాల్చి తెచ్చి బల్లమీద పడేసిపోతాడు. హాల్లోకి మదరిల్లా--అనగా అత్తగారు--అదే సూర్యకాంతంలెండి వస్తుంది. ఇందాక ఇక్కడ అగ్గిపెట్టె పెట్టాను ఏదీ అంటూ-- ఏవంటారు? సహజత్వం లేదంటారా? దానికేముంది ఆవిడకి చిన్నప్పటినుంచీ అగ్గిపెట్టెలు హాల్లో బీరువాలమీద దాచడం అలవాటని ముందురీళ్ళలో ఎస్టాబ్లిష్ చేస్తాం. కాపోతే ఫ్లాష్‌బాక్ పెడతాం--గ్లేమరు కూడాను. కాదంటారా. చుట్టకాల్చుకుంది కొచ్చినట్టు--అయి మీన్ మదరిల్లా కదూ. పోని ఫాదరిల్లా చేసేదాం లెండి--మీ ఇష్టం. మీ లాజిక్కు మీద నాకెంచేతో ఒక గురి పడిపోయింది. ఏం, సరే ఫాదరిల్లా, మామగారు, మీసాలూ కళ్ళజోడు కేసు. వోవరుకోటు, ఆయన వస్తాడు చుట్టపట్టుకుని. వేరీజ్ ద మాచ్ బాక్స్? అగ్గిపెట్టేది? ఇంగ్లీషు డైలాగులు పడాల్లెండి... పక్కనే తెలుగు పడేస్తే సరి. ఏది? అగ్గిపెట్టె వెతుకుతాడు బీరువామీద. క్లోజ్ షాట్ - అగ్గిపెట్టె లేదు, ఆయన వేలు పక్క తేలు.... కుడుతుందా.... సస్పెన్స్.... కోడలు మిడ్‌షాట్. కట్. మావగారి క్లోజప్. గిర్రున తిరుగుతాడు ఏది అగ్గిపెట్టె అని గర్జించి- ఆడియన్స్ హడిలిపోతార్లెండి. ఐ కెన్ సీ యిట్. జవాబుగా అగ్గిపెట్టె బల్లమీద ఉంటుంది. క్లోజ్ షాట్. మావగారు కోడల్ని చూస్తాడు. ఫుల్ షాట్ ట్రాలీ బాక్ వర్డ్.... ఏదమ్మా అగ్గిపెట్టె అంటాడు విద్వేషపూరిత నయనాలతో, ఆర్ వాటెవరిటీజ్.

కోడలు లేస్తుంది, జారిన పైట సవరించుకుంటుంది.

"మాటాడవేం?" అని మావగారి కంఠం. ఫ్రేములో ఆయనుండడు లెండి. షాట్‌లు ఈవిడ మీద తీస్తాం. ఆవిడ ముందరే చెప్పింది నన్ను బుక్ చేసుకుంటే, కాంట్రాక్టు కోసం తప్ప తన ఫ్రేములో ఇంకో ఆర్టిస్టు ఉండకూడదని. మిగతా వాళ్ళ డైలాగులు అవీ అవుట్ ఫీల్డులోంచి రావాలి. ఈవిడ రియాక్షను ఇస్తుందన్నమాట.

"మాటాడవేం?" మావగారి కంఠం.

"అదికాదు మావగారు?" అంటుంది కోడలు.

"ఇంత నీచానికొడిగడతావనుకోలేదు."

"మావగారూ! తొందరపడుతున్నారు." అంటుంది కోడలు దీనంగా.

"తొందర ఇప్పుడేం. ఎప్పుడో పడ్డాను. నిన్నీ యింటి కోడల్ని చేసుకోడమే తొందరపని."

"మావగారు! ఇది న్యాయం కాదు... కాదు."

"ఏది న్యాయమో నువ్వు నాకు చెప్పనక్కరలేదు. నీకీ యింట్లో ఏం తక్కువైందని ఇలాటి దొంగబుద్ధులు?"

"మావగారూ!"

"అవును. ఇందాక బీరువామీద అగ్గిపెట్టె ఇంతలో ఎక్కడికి పోయింది... ఛీ?"

"మావగారూ నామాట వినండి....వినండి" బల్లమీద అగ్గిపెట్టె క్లోజప్, సస్పెన్స్.

"పో ఈ యింట్లోంచి. అగ్గిపెట్టె దొంగతనంచేసి పైగా...నీ మాట వినాలేం--"

"అదిగాదు మావగారూ.... మావగారూ"

"ఏదికాదు. అసలు నువ్వీ యింట్లోంచి పో. ఈ గుమ్మం తొక్కకు"

"మావగారూ!" క్లోజప్.

"మావాడికి మరో పెళ్ళి చేస్తాను. మరో మరో పెళ్ళి పెళ్ళి చేస్తా చేస్తా."

కట్. ఆ హాలు తాలూకు మొగలీ అజాం మార్కు కిటికీ చిల్లుల్లోంచి రఘు చూస్తాడు ఈ దృశ్యాన్ని. అతని హృదయం దహించుకుపోతుంది...హెవీ డైలాగులు వస్తాయిలెండి....ఛీ.... బాబాయి ఎంత అఘాయిత్యానికి వడిగట్టాడు? తనకి మరో మనువు చేస్తాడట. తన భార్యను...అబ్బ...ఛీఛీ తాను యింటలేనివేళ ఇద్దరూ ఇలా కులుకుతున్నారన్నమాట. అతను మెలితిరిగిపోతాడు. సేపర్షుప్పాట...కట్. ఇంట్లో--

"మామగారూ" అంటూ కోడలు ఆయనకాళ్ళమీద పడుతుంది. లేచి మళ్ళీ కాళ్ళమీద పడుతుంది.

"ఛీ పో. నేను నిన్ను క్షమించలేను. నేను నిన్ను క్షమించలేను" అంటుంది మావగారి కంఠం. పాదంపైన--

"మామగారూ నే చెప్పేది వినండి. నా భర్తకు నన్ను దూరం చెయ్యకండి, చెయ్యకండి"

మావగారు ఆమెను ఒక్క తాపు తన్ని తోసి తలుపేసి వంటింట్లోకి పోతాడు "జానే అగ్గిపెట్టెక్కడే" అంటూ, లోపలెవరూ? సూర్యకాంతం. "దాన్ని తన్ని తగిలేశారు. ఇప్పుడు వంటెవర్తి చేస్తుంది. అంట్లెవరు తోముతారు" అంటుంది. ఫాదరిల్లా నవ్వుతాడు. "నోనో మైడియర్.... డోం టెటాల్ ఫియర్...." అంటూ డూయెట్ తొలి చరణం ఆరంభించి డాన్స్ చేస్తాడు. కామెడీ డ్యూయెట్ అన్నమాట. చూస్కోండి. రంగారావు సూర్యకాంతం గుమ్మడి సూర్యకాంతం న్యూయష్టు కాంబినేషన్ డ్యూయట్. దీనిమీద యింటర్‌కట్ చేస్తూ--అనగా ఇదో చరణం--అదోచరణంగా అటు హీరోహీరోయిన్‌లకి సేపరుప్పాట....ఎపిడీసార్. ఎలా వుంది?

ఇంతకీ చెప్పొచ్చింది అగ్గిపెట్టె సీను కదూ? అక్కడ డైలాగులు చూశారా? ఎంత గంభీరంగా ఆలోచనలు రెచ్చగొట్టేవిగా ఉన్నాయో! "అదిగోనయ్యా నీ అగ్గిపెట్టె బల్లమీద. అదేం...కనబట్టంలా?" అనేసిందనుకోండి కోడలు. గుట్టు బయటపడిపోలా? కొంప మునిగిపోలా? ఎంతడ్రామా మిస్సయిపోతాం. దానిమీద కథంతా ఆధారపడి వుంది. హీరో తూర్పుకీ, హీరోయిన్ పడమటికీ పోతారు. పోయి పోయి మళ్ళీ 260వ అక్షాంశం దగ్గిరే కలుసుకుంటారు....

ఎలా వున్నాయి డైలాగులు? నేనే టెంపరరీగా కంపోజు చేశాలెండి. ఇదే పైనలు కూడాను. కావాలంటే నేనే మొత్తం రాస్తాలెండి. దానికేం ఆల్వేజ్ ఎట్ యువర్ సర్వీస్....

హలో! హలో హల్లో....వింటున్నారా!...డామిట్ ఫోను పడేసి పోయాడే. వీడి తస్సాదియ్యా! వీడి తస్సాదియ్యా! డామిట్....డామిట్....మిట్....ట్....





# సెన్సారింగు సర్కస్

కట్ కట్ కట్ ఠట్...ఠ్ఠట్ ఠ్ఠ. ఠ్ఠ్ఠఠట్! నోనో సార్ ఇజ్జూస్తే-- ఐమీన్. సెన్సారు వాళ్ళిజ్జూస్తే ఇంకేమన్నా ఉందా సార్! కొంపలు మునిగిపోవూ? మళ్ళీ ఇంకో టేక్ తీద్దాం. ఆ కాఫీ కప్పు అందించినపుడలా వేళ్ళు తగల్నీకండి. జాగర్త. మీదెంత మేనరికమైనా ఇంకో రెండురీళ్ళతో మీరెంత దీనిగా ఎంత ఫెళ్ళుమనేలా పెళ్ళాడబోతున్నా ఈ రీల్లో అలా ఒకళ్ళనొకళ్ళు తాక్కోకూడదు. కాఫీ ఇస్తున్నపుడేనాసరే. వళ్ళు తగిలితే వెంటనే ఛీ ధూర్తుడా! అవివాహిత భారతబాలికను తాకుతావా అని మేనకోడలు అనాల్సి వస్తుంది. లేకపోతే ఇద్దరూ అగ్నిప్రవేశం చేసి చేసుకోవాలి. లేకపోతే సెన్సారువారు ఒప్పుకోరు. రీలు తగలేయించేస్తారు దగ్గిరుండి.

నో సార్ నో.... యస్సర్ యస్ మీరు చూళ్ళేదా? కొత్త సెన్సారింగు సర్కసూ? కొత్త రూళ్ళకర్ర లొచ్చాయి. పెళ్ళికాని వారిద్దరు ఒకళ్ళనొకళ్ళు ముట్టేసుకో కూడదు. యస్..... నో డూయట్ డాన్సెస్ నో లవ్ సీన్స్. ప్రేమపాటలు తీసినా మన సినిమాలను పురాతన పద్ధతుల్లోనే తీయాలన్నమాట. అనగా ఆవిడ సాంగు మొదలెట్టి పరుగెడుతుంది పొదలచుట్టూ, దుబ్బులచుట్టూ, కుర్చీలచుట్టూ, స్తంభాలచుట్టూ-- హీరోగారు కూతవేటు దూరంలోనే ఉంటూ పాడుతూ అభినయం పట్టాలి. అంతే, ఆర్టూ గీర్టూ అని కొత్తపద్ధతులు తెచ్చిందికి వీల్లేదు. యస్సార్. యస్. పెళ్ళిచేసుకునేవరకూ, అంతే. అంతెందుకు, పెళ్ళి జరుగుతున్నప్పుడు కూడా పుస్తెల తాడుకి మూడోముడి పడేవరకు పెళ్ళికొడుకు వేళ్ళు పిల్లకూ పిల్లదాని జడగ్గాని తగల్రాదని సెన్సార్ శాసనం. తగిలిందే, సెన్సార్రూళ్ళకర్ర ప్రొడ్యూసరు నెత్తిన ఠంగున పడిందే. అది రేప్ అనగా బలాత్కారం క్రిందకు వస్తుంది. అంతేమరి, మూడో ముడి పడేదాక టెక్నికల్‌గా పెళ్ళయినట్టు కాదు కదా? వ్వాట్?

హార్గ్యూ చేస్తారా? మైగాడ్. ఆర్గ్యుమెంట్లూ, లాజిక్కులూ పనికిరావు సార్. రూలంటే రూలే. సెన్సార్రూలంటే మరీను....అంతెందుకూ, ఎక్స్ ప్రొడక్షన్స్ వాళ్ళ పిక్చరులో మొన్ననేం చేశాం? హీరోయిను నూతిలో పడింది. హీరో ఆవిడను సేవ్ చెయ్యాలి. పెళ్ళికాలేదు. హౌ! దట్ వాజ్ ది ప్రాబ్లెం. వెంటనే పురోహితుణ్ణీ, హీరోయిను ఫాదర్ని కేకేయించుకొచ్చి నూతిలోదించి "ఇయంసీతా మమసుతా..." ముక్కలు మూడూ అనిపించి, అప్పుడు హీరోచేత మూడు ముళ్ళూ వేయించాం--

ఆవిడ మూడో గుటక వేసేలోగా. మళ్ళీ టైముండదని పుస్తైలతాడు ఐదారు పెద్ద పలుపుతాడుతోనే ముళ్ళువేయించి ఆ తాడుతో హీరోగారిచేత ఆవిదని పైకి లాగించాం.

అఫ్‌కోర్సు మనకి నావెల్టీ కూడా కలిసొచ్చింది నూతిలో పెళ్ళి... కొత్తగా లేదూ, అయిడియా మరి? సెక్సు. రెలిజను, ఎడ్వెంచరు, సస్పెన్సు, రొమాన్సు ఇన్ని కలిసొచ్చాయి. సెన్సారు రూళ్ళు కూడా కొరమాలిన వనిందికి వీల్లేదు.... మళ్ళీ ఎక్కడా అనకండి మన్లో మనమాట. బుచ్చమ్మ అని ఒక బ్యూటిఫుల్ యంగ్ విడో ఉండేది. ఆవిడ నన్ను వివాహమాడటానికీ నాతో లేచి వెళ్ళిపోయి రావడానికీ ఆరంభంలో ఒప్పుకుంది గాదు. చివరి కామెను దాదాపు ఒప్పించడానికి నేను వేసిన తస్సా ఎలాంటిదనుకున్నారు? అక్షరాలా ఇలాంటిదే.

"వదినా! మొన్న మీ అమ్మగారు నూతిలో దూకారు. ఆవిడకీ మారేజయింది. నాకూ నేదుగాకపోతే పూర్వం ఒకప్పుడైనా మారేజయింది. గాబట్టి నేన్నూతిలో దూకి ఆవిణ్ణి పైకిలాగి సేవ్ చేసినా సరిపోయింది. ఢిల్లీలోని 13వేల తల్లులుగాని, సర్వోదయవాళ్ళుగాని, మున్షీ మొరార్జీ, రాజాజీ గాని, ఆఖరికి సెన్సారువాళ్లు గాని తప్పట్టలేకపోయారు.... మరదే రేప్పొద్దున్న మీరు కాల్జారి ఆ నూతిలోనే పడతారను కోండి. పడ్డాక, అన్నా ఎంత పనయిపోయింది, హాయిగా ఆ గిరీశంగార్ని చేసుకొని మహారాణిలా ఉండాల్సిందని నాలిక్కరుచుకొంటారు. నేను మిమ్మల్ని చూసినా దూకి రక్షించడానికి వీల్లేదు గదా? మనకి పెళ్ళికాలేదు మరి? ఒకవేళ ప్రాణరక్షణ అని వంకపెట్టినా--వెధవది మానవదేహంలో ఉండి--లో లోపల నేనుగాని, మీరుగాని ఆ యొక్క మధుర స్పర్శవల్ల ఆ అవాంతర స్థితిలోనే ఏ కాస్తయినా ఆనందం పొందినట్టాయెనా--కొంప మునిగిపోతుంది. సెన్సారదకత్తెర మన పీకెలు కత్తిరిస్తుంది. గాన ముందే మారేజి చేసుకుని రడీగా వుండడం మంచిది" అవటాని ఒక గంభీరమైన లెక్చరిచ్చేశాను. "అంతేనంటారా? గిరీశంగారూ!" ఆవటాని ఆ యంగ్‌విడో ముక్కున వేలేసుకుని సాలోచనగా చూస్తూ నిలబడిపోయింది.

యావంటారు--ఈ రూళ్ళను వంచలేమా అంటారా? చిత్తం. దొంకతిరుగుళ్ళుంటూనే ఉంటాయి. పెళ్ళి జరగడానికి ముందు రొమాన్సు ఉండరాదని ప్రేమికులు ఒకళ్ళ నొకళ్ళు తాకరాదని రూలు కదా. మొన్న అల్లా పిక్చరదేవిటి.... అందులో పెళ్ళిసీనులు ముందర షూట్ చేశారు. ప్రేమ సీనులు తరవాత తీశారు. కథలో ప్రేమ ముందు, పెళ్ళి వెనకా వస్తాయనుకోండి. అయినా రూలు ప్రకారం పెళ్ళే ముందుగా తీశామని సెన్సారు వాళ్ళకి చెప్పబోతున్నారు. ఒప్పుకుంటార్లెండి.

అయినా కాకపోయినా అన్నిటికీ ఊరికే వాళ్ళనలా ఆడిపోసుకోడం సబబు కాదు. వాళ్ళ రూళ్ళు దయాదాక్షిణ్యాలు చూపించిన సందర్భాలెన్ని లేవు.

ఓ పిక్చర్లో విలను నానా ఘోరాలు చేస్తాడు. దొంగతనం, దౌర్జన్యం, ఒక చిన్న ఖూనీ, ఒక బలాత్కారం, రెండు ఫోర్జరీలు--ఇన్ని చేస్తాడు. తీరా కథ

అయిపోయి జనాభా అంతా గ్రూపు ఫోటో దిగేవేళకు పోలీసు లొచ్చేస్తారు విలన్ని తీసుకుపోవడానికి. అప్పుడు విలన్ భార్య ఏమంటుంది? "ఆయన నా భర్త. నా పసుపుకుంకాలు బాగుపడనీయండి. నన్ను చంపిగాని ఆయన్నరెస్టు చెయ్యడానికి వీల్లేదు. భారతనారి తన భర్తనలా పోలీసుల పాలుచేయదు" అంటుంది పెద్ద కుంకుంబొట్టు పెట్టుకుని, పుస్తెలు (మాత్రమే) పైట ఇవతలికి కనబడేలా ఏర్పాటు చేసుకుని.

అప్పుడు హీరో ఔదార్యం చూపిస్తాడు. "ఓ విలనూ, నీ వల్లగదా నా ధైర్యసాహసాలూ, మా ఆవిడ పాతివ్రత్యం ఋజువయ్యాయి. కాన నీకు మేము ఋణపడున్నాం, భయపడకు. ఓ పోలీసులూ! కేసులేదు మేం ఫిర్యాదు చెయ్యం, వాణ్ణొదిలేసి పొండి" అంటాడు.

పోలీసులు యస్సార్ అని వదిలేస్తారు. సెన్సారు వాళ్ళు వదిలేస్తారు.

వాళ్ళు కావాలంటే పేచి పెట్టరూ? కాని అవతల మహాపతివ్రత సిఫార్సాయె. గ్రేట్ సెంటిమెంట్. అది చూసి వదిలేస్తారు. మన ఫిలింవాళ్ళు కృతజ్ఞత లేకుండా వాళ్ళ ఉపకారాలు మర్చిపోయి సభలో రసభసలూ చేస్తున్నారు. దిస్ ఐ టెల్ యూ--ఈజ్ బేస్ ఇన్గ్రాటిట్యూడ్.

రైటే. రైటేనండీ. విలనుగారన్నట్టు పెళ్ళయాక ఇంక ప్రేమేమిటి. లవ్ సీన్సేమిటి--తరువాత మొగుడూ పెళ్ళాలు ఒహాళ్ళ నొహాళ్ళు ముట్టుకుందికి మధ్య సెన్సారువాళ్ళ పర్మిషనేమిటి: పర్మిషను గాదు పదిలక్షలిచ్చినా పాటలుపాడుతూ ఒహాళ్ళ నొహాళ్ళు తాకి పులకలెత్తి నవ్వి ఆనందపడమంటే ఛస్తే పడలేరు. చల్లవణ్ణం తిన్న తరువాత పచ్చడో పప్పో కలుపుకున్నట్టు ఇపుడు రొమాన్సేవ్టి సార్ ఛస్తుంటేను అంటారు. రైట్, బట్ వెయిటే మినిట్. ఒక్క నిమిషం ఆగి ఆలోచించండి. ఈ కాస్త పాయింటు ఆ రూళ్ళు పెట్టిన వాళ్ళకీ సెన్సారువాళ్ళకీ తెలీదనే అనుకుంటున్నారా? అసల్నన్నడిగితే ఈ రూలుకీ ఫామిలిప్లానింగు కమీషన్‌కీ సంబంధం ఉందంటాను. ఇది చాలా లోతైన వ్యవహారం. బీదవాడి ఏకైక ఎంటర్టయిన్‌మెంటుకి ఈ సినిమాలూ, వీటిలో ప్రేమఘట్టాలూ ఈ పోస్టర్లూ దోహదాలుగా ఉంటున్నాయని, పబ్లిసిటీ సాధనాలుగా పనిచేస్తున్నాయనీ, వాటివల్లనే జనాభా ఊహు పెరిగిపోతోందనీ వాళ్ళ అనుమానం. అందువల్లనే భర్త కంట్రోలు భార్య కంట్రోలు బాగా అమలుచేసి కుటుంబ నియంత్రణం, సంతాన నిరోధం జయప్రదం చెయ్యాలంటే సినిమాలను బాగా అదుపుచెయ్యాలి. సినిమాలో పెళ్ళికిముందు ప్రేమఘట్టాలు తీయించేస్తే పూర్వంలా ప్రేక్షకులు తమ పెళ్ళిళ్ళ ముందటి ప్రేమ ఘట్టాల ముచ్చట్లు గుర్తుకు తెచ్చుకొని ఊహించుకొని ఉత్సాహపడడం మానేస్తారు. దీనికితోడు పెళ్ళి తరువాత ప్రేమఘట్టాలు చూపెడితే. 'ఎంత జడ్డిగా ఉన్నాయి! పెళ్ళయ్యాక కూడా వీడు రొమాన్సు దూయేట్లు అఘోరిస్తున్నాడు' అని నవ్వుకుంటారు. వాళ్ళు నవ్వుకుంటే సినిమావాళ్ళు దరిమిలాను అసలు పిక్చర్లలో లవ్ సీన్లే పెట్టరు. ప్రేమ అవుటాఫ్ ఫాషను, అవుటాఫ్ డేటూ అయిపోతుంది. నీతులు ఆవాలూ, నీతులు మెంతులూ,

నీతులు జబ్బులూ, నీతులు ఏడుపులూ, అపోహలూ, నీతులు వగైరాలతో నిండిపోతాయి పిక్చర్లు. జనం హాయిగా ఇళ్ళలో కూర్చుని భారతీయ విద్యాభవన పుస్తకాలు చదువుకుంటారు--రామా కృష్ణా అనుకుంటూ....కాని అవి చాలా ప్రమాదమని, అందువలన వీళ్ళు నివారించదలుచుకున్న సమస్య మరింత పట్టపగ్గాల్లేకుండా పోతుందనీ గ్రహించలేదు.

ఇదంతా జరుగుతుందని కాదుస్మండి, సినిమా వాళ్ళం అసాధ్యులం, రూలు ఉంటే నాలాంటి అద్భుతమైన బుర్రలు కిరాయికొచ్చి రూలునీ గీలునీ ఎగరగొట్టేస్తాయి. సవాలక్ష ఉపాయాలు చెప్తాన్నేను. పెళ్ళిముందు ప్రేమకూడదు అన్న వాక్యంలో పెళ్ళి అనగా ఏ పెళ్ళి, సనాతన భారతీయ సాంప్రదాయిక వివాహాలున్నాయా మరి. గాంధర్వం, రాక్షసం వగైరాలు.

భారత సంస్కృతి సంప్రదాయ సంరక్షకులు వాటిని కాదనగలరా?

గుళ్ళో గాంధర్వ పెళ్ళాడితే కాదండం సబబా!

అక్కడి దీపం అగ్నిసాక్షి గాదా?

కావాలంటే అగ్నిదేవుడు ప్రత్యక్షమైనట్టు చూపిస్తే పోదా?

ఒకడి భార్యా, ఒకర్తె భర్తా--ఇద్దరూ వివాహితులే కాబట్టి ప్రేమించి ద్యూయెట్లు పాడడం అధర్మమా?

పెళ్ళయిన పిల్లదానికి కలొచ్చి అందులో మొగుడూ తనూ పెళ్ళి గాకముందు సరసాలాడినట్టు కనపడడం సెన్సార్ పక్షం అనిపించుకోదా!

విష్కంభంలో రిజిష్టరు పెళ్ళి చేసుకొచ్చి డూయెటు గట్రా పాడి సరసాలాడి తరవాత సెన్సారువాళ్ళు ఆయ్ అంటే రిజిష్టరు పెళ్ళయుండచ్చు. కావాలంటే ఇపుడు సివిలు పెళ్ళాడతామొచ్చి అంటే అది సెన్సారు పక్షం అనిపించుకోదా!

తెలుగు సినిమాలో లవ్‌సీన్స్ గొడ్డు (పాపము శమించుగాక) పోతాయా?

మిగతా కథ వెండితెర మీద చూడండి






అసలీకాలప్పొలిటీషియన్‌లకి ఐకమత్యపు విలువ తెలీలేదండీ వదినా. ఒక్క ఘడీసేపు ఒక్క మాటమీద నిలబ్రదు. చెరువునీటిమీద చిళ్ళపెంకులా అలా అలా మాటలమీద జరుక్కుంటూపోతారు. అందికే గవర్నమెంట్లిల్లా అఘోరిస్తున్నాయి. సృష్టిలో ప్రతి ఒక్కటిన్నీ ఉద్ఘోషించేది ఏమిటి? అయికమత్యం కావాలోయ్ చవలాయా అని. రూపాయికాసు చూడండి. అందులో పదహారణాలూ కలిసివుంటేనే వాటి సత్తా. అలా గుంభనగా కూడబలుక్కు నిలబడతాయి. ఏదీ ఆ రూపాయి నోమారు మార్చి చూడండి. ఆర్జించినవాడు హరీమనగానే వాడిసంతంతా తలకాస్తా పంచుకు తలోదారినా పోయినట్టు చక్కాపోతాయి. అణాకాసులు సెనగపప్పుల్లా చెల్లుబడయి పోతాయి. అలాగే మాటవరసకి చెబుతున్నాన్మండి. యగ్జాంపులుగా యవర్నో ఎందుకు గిరీశం అండ్ బుచ్చమ్మలనే తీసుకుచూడండి. వారిద్దరిమాట యాకమై వారు కలిసి నిలబడితే లోకం, సంఘం, ఛాందసప్పెద్దలూ వారిని తేరిచూడగలరా? యంతమాత్రం చూడలేరు. సంఘీభావం లేకపోతే యామవుతుంది! ఓ మంచిరోచ్చూసి అబ్బీ గిరీశం నువ్విహ నడు అని నన్ను పొమ్మంటారు. బుచ్చమ్మ దన్ను లేని గిరీశం నిర్బలుడై, నిస్తేజుడై, రోగియై, విరాగియై, చిక్కి సగమై తరువాత చచ్చిపోతాడు. అయ్యో సద్బ్రాహ్మడి న్చం పీశానేఁ అని దుఃఖించడం తప్ప రెండో పనుండదు మీకు.....

రా వెంకటేశం రా. వేళకొచ్చావు. యూనిటీమీద లెక్చరిస్తున్నాను. విని బాగుపడు. రేప్పిక్చరు తీసినపుడిదంతా అందులో గుప్పించెయ్యాలి. అసల్నన్నడిగితే ఈ అయికమత్యమ్మీద సినిమావాళ్ళకున్న గురిలో నూరోవంతు మనందరికీ వుంటే దేశం ఎప్పుడో బాగుపడేదోయి. వాళ్ళన్చూసి బుద్ధితెచ్చుకోవాలి మనవంతా. వాళ్ళు చూడు. అందరూ ఎల్లప్పుడూ ఒకటే కథని సినిమా తీస్తారు. యాడాది కెన్ని పిక్చర్లు చూస్తావు. ఎక్కడేనా ఒహదానికీ ఒహదానికీ ఒక్క అడుగులోనైనా తేడా వుందా చెప్పు. ఎందుకుంటుంది. ఉండదు. వాళ్ళు బాగుపడే లక్షణం ఉన్నవాళ్ళు. వాళ్ళకి అయికమత్యం విలువ తెలుసు. యునైటెడ్ వియ్‌స్టాండ్--అనగా మేమంతా ఈ విషయాల్లో కలిసికట్టుగా ఉంటాం. ఒకటే కథ తీస్తాం ఒక్కలాగే తీస్తాం. డివైడెడ్

వియ్‌ఫాల్ అనగా అలా చేయక తలావక కథా తీసుకుని తలా వకదారినా సినిమాలు తీసినట్లయితే--వుయ్ ఫాల్--అనగా మేవంతా కూలిపోతాము అని వాళ్ళనమ్మిక. దట్ మైడియర్ వెంకటేశం ఈజ్ 'ఇన్‌షార్ట్'ది సీక్రెట్ ఆఫ్ దెయిర్ సక్సెస్.

వక్క కథలోనే కాదు, అన్నిటా వాళ్ళకి యీ ఐకమత్యం మీద గురి వుంది. వాళ్ళకి దొరికినవి ఒకటోరకం పాత్రలు. అందరికీ ఆ వక్కటే రకం పాత్రలుంటాయి. అన్ని పిక్చర్లలోను అవి వక్కటే రకం విగ్గులు (వకటోరకమే) పెట్టుకుంటాయి. ఒకటేరకం దుస్తులు ధరిస్తాయి. వకటే రకం డైలాగుల్లో, పాటల్లో ఏడుస్తాయి, ఏడిపిస్తాయి, నవ్వుతాయి, నవ్విస్తాయి. నవ్వులపాలవుతాయి. వక్కటే రకంగా పుడతాయి. పెరుగుతాయి. గిడుతాయి. అన్ని పెళ్ళాలనూ వకటే కిటికీ చిల్లుల్లోంచి. వకటే రకం షాటులో చూసి వకటేరకంగా అపోహపడతాయి. వకటే రకం అవుడ్డోరులో (మహాబలిపురం, పూనమల్లి హైరోడ్డు) తిరుగుతాయి. తరువాత వకటే రకం కారుకిందపడి, వకటే రకం దెబ్బ (పలాస్ట్రీ మార్కు) తగిలించుకుంటాయి. చివర్ని అన్ని పాత్రలూ కలిసి వకటే రకంగా గ్రూపు ఫోటో తీయించుకుంటాయి-- మూడో రీల్లో పోర్షన్ పోగొట్టుకున్న పెరుమాళ్ళు (బహువచనంస్మీ) వినా.

మ్యూజిక్ మాత్రం? వాళ్ళీ మధ్య యూనియన్ గూడా పెట్టారుట. ఐకమత్యంలో మెలగీ, తమలో దామే గాదు డిస్ట్రిబ్యూటర్ ప్రొడ్యూసర్లతో గూడా-- అందరూ ఒకటే రకం పాటల్ని ఒకటోరకంగా కాపీ కొట్టడంలో ఘనవిజయం సాధిస్తున్నారు. పొడుగు చూడు, ఒకడుగు తభావతు రానీరు గద.

వేయేల వెంకటేశం ఒక్క హెడ్డింగు మినహా మన సినిమాలలో మిగతావన్నీ వహటే విధంగా ఉంటాయి. అందికే 'వాటీజినె నేమ'న్నాడు షేక్స్‌పియరు. పేరులో ఏవుంది "ఏ రోజీజె రోజీజె రోజ్" అందో సీమ దొరసాని ఇంకేవనాలో తెలీక. అలాగే మన సినిమాలూనూ.

ఫలం చెడ్డా విధం దక్కాలన్న పట్టుదల దక్కించుకునే ఐకమత్యవున్నూ మనవారి సొత్తు. అందికే బలవత్తరమైన ప్రజాభిప్రాయం గానీ, తీవ్రమైన విమర్శలు రానీ వాళ్ళు చెక్కు చెదరకుండా నిలబడి ఉన్నారు. విమర్శలు చేసేవాళ్ళు వెధవాయిలనుకో. గిట్టనివాళ్ళు, ఓర్వలేనివాళ్ళు, ప్రజలు పాపం ఉట్టి గొర్రెల మందలు గదా! వాళ్ళేమీ అనరు. అనుకోరు. "ఇహ నీ సినిమా ఇప్పట్లో బాగుపడదు. దీన్నేం జేసీ లాభం లేదు." అన్న నిస్పృహ కొద్దీ వదిలేశారని, గిట్టనివాళ్ళంటారే గాని అది వుట్టి భ్రమ అని - మా అనగా సినిమావాళ్ళ నమ్మిక.

అందువల్లనే మేమిటుపై నుంచి ఈ గిట్టనివాళ్ళ నెత్తినో మొట్టికాయ వేసి, ఆ విమర్శలేవో మేవే అఘోరిస్తామని చెప్పదలుచుకున్నాం సుబ్బరంగా. మా పిక్చర్లని మేవేఁ మెచ్చుకుంటూ పత్రికా విమర్శలు రాసి పారేసి అచ్చు కొట్టించేస్తాం. సీవఁ దొర్లలాగే చేస్తారుట నీకు దెల్సో లేదో. కుంపిణీవాడే తన తాజాపిచ్చరు మీద విమర్శ రాసేయించి, అందులో నిజాయితీకి రెండు చవాకులు గీకి--అబద్ధం. అపాటి

లోపాలు కూడా వుండవుగాని జనవేద్చిపోతారని లోపాలున్నట్టభినయించదవన్న మాట-- అచ్చు కొట్టి పంచిపెట్టిస్తాడు.

అవి ప్రజగాడు చదవడంటావా? లవుడు స్పీకర్లమీద చెవులు హోరెత్తిపోయేలా చదివేస్తాం. వూరూరు అహోరాత్రాలూ టముకేయించేస్తాం.... అప్పటికీ జనం నమ్మక హాలువేపు రాపోతే, మేవే టిక్కెట్లు కొనేసుకెళ్ళి మరోమారు చూస్చుక్కావస్తాం. బాగుందండోయ్ అని పొరుగువాడికి చెప్పి పోరు పెడతాం. మే వెరిగిన మినిష్టర్ల చేత ఒపినియన్స్ ఇప్పించి ఆశపెడతాం. అసలిందాకా రాదులే. మనవాళ్ళట్టి గొర్రెల మందలు. వాళ్ళకీ తభావతులన్నీ తెలిస్చస్తాయా యేవిటి.

సో మైడియర్ వెంకటేశం! నేను ప్రొడక్షన్‌కే గాక రిలీజ్‌కీ పబ్లిసిటీకీ, అనుకూల విమర్శకీ, జనానికీ కూడా ఏర్పాట్లు చేసేశాను. నీదీ మీ సిస్టర్దీ మాత్రమే ఆలీసెం. రిమెంబర్. యునైటెడ్ వుయ్ ఫాల్. మనమంతా కలిసికట్టుగా ఇందులో పడదాం; డివైడెడ్ వుయ్ శ్టాండ్--పడి లేచాక విడివిడిగా నిలబడదాం--నాఅంత గొప్పవాణ్ణి నేనేస్మీ అని.





# నొమోష్కార భాణము లేక మైగాడ్! పేరేనా మార్చరా!

ఆయ, ఆయ. నమస్కారం, నమస్కారం. దయచెయ్యండి, మీకోసవేఁ ఎదురుచూస్తున్నాను. పాత బాకీకోసం చిన్న నటుడిలా, కొత్త ఇనిస్టాలుమెంటు సొమ్ముకోసం ప్రొద్యూసరులా, రయమున టయమున రాని హీరోయిన్ కోసం మిగతా జనాభాలా, పార్టీ టిక్కెట్టు కోసం ఛాన్సు లేని ఎలక్షన్ కాండిడేటులా, ఈ ఉపమానాల అంతుకోస మీ్మలా, జీ(వి)తం కోసం బోర్డుస్కూలు మేస్టరులా, ఆయన జీతంకోసవేఁ ఆయన తాలూకు అప్పులాళ్ళలా, మందుకోసం ధర్మాసుపత్రి రోగిలా, ఈగల కోసం పెన్సిలినుబుడ్డిలా, రైలు కోసం ప్రయాణీకుడిలా, సీతకోసం మోహన్‌లా, ఈ ఉపమానాల ముగింపు కోసం పాఠకుడిలా, 'ది యండ్' కోసం ఇటీవలి చిత్రాల ప్రేక్షకుడిలా, ఐక్యత కోసం ఆంధ్రుల్లా, విమర్శ కోసం మహాకవుల్లా, గు. అప్పారావుని ఆడిపోసుకునే అవకాశం కోసం అపహాస్య బ్రహ్మల్లా, మనియార్డరు కోసం హాస్టలు స్టూడెంటులా, డెంటుకోసం టాక్సిడెంటు కోసం పొగరుమోతు డ్రైవరులా, మంచి ఉపమానం కోసం మీలా, అర్హుడైన ప్రయోక్త కోసం ఉపమానంలా, తమ పై సినిమా వారి మోజు విరిగే రోజు కోసం శరత్కథలా, చిద్గగనాంతాన గురు సాక్షాత్కారం కోసం విశ్వనాథగారిలా, రీమేక్‌కోసం పాత కథల్లా, సన్నదనం కోసం దేశవాళీ హీరోయిన్‌లా, చక్కదనం కోసం వాంపులా, నాయకుల చెవాకుల కోసం సెటైర్లు రాసేవాడిలా, ఈ పేరాగ్రాఫు ముగింపు కోసం పాఠకుడిలా, సరికొత్త కథలోంచి పుట్టవలసివున్న సరిపాత కథ కోసం మనలా, అప్పుకోసం అప్పారావులా, విడుదల కోసం లోభి జేబులో గుండుగల ఎద్వర్డురాజు రూపాయిలా, నేను మీకోసం ఎదురుచూస్తున్నాను. మీకోసవేఁ ఎదురుచూస్తున్నాను.

ఆయ ఆయ రండ్రండి. నమస్కారం. మీకోసవూఁ ఎదురుచూస్తున్నాను. అయిపోయింది. కథ రడీగా వుంది. మార్పులు, కూర్పులు చేసి తీసి సిద్ధపరచాను. ఓకె చెయ్యడవేఁ తరవాయి. ఇందుపు కాయేసిన వరద బురద నీటిలా తేటగా ఉంది.

ఎంత చిన్నపిల్లాడైనా--మాటలు రావాలనుకోండి--చక్కగా చెప్పగలడు. ఏ దేశంవాడైనా--భాష తెలిస్తే--ఇట్టే చెప్పేస్తాడు. ఏ ప్రేక్షకుడికి చెప్పినా, ఇది సినిమాకథ అని ఇట్టె గుర్తుపడతాడు. హిట్టవుతుందని నా మిత్రులెవర్నడిగినా చెప్తారు. నేనేనా ఆమాటే అంటాను.

చిత్తం, యావన్నారు? మార్పులు చెయ్యలేదనా? ఛంపేశారు. నేను ఛస్తే పాతకథని వాడతాన్టండీ. కొత్తదివ్వకపోతే నా గొప్పేవిటంట. అంతెందుకు. ఇందులో మెలోడ్రామా సీన్సు వింటే చాలు మీకే తెలుస్తుంది. భోర్న ఏడుస్తారు. నాఫ్రెండ్సంతా మొర్రోమని ఏడిచారు. బుచ్చెమ్మ బాబోయ్ అని ఏడిచింది! బుచ్చమ్మేవిటి ఇంటిల్లిపాది ఒకటే ఏడుపు....డామిట్. మీర్నమ్మరుగానీ, ఎవరో పోయారుగామోసని చుట్టు పక్కలవాళ్ళంతా వచ్చి ఈ ఏడుపంతా కరుణరసం బాపతని తెలిసి ముక్కున వేలేసుకున్నారు--తౌజండ్స్ కాదు--ఫింగర్స్--వేళ్ళు. ఒక ప్రొడ్యూసరుగారు, ఈ సీను పట్టిగెళ్ళి వాళ్ళ సెట్టుమీద శాడ్‌సీనులో ఏడిసి నట్టేడుస్తున్న హీరోయినుకు వినిపించారు. అంతే త్రిల్లింగ్గా ఏడిచిందావిడ. కట్ అన్నా ఆగలేదుట. ఈ లెక్క నిహ గ్లిసరిన్ అవసరంలేదనీ, ఈ సీన్ని స్టుడియో ప్రాపర్టీగా ఉంచుతామనీ స్టూడియో లాయన అన్నాడు. గ్లిసరిను కంపెనీ సేల్సుమానొచ్చి బాబ్బాబు వారికిది అమ్మకు నీ పుణ్యం ఉంటుందని గ్లిసరిన్ లేకుండా, ఈ సీనూ వినకుండా స్వతంత్రంగా (పాల్టిక్స్‌కి సంబంధం లేదు) దుఃఖించి వెళ్ళాడు మీరొచ్చేముందు. అంత పవర్‌ఫుల్ సీను! హృదయాల్ని కదిలించివేస్తుంది. హృదయాలేమిటి? ఇందాక అల్లా గోడని మేకు తీదామని ఎంత పీకినా కదల్లేదు. ఈ సీను వినిపించాను. ఊడి చక్కా వచ్చింది. పాలవాడు పాతబాకీ కోసం గుమ్మంమీద కూర్చున్నాడు ఇచ్చేదాక కదల్నని. ఇది వినిపించాను. కదిలి కరిగి నీరైపోయి పాలలో కలిసిపోయాడు. ఆ మధ్య ఎక్కడో (ఆంధ్రాలోనే లెండి) పనిచెయ్యని డాక్టర్లనీ, ఆస్పత్రుల్నీ, కారింజన్‌లనీ చూసి వో రైలింజను కూడా చెడిపోయి ఆగి కదలలేదు. దాన్దగ్గిర ఈ సీను టూకీగా వర్ణించేసరికి కదిలి సాగిపోయింది. అంతెందుకు, మనకథే 12 రీళ్ళయినా, ముందడుగు లేకుండా మొదలయిన చోటనే కదలక మెదలక కూర్చుంది. ఇది చూపించగానే పరుగెత్తింది. ఆవిడెవరో హీరోయిను "షూటింగుకు వేళ పూర్తి అయిపోతోంది రా తల్లీ" అని తెర వేలుపులంతా మొరపెట్టినా కదల్లేదు. ఇది చెప్పగానే ఏడిచి లేచ్చక్కా వచ్చింది. ఏం చెప్పమంటారు.

అయ్యా ఓ నమస్కారం పెడతానుగాని, ఇది మార్చమనకండి. మార్పులు చెయ్యకేం? చేశాను. మన పాతపిక్చరులో హీరో, హీరోయిన్‌లు సైకిళ్ళమీద వస్తూ డాషిచ్చుకుని ప్రేమలో పడతారు గదా. అందులో హీరోయిను ఎడమనుంచి, హీరో కుడినుంచి వస్తారు. ఈసారి ఆ సీనుని తలకిందులు చేసి పారేశాను. హీరో ఎడమనించి వస్తే, హీరోయిన్ కుడినుంచి వస్తుంది. రెండు సైకిళ్ళకీ డాష్, క్లోజప్ కట్ లాంగ్‌షాట్, ట్రాలీ, కోపం, దానివెనుక ప్రేమ, డైలాగులు, హోఁహో, హాహాలమీంచి, డ్యూయట్‌కి మిక్స్ చేస్తాం. టెక్స్టు కూడా మార్చేశాను. పాతపిక్చరులో

వోహోహో చందమామా అని వుంది. ఇందులో?....వాట్? ఆహోహో చందమామా-- థాంక్యూ థాంక్యూ. నాకు తెలుసు మీరు నావెల్టీ నెంకరేచ్చేస్తారని.

ఏం? అక్కణ్ణించి క్లాషు. ఈ హీరో ఇంత క్రితం ముగ్గురు పిల్లలతో డ్యూయెట్లు పాడి ఉంటాడు. అసలే ఆంధ్రా గదా. థర్టీ యియర్స్ వూరికే మడిగట్టుక్కూర్చుంటాడండీ? మనం రియలిస్టిగ్గా ఉండాలి. నా ఎస్టిమేట్ ప్రకారం ఇలాటి వోల్డ్ ఫ్లేమ్స్-అనగా ఫ్లాషుబాకు హీరోయినులు చచ్చు సంభావన వో అరడజనేనా ఉంటాయి. నన్నుబట్టి నా ఎస్టిమేటులో డిస్కౌంటిచ్చినా ఓ ముగ్గురు ప్రేయసీమణులేనా ఉండి వుంటారు--ఏం. ఈ సైకిలు హీరోయిను యాక్సిడెంట్ తరవాత హీరో, ఆవిడా డ్యూయటు మొదలెడతారు. పల్లవి, చెరో చరణం తిరిగేసరికి ఈ పాతప్రియురాళ్ళు ముగ్గురూ హలో హలో అంటూ ఆ తోటలోని పాటలో జొరబడిపోయి అపశ్రుతి కలుపుతారు. చివరకా డ్యూయెట్ కాస్తా కోరస్‌గా మారిపోతుంది. నావెల్టీ కదూ. ఐదుగురినీ ట్రిక్‌షాట్‌లో తమాషాగా చూపించవచ్చు. రాసలీలలా నారీనారీ నడుమ మురారీ టెక్నికుతో తియ్యొచ్చు. నాలుగు హీరోల బొమ్మలతో అయిదుగురు. ఐ మీన్ నలుగురు హీరోయిన్‌లతో రకరకాల మోస్తర్లలో చూపించొచ్చు. హిట్టా హిట్టున్నరా? ఏవన్నారూ, సెన్సారువాళ్ళా? వాళ్ళ కత్తెర్లు, వాళ్ళీ మధ్య సెక్సు వదిలి హారరు మీద పడ్డార్ట. ఏకలవ్యుడి కథలో గురుదక్షిణ సీను తీయించేశారట. రేప్పొద్దున్న సీతని రావణుడెత్తుకుపోయాడంటే బాగుండదని, ఇంకోటేదన్నా చేదామంటారు. అసలు బహుభార్యాత్వం పెట్టడం వల్ల పేచీలొస్తే. పోనీ ఆ సీన్ మటుకు ఫోక్‌లోర్--జానపదంలా తీదాం కలర్‌లో! లేపోతే పిక్చరే ఫోక్‌లోర్ తీద్దాం. మీకు బాక్సాఫీసూత్రాలు కొరుకుడు పడ్డేదుస్మండీ. ఎంతసేపు కళ కళ అని దేవుళ్ళాడతారు. జగదేకవీరుడికథ ఎందుకు హిట్టయినట్టూ? అతగాని జగదేకవీరత్వం ఏమిటి చెప్పండి. యుద్ధాలు చేశాడా? అంతా పార్వతి మద్దత్తు. మరతని గొప్ప? ఐదుగుర్ని పెళ్ళాడడం. అంతేగదా. ఈ కాలంలో ఒక్కదాన్ని కట్టుకునే మన్లాంటివాళ్ళం వేగలేక సినిమా కథలంత జీవితాల్తో చస్తున్నాం. ఒక్క కిటికీలోంచి ఒక్క పెళ్ళాంమీద అపోహ పడితేనే 20 రీళ్ళు. ఇక ఇద్దరు పెళ్ళాలమీద రెండు కిటికీ చిల్లుల్లోంచి రెండపోహలు పడి రెండు డైలాగులు రెండుసార్లు చెప్పి జోడు శాడ్ సాంగులు పాడి బతకడం అంటే చచ్చామే. నలుగురితో చావు పెళ్ళిలాటిదైతే, నలుగురితో పెళ్ళి చావులాటిదన్నాడో జ్ఞాని. తిరుపతి వెంకటేశ్వర స్వామి అంతటివాడు పద్మావతితో డ్యూయెట్లు మొదలెట్టేసరికి మహలక్ష్మి రావడంతో, వాళ్ళు యూ హౌ మచ్ అనుకోడంతో హడలిపోయి, రాయి అయిపోయాడు గదా. ఈ కష్టం మనకి తెలుసు. ఏడుకొండల జేజెకూ తెలుసు. అసలు నాకీ అయిడియాకి ఇన్‌స్పిరేషను అందులోంచే వచ్చింది లెండి. ఎవరితోనూ అనకండి.

అందువల్ల సంసార సుఖం (?) అనుభవిస్తున్న వారంతా కూడా భళీ నలుగురు భార్యల్ని కట్టుకు వేగ సాహసించినవాడు--జగదేకవీరుడు అంటూ హీరో వర్షిపుచేసి మరీ వస్తారు మన పిక్చరుకి. అంచేత మనం సోషల్ తీస్తేనే మజా వుంది.

మనుషులేమిటి, ఆ కొండమీది దేవుడుకూడా చూడడానికి వస్తాడు--ఈ వీరుడి గొప్పతనం ఎలాటిదీ అన్న కుతూహలం కొద్దీ. మనం తిరుపతి ఫస్ట్ రిలీజిద్దాం.

చివర్ని శరత్కథ ఒకటి మిళాయిద్దాం. కామెడీ స్టోరీ లెండి. సీరియస్‌గానే చూపెడదాం. ఒక పక్కగా వస్తూ వుంటుంది. చివరికొచ్చేసరికి హీరోయిన్ విలన్ని పెళ్ళాడవలసి వస్తుంది. ఆవిడ లేచి పారిపోతుంది! హీరో ఛేజ్ చేస్తాడు. ఎందుకు? ఆవిడిని పట్టుకుని పెళ్ళాడ్డానికా? దొరగ్గానే చంపడానికా? సస్పెన్సు, అసలు ఎడిటింగులో తమాషా చేదాం. హీరో హీరోయిన్ని తరుముతున్నాడా? హీరోయిను హీరోని తరుముతుందా అన్నది కూడా తెలీకూడదు ఆడియన్స్‌కి. ఆవిడ మోటారు సైకిలుమీదా (నావెల్టీ...నే చెప్పలే?) ఆయన మూడుచక్రాల సైకిలు మీదా (కామెడీ) వెళ్తారు.

ఏవన్నారూ? రీసెంట్ పిక్చర్‌లా ఉందంటారా. ఆఫ్‌కోర్సు. అది చూశాకే ఈ అయిడియా వచ్చింది. అందులో తరిమే సీను ఇంకా బాగా పెట్టచ్చుననిపించింది. హీరోయిను, హీరోమటుకే ఉన్నారు మనదాంటో. అలాకాక, ఆ సీనులో కథా కమామిషూ చూసి ముందర అసలు కథకుడు శరత్‌బాబు లేచి ఈ కథ నాదికాదు బాబోయ్ అంటూ పరిగెడతాడు. అయనను చూసి నాన్నా అంటూ హీరోయిన్ లేచి పరుగెడుతుంది కారుమీద. ఈవిడ కారుమీదున్నా, ఆయన్ని అందుకోకుండా ఎడిటింగ్ ఏర్పాటు చేస్తామనుకోండి. ఏం? ఆమె కోసం హీరో వెనకాల సైకిలుమీద పరుగెట్టుకెళ్ళి కారును ఆపుతాడు. అంతలో హెలికాప్టరు మీద దర్శకుడు (నావెల్టీ) వచ్చేసి ఇది ఆఖరి రీలని, ఇంక రొండొందల అడుగులు కూడా లేదని చెప్పి, సెట్‌కు తెచ్చి పెళ్ళి చేస్తాడు. ఎ స్టోరీ ఇన్ ఫోర్త్ డైమన్షన్ చివర్ని అంతా కలసి ముసలాయన్ని కూకలెయ్యొచ్చు. ఇది మీదని ఎవర్చెప్పారు? అసలీ సెట్టుకి మీరెందు కొచ్చినట్టు? అవటాని.

నేననే దేవిటంటే మన పిక్చరులో కూడా ఈవైపు కామెడీ పెడదాం. ఏవంటారూ! నచ్చలేదా?

పోన్లెండి. అలాగేకానీండి, మీ పాతపిక్చర్ కథనే మళ్ళీ తీద్దాం. ఒక్క రిక్వెస్టు, ఈసారి పిక్చరు పేరు మారుద్దాం. ఆ? అదీ వద్దా? సెంటిమెంటా? రైటర్నే మారుస్తారా? మైగాడ్!

అయ్యా! మీకో నమస్కారం.





# ఆంగ్లాంధ్ర శబ్దాశ్రయ హాస్యంలో ఆస్యం, హాస్యం

"కన్యాశుల్కంలో హాస్యం ఇంగ్లీషు తెలుగుమాటల కలయిక వల్ల పుట్టింది. అది తెలుగు హాస్యం కాదు"--ఒక హాస్య సైద్ధాంతకుడి తాత్పర్యం.

డామిట్! (ఇది ఉత్త ఇంగ్లీషు--పైగా టెలుగుతో మిక్సవలేదు. ఇందులో హాస్యం లేదు. అంచేత నవ్వకు.) గొప్ప చిక్కొచ్చింది. వెంకటేశం! అవునుగాని గొప్ప గొప్ప డిస్కవరీ ల్జేసిన (ఇదీ వుత్త ఇంగ్లీషే. హా॥ లేదు. నవ్వకు.) వాళ్ళకేవి టేవి టేవి టిస్తున్నారయ్యా బహుమతులు? కొలంబస్సూ (ఇంగ్లీషు కాదు, పోర్చుగీసువాడి పేరు. అయినా హాస్యం కాదు నవ్వకు) కోపర్నికస్సూ (ఇదీ ఇంగ్లీషువేషం వేసిన లాటినుముక్క గావోసు. హా॥ కాదు, గాని ఈయన బతికున్న కాలంలో జనాన్ని తెగ నవ్వించాడు--భూమి గుండ్రమనీ, పైగా సూర్యుడిచుట్టూ తిరుగుతుందనీ చెప్పి. హాస్యపదాలు తెలీకపోతే హాస్యాస్పదాలు మాటాడి నవ్వించొచ్చు ననింది కిదో నిదర్శనం. నీకిష్టమైతే నవ్వు...) చెప్పొచ్చిందేవిటంటే, కొలంబస్సూ, కోపర్నికస్సూ వాళ్ళూ డిస్కవరీల్చేసి ఏవేవి ఎవార్డులు (నవ్వకు) పుచ్చుకున్నారో వాటి విలువేపాటో కాస్త భోగట్టా చెయ్యి. మరేం లేదు. మన వీఁ మర్నునో బ్రహ్మాండమైన డిస్కవరీ చేశాం-- "డిస్కవరీ ఆఫ్ ఆంధ్రా అండిట్స్ సెన్స్ ఆర్ నాన్సెన్సాఫ్ హ్యూమర్--బై గిరీశం (హా॥ లేదు న.కు) దాని మీద బహుమతి అందగానే తాకట్టేసి, అప్పు తీర్చేద్దాం గాని అందాకా రొండు పుంజీల రూపాయ లప్పివ్వమని మీ అంకుల్నడిగి (హా॥ లేదు) పట్రా. చెప్తా.

మైడియర్ వెంకటేశం (హాస్యంకాదు) నిజంగానే నువ్వంటే నాకాపేక్ష. నామాటల్లో ఇంగ్లీషు టెలుగు కలిస్తే హాస్యం పుట్టేస్తోందని కొందరు అంటున్నారు. ముందేచెబుతున్నా నంచేత. అయామ్ ప్రౌడాఫ్ యు, ఆఫ్ ఆంధ్ర, అండిట్స్ హ్యూమర్ పండిట్స్ (ఇందులో కూడా హాస్యం లేదు. ఇవీ ఇంగ్లీషు ముక్కలైనా) బైదిబై. బ్రదరిల్లా! (హాస్యం కాదు, ఐ మీనిట్) ఒక్క చిన్న విషయం. ఈ వాక్యాలలో ప్రతి ఇంగ్లీషు ముక్క పక్కనా, 'హాస్యం కాదు బాబోయ్ నవ్వకు నాయనోయ్' అనే హెచ్చరికల్చెప్పలేక చస్తున్నాను. వాటివల్ల ముక్కకీ ముక్కకీ మధ్యదూరం హాస్యానికీ, హాస్యసైద్ధాంతికులకీ ఉన్నంత ఇదిగా పెరిగిపోతోంది. అందువల్ల ఇహనించి ఇలా..రెండు చుక్కలు పెట్టినప్పుడల్లా "ఇది ఇంగ్లీషు, అయినా హాస్యంకాదు.

'నవ్వవద్దు" అన్న వాక్యాన్ని కవి గుర్తులు అని కొండ గుర్తుంచుకొని నవ్వు మానెయ్యి, బాబ్బాబు.

చెప్పొచ్చింది. టెలుగువాళ్ళ హాస్యరసాస్వాదన లేక హాస్యపరిజ్ఞానము (అంటే సెన్సాఫ్ హ్యూమర్ - హా॥ కాదు. నవ్వకు) గురించిన నా డిస్కవరీ గురించి. నేను నాకు సహజమైన బ్రిలియన్స్‌తో ఆంధ్రాంగ్లాల్లో సవ్యసాచిలా సాచిపెట్టి లెక్చర్లు కొడుతుంటే, 'ఆ మారాజు' చూసి సెబాసని, నాటకాని కెక్కించాడు. ఆ నాట్నించి జనం నాముక్కలు వినీ చదివీ పొట్ట చెక్కలయ్యేలా నవ్వడం మొదలెట్టారు. అక్కడికీ, మీ తెలివి తెల్లారా. ఇది ఇంగ్లీషూ టెలుగూ మిక్సవగా మీ తాలములు సాగి, వోష్ఠములు విచ్చుకొని వచ్చినట్టి హాసమయ్యా, హాస్యం యంత మాత్రం కాదు. నా గొడవ వేరు. నా ఎత్తులు వేరు. నాది బీభత్సమైన జీవితరంగమ్మీద పన్నిన దుర్మార్గపు వ్యూహం, విషాద ప్రధాన, విషాదాంతమైన జీవన్నాటకం., బూటకం, పైకి మటుకే నవ్వుతాలూ అని చెప్పబోయా కాని వాళ్ళు వినందే. ఛెగపడి పైకి నవ్వి లోపల్లోపల ఆ దుస్థితికి జాలిపడ్డారు, బాధపడ్డారు.

"కావమ్మ మొగుడంటే కాబోసనుకొని కాపరంజేశానూ, కాదంటే అలాగే పోతా" నన్నాడు చూడు వెనకటికో మాయదారి అల్లుడూ-- అలాగ్గా, ఏమో వీళ్ళంతా నవ్వుకుంటున్నారు. హాస్యం అంటున్నారు. పోనీ అలాగే కానీ మనకేల అని నవ్వుకుని (హాస్యం) వూరుకున్నాను. కాని అక్కడే పప్పులో కాలు వేశానని నిన్న మొన్నటిదాకా. "అల్లాయన పేరేమిటి-చెప్మా" గారు (ఇంగ్లీషు దొంగచాటుగా మిక్సయిన టెలుగు డోకు. నవ్వితే నీ కర్మం) చెప్పిందాకా అసల్సంగతే కానుకోలేక పోయా. వాటెఫాల్ మై కంట్రీమన్, అనుకొన్నా. వెంకటేశం! నవ్వొస్తే ఇంగ్లీషులోనే నవ్వు సుమా.

నా పేలాపనలో హ్యూమరు (హాస్యం కాదు ఒట్టు! హాస్యం అనే అర్థం) ఇంగ్లీషు, టెలుగుమాటలు డీకొట్టుకు ఇదవడంవల్ల ఉత్పన్నమైనట్టిదనీ అది తెలుగు హాస్యంకాదనీ ఆయన (లేటెస్టు హాస్యబ్రహ్మ, హాస్యం కాదు సంస్కృత సమాన బ్బిరుదు) వెల్లడించేశారు. తెలుగ్గాకపోతే పోనీ, ఇంగ్లీషు హాస్యమా అనేవు, అదిన్నీ కాదు. దీన్ని శబ్దాశ్రయ హాస్యం అంటారు. హాస్యానికి గల బిరుదుల్లో ఈ శాబ్దికం ఒకటిలే. మొత్తం మీద ఇన్ని లక్షలమంది తెలుగుజనాభా ఇన్నేళ్ళుగా చేసిందీ, ఇంకెన్నేళ్ళో చెయ్యబోయేదీ--నా మీద ప్రాక్టికల్ జోకుచెయ్యడం అన్న మాట. ఇన్నాళ్ళూ నా పేలాపనలో హాస్యంకాని దానిని చూసి పొట్టలు బద్దలయేలా (హా.బ్ర.గారు ఒప్పుకోకపోతే పొట్టలు బీటలు వేసేంత మాత్రమే అని చెప్పుకుందాం) ఏవన్నానూ-లయేలా. (శబ్దాశ్రయ హాస్యము), నవ్వడంలో తాత్పర్యం ఒక్కటే--వీడు హాస్యమనుకొన్నది టెల్గూ హాస్యం కాదురోయ్! వీ డిదిహాస్యం అనుకుంటున్నాడు రోయ్. బాబోయ్. నవ్వాగటంలేదురోయ్ అని నవ్వుకుంటున్నారన్నమాట. కాని ఆ మాట నాకు చెప్పరాదూ. పోనీ ఒహడితో ఒహడైనా చెప్పుకోరాదూ. మనక్కాస్త వినబడేలా.

కాని ఇందులో వో మెలికుందిట. ఆరంభంలో ఇది తెలుగు హాస్యం కాదని, ఆంధ్రదేశభక్తిగలవారెవరూ నవ్వరాదనీ నవ్వొస్తే ఓగించుక్కూచోవాలని ప్రజలు అనుకుని ఉండవచ్చు. ఇందులో హాస్య పదాలన్నీ హాస్యాస్పదాలన్న దృష్టితో మాత్రమే కొంతకాలంపాటు నవ్వి వుంటారు. అయితే దరిమిలాను ఎన్నాళ్ళకీ నాన్నాన్ టెలుగు హ్యూమర్ (తెలుగు హాస్యం కానిది కానిది) ఏదీ తటస్థపడనందువల్ల బహుశా ఇన్నాళ్ళూ మనం హేళనచేసిందే అసలు హాస్యం కాబోలు భగవంతుడా అని నాలిక్కరుచుకుని మళ్ళీ రిట్రాస్పెక్టివ్ ఇఫెక్టుతో నవ్వ నారంభించారేమోనని. ఒకాయన వాదించాడు. వారి మొహం.

ఇప్పుడు అం-గ్లో (అంటే ఆంధ్రము ఆంగ్లము కలిస్తే ఆంగ్లో--అయినా ఇది హాస్యం కాదు, నవ్వవద్దూ) హ్యూమరని, ఇంగ్లీషు మాటల్ని, వాటిని వాడిన వాళ్ళనీ కోప్పడినాయనే, చాలా సైద్ధాంతిక గ్రంథాలు, నాటికి దార్శనిక సారస్వతం తయారుచేశారు--తెలుగు హాస్యం కానిదేదీ అన్నది ఆంధ్రాలు పోల్చుకుందికి వీలుగా ఆయన నేతి నేతి విధానం అవలంబించి హాస్యం ఇదికాదు, ఇదీకాదు అని తేల్చుకుందికి వీలుగా రచనలు అమరిగ్గా ఏర్పరచారు.

ఆపాటి థీసిస్సు నాకూ వచ్చు. వెధవది ఇంగ్లీషు ముక్కలు దొర్లి హ్యూమరు పుట్టిస్తాయి గాని.

"హాస్యమనగా నేమి, తాలములు (దవడలు గామోసు) సాగుట కొన్ని కందరములు ముడుచుకొని (ఇంగ్లీషు, ముక్కలు దొర్లాయన్న కోపంతో కాదు) కొన్ని సాగి వోష్ఠములు విడివడి దంతములు (ఉంటే) తళుకుమని (తగుపాటి వెల్తురున్నప్పుడు, కారా కిళ్ళీ వేసుకొనకపోతే) మెరియుటను హాసమందురు. అది తెప్పించుట హాస్యము" అని ఒహాయన. ఈయనకూడా బిరుదు మొగాడు కాదగ్గవాడే....పై విధంగా ఒక హాస్యోపన్యాసం మొదలెట్టేసరికి హాలు గొల్లుమంది--ఇది హాస్యమనో హాస్యాస్పదమనో తెలీదనుకో. అయితేనేం నవ్వింది కాబట్టి హాస్యం అనుకుందాం. వెధవ గొడవ ఈ ప్రజల్తో ఇదే చిక్కు. నవ్వుతున్నారో, నవ్వుకుంటున్నారో, నవ్విపోతున్నారో పోల్చుకోడం కష్టం. మందారిన మనం సిద్ధాంతాలు చేస్తూనే ఉంటాంగాని అజ తెలీదు. ఐనా వాళ్ళభిప్రాయం మనకెందుకనుకో. మొత్తానికి హా.బ్ర. గారి (హా) సిద్ధాంతం ప్రకారం హాస్యం రెండు రకాలైనట్టు తోస్తుంది. ఒకటి శబ్దాశ్రయ హాస్యం అనగా చప్పుళ్ళను ఆశ్రయించుకు బతికేది (ఇది బతుకుతుందా? బతికి బట్ట కడుతుందా? (హా) మిగతాది భవిష్యత్తు వెండితెరపై చూడుడు) ఇక రెండోది నిశ్శబ్దాశ్రయ హాస్యం. అంటే మాటాడకుండా గుడ్లింతజేసి జడ్డిగా చూడ్డం, ల్డల్యల్లా అని వెక్కిరించడం, పిల్లిమొగ్గలు వెయ్యడం, అంతకీ నవ్వకపోతే ఎదుటివాడిని కింద పడదోసి కితకితలు పెట్టడం అయుంటుంది. ఇందుకు బలిష్టులు అయినవాళ్ళే ఒడిగట్టడం మంచిది. ఎందుకైనా మంచిది. పోతే వారు చెప్పిన శబ్దాశ్రయ హాస్యంలో పరభాషా శబ్దాశ్రయ హాస్యం స్వభాషా శబ్దాశ్రయ హాస్యం అన్న విధాలుపై దానిలో ఛప్పన్న దేశాల భాషల పేరిటా అన్ని రకాల

హాస్యాలూ ఉంటాయి. వాటిలో ఆంగ్ల శబ్దాశ్రయ హాస్యం హీనమైంది. అది తెలుగు హాస్యం కాదు. నీకు తెలుస్తూనే ఉన్నా చెప్పడం నా విధి. వృత్తి స్వభాషా శబ్దాశ్రిత హాస్యంతో భారత రాజ్యాంగం గుర్తించిన పద్ధానుగు భాషలూ కాక, ఉన్న భాషలన్నీ లెక్కేసి వాటి పరస్పర సంకరంవల్ల పుట్టేవాటిని గుణించడానికి గణితశాస్త్రజ్ఞుడు రావాల్సిందే.

ఇక ప్రస్తుత విషయమైన ఆంగ్ల శాబ్దికం ఉంది చూశావూ, అందులో హాస్యం కలిగించే ప్రయోగాలు ఇవి: కొట్టిపై తిట్టిపై మొ.... చచచ, అబ్బెబ్బె ఇవి నావి కావు. హాస్యం తెలిసినవాళ్ళుకూడా--నవ్వకపోతే అదేపాయె. కనీసం నవ్వుకునైనా పోరా అన్న వూహ చొప్పున కాబోలు--ఆయన ఇంత పొట్ట చెక్కలయేలాటి ఉదాహరణలు ఇచ్చారు. అలాగే సంస్కృతంలో కూడా తినమిష జిగమిష అనేవి హాస్యపు ఫ్యాక్టరీలనీ మన్ని నవ్విస్తాయనీ హామీ యిచ్చారు. శబ్దాశ్రయ హాస్యం అంటే ఇదేనని ధైర్యం చెప్పారు. (అన్యాయం ఘోరం. నా టెక్నిక్కును--ది సీక్రెట్ ఆఫ్ మై సక్సెస్సును ఇలా క్షుణ్ణంగా ఆకళింపు చేసుకుని అందరికీ చెప్పెయ్యడం అన్యాయం మేష్టారూ.....)

అయితే యివన్నీ శబ్దాశ్రయ హాస్యాస్పదాలే. ఇది తెలుగు వ్యాసం కాదు.

ఇక తెలుగు హాస్యాస్పదాలేవిటి. అబ్రహాం లింకను (ఆంగ్లనామానికి స్వేచ్ఛానువాదం) ఒకనాడు పాదరక్షలు తుడుచుకుంటూ ఉండగా ఒకడు వచ్చి ఏమీ మీ జోళ్ళను మీరు తుడుచుకుంటారా (యు పాలిష్ యువరోన్ షూస్?) అనగా ఆయన మీరెవరివి తుడుస్తారు అనెను... ఇది ఇంగ్లీషూకాక అమెరికనీస్ జోకు అనుకోవచ్చు. ఇది శబ్దాశ్రయ హాస్యానికి చక్కని ఉదాహరణ అనీ దీని బతుకంతా 'యువర్ వోన్' అన్న పలుకుబడిమీద ఆధారపడిందనీ నువ్వనుకుంటే నీ కర్మ. ఆ జోళ్ళజత ఇండియాకి తెచ్చి పింగళి లక్ష్మీకాంతానికో పిలకా గణపతిశాస్త్రికో, తొడిగించి మీ జోళ్ళను మీరే పాలిష్ చేసుకుంటున్నారే అన్న ప్రశ్న. అవును మీరెవరివి చేస్తారు అన్న జవాబు (పై ప్రశ్నకు ఇంకెవరు చేస్తారు అన్న జవాబు రావాలనుకుంటే నీకు తెలుగొచ్చినంత ఒట్టు) ఏర్పాటు చేస్తే అది పదహారణాల తెలుగు జోకు. (ఆఫ్‌కోర్స్ టు హెల్ విత్ నుడికారం) ఆ టెలుగూ జెంటిల్మన్లిద్దరూ ఆ జోకు చూసి ఆశ్చర్యపడగానే విట్టు పూర్తవుతుంది. నువ్వు నవ్వచ్చు లేదా నవ్వుకోవచ్చు.

ఫూల్స్‌కు నేను దారివ్వనన్న మూర్ఖుడిని చూసి, నేనిస్తానన్న ఒక సీమ రచయిత డైలాగుని, పదహారణాల తెలుగు చిన్నదానికి తొడిగి, అంతమాట-- మొగుడి మొహంమీద విసిరేయిస్తే అది పదహారణాల తెలుగు జోక్ (ఆఫ్‌కోర్స్ టు హెల్ విత్ ఔచితి ఆర్ వాటెవరిటీజ్) అయ్యో ఆ ముగ్ధనాయిక, పతిని దైవంగా మన్నించేది, ప్రేమించేది, ఒక రచయిత చెప్పిన మాటవిని ఆంగ్లేయ శబ్దాశ్రయ హాస్యాన్ని దొరకబుచ్చుకొని మొగుడి మొహాన విసిరి కొట్టిందేవిటని మీరు నవ్వుకోగానే తాలములు సాగి ఓష్ఠములువిడి హాస్యం ఉత్పత్తి అవుతుంది.... ఒక టెక్సాసు మిలియనీర్ భార్య కిటికీలోంచి విసిరేసిన వజ్రవైఢూర్యాలను చక్కా

పట్టుకొచ్చి (వారు పారేసినవే కాబట్టి చౌర్యం కాదుగా. హా) మన వీధిలో సుబ్బమ్మగారి నోటికిచ్చి పెరటిగోడవతల పారేయించేస్తే అది పదహారణాల తెలుగుజోకు. బహుశా 'నిశ్శబ్దాశ్రయ' జోకు అయుంటుంది.

ఈ విధంగా తెలుగుహాస్యాన్ని పోల్చుకుని ఆనందించడానికి కిన్ని వసతులుండగా ఈ టెలుగూస్‌గాళ్ళు నా యింగిలీషు ముక్కలు పట్టుకు దేవుళ్ళాడ్డం బాగు లేదు. పైగా ఇప్పుడిప్పుడు నాకే అనిపిస్తోంది. నేతి వాదం ప్రకారం అన్ని హాస్య రచనలు! (హాస్యమే, నవ్వాలి) చేసెయ్యడమే కాక, హాస్యబ్రహ్మ (ఇదీ హాస్యమే... వన్స్‌మోర్. హా. కాదు) అనే సంస్కృతపు సమాసబ్బిరుదుచ్చుకొన్న సైద్ధాంతిక, నిర్మాత చెప్పాక ఇహ నాయనమాట నెదిరించిందికి దమ్ముల్లాలవు. అంచేత నీకు గురి కుదిరినా మానినా నమ్మకం ఉన్నా మానినా, నవ్వు వచ్చినా, నువ్వూ మిగతా ఆంధ్ర ప్రజలూ నా మాటలు విన్నప్పుడు పైకి నవ్వకండి. కావమ్మ అసలు మొగుడే ఆర్నెల్లు కాపరం చేశాక, నేను కాను మొర్రో అంటే ఎలా నమ్ముతారో అలాగే నాది తెలుగు హాస్యం కాదన్న మాదన్న మాట కూడా నమ్మి మన్నించాలి. మీరుగనక పైకి నవ్వితే మీకు హాస్యం తెలిసినంతొట్టు. రేడియో నాటకాలకీ, తెలుగు సినిమా కథలకీ, తలా తోకా ఉన్నాయనుకున్నంత ఒట్టు.





# ॥ ఆదికావ్యమ్ ఓపెన్స్ విత్ విడో రిమారియేజ్ ॥

వామిటి! కథద్దం తిరిగిందివాయ్ వెంకటేశం. రాత్రి మీ ఫాదరింటి కొచ్చేసరికి రెండు ఝావుఁలై వుంటుంది. నువు మాంచి గాఢనిద్రలో వున్నావు. ఇవాళ మంఁచిరోజుగదా యలాగయినా మన బైస్కోపు సంగతి తేల్చేద్దావఁని ఆయనతో ఇంకా భోంచెయ్యలేదూ తమకోసఁవే కూర్చున్నానూ అవట్టాన్జెప్పి, రెండో విడత ఆవకాయా పొడిమెతుకులూ మింగడానికి వడిగట్టాను. ఆయన బంతిని కూచుంటే, నేచ్చుక్క గట్టిగా విదపడానిగ్గాని, పెరుగుబిళ్ళ వెయ్యడానిగ్గాని, అత్తగారికి సొతంత్రం లేదు గదా. ఇహ నా దురవస్థ చెప్పేదేవుంది. మీనాన్న కోపంలా, మీ అక్క హృదయంలా, ధరలలా, గిట్టని వాళ్ళమధ్య పచ్చిగడ్డిలా ఆజ్జెంచాల్ని ఆవకాయ దెబ్బకి నోరు భగ్గుమంది. అలాగే అసురుసురంటూ సబ్జెట్టు కదలేసి ఇలా బైస్కోపు తియ్యడానికి పదిహేనొందలు చాలూ మిగతా నాలుగు లక్షలూ డిస్ట్రిబ్యూటర్ దాఖలు చూసుకుంటాడూ-- ఏతావాతా మనకేవిటయ్యా ఎక్స్ట్రా ప్రాఫిటూ అనగా--మన వెంకటేశానికి రంగున హీరో వేషం వచ్చేస్తుందీ అన్నాను. ఏదీ ఏదీ అబ్బిగాడికా వాడి బొంద అన్నాడాయన--యంతమాటా. కన్న తండ్రులు గాబట్టి తవఁరి దృష్టికి అబ్బిగాడే కావచ్చు. కాని అస్మదాదులకూ, ముజ్జగాలకూ వాడు ఫ్యూచర్ హీరో-- రాబర్టెయలరూ, చార్లెసు హెస్టనూ, గ్రీరు గార్సనూను. వాడు రేపు లక్షలార్జిస్తాడూ అంటూ ధోరణి ఫోర్తుగేరుకి ఎక్కించేసరికి--చీ ఛీ--వంటింటిలోనూ తిండిదగ్గిరా కూడా ఈ పాడు ఇంగ్లీషు, కూతలేనా అంటూ ఛర్రుమన్నాడు. నేను తగ్గి మళ్లా 'పదిహేనువందల' పల్లవికొచ్చాను. ఈ శషభిషలేం కుదరవూ. మాయింటావంటా లేవీ

బయస్కోపులు. అబ్బిగాడు లక్ష లార్జించినా మాన్నా--నాదగ్గిర మాత్రం ఇంత గరళమ్మింగడానిక్కూడా ఏగాని డబ్బులేదూ అన్నాడు. అంతట పాపం...మీ సిస్టర్--దట్ పూర్ బ్యూటిఫుల్ యంగ్ విడో బుచ్చమ్మ చల్లగిన్నె తెచ్చుక్కడపెడుతూ, పోనీ నన్నమ్మిన పఝ్జెనివిఁది వందల్లోంచీ ఇవ్వరాదా! అందోయ్, అంతే. మీ ఫాదరు వీరభద్రుడై పోయి చల్ల తప్పేళానమాంతం ఆమె నెత్తిన బోర్లించి లేచ్చుక్కాపోయాడు. దేర్ గోస్ అవర్ సినీ ప్రాజెక్ట్ అనుకుని విస్తట్లోది కానిచ్చి చెయిగడుక్కున్నాన్నేను. తెల్లవార్లూ నిద్దర్లేదనుకో. సరే రాబర్టు బ్రూసంతవాడు ఏడుసార్లు సాలెగూడు కట్టాడూ. మనవెంతా అనుకుని. నాకు మాడెస్టీ మహలావులే--ఉదయవేఁ మరో ఎస్సాల్ట్‌కి సిద్ధపడ్డాను. శాస్త్రకారుదేవన్నాడూ ఇట్నించి కాపోతే, అట్నించి నరుక్కురా అన్నాడు.

అందుకని సినిమా వదిలేసి నాటకాలకని చెప్పో తస్సావేస్తే--దాన్సిగదరగ ఫిఫ్టీన్ డేస్ సిగార్స్‌కి జరుగుబాటు సందర్భపడదా అనుకుని, పొద్దుటే మీ ఫాదరరుగుమీద కూచుని దంతధావనం చేస్తూ వుండగా-'కావ్యేషు, నాటకం రమ్యమ్' అన్నాను జనాంతికంగా... పరగడుపునే సంస్కృతమ్ముక్క కక్కేసరికి ముసలాడు బుర్ర తంగున తిప్పి, మీకు దేవభాషలో కూడా ప్రవేశం వుందా యేవిషీ అన్నాడు. నేను పకాలున నవ్వి--ప్రవేశవేఁవిఁటి స్వామీ! భాస, భవభూతి, కాళిదాసాదుల నాటకాలు యావత్తున్నూ పఝ్జెనివిదో యేటికే భట్టీయం వేసినవాణ్ణి, అంతటితో ఆక్కుండా ఆ సకలాన్నీ ఆంగ్లభాషలోకి డబల్‌యూ షేక్స్‌పియిర్ అను కలం పేరుతో తర్జుమాయించి, అచ్చొత్తించాను--కావలిస్తే చూసుకోండి అంటూ అరుగుమీద సంసిద్ధముగా వుంచుకున్నట్టి బైండు బుక్కులు ముందుకు నెట్టేశాను. ముసలాడు డంగయి పోయాడంటే నమ్ము. ఇదే ఛాన్సని పుంజుకుని, ప్రస్తుతం తెలుగులో సాంఘిక నాటక రాజమొకటి రచించి, పరిషత్తుకట్టిస్తానని, అందులో అబ్బిగాడిచేత వేషం కట్టిస్తినా అటు ఆ యొక్క స్క్రిప్టుని, అబ్బిగాణ్ణి కూడా సినీమా వారు ఎగరేసుకు పోతారనీ, ఆశ చూపించాను.

లెక్చరంతా విన్నాక ఇంతకీ ఏవిషంఛారు అన్నాడు అనుమానంతో. మరేం లేదు ముందు నాటకం వ్రాయడానికో అర్ధ రీము ఫుల్‌స్కేపు తావులూ, ఆపైన రిహార్సళ్ళకి సాదరు ఖర్చులూ అంటూ ఆరంభించేసరికి--శివాలెత్తినట్టు లేచిపోయాడోయ్.

నువ్వేదో బుద్ధిమంతుడివనుకున్నాను. ఇదా నువ్వు చేసే పనీ నాటకం రాయాలనుకుంటే లక్షణంగా ఓ తాడిచెట్టు ఆకు దింపిస్తాను. మా తాతగారి ఘంటం వుంది రాసుకో. కుర్రాడిచేత భట్టీయం వేయించు. అంతే తప్ప కోర్టర్జీలకు వాడుకునే తెల్లకాయితాల్నిలా తగలేస్తావా అంటూ తగులుకున్నాడోయ్. మై గాడ్. హౌ బార్బేరియస్. తాటాకులమీద రాయాల్ట. కళాపోషణిలా అఘోరిస్తూ వుంటే--ఇక నాటకాలూ సినీమాలూ ఎలా బాగుపడేడుస్తాయనీ--మాటాడవేం?

..అహ వద్దొద్దు...నువ్వలా సైలెంట్‌గానే కూర్చో... వదినగారు బావిలో నీళ్లు తోడుతున్నారు. మార్నింగ్ బ్యూటీని వక పక్క స్టడీ చేస్తూ నీకు నాటకశాస్త్ర రహస్యం వుపదేశిస్తాను... అహో..ఓహో...చూశావుటోయ్. మీ సిస్టర్ అలా బావిలో చేదవేసి--లోకంలో నాకు చీకూ చింతా లేదూ అన్న భంగిమలో నీరు తోడుతూందే గాని--ఆవిడలోని అగ్నిపర్వతాలను, క్షణం క్రితం భావిలో పడిన ఆ యొక్క మంచిముత్యం వంటి కన్నీటి బొట్టు వెల్లడిచేసిందోయ్. ఆహా...దట్ మై డియర్ వెంకటేశం--ఈజ్ డ్రామా... చూసేందుకు కళ్లుంటే సృష్టంతా డ్రామావే కదుటోయ్. అడివిగాచిన వెన్నెలనీ, ఎడారిలో పన్నీటినీ ఆ కన్నీరు స్ఫురింపచేస్తోంది.... ఆవిడ భావిలోంచి తోడేది నీరుటోయ్! యంత మాత్రం కాదు--అది భూమాత కన్నీరు. లోకంలోని యంగ్ విడోస్ గురించి--ముఖ్యంగా శాపవశాత్తు ఈ అగ్గురారం ఛాదస్తుడింట పడిన దేవకన్యవంటి బుచ్చమ్మ గురించి భూదేవి దుఃఖించి రాల్చిన కన్నీళ్ళోయ్ ఆ భావిలోవి. అదుగో ఆ చెట్టుమీద పిట్టలజంట ఏమ్మాటాడుకుంటోంది తెలుసా....ఓపిల్లా--నీకేం భయం లేదు. అదిగో ఆ బావి దగ్గర చిన్నది కూడా నీలాటి యంగ్ విడోనే...నేడో రేపో... చదువు సంస్కారం గల ఒక నవ యువకుడితో వెళ్లిపోతోందీ, నువ్వుకూడా నాతో వచ్చెయ్యి అంటోంది.

ఆ? ఏవిటన్నారూ వదినా... పిట్టల్లో కూడా వితంతువులుంటాయ్యా అంటున్నారా? యంతమాట. ఆదికవి వాల్మీకి వ్రాసిన ఆదికావ్యం రామాయణంలో కథారాంభం ఇదే కదండీ. బోయవాడు క్రౌంచ పక్షుల మిథునంలో మొగదాన్ని కొట్టి చంపగానే ఆయన మానిషాద! ఓరి కిరాతకుడా ఎంత పని చేశావు--ఇప్పుడు వితంతువయిన ఆ యంగ్ విడో గతేవిటి అంటూ శోకించి శ్లోకించాడు. మన మొదటి గ్రంథమే విడో రిమారియేజ్‌తో స్టార్టయింది. ఆయనంతగా ఘోషించినా ఆ పక్షి మీలాగే చాదస్తం కొద్దీ రెండో పెళ్ళికి ఒప్పుకోలేదు. అందుకే తరవాతి కథలో ఆయన ఆ కథ గురించి ఎక్కడా రాయలేదు. అందువల్ల--

....ఏవిటీ, ఆలాటి విషయాలు వినడం మీకు సయించదా...చూశావా వెంకటేశం...దిస్ అగెయిన్ ఈజ్ డ్రామా--నోరు నవ్వితే నొసలు వెక్కిరించిందన్నట్టూ-ఆవిడ అనేది వేరు, అనుకునేది వేరు. షేక్స్‌పియర్ ఊరికే అన్నాడటోయ్ ఆల్ ది వాల్డీజెస్టేజనీ--ప్రపంచమే ఒక నాటక రంగం. ఆవిడ వెళ్లిపోయింది కాబట్టి ఇక నీకు అనర్గళంగా నాటకాల మీద లెక్చరిస్తాను. నోటుబుక్కు తీసుకో. నాటకాలు లక్ష వెరైటీస్. ఒకటి సంస్కృత నాటకాలు...మనం గొప్ప చెప్పుకునేందుకే తప్ప చదువుకుందుకని రాసినవి కావు. ఒక ముక్క కూడా అర్థం కాదు. రెండు సీమ నాటకాలు అనగా ఇంగ్లీషు, ఫ్రెంచి, ఇటాలియన్, జర్మన్ వగైరా దొరల భాషవి. ఇవి చదివి ఇన్‌స్పైయిర్ కావడానికి--అనగా చెక్కెయ్యడానికి, ముఖ్యంగా తెలుగు వాళ్ళకోసం రాసినవి.

వీటిలో పరిషన్నాటకాలు, రేడియో నాటకాలు, రూపకాలు, సినిమాలు వగయిరాలు.

ఇవికాక సినిమా స్క్రిప్టుల్లా ముందేమీ రాసుకోకుండా--అక్కడికక్కడ మాటలనుకుని ఆడేవి. వీటిలో ఎలక్షన్ నాటకాలు, కలక్షన్నాటకాలు, కంట్రాక్టు నాటకాలు (నువ్వనుకునీవి కావు. రోడ్డు, వంతెనలు, ప్రాజెక్టులు, ఆఫీసులు, ఆస్పత్రులూ కట్టే కంట్రాక్టు నాటకాలే) సాహిత్య సంగీత నాటక పరిషన్నాటకాలు, ఉద్యోగ విజయాలు (నువ్వనుకునే తిరుపతి వెంకట కవులవి కావు)--ఇవి వేరు. .

....ఓయ్ చోటయి పోయింది. భావాలు క్రిక్కిరిసి పోతున్నాయి. ఇవాల్టికి లెక్చరాపి నీలాటి రేవుకెళ్ళి, ఎనాటమీ--అనగా సుందర శరీరశాస్త్రం, స్టడీ చేదాం గాని అమ్మనడిగి ఓ పావలా పట్రా సిగార్సుకుంటుంది.



# ఐకమత్యానికి ప్రిరిక్విసిట్ – తేడా!



ఏంవాయ్ మైడియర్ వెంకటేశం! పరగడుపునే మొహం వేలవేశావ్? డ్యూటీ దిగిపోయిన సూర్యుడిలా--జేబు కాళీ అయిన జీతగాళ్లా--ఇంకోళ్లు-- మరోళ్లా--ఆం? ఈదురోమంటూ ఏవిటి నీరసం? ఏవిటా వాలకం? ఇవాళ మన హేపీ బర్త్ డే--బకప్ మై బోయ్! బకప్ అండ్ పికప్ ఎ బుక్ అండ్ పెన్సిల్. రాయ్-నోట్సురాయ్-ఏవిటీ? ఎవరి బర్త్‌డే--అంటావా? మనదేనోయ్! నీది-నాదీ--మన తండ్రి గురజాడ అప్పారావుదీ. ఆ మాటకొస్తే టెలుగూస్ అందరిదీనోయ్! కన్యాశుల్కం నాటకం ఆడి వందేళ్లయిందట ఈ1992 శతజయంతి సంవత్సరం. హేపీ డే. బట్ శాడ్ డే మై బాయ్! మనం బతికి తిరుగుతున్నాం గానీ పూర్ కన్యాశుల్కం చచ్చిపోయింది--కథ మిగిలింది. అందుకని మనం అర్జంటుగా కన్యాశుల్కం ఉద్యమాన్ని, అనగా యంగ్ విడోస్ ఇండస్ట్రీని రెస్టోర్ చెయ్యాలి. పునరుద్ధరించాలి--అనగా తొమ్మిదేళ్ల ఆడపిల్లల్ని తొంభై యేళ్ల ఆస్థిపరులు కొనుక్కు పెళ్లాడే స్వేచ్ఛ యివ్వాలి. వాడు హరీయనగానే వీడు, ఆ గిరీశంగాడు సాహసంతో ఆ పిల్లని పెళ్లాడేసి సంఘాన్ని ఉద్ధరించేస్తాడు. సివిలిజేషన్ మూడుగొలుసులూ ఆరు వడ్డాణాలుగా వర్థిల్లుతుంది.

వ్వాట్! ఛీ అన్నావా! ఆయామ్ షాక్‌డ్ మైడియర్ వెంకటేశం! దిసీజ్ గ్రాస్ ఇన్‌గ్రాటిట్యూడ్. కన్యాశుల్కం, నేరం, ఘోరం, పాపం, అంటావా! ఇడ్డియట్! నేరాలూ ఘోరాలు పాపాలూ లేందే లైఫేముంది! సైకిల్ ఆఫ్ సివిలిజేషన్ అరెస్టయి, స్టన్నయిపోదూ! జీవితం స్తంభించి పోదూ!

అసలు మన పురాణాలూ దశావతార కథలూ ఎందులోంచి పుట్టాయ్? నేరాల్లోంచే గదా. ఒక్కొక్క రాక్షసుడు పుట్టి పేట్రేగిపోతే విష్ణుమూర్తిగారు మత్స్య కూర్మ వరాహశ్చ నారసింహశ్చ వామనః (రహస్యంగా) మీ నాన్న వింటున్నాడా? చూడు--వామనః అంటూ అవతారాలెత్తి వాళ్లని చంపి సెట్‌రైట్ చేస్తాడు. ఏ భయం బాధలు లేకుండా ప్రజలు హాయిగా వుంటారు. భయం కాస్తా పోగానే భక్తి తగ్గిపోతుంది. దేవుడిండస్ట్రీ డల్లయిపోతుంది. అపుడు ఏ బ్రహ్మో శివుడో ఒకడికి వరాలిచ్చి,

పవరిచ్చి, రాక్షసుణ్ణి మాన్యుఫాక్చర్ చేస్తాడు. వాడు చెలరేగి మళ్లీ నేరాలూ ఘోరాలూ ఆర్గనైజ్ చేస్తాడు. మళ్లీ గోవిందా, శ్రీకృష్ణా యదుభూషణా నీ తప్పులమందూ కాపాడరోయ్ అని మొరపెడతాడు.

అంచేత పాపాలూ, నేరాలూ, ఘోరాలూ ఎందుకనడక్కు. అవి లేపోతే పోలీసిండస్ట్రీ, లాయరిండస్ట్రీ, కోర్టులిండస్ట్రీ, ఆసుపత్రులిండస్ట్రీ ఇవన్నీ నాశనమై పోవూ! వాళ్ళంతా నిరుద్యోగులయిపోయి నేరాలూ ఘోరాలూ మొదలెడతారు. కళలన్నీ చచ్చిపోతాయ్.

రెండు ప్రపంచ యుద్ధాలూ లేకపోతే గొప్పసాహిత్యం వచ్చేదా! గొప్ప పొయట్రీ గూఢచారి నవలలూ--సినిమాలూ--నాటికలూ--టీవీలూ--జర్మనీ కొట్టుకు చస్తేనే గదా ఐన్‌స్టయిన్ పుట్టుకొచ్చాడు. యుద్ధం వద్దన్న స్విట్జర్లాండులో ఏవుంది? కుక్కూ క్లాకు!

దొరలెందుకు--మన సంగతే చూడు. రావణాసురుడు లేకపోతే రామాయణం వచ్చేదా? దుర్యోధనుడికి ఆ పొగరు లేకపోతే భారతం పుట్టేదా?

అంచేత రాస్కో--యుద్ధం లోంచే శాంతి పుడుతుంది. బురదలోంచే పద్మం పుడుతుంది. షేక్స్పియర్ అన్నట్లు అవుటాఫ్ పెయిన్ కమెత్ పొయిట్రీ! బాధ లేందే పద్యం లేదు. ఎండలేందే నీడకి రుచి లేదు. ఆకల్లేనిదే అన్నానికి అర్థం లేదు! అవినీతి లేకపోతే నీతికి విలువ నిల్లు.

అలాగే అభిప్రాయ భేదాల్లేందే ఐకమత్యం వర్ధిల్లదు.

ఐకమత్యమే రైటైతే -- ఐదువేళ్ళూ ఒకే సైజులో వుండాలి--కద?

ఆడా మగా తేడా వుండరాదు--కద?

తెలుపూ నలుపూ, పొడుగూ పొట్టీ, లావూ సన్నం, కుడీ ఎడమా వుండకూడదు. ఇందరు దేవుళ్లూ ఇన్ని మతాలూ మార్గాలు ఉండకూడదు.

ప్లేటుకి రెండోవైపు ఉండరాదు. ఫైటుకి ఒక సైడే వుంటే నాలాటి పొలిటీషియన్స్ ప్లేటు ఫిరాయించడం ఎలా?

నేను ఐకమత్యానికి మూలవిరాట్‌ని--ఎలా?

నేను పగలంతా యాంటీనాచ్ వాదిని. రాత్రిళ్లు ప్రోనాచ్చిగాణ్ణి.

ఆ రెండూ నాలో--నాలాటి సంస్కరణ వాదుల్లో కలవటమే కదా ఐకమత్యం--అందువల్ల ఐకమత్యానికి బేసిక్ ప్రిరిక్విసిట్ కండిషన్--తే--డా!

ముడిపదార్థం -- రెం ...డు.

రెండూ వుంటేనే అవి కలిసి ఒకటి అవగలవు.

అది సాధించడం కోసం. 'ఒకటి' నిలువునా చీలి--రెండై--అవి మళ్లీ కలవాలి.

అదే సివిలిజేషన్ సోల్-స్పిరిట్!

రెండుచేతులూ కలిస్తేనే చప్పట్లు.

విడిన మనసులు కలిస్తేనే ముచ్చట్లు.
చప్పట్లు జోరుగా పేలాలంటే రెండు చేతులూ కొట్టుకోవాలి.
ఆ కొట్లాటలోనే ఆనందం వుంది.
ఐకమత్యం వుంది.
తెలుగుతనం వుంది.
రెండు చేతులూ జిందాబాద్!
ఐకమత్యం జిందాబాద్!
ఏదేశమేగినా--ఎందుకాలిడినా--తెలుగు చప్పట్లూ జిందాబాద్!
అన్నట్టు మరచిపోయాను--
చప్పట్లు మరీ గట్టిగా కొట్టకండేం--చేతులు నెప్పెడతాయ్!

1992 ఆటా నాల్గవ తెలుగు మహాసభల్లో జూలై 4న--న్యూయార్క్ వైట్ ప్లెయిన్స్‌లో ముళ్ళపూడి వెంకటరమణ పేరున యస్.పి. బాలసుబ్రహ్మణ్యం చదివినది.



1992. "కన్యాశుల్కం" శతజయంతి ఉత్సవాల సందర్భంగా

బ్రహ్మశ్రీ
నవయుగ వేదమూర్తులయినట్టి



గురజాడ అప్పారావు
పంతులు గార్కి

# గిరీశం నమస్కార భాణం



...తమ మానసపుత్రుడు గిరీశం నమస్కార భాణాలు సంధించి వ్రాయు లేఖార్థములు. ఉభయ కుశలోపరి.

మీకేం మహానుభావా! మా వేషగాళ్ళందరినీ చిరంజీవులుగా భూమ్మీద బతికి చావండని వదిలేసి తమరు మాత్రం జై పరమేశ్వరా అంటూ పొరుగు లోకాలకి పెందరాళే వుడాయించేశారు. తమరు తిరిగీ ఈ భూమ్మీదకి దైచేయాల్సిన పనులుండబట్టే ఈ లేఖ.

ముఖ్యమైందిー- ఈ తొంభై రెండు ఆగస్టు మీ/ మా/ మన కన్యాశుల్కం నాటకానికి హండ్రెడ్డేస్... సారీ సినిమా భాష...హండ్రెడియర్స్! జోరుజోరుగా ఊరూరా గుండె గుండెలో మిమ్మల్ని ఊరేగించుకుని ఉత్సవాలు జరుపుకుంటున్నారు. కష్టాలూ బాధలూ భేదాలూ అన్నీ మరచిపోయి హాయిగా తల్చుకు తల్చుకు విరగబడి నవ్వేసుకుంటున్నారు. ఈ టెలుగూస్‌లో ఐకమత్యం లేదన్న గూస్ ఎవడండీ? ముక్కోటి ఆంధ్రులూ ఒక్క కంఠంతో గురజాడ మావాడు అని సగర్వంగా చెప్పుకుంటుంటే!? అన్నట్లు ముక్కోటేం ఖర్మ మనమిప్పుడు ఆరుకోట్ల ఆంధ్రులం.

గుర్తుందా? లోగడ మీరూ నేనూ--'ద ఇలెవెన్ కాజెస్ ఫర్ ద డీ జేనరేషన్ ఆఫిండియా' మీద ఓక్క బిగిని లెక్చరిచ్చేసరికి మన వాళ్ళంతా ఆశ్చర్యపడి లేచి జెనరేషన్ ఆరంభించి ఆరుకోట్లకి పెరిగిపోయారు!

మీరు రంగనిష్క్రమణం చేశాక చాలా జరిగాయి-ఇండియాకి ఇండిపెండెంసు వచ్చేసింది. తెల్లదొరలు పోయి నల్లదొరలు వచ్చేశారు. ఆఫ్‌కోర్స్! షరా మామూలే.

మన జటకా వాడిక్కావల్సిన హెడ్డు కనిస్టేపు బదిలీ మాత్రం ఇంతవరకు జరగలేదు. గాంధీ, నెహ్రూ, పటేల్, ఆజాద్, పంత్ వంటి పాత్రలన్నీ నిష్క్రమించాయి. కొత్త తరం దేస్సేవకులు విరగబూచారు. మీ పాటని మధురవాణి ముంగురుల్లా కాస్త సవరించి దేశమంటే మంత్రులోయ్ అన్నారు. ఆటల పోటీల్లోకి పాలిటిక్సు దూరిసట్టే--పాలిట్రిక్సులోకి ఆటలు జొరబడిపోయాయి. వోట్లాటల్లో ఘనాపాఠీ దేస్సేవకులు రాటు దేలారు... చాలా మంది దేస్సేవకులకు డబ్బు చేసింది. డబ్బు చేసిన వాళ్ళు (విమానాల్లో) ఎగరడవే దప్ప నడవలేరు గదా! అంచేత పల్లెల్లో ప్రజలని కలవడం, చూడ్డం... ఏమిటలా చూస్తారు. దేస్సేవంటే అర్థం మారింది. షష్ఠీ విభక్తిలోని 'కి' అక్షరంతో విగ్రహం చెప్పడం చెల్లదు. ఇప్పుడు ఫాషన్ 'యొక్క' అను విభక్తి. దేశానికి నేనేం చేస్తానని గాదూ; ఈ గడ్డ మీద పుట్టినందుకు దేశం నాకేమిస్తుందీ అన్నదే వైటల్ క్వెశ్చెన్....అలా చూస్తారేం?....

అన్నట్లు కాస్త శాఖా చంక్రమణం.... మన మధురవాణి జోరీగలా రొద పెట్టేస్తోంది. మీరుండే ఆ స్వర్గంలో రంభలూ గింభలూ బాగుంధారా? సరదాగా వుంధారా? మీరు మరి భూలోకంలో యాంటీ నాచ్ గదా? అక్కడి వాళ్ళేమో ప్రోనాచ్చిగాళ్ళు గదా?... అక్కడ మరి మీరు నలుగురితో పాటు నారాయణా అంటూ ప్లేటు ఫిరాయించారా? అని అడగమంటోంది...ఆ...బాగా చెప్పారు.

నేనూ అదే అన్నా. ప్లేటు ఫిరాయించడానికి మన గురూజీ పొలిటీషియన్ కారు గదా--కవీ రచయితానూ--అంచేత ఆ క్వెశ్చెన్ లేదూ అని చెప్పాను. అంతేగాదూ; అక్కడ ఆ యింద్రుడూ చంద్రుడూ వాళ్ళూ మామూలు నాచ్‌లు గాదూ--బాగా ముదర కేసులూ-వరి వ్యభిచారులు గాదూ--జారులూ... అంచాత వాళ్లందర్నీ ఎటాక్ చేసి పరిమార్చడానికని- 'దిగజారుడు మెట్లు' అని కొత్త నాటకం రాస్తుంటారు అని బుకాయిస్తున్నాను. రైటేనా?

అబ్బ!... సార్! రైటో తప్పో మాటలతో చెప్పచ్చు గాని అలా ఎర్రగా చూసి కాల్చి పారేస్తే యలా?... చూడండి. కమీజు కాలిపోయి చిల్లు పడింది. సర్లెండి చెప్పొచ్చిన పాయింటు కొచ్చేస్తా....

మహాప్రభో! ఈ దాసుడు శాయంగల విన్నపంబులివే. తమరు కన్యాశుల్కం రాసిన దరిమిలాను ఆ సమస్య సిగ్గుపడి చిక్కి సగమై చచ్చిపోయింది. సమస్య చచ్చింది గాని మా నాటకం బతికింది. మేం మిగిలిపోయాం. గానీ--అది ఈసారి వరశుల్కం అనే కొత్త అవతారమెత్తి పెరిగి పేట్రేగిపోతోంది.

మన కన్యాశుల్కం రోజుల్లో ఏదో సాదా సీదాగా ఉరేసుకోడాలూ బావిలో దూకడాలు వగైరా సంసార పక్షపు చావులే ఎరుగుదుం తప్ప--ఈ వరశుల్కం వరస వేరు. కిరసనాయిలూ అగ్గిపెట్టే వగయిరా పరికరాలతో ఆడపిల్లని తగలబెట్టడం రివాజైపోయింది. చూశారా శుల్కం ఏ బాపతైనా శిక్ష మాత్రం ఆడ కూతుళ్ళకే. కాళ్ళకూరి నారాయణరావుగారు వర విక్రయం నాటకం రాసి కోప్పడ్డారు. చాలామంది ఈ సినిమాలు తీసి ఆడించారు. కాని గుణం కనబడలేదు. గుర్రపు

దెక్కలా అలా మొండికేసి బతికేస్తోంది.... ఇపుడు దీన్ని మించి పులి మీద పుట్రలా--దీనికి అనుబంధ పరిశ్రమగా--డిగ్రీ శుల్కం అనే కొత్త జబ్బు వచ్చిపడింది.

పల్లెటూళ్ళలో పాలఘాటులో ఆడ పిల్లల్ని కొనుక్కున్నట్టే కాలేజీలో డబ్బిచ్చి డిగ్రీలు కొనుక్కోవచ్చు. మొన్నటి దాకా మేడినమెరికా పీ హెచ్చిడీలు అమ్మొచ్చేవి. ఇపుడు దేశవాళీ ఇండస్ట్రీలు పెట్టేశారు. లైసెన్స్ టు కిల్ గల జేమ్స్‌బాండు లాగానే ఈ లైసెన్సులు కొనుక్కుంటే బ్రిడ్జీలు పడగొట్టవచ్చు. కోడల్ని నిష్పూచీగా చంపవచ్చు... అఘము బొందదధిప అన్నారు పెద్దలు.

అన్నట్టు వీటన్నింటినీ మించిన మోస్ట్ ఇంపార్టెంట్ బర్నింగ్ ప్రాబ్లెంసు ఇంకా చాలా వున్నాయి.

అబ్బెబ్బే... ప్రజగాళ్ళ దరిద్రం, ఆకలి, దాహం, రోగాలూ.... అవి కావు. అవి బాగా ఓల్డు ఫాషన్ ప్రాబ్లెంసు గదా... అవి ఎప్పుడూ ఉన్నాయి; వుంటాయి; వుండాలి కూడా... నేను చెప్పేవి కొత్తవి. ఫరెగ్జాంపుల్ తిరుపతి విమానాశ్రయంలో వివిఐపిలు అనగా రాజాధిరాజులూ మంత్రాధిమంత్రులూ పెద్ద విమానాల్లో దిగటానికి వీలుగా ఏరోడ్రోముని పెద్దదిగా కట్టడం... కొండ మీదకు అబ్బే నడిచే వాళ్ల గొడవ కాదయ్యా స్వామీ--పాపం బస్సుల్లో కారుల్లో కూర్చుని కుదుపుకి అవస్థ పడకుండా జాయ్‌గా ఎగబాకే ట్రాములూ ట్రాలీలూ చెయ్యడం లాటివి. దానిమీద మేధావులు, నాయకులు, పత్రికలు, రేడియోలు అహర్నిశలూ గిలగిల్లాడిపోయి మాట్లాడేస్తున్నారు. తెగ రాసేస్తున్నారు. అలాగే పాకే బెల్టుల మీద భక్తుల్ని దేవుడి ఎదరగా భక్తుల్ని ఊరేగించాలా, దేవుడినే--మన విజినారంలో చిన్న రధంలా--భక్తుల ముందు పెరేడ్‌చేయించాలా.... లడ్డూ ధర పెంచాలా వుంచాలా--యజ్ఞాలు చెయ్యాలా మానాలా-- ఇలాంటి భయంకర సమస్యలతో దేశం అతలాకుతలం అయిపోతోంది. ఆ తరవాత--మన రోజుల్లో వర్ధిల్లిన కన్నపు దొంగలు కనుమరుగైపోయి కలం దొంగలు పుట్టుకొచ్చారు. అంటే బ్యాంకులు షేర్లు వగైరాలు--వీళ్లతో చిక్కేమిటంటే ఇట్టె ఇట్టె పట్టుబడిపోతున్నారు.. వీళ్ళందర్ని కాపాడడం ఎలా....ప్చ్...నేనిలా రాస్తే మీకర్థం కాదు... మీరు కాస్త దిగి రావాలి. మీకు ప్రైవేటు చెప్పి నాలుగైదు నాటకాలు రాయించగలవాడను.

త్వరగా రండి. రాకపోయారో నరసింహారావుగారు నవ్వినంత ఒట్టు.

ఇట్లు
గిరీశం

దేశం బాగుపడి కులాసాగా నవ్వేదాకా ఆయన నవ్వరు. తెలుసుగదా. - గి





# గిరీశం నమస్కార భాణం-2

హలో మైడియర్ క్రియేటర్ గారూ? అనగా నన్ను కన్న బ్రహ్మదేవుడు గారూ? ఒక చిన్న పొడుపు కథ... ఒక మనిషిని వేణ్ణీళ్ల దేగిసా మీద వేళ్లాడదీసి నోట్లో ఐస్క్రీం పెట్టే రివాజుగల పదవికి ఇక్కడ భూలోకంలో కొత్తగా పేరేం పెట్టారో తెలుసా? 'ఇంద్రభోగం' అని.. ఎంచాతంటారు? మీ గురూజీని కనుక్కు చెప్పండి. వారు కులాసే గద.... వాట్? 'ఇంద్రభోగా'నికి స్వర్గంలో కూడా ముద్దు పేరు పెట్టారా? ఏవిటది?... మంత్రి గిరీయా? భలే అక్కడా ఇదే వరసా? ఆ కుర్చీ కోసం ఎవడో రుషిగాడు తపస్సు చెయ్యడవూ వాడి తపోమంటలు-పొగలూ సెగలూ కక్కుతూ స్వర్గం మీదికి ఎగదన్నడవూ ఇంద్రుడు గారికి సీటు అదిరిపోయి వానలూ వరదలూ రంభలూ గింభలూ పంపి ఈ రుషిగాళ్లని సవరదీయడమూనా....?

పరిపాలన స్థంభించి పోయిందా?

అరె ఆశ్చర్యం... ఈ భూలోకంలో కూడా డిటో డిటోలే ... అయినా కింద నెసరు పెట్టి పాలించమంటే ఎవడి తరం లెండి... ఏవన్నారు? కొత్త దేవేంద్రుడు పవరులో కొచ్చి వందేళ్లేనా కాకుండా డౌన్ డౌన్ అంటున్నారా... దిగి పొమ్మంటున్నారా? ఇక్కడా అదే నండి... ఇట్నించి నిచ్చెనెక్కి సింహాసనం మీద సీటు మోపే లోపల అట్నించి దిగాలి దిగాలంటూ కేకలు....

ఇలా అయితే ఎలా? కుర్చీ ఎక్కినవాడు ఓఖ్ఖ బిగిని ప్రజాసేవలోకి ఉరికెయ్యలేదు గదా!- ముందర తన యలక్షన్ పెట్టుబడీ దానిమీద వడ్డీ దరిమిలా లాభవూ చూసుకోవాలి గదా! తరవాత తనవాళ్లు, ఆనక మనవాళ్లూ, ఆ పైన పొజిషన్ వాళ్లు, ఆ తరవాత అపొజిషన్ గాళ్లూ, పార్టీలో కొందరు వర్కర్లూ ఇలా వడ్డించుకుంటూ వెళ్లి తీరా ప్రజగాళ్ల వరసలో కొచ్చేసరికి దింపేస్తున్నారు. దింపేశాక ప్రజలకేం చెయ్య లేదంటున్నారు. దిగాక ఆ మాజీ మంత్రి కష్టాన్నెవడన్నా ఆలోచిస్తారా? ఏబ్బే!.... పాపం పవరు గిరీ చేస్తుండగా ఆ దేస్సేవకుడికి ఎన్ని కొత్త భోగాలు మప్పుతారో గదా... బంగళాలు, పదేసి కార్లూ, పాతికేసి ఫోనులూ, ఏసీలూ గీసీలూ, లేడీ సెగ్రటీలూ, బాడీగార్డులూ, మందీ మార్బలం -- పూటకి రెండేసి

సన్మానాలూ, పేపర్లో ఫోటోలూ--తీరా కుర్చీ దిగితే ఇవన్నీ లాక్కుంటారు గదా... అబ్బిన అలవాట్లు మరి-పదవులూ పళ్లూ రాలినట్లు ఠపీమని రాలిపోవు గదా... మరి అవి మెంటెయిన్ చెయ్యడం యలా? దానిక్కావలసిన దస్తు గురించి ముందు జాగ్రత్తపడాలి గదా.... ఆ జాగ్రత్తలు పడితే కుంభకోణాలూ చిదంబరాలూ అంటారు. దారుణం... అన్యాయం.. మంత్రుల కష్టాలు ప్రజలకేం తెలుస్తాయి?

మొన్నో కొత్త మంత్రికి ఢిల్లీలో ఇల్లివ్వ లేదుట... ఎంచేత అంటే మాజీ మంత్రులు--కుర్చీలు కాళీ చేశాం గాని ఇచ్చిన బంగళాలు మాత్రం ఇప్పట్లో కాళీ చెయ్యడం కుదరదని బైఠాయించారుట. అందువల్ల తాజా మంత్రులకి బంగళాలు దొరకలేదు. సరేలే పాపం ఆయన తన సొంత యింటి మీదే సర్కారు సొమ్ము పదిహేను లక్షలు పెట్టి బాగు చేయించి గదులు విశాలం చేసి అందులోనే ఓ మూల కూర్చుని మంత్రిగిరీ ఆఫీసుకి చోటిచ్చాడట... ఇంతలోనే గిట్టనివాళ్ళు నిందలేసి హడావుడి పెట్టి కుర్చీ దింపేశారు. ఇంకా నయం. కుర్చీ ఎక్కిన మర్నాడే అమెరికా చెక్కేసి ఒక హార్టాపరేషనూ, వాళ్ళావిడకో కిడ్నీ బదలాయింపూ లాగించేశాడు. సరే దిగిపోయాడు - కాని గోడకి రాసిన ఆ 15 లకారాల సున్నం గీకి తీసుకోలేం గదా... అని అపోజిషన్ వాళ్లు సాధించారు. అది సరే పేద ప్రజల సేవకోసం ఇల్లు పెద్దది చేయించుకున్నానూ ఇప్పుడు ఆస్తిపన్ను పెరిగిందీ అదెవడిస్తాడూ అని పాపం ఆయన గోల... ప్రజాసేవ చేసినందుకు యిదీ లాభం!... ఆయన బాధలు వినగానే గవర్నమెంటు కరిగి కన్నీరై పారింది... సర్లే ఒక పేద సేవకుడికి అన్యాయం చేశారు అని 80 కోట్ల (ఒకరా యిద్దరా?) ప్రజలకి చెడ్డ పేరెందుకు రావాలీ, వాడి వుసురు ఇన్ని కోట్లమందికి ఎందుకు తగలాలీ అని బాధపడి కానీ-సర్లే ఓ ప్రజాసేవకా! నువ్వు పవరులో వుండగా నెలకి ఒకే ఒక్క రూపాయి జీతం తీసుకున్నావు కాబట్టి మేము మా ప్రజలందరం--నీ సొంత బంగళాలో మంత్రిగా నీ కోసం బిగించిన ఐదు ఏసీలూ, ఆరు ఏర్ కూలర్లూ--నాలుగు ఏసీ కార్లూ, రెండు బుల్లెట్ ప్రూపులూ, 12 కాశ్మీరు కార్పెట్లూ, నాలుగు టెలీఫోన్లూ, రెండు కార్నింగ్ వేర్ డిన్నర్ సెట్లు, రెండు ఎలక్ట్రానిక్ టైపు రైటర్లూ, రెండు ఏ.సీ.కార్లు అన్నిటినీ ఒక్క రూ.కే అక్షరాల ఒక్క రూపాయికే ఇచ్చివేసి మా కృతజ్ఞతను ప్రకటించుకుంటున్నాము అని ప్రకటించారు.

ఒక్క రూపాయంటే గుర్తుకొచ్చింది....మొన్నా మధ్య మధురవాణి ఓ కథ చెప్పింది. అనగనగా ఓ అందాల భామ. ఆమెకి తాంబూలం ఇచ్చాట్టో నవ మన్మధుడు. ఎలా గంటే ఆమె రేటు నైటుకి లక్షట! అయినా సరే ఆమెతో పొందు జన్మంతటికీ విందూ అనుకుని ఆ జిల్లాలో రసికులంతా తలో రూపాయీ చందావేసి లక్షా పోగేసి చీటీలు తీశారు. ఒక నవ మన్మధుడి పేరొచ్చింది. వాడికా లక్ష మూటా ఇచ్చి బస్సు ఖర్చులకి విడిగా మూడ్రుపాయలిచ్చి--తమందరి తరపునా ఎంజాయ్ చేసిరమ్మని ఆ అందాలభామ ఇంటికి పంపారు. ఆ సంగతి వాడు రాత్రంతా చెప్పలేదుట. తెల్లవారు ఝామున బస్సుకి బయల్దేరుతూ చెప్పాడు--ఇలా లక్షమంది

తరపున వచ్చిన ప్రేమదూతనీ అని. అందాల భామ ఆశ్చర్యంతో, ఆనందంతో అవాక్కయి పోయిందట... నన్ను వలచిన లక్షమంది ఇలా మూకుమ్మడిగా-- వైకేరియస్‌గా--నీ ఒక్కడి ద్వారా--నన్ను అనుభవించడం అనేది - నా సౌందర్యానికీ, రసికతకూ యమా ట్రిబ్యూటూ - భరించలేని ఆనందంతో నాకు ఏడుపొచ్చేస్తోందీ--ఉండూ--డబ్బు వాపసిచ్చేస్తానూ అంటూ సందుగా పెట్టి తీసి డబ్బు తిరిగిచ్చేసిందిట! ఎంతనుకున్నారు-- లక్షా! ఆశ...లక్షమందిలో ఆకుర్రాడి వాటా చందా ఒక్క రూపాయే గద... ఆ రూపాయి వాపసిచ్చేసింది... అయితేనేం గొప్ప గాదూ ... దానికిచ్చిన సొమ్మూ గోడకి రాసిన సున్నవూ తిరిగి రావని సామెత చదువుతారే!... ఇది చూడండి మరీ? ఎంతటి త్యాగమో!



మధురవాణి సెన్సాఫ్ హ్యూమర్ మరీ పేట్రేగి పోతోందీమధ్య. మా అన్నగారు నులక అగ్నిహోత్రావధాన్లూ జాకాల్ రామప్పంతులూ ఓల్డు బాండీకూట్ లుబ్ధావధాన్లూ వగయిరాలంతా స్వర్గలోక పొలిమేరల్లో తారట్లాడగా చూశారా అని తవర్ని కనుక్కోమంది. అదేవిటి వాణీ నీకేవన్నా మతిపోయిందా అలాంటి పాపిష్టి వాళ్లకి పుణ్యగతులెక్కడివీ అన్నాను. పైవాడు తల్చుకుంటే పాపపుణ్యాల బేరీజులు తారుమారు చెయ్యగలరుస్మండీ!

కోడి పందాల్లో పోరాడి ఓడి చచ్చిపోయిన కోడి పుంజులకే వీరస్వర్గం రంభా, అప్సరా సంభోగం లభిస్తాయిట గదా--రంభనే తల్చుకుంటూ జపతపాలు చేసిన వీళ్లకెందుకు రాదూ అంది. ఆమాటెవరు చెప్పారు నీకు అన్నాను. మహాకవి శ్రీనాధులవారు కోడిపుంజుల మీద చెప్పినట్టు ఓ పద్యం విన్నానూ. అందులో హా ఖగేంద్రము లార కయ్యమున నీల్గి పోవుచున్నారే దేవతా భువనములకు మీరు రంభా, తిలోత్తమా, మేనకాది భోగకార్యార్థమై కోడి పుంజులార! అన్నారు అని చెప్పింది.

ఓసిని! నీకు లుబ్ధావధాన్లతో కల్యాణం గానూ!... శ్రీనాధుడు పద్యం రాసినంత మాత్రాన దేవేంద్రుడు కోళ్లకీ గాడిదలకీ వీర స్వర్గం యిచ్చేసి రంభల మీదకి తోలేస్తాడటే .... అన్నాను.

దానికీ దాఖలు వుంది స్మండీ! ఇంద్రుడు కోళ్లకి ఆ ఛాన్సు ఎందుకిచ్చాడో ఇంటర్నల్ ఎవిడెన్సు ద్వారా--కూపీ లాగడానికి ఆపద్యంలోనే ఒక పాదం వుందీ అంది. హా! అహల్యా జార యఛన హేతువులారా! -- అని సంబోధించారు. కోళ్లని... అనగా అహల్య కొంపలో దూరడానికి కోడి తన రూపం ఎరువిచ్చినది గదా-ఇంద్రు డా మేలు మరిచిపోలేదు. ఆ ధరిమేనా రుషులూ గిషులూ సభలు పెట్టి ఆ చాయలో వున్న కోడిపుంజులన్నిటినీ తరిమి తరిమి సంహరించారు... దానికి ఇంద్రుడు ఎంతో బాధపడి--నేడే కాదు ఏనాడైనా అలా వీరమరణం చెందిన కోళ్లన్నిటికీ వీరస్వర్గం ప్రసాదిస్తూ ఒక ఎమెండుమెంటు చేసి పారేశాడు. కోడిగారి రుణం తీర్చుకున్నాడు... అయ్యా ఇదీ కథ అని చెప్పింది.

అంచేత పవరుగిరిలో వున్న పెద్దాళ్లకి మనం పనికొచ్చే పనిచేసి పెడితే మనకు ఎలాటి బిరుదులూ పదవులూ కావాలన్నా నూకలు జల్లినట్టు జల్లేస్తారు-- అంటూ ఆపళంగా నవ్వసాగింది. ఏవిటా నవ్వు అన్నాను.... దేవతా నాచ్చీలను తల్చుకుని అంది. అటు హఠయోగాలూ, పుణ్యాలూ చేసినవాళ్లూ, తపం గిపం జేసే గడ్డపాళ్లూ, వీరపోరాటంలో మరణించిన వాళ్లూ అదే బాపతూ, ఆ బాపతు కొళ్లూ గుమ్మంలో క్యూలు గట్టి నిలబడిపోతే -- ప్పాపం ... ఫాపం ఆ దేవకన్యలెలా నిభాయిస్తున్నారో... వాళ్లనుభవించేది స్వర్గసుఖాలా నరక బాధలా అంటూ విరగబడి నవ్వసాగింది....

ఓహో అలాటి స్వర్గ సుఖాలను భరించలేక దివినుండి భువికి దూకేసి పారిపోయి వచ్చిన అప్సరస ఒకత్తె నాకు తెలుసు అన్నాను.

ఎవరా ధాణీ? అంది

ఇంకెవరు మధురవాణి అన్నాను.

విరగబడి నవ్వింది.

ఇట్లు
గిరీశం





# గిరీశం నమస్కార భాణం - 3

బెంగుళూరు బంగారప్పగారు రెండేళ్ళ పండగ లాగించేస్తాననగానే ఒద్దురోయ్ అంటూ అయినవాళ్ళూ, కానివాళ్ళూ కూడా గోల చేశారు. సీయమ్ కుర్చీ ఎక్కి నువ్వు సాధించిందేవిటని నలుగురూ నిల్దీస్తారనీ బెదిరించారు. ఆకుర్చీమీద రెండేళ్ళుండటమే గొప్ప అన్న సంగతి ఈ గిట్టనివాళ్లు మర్చిపోయారన్న మాటే గదా. మాట వరసకి మన వూరే తీసుకుందాం. అయ్యకోనేటిగట్టు దగ్గర ఆడపాప గడకట్టి దానిమీద కెగబాకి గడకొసమీద బొడ్డునమర్చి బోరిగిళా పడుకుని కాళ్ళూ చేతులూ బారజాచి కసరజ్జేసి దిగిపోయొస్తే నువ్వేం సాధించేసీవే గుంటకానా అని మనమెవ్వళం ఎద్దేవా చెయ్యలేదే! ... నిజానికా నాలుగైదు నిమిషాల్లో చుట్టూ మూగిన నేలబారు ప్రజగాళ్ళంతా గుడ్లప్ప చెప్పి నోరెళ్ల బెట్టి చూస్తూ చప్పట్లు కొడుతూ ఆకలి దప్పికలు మర్చిపోయి పక్కవాళ్ళు తమతమ జేబులు కత్తిరించేస్తుంటే కూడా పట్టించుకోలేదు. ఆ గడసాని అయిదారు నిమిషాలు ఆకలిదప్పులు మరిపిస్తే ఈ బంగారుసామి రెండేళ్ళపాటు ఆ కుర్చీమీద కసరజ్జేస్తూ అందరికీ ఆకల్దప్పులూ, అవసరాలూ మరిపించేడు గదా? ఆకలీ, నీరూ ఎవడూ అడగలేదు గద--వీడెప్పుడు పడతాడో ఎలా పడతాడో అన్న ఝూసే దప్ప ఇంతకన్నేం గావాలని...ఇంతా కన్నా నందమేమీ అని....

లోగడ దశరథులవారు అయోధ్యని అరవై వేల ఏళ్ళు పాలించి వారికే బోరుకొట్టి రాముల వారికి రాజ్యమిచ్చేసేట్ట... అప్పట్లో దిగిపో దిగిపో అండాల్లేవుగాని ఆయన దిగుతాననగానే జనం తొందరపడి చప్పట్లు గొట్టీసేరు. పెద్దాయన కనుమానం వచ్చి అడిగీశాట్ట. ఏవర్రా! ఏమిటి నేనంత బోరుకొట్టానా అని. అబ్బెబ్బే కాదు మీరు దిగుతారని కాదు. అబ్బాయిగారు ఎక్కుతున్నందు కీ చప్పట్లూ ఆవటాన్నారుట ప్రజలు--

ఆ ధరిమేణా రాములవారు పదకొండు వేల సంవత్సరాలు పాలించి కుర్చీ దిగడం మర్చిపోయారు. చివరికి స్వర్గం నించి దూర్వాసుడి ద్వారా కబురొచ్చింది. అయ్యా విష్ణుమూర్తిగారూ తవరు పరాకు చిత్తగిస్తున్నారూ, వైకుంఠానికి తిరిగి వచ్చే వేళ దాటి చాలాకాలమైందిస్మండీ అని....

యుగం ఫిరాయించాక ధర్మరాజుల వారు పాతిక ముప్పైయేళ్లు పాలించారు. నూటికి తొంభై మంది కురుక్షేత్రంలో ఖర్చయిపోయినందువల్ల తిండి గింజలకు లోటులేక ఆకలి బాధలు కొన్నాళ్ళు గైరు హాజరు వేశాయ్. ఆ ధరిమేణా వచ్చిన పాదుషాలు మూడు నాలుగు పుంజీల యేళ్ళూ, నెహ్రూగారు నాలుగు పుంజీలూ ఇలా తగ్గిపోతూ వచ్చాయి. మధ్యలో ఆ తెల్ల దొరలు కాస్త నిలకడగా జెండా ఎగరేశారనుకోండి...

ఏతావాతా చెప్పొచ్చేదేవిటంటే అసలు రాజ్యపాలన అనగా ప్రజలు ఆకలిదప్పికలు రూపుమాపడంగాదు. ఆకలీ దప్పికా ఎప్పుడూ సూర్యచంద్రుల్లా వుండేవే. వాటిని కాసేపు మరిపించి అల్లిబిల్లి గారడీ చెయ్యడవే పరిపాలన. జనాలు వాళ్ళ తిప్పలు వాళ్ళు ఎప్పుడూ పడుతూనే వుంటారు. మళ్లీ గవర్నమెంట్లు పెడుతూనే వుంటారు. అసలీ గవర్నమెంట్లు ఎలా వచ్చాయో తెలుసా... తవరు రాజరికాల రోజులవారు... అందువల్ల ఇటీవలి సంగతులు దఖలు పరుస్తున్నాను....

అనగనగా ఓ గదిలో రెండరటి పళ్ళూ రెండెలకలూ. రెండే కాబట్టి రెండూ హాయిగా ఇల సాటిలేని జంటలా దూయెట్లు పాడుకుంటూ భోంచేశాయి చెరొక పండూను. ధరిమేణా పళ్ళు రెండే గాని ఎలకలు ఇరవై జేరాయి. కొట్టుకు చావడం మొదలెట్టాయి. ఇది పనిగాదని పిల్లిని పిలిచి ఓ గవర్నమెంటు పెట్టాయి. పిల్లి చూసింది. ఎలా సర్దినా వీటికి చాలదని చెప్పి తను దిని తన పిల్లలికి పెట్టింది. అదీ చాలక పిల్లలేడిస్తే ఓ నాలుగెలకల్ని కూడా లాగించేసింది. మిగతా ఎలకలు అజ్జూసి హడలి చచ్చి వూరుకున్నాయి. ఆ భయంతో ఆనక పెట్టిన అరపండులోనే సర్దుకుని సారా తాగి నిదరోయాయి.

అసలు సృష్టిలో మొట్టమొదటి గవర్నమెంటు ఎలా పుట్టిందో తమకు తెలిసే వుంటుంది. దేవతలూ దానవులూ అమృతం కోసం సముద్రాన్ని మధించారు గదా! దేవతలు గడుసుగా ఓ గేమాడారు. తాము వాసుకి పాముని తలకేసే పట్టుకుంటామని.... అప్పుడు దానవులు అదేదో గొప్పనుకుని అబ్బే ఆ తలకాయ సైడు మాకే కావాలన్నారు. పొగలూ సెగలూ కక్కే తలని అసురులూ, నీటుగా వున్న తోకని సురలూ పట్టుకు లాగారు. ఆ ముహూర్తం వచ్చింది. పోయి స్నానం జేసి మడిగట్టుకు రండన్నారు అసురుల్ని. మరి మీరో అన్నారు. మేము దేవతలం మాకు చెమట పట్టదు గదా స్నానాలక్కర్లేదు అన్నారు. వాళ్ళు వచ్చేలోపల కుట్ర జేశారు. వీళ్ళు అమృతం తాగితే ఇక చావరూ. కంట్రోలు చెయ్యలేమూ ఎలాగా అని విష్ణుమూర్తిని పిలిచారు. ఆయన అలాక్కానీండని మోహినీ అవతారం ఎత్తాడు. మీరంతా అటూ యిటూ వరసగా కూచోండర్రా నే పంచుతాను అంది మోహిని. అసురులు డంగైపోయి అలాక్కానీమన్నారు. మోహిని మాంచి డాన్సాడుతూ ఒకే కుండలోంచి ఇటు దేవతలకు పాలూ అటు రాక్షసులకు పాపాలూ వడ్డించి పారిపోయింది. అదిగో అదే స్వామీ గవర్నమెంటు...వంద మంది నోరుకొట్టి ఒకళ్ళిద్దరికి శుభ్రంగా మేపడం అంటే తాత్పర్యం ఏమిటి? పాపం నోరు లేని

మైనారిటీ వర్గాల్ని ప్రజా బాహుళ్యం అనే రాక్షసుల బారి నుండి కాపాడ్డం.... మొన్నమెరికాకి కాబోయే అధ్యక్షుడు క్లింటన్ చెప్పాడు--పన్నెండేళ్ళుగా రేగనూ బుష్షూ కల్సి - 90% జనాభా గాళ్ళని కంట్రోలు చేసి 2% మైనారిటీ వర్గానికి 7600 కోట్ల డాలర్లు అనగా రెండు లక్షల 28 వేల కోట్ల రూపాయలు పన్ను తగ్గించి పెట్టారు. నోరుండి కలముండి రాసే మిడిల్ క్లాస్‌వారనే 8 పెర్సంట్ గాళ్ళకి కాస్త అటూ యిటూగా చిరుతిండి పడేశారు. కడమా 90 మందికీ మనం త్యాగాలు చెయ్యాలీ, జీతాలు తగ్గించుకోవాలీ, ఎక్కువ పన్నుల కట్టాలీ లేకపోతే కమ్యూనిజం మళ్ళీ వచ్చేస్తుంది జాగర్తా అని భయం చెప్పారు. మనకూడా ఇండియాలో నల్ల దొరతనాలూ వాళ్ళ కాళ్లకింద కార్పొరేషన్‌లూ చంకల్లో బాంకులూ ఇలాగే మైనారిటీ వర్గాల సేవలో అహోరాత్రాలు కష్టపడుతున్నాయి. చేతగాని సన్నాసులు దొరికి పట్టుబడిపోతుంటే పొజిషన్ వాళ్ళూ, అపొజిషన్ వాళ్ళూ అంగోలాలో ఆకలీ, సోమాలియాలో చావులూ, దేవుడి గుళ్ళూ గోపురాలూ, రేపులూ, కామాపులూ వగైరా గడమీద కసరత్తులు చేసి వాళ్ళని కాపాడుతున్నారు. ముసిలి నాయకులంతా రోజూ పవిత్ర ప్రకటనలు ప్రపంచిస్తున్నారు. శాంతి వర్ధిల్లాలనీ మనం ఐకమత్యంగా వుండాలనీ అబద్ధాలను చెప్పకూడదనీ నిజాలు చెప్పాలనీ ఏది అబద్ధం ఏది నిజం ఏ నిజాన్ని ఏ పాళ్ళలో ఎప్పుడు చెప్పాలీ అనేది సూత్రీకరించడానికి త్వరలోనే కమిటీలను కమీషనులను వేస్తామని అంతేకాక ఆకలి బాధ గురించి వాకబు చేయడానికి 32 కమిషన్‌లను వేసి దేశ దేశాలకు పంపిస్తున్నామనీ చెబుతున్నారు. ఆ మధ్య 700 మందిగల గ్రామానికి 70వేలతో రక్షిత మంచినీళ్ళ పథకం అమలుచెయ్యడంలో మోసాలు దగాలు జరక్కుండా కోటి రూపాయల కర్చుతో ఓ కార్పొరేషన్ పెట్టి దానికి ఛైర్మన్, డిప్యూటీ ఛైర్ పర్సన్ (పర్సన్ అనగా స్త్రీ లెండి) ఎం.డి, సెగట్రీ, డెప్యూటీ, అండర్ సెగట్రీ వగైరాలను నియమించారు. ఇంత జాగర్తపడి చస్తుంటే గిట్టనివాళ్ళు దిగిపో దిగిపో అంటున్నారు మరి.

అబ్బా.... వుండు మధురవాణీ... చెప్తే నీగ్గాదూ... గురూజీతో మాట్లాడుతున్నా.....

ఏవిటీ? చెప్పమంటారా... ఇదీ ముఖ్యమైందేలెండి. ఈ గవర్నమెంటు లిటిగేషన్‌ల గురించి ఆనక చెప్తాను. ఈ కథ నాది కాదండోయ్ మధురవాణి చెప్పింది.

పై బాపతు మహాసంస్థల్లో ఒక షావుకారుగారు ఆఫీసులో అయిద్దాటి ప్రజాసేవ చేస్తున్నాట్ట. ఠకీమని లైట్లు పోయి ఝుడుసుకున్నాడు. ఆయన గారి సెగట్రీ వెన్ను చరిచింది. అయినా భయం తగ్గలేదు. ఎలాగైతేనేం ఆ పిల్ల కష్టపడి భయం పోగొట్టింది. ఆనాట్నించి రోజూ ఆఫీసులో పేదప్రజాసేవలో కరెంటుపోడం, ఆయన భయపడ్డం, ఆ పిల్ల ధైర్యం చెప్పడం ఇలా జరిగింది. ఒకనాడు చీకట్లో ఆయన తన రుమాలు తీసుకోబోయి ఆ పిల్ల బాడీని కోటు జేబులో వేసుకు ఇంటికెళ్ళాడు. ఇల్లాలు గొల్లుమంది. ఎవరీ బాడీ ఏమా కథ-అంది. పర్సు తీస్తే అందులో తన

ఫోటో వెనకాల ఆ బాడీ పిల్ల బొమ్మ కూడా వుంది. ఆయన అలవాటుకొద్దీ ఈ సంగతిపై ఓ కమిషన్ వేస్తాననబోయి నాలిక్కరుచుకుని నిజం చెప్పేశాడు. చూడు నాకు 59 ఏళ్ళు. నీకు 52. మనకి ముగ్గురు పిల్లలూ నలుగురు మనవలూను. ప్రకృతి నీకు సుఖాలు చాల్లే అంది. నాకింకా అనలేదు. ఏదో భూతశాంతి కోసం ఆపిల్లని ధైర్యం చెప్పనిస్తున్నా. నీకేం అన్యాయం చెయ్యను. రేపే ఓ లక్ష రూపాయల నెక్లెసు, నాలుగున్నర లక్షలు పెట్టి మారుతీ తౌజండూ కొనిపెడతాను. రేపే ఫైవ్‌స్టార్ హోటల్‌కి భోజనానికి తీసుకు వెళ్తాను. సరేనా అన్నాడు. ఆ ఇల్లాలు జాలిపడి సరే అంది. మర్నాడు అన్న ప్రకారం ఆయన నెక్లెసూ, కారూ కొనిచ్చి ఐదు నక్షత్రాల హోటలుకి తీసికెళ్ళాడు. ఆవిడ పొంగిపోయింది. భోజనం ముగిసి ఐస్క్రీం లాగిస్తుండగా అంత దూరంగా తన భర్తగారి నేస్తాన్నీ ఆయనతో ఓ చక్కని గుంట పిల్లనీ చూసింది. హవ్వ! మన రావుగారండీ! పక్కనా పిల్లె వర్తో అంది.

ఈనగారు చిరునవ్వి భార్య వీపు తట్టాడు. చెప్పొగా ఆయనా నాలాటి కేసే...ఆ పిల్ల ఆయన ఫ్రెండు. ఆయనకి వెన్నూ అదీ తట్టి ధైర్యం చెబుతూ వుంటుంది అన్నాడు. అలాగా అంటూ ఆవిడ అటే నాలుగు క్షణాలు పరిశీలనగా చూసింది. మొగుడి జేబులో పర్సు తీసి అందులో తన సవితి ఫోటో చూసింది. మళ్ళీ అటు చూసింది. తృప్తిగా నవ్వింది.

మన సవితే బావుందిస్మండీ అంది కన్నులరమోడ్చి

ఇట్లు,
గిరీశం



# గి.న.భా.ఉ-4



టైటిల్ మార్చేశావేవిట్రా గిరీ అంటున్నారా? చిత్తం. పొదుపండి. దేశమంతా ఇదే ఫాషను. గిరీశం నమస్కార భాణాలూ అంటూ పెద పేద్ద అక్షరాలతో హెడ్డింగు అచ్చు వెయ్యడం వల్ల ఎంత చోటు వేస్టవుతోందీ అంటూ శ్రీ పొదుపు కమీషన్ వారు కోప్పడి పై విధంగా సూచించారు పొడక్షరాలతో సర్దుకోవలసిందని. వారు అమెరికా, ఆఫ్రికా, ఆసియా ఖండాలన్నీ పర్యటించి, పరిశీలించి, పరిశోధించి పై తీర్పు చెప్పారు. ఆ టైటిల్ కన్నా నా సంజాయిషీయే ఎక్కువచోటు ఆక్రమించిందీ అంటారా అలాక్కానీండి. తమలాటి గిట్టని వాళ్ళకి మేవేం జేసినా నచ్చదు మరి. రూల్సంటూ పెట్టాక వాటిని శిరసావహించాలి గద! హు!

మొన్న ఒహ పేద్ద పబ్లిక్ కార్పొరేషన్‌కి ఛైర్మనుగా ఒక వాసుదేవరావుగార్ని వేశారు. మరి వారికి ఢిల్లీలో బస కావాలి కదా? ఆ కార్పొరేషన్ రూల్సు ప్రకారం ఛైర్మన్‌గారికి ఇంటద్దె క్రింద రూ.5,500/- కన్నా ఒక దమ్మిడీ ఎక్కువ ఇవ్వరాదు. ఢిల్లీ అంతా వాకబు చేసినా వారి ఫాయాకి తగిన ఇళ్ళు పాతిక వేలకి లోపు లేవు. ఇటు రూల్సు చూస్తే అయిదున్నర వేలు దాటరాదు. ఈ సంకట స్థితిలో కొంప దొరికేదాకా ఛైర్మన్ గారినెక్కడ పెట్టాలా అని బుర్రలు బద్దలు కొట్టుకుని అందాకా అశోకా హోటల్‌లో వుంచుదామన్నారు. అశోకా కూడా సర్కారు ఇలాకా లోదే. సిస్టరు సంస్థ... అక్కడ ఒక స్వీటుకి 3 వేల అద్దెట.... ఒక స్వీటు అంటే రెండు బెడ్రూములూ రెండు డ్రాయింగు రూములూ, నాలుగు బాతురూములూ, ఒక దొడ్డిదారీ, ఒక చిన్న డాబా వుంటాయి. రెండు స్వీట్లు తీసుకొంటామని బేరం పెట్టి రెండు మూళ్ళారు వేలనీ రూల్సు ప్రకారం ఐదున్నరకు కుదించి ఒప్పించారు. కాపోతే ఒక్కటే చిన్న తేడా. రూల్సు ప్రకారం ఇంటద్దె నెలకి అయిదున్నర--హోటలు రూల్సు ప్రకారం రోజుకి అయిదున్నర.... రూల్సు ప్రకారం అయిదున్నర అన్న ఫిగరే ముఖ్యం. నెలా, రోజా గంటా అన్నది కాదు. ఈ విధంగా ఛైర్మన్‌గారి బసకు నెలసరి

అద్దె లక్షా అరవయ్యయిదు వేలూ సోడాలూ బీడాల ఖర్చు (భోజనంలో రాయకూడదు రూల్సు ప్రకారం) మరొక నలభై వేలూ... వెరసి రెండు లక్షలు అయింది. రేపు పియ్యేసీ వాళ్ళు కోప్పడినా - పిచ్చివాళ్ళలారా అది దుబారా కాదు-రూల్సు ప్రకారం ఇంటద్దెకు గాను ఇవ్వాల్సిన అయిదున్నర వేలూ ప్రభుత్వానికి మిగులే గదా అజ్ఞాసుకోరేం అని ఠంగున జవాబివ్వచ్చు.

అయినా గిట్టని వాళ్ళు ప్రభుత్వాన్ని కోప్పడుతూ పేపర్లో రాసి పారేశారు. వాళ్ళ మొహం. దెయర్ ఫేస్! వాళ్ళలాగే మీరు కూడా ఇది తప్పంటారా? అంటే - జాన్ మేజర్ 10, డౌనింగ్ స్ట్రీటు ఇంటిని మేగీథాచర్‌కు అద్దెకిచ్చినంత ఒట్టు! అది విని పీవీజీ నవ్వినంత ఒట్టు!

❀ ❀ ❀ ❀

తమ దయవల్ల కన్యాశుల్కంలాగె వరశుల్కం కూడా చిక్కి శల్యమైనా బతికి బట్టగట్టే మారు వేషంలో తిరుగుతోంది.

ఈమధ్య ఓ మంత్రిగారూ, షావుగారూ (షావుకారు గారుకి పొదుపు రూపం) వియ్యమందాలనుకున్నారు.

నేను చచ్చినా కట్నం ఇవ్వను. మా తాతగారు మంత్రి అయినప్పట్నించీ పబ్లికున కమిటై పోయా అన్నారు మంత్రిగారు.

కట్నం లేపోతే నేను చచ్చినా పెళ్ళి కొప్పుకోను. ఇది తరతరాలుగా మా వంశాచారం అన్నారు షావుగారు.

మంత్రిగారు నవ్వేశారు. కట్నం అంటే కాషే గదయ్యా అది నేనిస్తే నేం నాసేవలు పొంది నాకు రుణపడ్డ నా ప్రజలిస్తేనేం అన్నారు....

అంటే చందాలు పోగేస్తారా ఛీ.... అన్నారు షావుగారు.

అలాగ్గాదయ్యా, నేను అల్లుడి కంట్రోల్లో వుండేలా--రెండు మెడికల్ సీట్లు, రెండు డెంటల్, ఒక మెంటల్ సీటూ కేటాయిస్తాను మీరు రొక్కంగా ఫిరాయించుకోవచ్చు.

రెండు మెడికల్ అంటే ఏడెనిమిది లక్షలనుకుందాం, డెంటల్ రెండంటే నాలుగూకాని-- మెంటల్‌సీటుకేమొచ్చి చస్తుందీ పిచ్చాసుపత్రేగా-- అన్నారు షావుగారు.

షావుగార్లయి వుండే తమరలా అనడం ఆశ్చర్యంగా వుంది.... మెంటల్ అంటే నా అర్థం ఒక మనిషికి పిచ్చెక్కిందా లేదా అని తీర్పు చెప్పే ఫైనల్ అధికారం. దివాళా పెట్టదలచుకున్న కోటేశ్వరుడు--ఆ సర్టిఫికేట్‌కి పాతిక లకారాలైనా ఇస్తాడు. అలాగే సుబ్బరంగా వున్న ఓ కోటేశ్వరుడి విడోని లోపలికి తోయించాలంటే-- సగానికి సగమిస్తారు బేవారసులు. ఇదంతా అల్లుడిగారి అదృష్టమే గదా అన్నారు మంత్రిగారు

షావుగారు గంభీరంగా తలవూపారు సంతోషం పైకి చిందకుండా. అది సరే.... మరి అత్తగారూ ఆడపడుచుల లాంఛనాలూ? అన్నారు.

ఆడపడుచులు నలుగురున్నారుగా. అక్కగారితో కలిపి అయిదుగురు. వాళ్ళలో వాళ్ళని ఎలాగేనా సర్దుకోమనండి. నేనిచ్చేవి ఈ క్రింది పవర్సులు. రెండు ఎస్సై వుద్యోగాలూ, రెండు చెక్ పోస్టులూ, రెండు సీటీవో పోస్టులు వాటి బదిలీ పవర్సులూ నాలుగు టీచర్లు-అందులో రెండు జెంట్సులూ రెండు లేడీసులూను.

అబ్బో ఇది భలే అన్నారు షావుగారు ఆనందంతో... బదిలీల పేరు జెప్పి జంటల్ని చెరో వూరికీ వేసి విడదీస్తానని భయపెట్టచ్చు. ఒక్క వూళ్ళోనే వుండనిస్తానని ఆశ పెట్టచ్చు. చక్కగా వుంది....పూర్వం ఆవులూ గేదెలూ ఇచ్చేవారు. అవేముంది పాలిస్తాయి. పేడేస్తాయి.... అబ్బో ఇది బెమ్మాండం. వీళ్ళకే ఇలా ఇచ్చారుఁ ఇహ మీ వియ్యపురాలికేఁ విస్తారో.

అమ్మమ్మ తక్కువ చేస్తానా అనాథ శరణాలయాలు రెండు, వికలాంగ సెంటర్సు రెండూనూ--బెనిఫిట్స్ అవీ పెడితే--

ఇహ చెప్పకండి....పుణ్యం పురుషార్థం రెండూను. దేస్సేవ రంగు వుంటుంది. పేపర్లలో ఫోటోలు ఫ్రీగా అచ్చేస్తారు. అన్నట్టు బావగారు అందరికీ ఇచ్చి మా మనవడిని వదిలేశారు. వయస్సు పదేళ్ళేగాని దేవాంతకబ్బుర్ర. తొందరపడకండి సార్.... మాకూ వున్నారు మనవళ్ళు..... మాపార్టీకి మహిళా వింగు, యూత్ వింగూ వున్నట్టే రేపు బాలిండియావింగుని ఓపెన్ చేస్తున్నాం. మన వాళ్ళకి ఎల్కేజీ యూకేజీ స్కూళ్ళు ఇచ్చేద్దాం....

"స్కూళ్ళా!" అన్నాడు షావుగారు నీరసంగా.

"భలేవారే.... లైసెన్సు రావాలేగాని కాలేజీల కన్నా లాభసాటి...రూల్సులూ బాదర బందీలూ తక్కువ. సీటుకి అయిదు నుంచి పదివేల దాకా పలుకుతుంది"

ఢాం! హచ్చా-!....

వార్నీ! ఇవా! నువ్వా!

అయ్యిగుర్రూజీ ఈ బాంబుల చప్పుడేమిటని భయపడకండి. నేనూ ఝుడుసుకున్నాను గాని మరేం లేదు.... ఇందాకళో హాస్యకవిగారు సంచి నిండా సెటైర్లు పట్టుకొచ్చాడు నాకు వినిపిద్దామని. మన కబుర్లు వినగానే అవి ఢాం ఢాం మని పేలి పంచరై పోయాయి. కవిగారు గల్లంతై పోయాడు.

అయ్యా ఇప్పుడు చెప్పిన కట్నాల కథని తమరు రుజువు చేసి ప్రాసిక్యూట్ చేయగలిగ్తే-బోఫోర్సు సాల్వయినంత ఒట్టు.

శ్కామ్ అనగా ఏమిటని డిఫైన్ చెయ్యడానికి నిఘంటువు వాళ్ళూ కమిటీల వాళ్ళూ గింజుకుపోతున్నారు.

"ఏ వుందిషా? నీ బాంకులో డబ్బు కాస్సేపు నా జేబులో వేసుకు ధంకా

పలాసు. నాలుగాటలాడుకోడం--ఆనక నీ వెధవ డబ్బు నీ మొహాన కొట్టడం" అని ఠంగున చెప్పేశారు రామప్పంతులుగారు.



నిజమేగాని శ్కామ్‌సుందరుల జోరు పెరిగాక అటు గవర్నమెంటు వారూ ఇటు రిజర్వు బ్యాంకు వారూ వారిని బట్టి తతిమా బ్యాంకుల వాళ్ళు కూడా రూల్సుని ఇనపకచ్చడాల్లా బిగించేశారు. చాలా ఖచ్చితంగా అమలు చేస్తున్నారు.

మొన్న ఒక రైతు బాంకీకి వెళ్ళి అయ్యా నా చేను పక్క దిగుడుబావికి పూడిక తీయించుకోవాలీ ఐదొందలు అప్పిస్తారా అని అడిగాట్ట.

బాంకు వాళ్ళంతా ధామ్మని మూర్చపోయి లేచారు.

"నీకేవన్నా బుద్ధుందా బక్కరైతూ!? ఇలాటి దిక్కుమాలిన అప్పులిచ్చి దేశాన్ని అధోగతి పాలు చెయ్యొద్దని శ్రీ గవర్నమెంట్లూ పెద్ద బ్యాంకుల వాళ్ళూ తీవ్రంగా హెచ్చరించి రూల్సు బిగించి పారేశారు.... అంతగా నీకు అవసరమంటే ఓ పదివేల బావులు తవ్వుకోవాలని జెప్పి దరఖాస్తు పడేసి నాలుగైదు కోట్లు పట్టుకు పో....దాన్ని గురించి నిన్నెవరైనా హన్నా అంటే ఆర్బీఐ మీద ఒట్టు" అని చెప్పారట.



ధ్వని అలంకారం లావుపాటి బొక్కుల్లోనే వుంటుందనుకునేవాడిని. అది ప్రజల జీవితాల్లో చక్కగా చెలామణి అయిపోతోంది. మొన్న మధురవాణి ఎరిగున్నపిల్లని ఓ రోమియో దగా చేసి దెబ్బ కొట్టాట్ట.

"ఆ పిల్లక్కడుపు జేశావట గదా... కాదంటే ఎలా?" అని మధురవాణి నిలదీసి అడిగింది.

మహాప్రభో చీకట్లో ఎవడిని జూసి ఎవడనుకుందో--నేను గాదు. నేనా పిల్ల మొహమే చూళ్ళేదు. చూస్తే మర్చిపోనుగదా అని బుకాయించాట్ట.

"నీ కింత మహాలావు జ్ఞాపకశక్తి వుందే.... నేనూ నిన్నెరుగుదును. ఐదో యేట ఏం జరిగిందో చెప్పు" అంది మధురవాణి తమాషాకి.

వాడు తడుముకోకుండా ఐదో యేట, మూడో ఏట, ఆర్నెలప్పుడూ ఏవేం జరిగాయో పూసగుచ్చినట్టు చెప్పేశాట్ట.

అంతట మధురవాణి ఓ రస్సా వేసింది.

"ఆరోనెల సంగతులు సరే అంతకు 15 మాసాల క్రితం ఏం జరిగిందో చెప్పగలవా" అందిట...

వాడు "15 మాసాలా అదీ అదీ..." అంటూ కొంచెం బుర్రగోక్కున్నాడు.

అదేనయ్యా ఆ రోజున నువ్వు మీ నాన్నతో పొలాలకెళ్ళి మీ అమ్మతో ఇంటి కొచ్చావు అది గుర్తు లేదూ అంది.

ఓహో అదా...బలేదానివే అవి గుర్తులేకేం. ఆవేళ పెద్ద గాలివాన కూడా అన్నాట్ట వాడు.

అదే అదే ఆ ధరిమేనా మా అమ్మా నాన్నా మళ్ళీ కలిసినట్టు లేదను. ఒకవేళ కనిపిస్తే వాళ్ళకి పెళ్ళి చెయ్యి. చేస్తే నాక్కబురు చెయ్యి. నాలుగక్షింతలు వేస్తాను అందిట.

నేనే గెలిచాను - గీ.

గిరీశం లెక్చర్లు

## ది మోస్ట్ బర్నింగ్ ప్రోబ్లెమ్ ఆఫ్ టుడే టుమారో అండ్ ఫరెవర్



హలో మై డియర్ వెంకటేశం! ఏమిటలా పేపరుచాటున తల దాచేసుకున్నావ్... నీక్కూడా నాలాగే "లోన్ వుల్వ్స్" - అనగా అప్పులవాళ్ళ బాధ వుందా... లేపోతే కొంపదీసి ఒకవేళ న్యూసే చదివేస్తున్నావా? నిజవేఁ? మైగాడ్! దిస్-ఐతింక్ - ఈజ్ ది ఎండాఫాల్ పోలిటిక్స్.... ఇలా అడ్డమైన వాడూ పేపర్సు చదివేసి పాలిటిక్స్ ఒంటబట్టించేసుకోబట్టే కంట్రీ ఈస్థితికి వచ్చింది. మినిస్టర్లు నానా అవస్థా పడుతున్నారు. పాలిటిక్సంటే ఏ పదిమంది చేతుల్లోనే ఉండి గుంభనగా ఏడవాలి తప్ప ఇలా బజారుకెక్కిపోతే ఇంకెలాగంట.... దేశం మేలుకోరేవాళ్ళు రెస్పాన్సిబుల్ సిటిజెన్స్ చెయ్యవలసిన పనేనా ఇది? ఇవన్నీ చదివెయ్యడమూను - అదేమిటి ఇదేమిటి అంటూ అడ్డదిడ్డమైన ప్రశ్నలు వెయ్యటం, విమర్శలు చెయ్యటం అవతల జనాన్ని తికమకపెట్టటం... వాటీజ్ దిస్? డెమాక్రసీ?...

మొన్న శ్రీ చీఫ్‌మినిష్టరు గారన్నట్లు విమర్శలంటే - ఏదో మన్దీ ఓ డెమోక్రసీ గాబట్టి, ముచ్చటగా ఎప్పుడేనా ఓసారి "అదిగో మీరల్లా అనడం బావులేదూ, ఇలా చైడం బావులేదూ, కూడదని గాదుస్మండి, నా వూహ చెప్పా ఆపైన మీ ఇష్టం" అని వూరుకోవాలి. అంతేదప్ప అదేపట్టుకు వేళ్ళాడి యాగీచేస్తే ఎలా? ఎలా గంట?...

అసలీ పాలిటిక్సంటే నీకేం తెలుసునని. గట్టిగా అడిగితే మీ నాన్న దగ్గరో మస్కావేసి సిగార్సుకో రూపాయి పుట్టించలేవు. నువ్వా ఇవి చదివి మాటాడ్డవేనా అని. ఏదీ చూతాం. ఘంటాయి చదువుతున్నావు గదా. వాటీజ్ ది బర్నింగ్ ప్రాబ్లెమాఫ్ ది డే?... ధరలా? మతాబాలా?- ప్రణాళికలా - కట్నాలా? కాకరకాయలా? ఉద్యోగాలా? జీవితాలా? ధర్మమా? కాబినెట్ పాలిటిక్సా? ఎలక్షను సన్నాహాలా? చెప్పవోయ్ చెప్పు! టెల్ మాన్...

మైగాడ్! ఇన్సల్ట్... డౌన్‌రైట్ ఇన్సల్టు. గిరీశం దగ్గిర ఇంతకాలం తర్ఫీదయుండి ఈనాటి ప్రాబ్లెం గెస్ చెయ్యలేకపోవవేఁవిటోయ్.... నోట్‌బుక్ తీసిరాసుకో. ఈనాటికి ఈ క్షణానికి - నోనోస్ట్రయికిటాఫ్. కొట్టెయ్.... ఈనాడేమిటి. టుడే టుమారో ఎండ్ ఫరెవర్ మనకి బర్నింగ్‌ప్రాబ్లెం ఏమిటి. సి-గా-ర్స్.... చుట్టలు. చుట్టల్ని మనం వేళపట్టున కాల్చేదారిలేపోతే అవి మన్నికాల్చుకు తినేస్తాయ్. చర్చిలుగారి సీక్రెటాఫ్ సక్సెసేవిటి.... సిగార్స్... వరయూర్ సిగార్స్...అవి నోట్లో

లేపోతే ఆయనసలు మాట్లాడడు. నాటెవరెడ్... ముందులోపలికెళ్ళి మీ మావం పంచాంగప్పొదిలో పొగాకు పాయోటి పట్రా చెప్తా.... ఐ విల్ ఎడ్యుకేట్ యూ ఆన్ పాలిటిక్స్ ఓవరె పఫ్ ఆఫ్ స్మోక్...

వాట్! జేబులోనే ఉందా.... నాకోసం దాచావా... నాన్సెన్స్... నోనో... వండ్రఫుల్. మైడియర్ వెంకటేశం. దిసీ జ్పొలిటిక్స్. నువ్వు నిల్చున్న పళంగా లీడరు గిరీకి సెలక్టయిపోవచ్చునోయ్... ఏంవిండ్రాటజిక్‌గా రిప్లయిచ్చావు.... ఒక్కమాటలో ఇటు నువ్వు చుట్టదాచుకున్నవైనం రుజూకాకుండా తప్పించుకున్నావ్; అటు గురూ గారినే పల్టీ కొట్టించావ్. సెబాష్. బట్ ఫర్ మీ, అయామ్ ఆల్మోస్ట్ ప్రౌడాఫ్ యూ.

నౌ ఫర్ ది లెసన్స్. అసలు పాలిటిక్సనగానేమి? ఎట్టివాడు పాలిటీషియన్? పాలిటిక్స్ ఈజ్ ది ఆర్టాఫ్ గెసింగ్ ది పాసిబుల్ అన్నాడు శాస్త్రకారుడు. ఎండ్ నోయింగ్ ది ఇంపాసిబుల్ అన్నది నాపేరు చెప్పి రాసుకో. అనగా ఉదాహరణకి బర్తరపు ఖాయమని తెలుసుకోవడం; అందుకో గంటముందే ఆ పదవిని త్యాగం చేసవతల పారెయ్యడం. అందువల్ల పై టెర్ముకి మనకో సీటు ఖరారని ఊహ చేసుకోవడం. పొజిషన్‌లో లేకపోవడమే అపొజిషన్ అని గుర్తుంచుకోవడం. స్థానచలనాలనుబట్టి విమర్శలు అటుదిటూ ఇటుదటూ ఫిరాయించడం....

డామిట్... ఏమిటోయ్ ఈ చుట్ట? స్టుపిడ్ టుబాకో... నిజంగానే ఇది బర్నింగ్ ప్రాబ్లెంలావుందే... ఇప్పటికారగ్గిపుల్లలు తగులడ్డాయి. అరంగుళం కాలలేదు.... ఇది కాదు పని. ఇలారా... దగ్గిర్గా రా... చురకబెట్టనులేవోయ్... ఏడ... పంట్బుడార ధరెంటోచెప్పు.. అబ్బ!! డామిట్! చుట్టతోపాటు మొహం కూడా భగ్గుమనేది కాస్తుంటే. మరీ అంత మండిపోతూందోయ్. ధరా... అలాటపుడు కాస్త నెమ్మదిగా చెప్పాలి. – ఇదిగో ఇదే ఆర్టాఫ్‌గెసింగ్. ది పాసిబుల్ అనగా యిదే. పంచదార ధరలంతగా మండుతూంటే ఏ పప్పో బియ్యమో చెప్పాలి... అవంతకన్నానా! అన్నీ అలా మండితే, ప్రాణం అంటే సరిపోయేది.... కారు చవగ్గదా.... ధరలన్నీ యింతలా మండిపోతూవుంటే వాటిని చల్లార్చే గవర్నమెంటు కాపేరుతీసేసి ఫైరు సర్వీసెస్ అనగా అగ్నిమాపకదళం అని పేరుపెట్టడం న్యాయం కదూ... అంటే ది పూర్ సర్వీస్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్, ఆఫ్ మద్యప్రదేష్....

ఏమిటి? మద్యప్రదేష్ అన్నానా. చ ఛ నేను ధ్య అని ఖచ్చితంగా అన్నాను. అచ్చు తప్పేమోచూడు. లేకపోతే సెన్సారువాళ్ళెవరేనా ఓదానికోటనుకుని ధ వత్తు కొట్టేశారంటావా.... నో నో ధ వత్తులో సెక్సేముంటుంది?... మద్యం అబ్జెక్షన్ అయుంటుంది. దీనికి ఇదమిత్థంగా చెప్పలేమనుకో. వాళ్ళు ఎప్పుడేది కత్తిరిస్తారన్నది. డిపెండ్సాన్ ఇంటర్‌ప్రెటేషన్!... పిక్చరు టు పిక్చరుంటుంది. సేమ్‌సీన్ సేమ్ డైలాగు ఒకసారి తప్పించుకుంటుంది. మరోదాంటో శిక్ష పొందుతుంది.

ఏవిటి? సమానతా? సమానతేవిటి నాన్సెన్స్. ఇదేం డెమాక్రసీ అనుకున్నావా. అసలు సమానతదేంటో ఉందని, జీవితావసర వస్తువుల ధరలన్నీ సమానంగా మండుతున్నాయిటోయ్? కొన్ని హెచ్చుగా మండటం లేదూ? చూడు, మొన్నటిదాకా

బెల్లం, ఖండసారి ధరలు బాగా మండుతున్నాయనే గదా చక్కెర ధరలు ఎగసందోశారు? వంటచెరుకంతా అయిపోతుందని దాన్ని మళ్ళించడానికి పంచదార చెరకూ, పంచదారకూ ధరలు పెంచారట, రేపు బెల్లం, ఖండసారీ గోలపెట్టవూ - మమ్మల్ని కూడా పెంచమని? మరిలా అయితే సమానతేనాటికి కుదురుతుందని. ఇలా దీనికోసం అదీ, దానికోసం ఇదీ టూ అసమానతని పెంచటంలే? అసలీ ఇకనమిక్సే ఓ కప్పల తక్కెడ. ఇందులో పొలిటికల్ ఫ్రాగ్సు వినోదక్రీడలారంభిస్తే మనక్కాలక్షేపానికి లోటేమిటి. కాలక్షేపమనేకాదు. వెనకోసారి నేనే అన్నట్లు ఇలాటి లోపాలుంటే గాని, విమర్శలెలా - ఉద్యమాలెలా - ప్రోగ్రెసాఫ్ సివిలిజేషనెలా.

అలాగే స్కూలు టీచర్లు (పూర్ క్రీచర్లు) కేవలం అంత్యప్రాస మోజుకొద్దీ అన్నాను. నాయకులు కోప్పడకుండెదరుగాక చూడు గవర్నమెంటు స్కూళ్ళ టీచర్లకి ఉచితంగా మందులిస్తున్నారట. ఏదీ? వేరీజ్ యువర్ సమానత? టీచర్లంటే అంతా ఒకటేగా. అందరికీ కంఠశోషేగా. అందరివీ అవే జీ(వి)తాలుగా. ఏ వొక్కరికీ అజీర్ణంచేసే ప్రమాదం లేకుండా ప్రభుత్వం కట్టుదిట్టం చేసినా - మిగతా జబ్బుల కలాటివి లేవుగా. మరి ఏ వొక్కరికి ధర్మాసుపత్రి వైద్యం చేయించుకునే తాహతుండదుగదా. ప్రైవేటు డాక్టరు వైద్యాలయినా ఇచ్చుకోడం అంత సులువుగాదు గదా. మరి ఏవిటీ అసమానత? ఏం? గవర్నమెంటు స్కూలు జబ్బులు బాధపెట్టవనా? ఆ మాట ప్రభువులు కూడా అనరే. ఎయిడెడ్ స్కూలు జీతపు రూపాయికి నూటపదహారు నయాపైసల చిల్లరివ్వాలని జీ.వో. లేవీ వున్నట్టులేవే! మరి వైద్యసదుపాయాలకీ అసమానతేల? నువ్వు కేవలం సెన్సారు వాళ్ళనే వేలెత్తి చూపిస్తే ఎలా? వీళ్ళననవేం?

ఆ... కమాన్ అలా దారికిరా, ఎగ్జాక్టలీ. దటీజ్ వేర్ ప్రోగ్రెస్ కమ్సిన్... ఆంధ్రదేశంలో గవర్నమెంటు స్కూళ్ళకన్న ఎయిడెడ్ స్కూళ్ళ సంఖ్య చాలా ఎక్కువ. అందరికీ ఉచితవైద్యం అంటే జరిగేపని కాదు. అదీ కిటుకు. ఏదో కాసిని మందికన్నా చెయ్యకపోతే మనం ఏమి ప్రోగ్రెసు సాధిస్తున్నట్టూ? రేపు వావిలాలకేం రిప్లయిస్తాం! 'శ్టాటిట్రిక్సు' ఏం రాయిస్తాం! ఇంక మనవంతా సమానత అంటూ రభస చేస్తే అందరికీ ఉచితవైద్యం లేకుండా రద్దుచేసి సాపు చేస్తారు. అదీ ఓ పాయంటేననుకో. టీచర్లలో అసంతృప్తి ప్రబలకుండా చేసే దృష్ట్యా ఈ ప్రతిపాదన ప్రభుత్వాలోచనలో ఉందని విన్నాను.

అంచేత చెప్పొచ్చేదేవిటంటే సెన్సారు వాళ్ళ నాడిపోసుకోకు. వాళ్ళు చేసే మేళ్లు గుంటడివి నీకేం తెలుసు. కథలల్లేవాళ్ళం, డైరెక్షన్లు, ప్రొడక్షన్లు చేసేవాళ్ళం మమ్మల్నడుగు, కథలల్లడం ఈనాడెంత సులువైపోయిందని? నువ్వు బెంగాలెళ్ళు బొంబాయెళ్ళు బెంగుళూరెళ్ళు ఎక్కణ్ణించేం తెచ్చినా మన కథ మూసలోనే పోసేస్తాం. ఏ కాస్త మారినా, అందులో అబద్ధం గురించి, అవినీతి గురించి మాటపలుకొచ్చినా సెన్సారొప్పుకోరన్న భయంవంక చూపి పాతకథలే హాయిగా వాడుతున్నాం గదా. అసలు పెద్దబాలశిక్షకి బంగారు ఫ్రేములు గదటోయ్ మన టెలుగు పిక్చర్లు.

అందులోనూ అబద్ధమాడరాదూ అన్న వాక్యాన్ని చూపిస్తామా? అమ్మో! జనం చెడిపోరూ? నిజము అన్నదే చూపిస్తాం. మన కథల్లో జనం అందరూ మంచివాళ్ళే. అంతా త్యాగమూర్తులే. పరాయి దేశీయులు చూసినా - ఓహో ఇండియా సారవంతమైనదే కాదు సత్యవంతమైనది కూడాను అనుకోవాలా? అవన్నీ అలా వుంచు. అసలు కొత్తకథల ప్రాబ్లెం లేకుండా పోయిందంటే అది ఎవరి చలవ? ఏదీ నువ్వు, పెళ్ళికాని పిల్లకట్టుదప్పి చెడిపోయిందని చెప్పు చూద్దాం. ఒప్పుకోరు. ఎవడో లంచాలు పట్టి తన బతుకు తన కుటుంబం బతుకూ నాశనం చేశాడను. ఒప్పుకోరు. ప్రొహిబిషన్ అధ్వాన్నంగా ఉంది. కల్తీ సరుకువల్ల జనం ఆరోగ్యం మరింత చెడుతుంది. గుంటవెధవలు కూడా తాగడం గొప్పదనుకుంటున్నారు అని చెప్పు. ఒప్పుకోరు. నగ్నసత్యాలు ఏవీ ఒప్పుకోరు. అన్నిటికీ ఖద్దరు నీతిబట్టలు చుట్టబెట్టాలి. చేతనైతే ఈ అబద్ధాలకీ - ఈ దేశంలో కన్నెపిల్లలు మోసపోవటం లేదు, కట్నాలవల్ల కుటుంబాలు దెబ్బతినటం లేదు. మద్యపాన నిషేధం జనాన్ని తప్పుదారిలో పెట్టడంలేదు, లంచాలు ఎవరూ తీసుకోరు వగైరా అసత్యాలకు నువ్వు అందమైన నైలాన్ చీరలు కట్టి డాన్సు చేయించు. నిన్ను మెచ్చుకుంటారు. ఇప్పుడీ సమస్య లన్నిటి గురించి నువ్వు పౌరుడుగా బాధ్యతగల కళాకారుడుగా చర్చించి నీ అభిప్రాయాలు చెప్పాలనుకో. బుర్రకెంత శ్రమ! ఎంత అవస్థ! పైగా రిస్కోయ్. ఎందుకూ జనాని కలవాటైన కథలే సెన్సారుపక్షంగా ఉండే కథలే తీసుకో. ఆ బాపతు మాటలే పాటలే - వీలైతే అవే - రాసుకో!

ఇంతకీ ఇందులో అసలు కిటుకు చెప్పనా, సెన్సారువాళ్ళు సాహిత్యంమీద, మిగతా క్లాసురకం లలితకళల మీద పడి వాటిని కంట్రోలుచేసి పారేసే ప్రమాదం ఉందన్న భయం పట్టుకుంది గవర్నమెంటుకి. సంగీత సాహిత్యాల పీక నొక్కేస్తే ప్రపంచ రంగంలో మన కసలున్న ఆబోరుకూడా దక్కదు. సినిమాలో మనం జానపదం తీసుకున్నా ఎవడికి బెంగలేదు. అందికని ఈ సినిమాని సెన్సారు కత్తెర కెరచేసి - ఏదీ - అదన్నమాట సంగతి, అందికేనోయ్ చెకోవ్ అన్నట్టు కాల్లో ముల్లుగుచ్చుకుంటే కంటో గుచ్చుకోలేదని ఆనందించాలి. ఒక పన్నురాలితే (టాక్సుకాదు) 32 రాలి పడలేదని పొంగిపోవాలి. దటీజ్ లైఫ్. అంతేగాని వాళ్ళనాడిపోసుకుంటే లాభవేఁవిటి, కంఠశోష. ఎవరన్నా వింటారా ఏవన్నానా?

రమణ - జ్యోతి మంత్లీ నుంచి •


పల్లెటూరు - వ్యాసు పోదనుకున్నను గాని
పెద్దకొంపేనుకి అవకాశం యిక్కడ కూడ
దొరకడం న అదృష్టం!


గాడిద - పాటకి నేను - అందానికి మా అప్ప అందట!
పెళ్లికి గాడిద లొటిపిటామాట యిన్నాళ్ళకి
మళ్లీ విన్నాను గదా!


శ్రీకృష్ణుడు తన్నునమ్మిన వారితో అల్లా స్నేహం
కడతాడు. పరమాత్మకు జాతి భేదం లేదు!
శ్రీకృష్ణుడు
కథ అడ్డంగా తిరిగింది!


యవరన్నా సరే - మహానుభావులు!


ఎన్నాళ్లకెందు
చీకట్లోంచి వెలుతురులోకి వురికి?


ట్రూ కిపెంటేన్ను
ట్వంటీఫోర్ అవర్సు చాలదా అండీ!


ఛీ- అవతలకి పో- నేను యింటేనాబ్బి- సానిది తాకితే
పరమ అపవిత్రం- నువ్వారంభవి! మా బుచ్చమ్మ సొగసుకి
నువ్వు వాట్టికి పనికిరావు! గోయివే
డెమ్ డర్టీ గూస్!



మంచోపాయం చేసి దీన్ని తేవదీసుకుపోయి విడో మారియేజి చేసుకుంటేనట్టయినా – కీర్తి సుఖం కూడా దక్కుతాయి. టూ బర్డ్స్ యట్ వన్ షాట్।




తాగి తాగి తాగి ధరణిపైబడుదాక తాగెనేని తన్నుతాను తెలియు.
తాగలేనివాడె
తాగుబోతరయంగ....
బాపు


పంచాంగం మార్చడానికేం! సిద్ధాంతి
ఆడింది ఆటా పాడింది పాటా!
యింత ద్రోహం చేశాడయ్యా!




రాణియనన్మధురవాణో
రాజుల రాణో!




యీ ముండ నాయింట్లోంచి
విరగడైపోతేగాని యీ పిశాచం
వదిలిపోదు. వేదం చదువుకున్న
ముండాకొడుకుని!
నా మీదే పడింది!



అంకముఁజేరి శైలతనయా స్తన దుగ్ధము లానువేళ బా
ల్యాంక విచేష్టఁ దొండమున నవ్వలి చన్కబలింపఁబోయి, యా
వంకఁ గుచంబు గాన కహివల్లభహారముఁ గాంచి వే మృణా
ళాంకురశంక నంటెడు గజాస్యునిఁ గొల్తు నభీష్టసిద్ధికిన్.



చేత వెన్నముద్ద చెంగల్వపూదండ
బంగారు మొలతాడు పట్టుదట్టి
సందిట తాయెదు సరి మువ్వ గజ్జెలు
చిన్నికృష్ణ! నిన్ను చేరి కొలుతు.

# పూజ

నల్లని వానికి
తెల్లని నవ్వుల వానికి
చల్లని చూపుల వానికి
అల్లరి చేష్టల వానికి
దేవుడై పుట్టి మనిషిలా నటిస్తూ మహిమలు చేసిన వానికి
మనిషిగా పెరుగుతూ మనుషులచేత కూడా
మహిమలు చేయించిన వానికి
మనిషి కూడా దేవుడవచ్చునని ధైర్యం చెప్పిన వానికి
అందుకు దారివేసిన వానికి
అబద్ధాలు చెప్పిన వానికి
చెప్పించిన వానికి

మనిషిలో దానవుడిని దండించిన వానికి
దానవుడిలో మానవుడిని సృష్టించిన వానికి
ధర్మా ధర్మాలనూ
సత్యా సత్యాలనూ
నిత్యా నిత్యాలనూ
కృత్యా కృత్యాలనూ 'ఎరుక' పరచుకొని
వాటి నిజరూపాలను చూసే 'దారి' చూపించిన వానికి

'పుట్టుక చెరసాల' చెరనుంచి
బయటపడే దారి చూపిన వానికి
దుఃఖాల నరకాలలో ఏడవకుండా
సుఖాల మోసాలలో చెర పడకుండా
బయటపడే దారి స్వరపరచిన వానికి

'ఎరుక' సమగ్రమైన వానికి
హాయిగా నవ్వి నవ్వించిన వానికి
పాడి పాడించిన వానికి
ఆడి ఆడించిన వానికి

కురుక్షేత్రంలో ధర్మక్షేత్రాధిపతిగా నిలిచిన వానికి
చేత వెన్నముద్ద, చెంగల్వ పూదండ, మురళీ మాత్రమే ధరించి
తాను ఆయుధం పట్టకుండా
పరుష వాక్యం పలకకుండా
భీకర సంగ్రామం నడిపించిన సారథికి
పార్థ హృదయ సారథికి –

ప్రతి మనిషినీ ఒక మురళిగా
ప్రతి మనిషి మనసునూ మురళిలో స్వరద్వారంగా
ప్రతి మనిషి మనసులో పలికే మాటనూ
పలుక దలచిన మాటను
పలుక లేని మాటను
పలుక రాని మాటను
పలుక దలచుకోను మాటను
తాను
పలికించ దలచిన మాటగా
సప్తస్వరాలలో పూరించి

గోవులలో గోపాలకులలో
గోమాత పిలుపులో
గోబాల పలుకులో
గోపిక విరహంలో పలికే 'హే కృష్ణా' స్వరంలో
గోపిక ధన్యురాలై పలికే 'హా కృష్ణా' స్వరంలో

దేవకి ఏడుపులో
యశోద నవ్వులలో
కంసుడి ఆక్రందనంలో
దుర్యోధనుడి దీనారావంలో
భీముడి విజయ శంఖారావంలో
భువనైక మోహనంగా
దివికీ భువికీ తన పరంగా
భగవద్గీతా స్వరంగా
పలికించిన

సంగీత శృంగార రస రాజ్యాధినేతకి
కర్మ ధర్మ చక్రవర్తికి –

ఎన్ని సార్లు చదువుకున్నా
చెప్పుకున్నా
విన్నా వినిపించినా
ఆలోచించినా
తనివి తీరని
చెన్ను తరగని
ఆయన కథల నన్నిటినీ మాలలు కట్టి అలంకరించాలన్న

ప్రేమతో
గౌరవంతో
సంభ్రమంతో
ఆశ్చర్యంతో
ఆనందంతో
భక్తితో
ఈ తొలి హారాన్ని కట్ట సమకట్టి –

ఈ కథల కథా నాయకునకు
నమస్కరించి.....



ధర్మానికి ఆపదవాటిల్లినపుడు - మంచివాళ్ళమీద కొందరు చెడ్డ వాళ్ళు చెలరేగి బాధలు పెడుతున్నపుడు భగవంతుడు భూమికి దిగి వస్తాడు. అధర్మానికి ఒడిగట్టిన వ్యక్తులను, వారి శక్తులను సంహరించి ధర్మాన్ని తిరిగి స్థాపిస్తాడు. మంచివాళ్ళని కాపాడి మంచి చేస్తాడు. ఈ పనులు చేయడానికి ఆయన భగవంతుడి రూపంలో కాకుండా- జీవకోటిలోని ఏదో ఒక రూపంలో వస్తాడు. చేప, తాబేలు, వరాహం, సగం మనిషి సగం జంతువు ఇలా అనేక రూపాలు ధరించాడు. చాలా సార్లు మనిషి రూపంలో వచ్చాడు. ఈ రూపాలనే దేవుడి అవతారాలు అంటారు. మనసు పెట్టి ప్రయత్నిస్తే మనిషి కూడా దేవుడిలాగే గొప్ప పనులు చేయగలడని ధైర్యం చెప్పడం దారి చూపడం- ఈ అవతారాల పరమార్థం అంటారు.



భగవంతుడు - ధర్మ సంస్థాపనకోసం పది అవతారాలు ఎత్తాడు. అవి - మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, భృగు రామ, రఘురామ, బలరామ, బుద్ధ, కృష్ణ, కల్కి, అవతారాలు.

బ్రహ్మకల్పం ముగిసి, జలప్రళయం చెలరేగే వేళ.... కొద్ది సంవత్సరాలలో సృష్టిలో జీవకోటి అంతా నీట మునిగి నాశనం కాబోతూంది -

ద్రవిడదశపు రాజు సత్యవ్రతుడు కృతమాలిక నది వద్దున తపస్సు చేస్తున్నాడు. ఒకనాడు నదిలో స్నానంచేసి సూర్యభగవానుడికి అర్ఘ్యం ఇవ్వడానికై దోసిట నీళ్ళు తీశాడు.

'రాజా నన్ను కాపాడు. నీటిలో విడవకు'- అన్న మాటలు విని కన్నులు తెరిచి చూశాడు. దోసిటలోని నీటిలో చిన్న చేపపిల్ల కనబడింది.

'ఓ రాజా.. నదిలో పెద్ద చేపలు నన్ను మింగెయ్యాలని చూస్తున్నాయి. నేను చిన్నదాన్ని నన్ను కాపాడు' అంటూ దీనంగా చూశాయి మీన నేత్రాలు...

రాజు జాలిపడి ఆ చేపను తన కమండల జలంలో ఉంచాడు. అర్ఘ్యం ముగించి ఆశ్రమం చేరే వేళకి ఆ చేపపిల్ల పెరిగి పెద్దదై కమండలం అంతా నిండిపోయింది.

'రాజా... ఇందులో వూపిరి ఆడడంలేదు... కొంచెం విశాలమ్మైనచోట ఉంచవా?'- అంది.

రాజు ఆ చేపని ఒక పెద్ద కుండలో వుంచాడు. అంతలోనే అది కుండంతా నిండిపోయింది. రాజు దానిని బావిలో దించాడు. అదీ చాలా లేదు... ఆశ్చర్యంతో చెరువులో ఉంచాడు. అది క్షణ క్షణానికీ పెరగసాగింది. చివరకు దానిని సముద్రం దగ్గరకు చేర్చాడు... అక్కడ అది సముద్రాన్ని మింగేటంత రూపం ధరించింది.

రాజు సంభ్రమాశ్చర్యాలతో చేతులు జోడించాడు.

'ఇది నీ నిజరూపంకాదు... నీవు సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడివి' అన్నాడు.

మీన రూపుడైన శ్రీహరి రాజును కటాక్షించాడు.

'రాజా నేటి కేడవనాడు జగత్ప్రళయం వస్తుంది. ప్రళయానంతర ప్రపంచంలో జీవకోటిని తిరిగి పెంపొందించే బాధ్యత నీకు వప్పగిస్తున్నాను. ఇక్కడికి ఒక పెద్ద నావ వస్తుంది. సకల చరాచర జీవకోటినీ ఒక్కొక్క జాతికి ఒక జంట చొప్పున - నీవు తీసుకువచ్చి ఆ నావలో వుంచాలి. సప్తర్షులను కూడా తీసుకురావాలి... ప్రళయం వచ్చినపుడు అంతా పెనుచీకటి ఆవరిస్తుంది... ఆ చీకటిలో - ఆ ఋషుల మేని వెలుగే నీకు దారి చూపుతుంది. ఆ నావను నా కొమ్ముకి కట్టు. ప్రళయం ముగిసి ప్రశాంతత నెలకొనేవరకూ నేను మిమ్మల్ని కాపాడతాను... కల్పాంతాన



బ్రహ్మ కన్ను మరగినవేళ సోమకాసురుడు వేదాలను అపహరించాడు. నేను ఇపుడు వాడిని సంహరించి ఆ వేదాలను తీసుకువస్తాను... సృష్టిలో ధర్మ కర్మ ప్రవర్తనాగ్రికి జీవన విధానాలకు మార్గాలు ఏర్పరిచేవి వేదాలే.... తరువాతి కల్పంలో నువ్వు వైవస్వతమనుప్రజాపతివై వేదబద్ధంగా - జీవకోటిని పాలించగలవు...' అని చెప్పాడు శ్రీ మహావిష్ణువు. సత్యవ్రతుడు ఆ ప్రకారమే చేశాడు. శ్రీహరి మత్స్యావతారుడై కడలి గర్భంలోకి వెళ్ళి సోమకాసురుడిని వధించాడు. వేదాలను సాధించి తెచ్చాడు.

చీకటి వెలుగుల - రాత్రింబవళ్ళ తరుములాటలాగే రాక్షసులకీ దేవతలకీ నిరంతరంగా పోరు జరగడం గెలుపూ ఓటమీ చావూ బతుకులమధ్య కొట్టుకులాడడం నానాటికీ ఎక్కువైపోతూంది.

రాక్షసుల తాకిడికి తట్టుకోలేక దేవతలు బ్రహ్మదగ్గరకుపోయి మొరపెట్టుకున్నారు.

బ్రహ్మవారిని తీసుకుని శ్రీ మహావిష్ణువు దగ్గరకి వెళ్ళాడు. పాలసముద్రంలోని శతసహస్రాధికాలయిన ఓషధులు, లవణాలు ఎంతో శక్తివంతమైనవి - ఆ పాల కడలి నడుమ మంథరగిరిని నిలిపి మథిస్తే - అమృతం లభిస్తుందని - ఆ అమృతం సేవిస్తే జరామరణాలను జయించవచ్చుననీ విష్ణువు చెప్పాడు. కాని ఇది దేవతలు ఒకరివల్లనే సాధ్యంకాదనీ - దానవజాతి చేయూతకూడా తీసుకోవాలనీ హితవు పలికాడు.

చావుని జయించవచ్చున్న ఆశతో అసురులుకూడా ఈ వుద్యమంలో చేయి కలపడానికి అంగీకరించారు. మంథరగిరినీ సర్పరాజు వాసుకినీ - కవ్వంగా, తాడుగా ఉపయోగించడానికి నిశ్చయించి - వాటిని ప్రార్థించి ఒప్పించారు.

సముద్రమథనం ప్రారంభమైన కొద్ది క్షణాలలోనే పర్వతం సముద్రంలో మునిగిపోయింది. సురాసురులు దిక్కుతోచక నిరాశతో క్రుంగిపోయారు. అప్పుడు శ్రీమన్నారాయణుడు కరుణించి - కూర్మావతారం ధరించి కొండని తన మూపున ధరించాడు.

సముద్రంలో కాలుష్యాలు, విషవస్తువులు కదిలి హాలాహలవిషమై విజృంభించాయి... ఆ వేడికి - ఆ తీవ్రతకు అంతా కల్లోలం చెందారు. దేవతలంతా కైలాస నాథుని ప్రార్థించారు. పరమేశ్వరుడు కరుణించి ఆ కాలకూట విషాన్ని భరించి - మింగకుండా కంఠంలోనే ధరించాడు. తరవాత క్రమంగా ఐరావతం, కామధేనువు, కల్పవృక్షం, చంద్రుడు, శ్రీమహాలక్ష్మి ఆపైన అమృతం ఆవిర్భవించడం జరిగింది.

అమృతాన్ని అందరూ పంచుకోవాలన్న ఒప్పందాన్ని త్రోసిరాజని, దానవులు ఆ భాండాన్ని తీసుకుపోయారు.

వంచనకి ప్రతి వంచనగా శ్రీహరి మోహినీ రూపం ధరించి రాక్షసులను సమ్మోహితుల్ని చేశాడు. తానే పంచిపెడతానని ఆ భాండం తీసుకుని - అంతటినీ దేవతలకే ఇచ్చి వేశాడు.



మరొక కల్పాంతాన బ్రహ్మ నవసృష్టి రచన ఆరంభిస్తూ తన కుమారుడు స్వాయంభువును అతని భార్య శతరూపనూ ప్రజాపత్యం వహించమని ఆదేశించాడు...

'తండ్రీ! భూమిని హిరణ్యాక్షుడు అనే రాక్షసుడు ఎత్తుకుపోయి సముద్రంలో దాగి వున్నాడు...' అని చెప్పాడు స్వాయంభువు...

అప్పటికే శ్రీహరి ఆదివరాహ అవతారం ధరించి సముద్ర గర్భంలోకి ప్రవేశించాడు. హిరణ్యాక్షుడితో పోరాడి వాడిని వధించి - తన కోరలమీద భూమిని నిలిపి పైకి వచ్చి దానిని యథాస్థానంలో వుంచాడు. పరిపాలన కొనసాగాయి.

ఆ కల్పాన్ని వరాహ కల్పం అంటారు.



తన తమ్ముడిని చంపిన విష్ణువుపై హిరణ్యకశిపుడు పగబట్టాడు. కాని విష్ణువు ఎక్కడ వుంటాడో ఎలా వుంటాడో తెలియలేదు...

అందుకని విష్ణువును పూజించే యాగశాలలకూ ఆశ్రమాలకూ ఆలయాలకూ విష్ణుభక్తులూ, గోబ్రాహ్మణాదులూ ఉండే చోట్లకూ వెళ్ళి వారిని హింసించి వధించసాగాడు.

దేవతలు అమృతం అంతటినీ తాగేసి చావును జయించారు.

తాను కూడా మరణాన్ని జయించాలని సంకల్పించి - ఈశ్వరుడి కోసం ఘోర తపస్సు చేశాడు. ఆయన ప్రసన్నుడై వరం కోరుకొమ్మన్నాడు.

తనకు చావు రాకూడదని కోరాడు. తనని నరులుగాని, జంతువులు గాని - పగలుగాని, రాత్రిగాని - నేలపైగాని, ఆకాశంలోగాని - చంపకుండా వరాలు పొందాడు.

ఈ లోపల శ్రీహరి - హిరణ్యకశిపుడి పుత్రుడు ప్రహ్లాదుడి గుండెలో హరిభక్తి జ్యోతి వెలిగించాడు. తండ్రికి కొడుకుపట్ల వైరం పెరిగింది. హరిస్మరణ మానిపించడం కోసం హిరణ్యకశిపుడు నరకక్షోభ అనుభవించాడు. కొడుకుని చంపించడానికి శతవిధాల ప్రయత్నించాడు. వాడెక్కడున్నాడో చూపరా అని బ్రతిమాలాడు.

'ఇందుగల డందు లేడని సందేహము వలదు' అన్నాడు కుమారుడు.

ఆవేశంలో అక్కడున్న స్తంభాన్ని కొట్టాడు - ఇందులో వుంటే కనబడమను అని గర్జిస్తూ -

ఆ స్తంభంలోనే శ్రీహరి - సగం మనిషి సగం జంతువుగా నరహరి రూపంలో ఆవిర్భవించాడు. పగలూ రాత్రీ కాని 'అసుర' సంధ్యవేళ - నింగీ నేలాకాని గడపమీద కూర్చుని అతడిని తన వడిలో వుంచి - ఆయుధం కాని ఆయుధం గోళ్ళతో పొట్ట చీల్చిచెండాడాడు... నరసింహస్వామి.

వంచనని వంచనతో - బలాన్ని బలంతో సాధించి మరో దుష్టశక్తిని నాశనం చేశాడు నారసింహుడు.

హరిభక్తుడు ప్రహ్లాదుడి మనుమడు బలిచక్రవర్తి... దానవజాతిని మోసగించి అమృతాన్ని తీసుకుపోయిన దేవతలమీద ధ్వజమెత్తి వెళ్ళాడు బలిచక్రవర్తి...

అతన్ని ఎదిరించి గెలిచి నిలబడడం అసాధ్యమనీ ఇంద్రపదవినీ స్వర్గాన్నీ అతనికి వదిలి పారిపొమ్మనీ ఇంద్రుడికీ దేవతలకీ హితవు చెప్పాడు బృహస్పతి.

బలిచక్రవర్తి త్రిలోకాధిపత్యంతో ఆగక పదునాలుగు భువనాలనూ పాదాక్రాంతం చేసుకోవాలని - విశ్వజిద్యాగం తలపెట్టాడు. దానధర్మాలూ పుణ్యకార్యాలూ అన్నీ దేవతల వరవడిలోనే చేస్తూ యాగం ఆరంభించాడు. మార్గం మంచిదైనా లక్ష్యం చెడ్డది... అతను జయిస్తే దానవజాతి విజృంభిస్తుంది. బలహీనులు బతకడం అసాధ్యం అవుతుంది. ధర్మం సర్వనాశనం అవుతుంది. అతనిని అణచడం కోసం శ్రీ మహావిష్ణువు త్రివిక్రముడై అవతరించి - వామనమూర్తిగా యాగస్థలికి వచ్చాడు. సభ అంతా ముగ్ధులైపోయారు ఆ వర్చస్సు చూసి... అర్ఘ్యం పాద్యం ఇచ్చి-

'ఏం కావాలి బాబూ?' అన్నాడు బలి.

'ఏమివ్వగలవు?' అన్నాడు వటువు.

ఇవ్వగలిగిన వన్నీ వల్లించాడు బలి.

మూడడుగుల నేల చాలు - అన్నాడు వామనుడు.

దానాన్ని ధారపోయడానికై కమండలం అందుకున్నాడు బలి.

కులగురువు శుక్రుడికి వామనుడి నిజ స్వరూపం స్ఫురించింది.

'అడిగేవాడు శ్రీమహావిష్ణువు. నిన్ను నాశనం చేస్తాడు. దానం యివ్వకు' అని హితవు చెప్పాడు.

'శ్రీ మహాలక్ష్మి శిరస్సును నిమిరిన చేయి - మీదు కిందై నా ముందు దేహీ అని నిలిస్తే - అంతకన్న మహద్భాగ్యం ఏముంది...అంతేకాదు ఆడి తప్పితే నా బతుకేముంది' అంటూ బలి, ధారపోశాడు.

వామనుడు త్రివిక్రముడై ఎదగసాగాడు. బలి పైకి చూశాడు. సూర్యబింబం ఆ వామనుడి తలపై గొడుగులా కనబడింది - తర్వాత శిరోరత్నమై వెలిగింది. ఆ వెనుక కర్ణాభరణంగా ఆ పిమ్మట గళాభరణంగా సౌవర్ణ కేయూరంగా ముంజేతి కంకణంగా - మొలనూలి గంటగా భాసించింది. చివరకు పాదపీఠమై పోయింది.

అణువంత వటుడు బ్రహ్మాండ మూర్తియై నిలిచాడు. ఒకపాదంతో భూమండలాన్నీ రెండో పాదంతో పదునాలుగు భువనాలనూ ఆక్రమించాడు...

'మూడవ అడుగుకి చోటేదీ' అని అడిగాడు.

దిగ్భ్రాంతుడైన బలిచక్రవర్తి విశ్వరూప దర్శనంతో ధన్యుడైనాడు.



'నాది అన్నచోటు ఇంకేదీ లేదు - ఈ శిరస్సు తప్ప' అని తలవంచాడు బలి. అతని తలపై తన పాదతల ముంచాడు హరి.

బలిని పాతాళ లోకానికి పంపి పట్టం కట్టాడు.

అతని దురాలోచనకు ఈ దండన విధించినా - అతని సదాచరణకు సంతోషించి పాతాళంలో బలి ఇంటి వాకిట కావలి నిలిచాడు శ్రీమహావిష్ణువు - ధర్మ వర్ధిష్ణువు...

దయ దాక్షిణ్యం లేకపోవడమే కాకుండా క్రూరత్వం విజృంభించగా సంహారకాండ గావించిన అవతారం పరశురామావతారం.

అవతార పరమార్థం దుష్టశిక్షణే అయినా - పరశురాముడి క్రౌర్యం గురించి ఒక చిత్రమైన కథ వుంది.

పరశురాముడి తాత రుచికుడనే రుషి - గాధిరాజు కుమార్తె సత్యవతిని మోహించి - పెళ్ళి చెయ్యమని కోరాడు.

బ్రాహ్మణుడికి పిల్లనివ్వడం ఇష్టంలేక ఆ సంగతి చెప్పడానికి ధైర్యం చాలక - నల్లటి చెవులున్న తెల్ల గుర్రాలను వేయింటిని తెచ్చి కానుక ఇమ్మన్నాడు గాధిరాజు, ఇది మునికి సాధ్యంకాదన్న భావంతో. కాని రుచికుడు వరుణుడి నడిగి వేయి గుర్రాలూ తెచ్చాడు. సత్యవతిని వివాహం చేసుకున్నాడు.

కొన్నాళ్ళకి సత్యవతి, ఆమె తల్లి ఇద్దరూ సంతానం కోరి దానికై పూజలు చేయించమని రుచికుడిని అడిగారు.

రుచికుడు తన భార్యకోసం బ్రాహ్మణ తేజంతోనూ అత్తగారికి రాజ తేజంతోనూ సంతానం కలగడానికి పూజలూ హోమాలు చేసి హోమాన్న ప్రసాదాలను ఒకచోట వుంచి నదికి వెళ్ళాడు.

తల్లీ కూతుళ్లు ఆ ప్రసాదాలను తారుమారు చేసి ఆరగించారు.

'ఈ పొరబాటువల్ల మీ అమ్మకి బ్రహ్మతేజంగల కొడుకు - నీకు పరమ క్రూరుడైన కొడుకు పుడతారని' రుచికుడు చెప్పాడు.

సత్యవతి దుఃఖించ సాగింది.

రుచికుడు జాలిపడి ఆమె కుమారుడు కాక మనుమడు క్రూరుడై జన్మిస్తాడని చెప్పాడు.

ఆ ప్రకారమే గాథిరాజు కొడుకు విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అయ్యాడు.

రుచికుడి మనుమడు - జమదగ్ని కొడుకు - పరశురాముడయ్యాడు.

పరశురాముడి క్రౌర్యానికి ప్రబల నిదర్శనం - తల్లిని అన్నలను గండ్ర గొడ్డలితో తలలు నరికి చంపడమే.

జమదగ్ని భార్య రేణుకాదేవికి - గగనంలో విహరిస్తున్న చిత్రరథుడనే గంధర్వుడిని చూసి క్షణకాలం పాటు మనసు చలించింది.

శరీరంతో చేసిన పాపాని కిదేమీ తక్కువకాదని జమదగ్ని ఆమెకు మరణదండన విధించి - కొడుకుల్ని పిలిచి తల్లిని చంపమన్నాడు. వాళ్ళు అందుకు నిరాకరించారు. అంతలో పరశురాముడు వచ్చాడు. తండ్రి తన ఆనతి చెప్పాడు. పరశురాముడు తక్షణం తల్లినీ అన్నలనూ తెగనరికి చంపాడు. తండ్రి ప్రసన్నం కాగానే వాళ్ళకి ప్రాణదానం చేయమని వరం కోరి వాళ్ళని బ్రతికించుకున్నాడు.



ఒకనాడు - రాముడు లేనివేళ కార్తవీర్యార్జునుడు జమదగ్ని ఆశ్రమానికి వచ్చాడు - తన యింట వున్న కామధేను కటాక్షంతో అందరికీ షడ్రసోపేతంగా విందులు చేశాడు ముని. రాజు ఆ ధేనువును తనకు ఇమ్మన్నాడు. ఋషి కాదన్నాడు. రాజు బలం చూపి ధేనువును లాక్కుపోయాడు.

పరశురాముడి కిది తెలియగానే - ఆగ్రహావేశుడై మాహిష్మతీపురానికి వెళ్ళి - కార్తవీర్యార్జునుడి వేయి చేతులను నరికి కుప్పలు పోశాడు. వేలాది సైనికులను

వధించాడు. చివరికి రాజు శిరస్సును ఖండించాడు. కొండంత రాజు నేల కొరిగాడు.

పట్టపురాజుని చంపడం బ్రహ్మహత్యకు సమానం అని చెప్పి పాపనివారణార్థం తీర్థయాత్రలు చేసిరమ్మని ఆదేశించాడు తండ్రి. రాముడు యాత్రలకి వెళ్ళాడు.

కార్తవీర్యార్జునుడి కొడుకులు పదివేలమంది - రాముడు లేనివేళ దండెత్తివచ్చి జమదగ్నిని చంపి పగదీర్చుకున్నారు...

రాముడు రాగానే జరిగినది చెప్పి భోరున ఏడుస్తూ ఇరవై ఒక్కమార్లు గుండెలు బాదుకుంది తల్లి.

అగ్ని పర్వతం కదిలింది.

ఒకనాడు దేవతలని దానవులు హింసించారు. ఈనాడు అధికార దర్పం అహంకారం మదం మత్సరం ఆవేశించిన మానవులే దానవులై పోయారు.

కాపాడవలసిన రాజులే అరాజకత్వాన్ని తెచ్చారు...

రాముడు పరశువుతో తరలివెళ్ళి - ఇరవై ఒక్కమార్లు దండెత్తి ముఖ్య పట్టణాలనుండి మూలమూలలనున్న వాళ్ళని కూడా వెదికి క్షత్రియ కులం అంతటినీ సమూలంగా సర్వనాశనం చేశాడు. తర్వాత తపోభూమికి తరలి వెళ్ళిపోయాడు...

బ్రాహ్మణుడైన పరశురాముడు క్షత్రియుల మదం అణచివెళ్ళాడు.

కాలచక్రం తిరుగుతూంది. కొంత కాలానికి బ్రాహ్మణుల అహం మదం పెరిగాయి... రావణబ్రహ్మ పరమేష్ఠినుండి చావు లేకుండా వరాలు పొందాడు. జాతి జాతినీ పేరు పేరునా పేర్కొన్నా నరవానర జాతులను మరిచిపోయాడు.

అందువల్ల - తాను నరుడై, దేవతలను వానరులుగా రమ్మని భూమికి దిగివచ్చాడు శ్రీమన్నారాయణుడు.

కాంతా కనకాలమీద దురాశవల్ల అధర్మం, అసత్యం, స్త్రీలోలత, అక్రమాలు చెలరేగిన రాజ్యంలో ఆదర్శ మార్గాన్ని ఏర్పరచి - తానా మార్గంలో నడిచి కష్టసుఖాలను సమభావంతో స్వీకరించి దుష్టశిక్షణ శిష్టరక్షణ సాధించాడు రాముడు. అందుకే రామ కథను రామాయణం అన్నారు. రామాయణం అంటే రాముడు నడిచిన దారి అని అర్థం.



రావణాది రాక్షసులను సంహరించాక రాముడు అయోధ్యకు రాజై పదకొండు వేల సంవత్సరాలు చల్లగా పాలించాడు. రామరాజ్యంలో ప్రజలు ఏ బాధలూ భయాలూ లేకుండా సుఖంగా జీవించసాగారు.

కాని మనిషి బుద్ధి విచిత్రమైనది.

ఏమీ లేనినాడు - కడుపునిండా తినడానికి తిండి, కంటినిండా నిద్రా దొరికితే అదే పదివేలనీ, అదే స్వర్గమనీ, ఆ కాస్తా ఇవ్వమనీ దేవుడికి మొక్కుతారు. తీరా కడుపునిండా తిండి దొరికి, ప్రాణం హాయిగా వున్నవేళ - నోరు అన్నం తింటున్నవేళ బుద్ధి గడ్డికరుస్తుంది. పెడదారిన పడుతుంది. అప్పుడు తన నోటి దగ్గర కూడు కన్న ఎదటివాడి కూడు రుచిగా అనిపిస్తుంది. తన భార్య కన్న పరుడి భార్య చక్కగా కనిపిస్తుంది 'పంచ'దారకన్న పరదార తీయగా తోస్తుంది. నూరేళ్ళ ఆయుస్సున్నా చాలదు. చావే రాకూడదు. తను నాయకుడైతే చాలదు. రాజు కావాలి. మహారాజయ్యాక రాజాధి రాజు - ఆపైన భగవంతుడినే అవాలని ఆశ అహం ఆవరిస్తాయి...

రామరాజ్యం తరవాత ద్వాపర యుగం వచ్చింది...

కొంతకాలం ధర్మరాజ్యం సాగాక-

మనుషులలో ఇలాంటి కోరికలు చెలరేగాయి. వీటిని సాధించడం కోసం తపస్సులుచేసి సాధనచేసి భయంకరమైన అస్త్రాయుధాలు సంపాదించసాగారు.

ఈ మహాస్త్రాలు - రాముడికాలంలో రాముడు, వశిష్టుడు, విశ్వామిత్రుడు, రావణుడు, ఇంద్రజిత్తు వంటి ఐదారుగురికే తెలుసు. అస్త్రానికీ శస్త్రానికీ తేడా వుంది... శస్త్రాలు అంటే కేవలం కండపుష్టిమీద, హస్తనైపుణ్యంమీద ఆధారపడే కత్తి కటార్లు, బాణాలు గదలూను. అస్త్రాలు అంటే మంత్రశక్తితో అణువులోని ప్రకృతి శక్తిని మేలుకొలిపి రెచ్చగొట్టి శత్రువునీ వాడి రాజ్యాన్నీ బూడిదచేసే మహత్తర ఆయుధాలు. అంటే ఈనాటి ఆటంబాంబు, హైడ్రోజన్, న్యూట్రాన్ బాంబులు, ఐదారువేల మైళ్ళ దూరం వెళ్ళి అక్కడ శత్రువుని నాశనం చేసే మిస్సైల్స్ ఆనాడూ వుండేవి.

ఆగ్నేయాస్త్రం అంతటినీ తగలబెట్టేది. వారుణాస్త్రం నీటిలో ముంచెత్తి నాశనం చేసేది. వాయవ్యాస్త్రం పెనుగాలిలా సర్వనాశనం చేసేది. మోహనాస్త్రం అందరినీ మూర్ఛపోగొట్టేది...వీటిలో ఏ ఒక్కటైనా సమస్త భూమండలాన్ని సర్వనాశనం చేయగలవు...

అలాటి భయంకర అస్త్రాలు ఇప్పుడు చాలామంది చేతుల్లోకి చేరాయి. వాళ్ళందరూ మంచివాళ్ళు కారు. అందరిలోనూ రాక్షసులు దూరి ఆక్రమించారు. వారిలో ఏ ఒక్కడు తలుచుకున్నా అమాయక నిస్సహాయ జీవులను కోటానుకోట్లుగా సర్వనాశనం చేయగలడు. ఈ లోపల వారి అధికారాలకోసం - సుఖాలకోసం ఆబాల గోపాలాన్ని పీడించుకుతింటున్నారు. నెత్తురు తాగుతున్నారు. బలివేస్తున్నారు. భూమికి పాప భారం పెరిగింది. భూమాత గోమాత రూపంలో భగవంతుడి దగ్గరకు వెళ్ళి మొరబెట్టుకుంది - ఈ బాధలను వారించమని కోరుకుంది. మహావిష్ణువు కటాక్షించాడు.

'ఓ భూదేవీ... పూర్వం మానవులూ దానవులూ విడివిడిగా వుండేవారు. అధర్మం ప్రబలినపుడు నేను వచ్చి దానవులను చంపి మానవులను కాపాడాను. ఇపుడు అంతా కలిసిపోయారు. మానవులలోనే దానవులున్నారు. దానవబుద్ధి కలవారందరినీ సంహరించాలి - వారితోపాటు వారు సంపాదించిన అస్త్రాలను - వాటి గురించిన జ్ఞానాన్ని కూడా నాశనం చెయ్యాలి - ఇందుకై నేను భూమికి తరలివస్తున్నాను. కంసుడై పుట్టిన కాలనేమితో ఈ సంహారకాండ ఆరంభమై కురుక్షేత్రంలో మహాభారత యుద్ధంద్వారా పరిసమాప్తమవుతుంది - కంసుడి మరణం రేపే ఆరంభం...



భూదేవి ఆశ్చర్యంగా చూసింది.

'కంస మరణానికి ఆరంభం అంతం ఏమిటి? నీ సుదర్శన చక్రంతో ఒక్క క్షణంలో సంహరించవచ్చుగదా?'

'అది వాడికి వరప్రసాదం అవుతుంది...ఆ ప్రకారాన్ని నువ్వే చూద్దువుగాని' - అన్నాడు మహావిష్ణువు.

వికటాట్టహాసం వినబడింది.

  

భూలోకంలో -

మధురా నగరంలో -

కంసుడు విరగబడి నవ్వుతున్నాడు -

అది పెద్ద చెరసాల...

నరకశాల - త్రిశంకు స్వర్గంలా కంస నరకం...

కంసుడు కొందరు ఋషులను భక్తులను హింసిస్తున్నాడు. వారిని నిప్పులు చెరిగే ఎండలో వట్టి కాళ్ళతో నిలబెట్టి కాళ్ళకి గొలుసులువేసి కట్టేశాడు - సరిగ్గా అడుగుదూరంలో చల్లటినీడ - అందులో మంచినీరు - అందివ్వడానికి సిద్ధంగా చక్కని అమ్మాయిలు... కాళ్ళు నేలమీద ఆన్చలేక గెంతుతున్నారు ఋషులు - దాహంతో నాలుక పిడచకట్టుకునిపోయి నీటికోసం అర్రులు చాస్తున్నారు కొందరు - అందీ అందనంత దూరంలో నీరూ పళ్ళూ అన్నీ వున్నాయి- ఒక తల్లిని కట్టిపడేశాడు- ఆమెకు అందీ అందనంత దూరాన బిడ్డని కట్టేశాడు-

'ఎవడురా మీరు కొల్చే దేవుడు?... ఉంటే దమ్ములుంటే- రమ్మనండి- వచ్చి మీకా నీడా నీళ్ళూ అందించమనండి... నమ్మిన భక్తుల్ని కాపాడలేనివాడు దేవుడేవిట్రా- నేనే దేవుడిని... తల్చుకుంటే మీకా నీళ్ళు ఇవ్వగలను- లేదా మాడ్చి చంపగలను...ఊఁ పిలవండి...' అంటూ వినోదిస్తున్నాడు కంసుడు.

'కంస రాజా! దేవుడు నువ్వు రమ్మని పిలిచినపుడు రాడు... రావలసిన వేళ అయినపుడే వస్తాడు- చెయ్యవలసిన పని చేస్తాడు'- అన్నాడు అక్కడే కొంచెం దూరంలో నించున్న నారదుడు-

కంసుడు అటు చూశాడు.

'అవసరమైన వేళకు రానివాడు ఆపదలేం కాస్తాడు... అసలుంటేగా రావడానికి...ఆ దేవుడు వట్టిభ్రమ...మీబోటివాళ్ళ కల్పన...పామర జనాన్ని భయపెట్టి ఆశపెట్టి లోబరుచుకుందుకు మీరు వడ్డించే మత్తు మందు-' అన్నాడు కంసుడు.

అంతలో ఒక భటుడు వచ్చాడు.

'ప్రభూ...! తమ సోదరి దేవకీ-వసుదేవులవారూ కళ్యాణమంటపం దగ్గర తమకై వేచియున్నారు- దేవకీదేవి అత్తవారింటికి వెళ్ళే సమయం ఆసన్నమైంది- తమ అనుమతికై...'

'అనుమతి ఏమి... మేమే ఆమెను స్వయంగా సాగనంపి వస్తాము...మా అనుంగు సోదరి...' అంటూ కదిలాడు కంసరాజు...

మధురా నగరంలో మహారాజ ప్రాసాదం శోభాయమానంగా అలంకరించి వుంది. మంగళవాయిద్యాలు ఆ శోభను ముల్లోకాలూ మురిసిపోయేలా సర్వజన సమ్మోహనకరంగా కీర్తిస్తున్నాయి.

రాజ భవనం ముంగిట రథం సిద్ధంగా వుంది. దానికి ముందు దారిచూపే అశ్వాలు- వెనక సారె తీసుకువెళ్ళే రథాలూ బారులు తీరి వున్నాయి.

మహారాజు ఉగ్రసేనుడు, మహారాణి, మంత్రి, సైనికాధికారులు, పురోహితులు, శకునం రావడానికి గోబ్రాహ్మణ సుమంగళీజనం నిలచివున్నారు.

దేవకీ వసుదేవులు కంసుడికి మొక్కారు. కంసుడు సాదరంగా లేవదీసి చెల్లెలి మూర్ధం ఆఘ్రాణించాడు. తాను చెయ్యి పట్టుకుని ఆమెను రథం ఎక్కించాడు. మహారాజు ఉగ్రసేనుడు, రాణీ, పరివారం అంతా సంభ్రమంతో చూస్తున్నారు. సారథిని తప్పుకోమని సైగచేసి-కంసుడే రథం ఎక్కి పగ్గాలు అందుకున్నాడు.

నారదుడు ఇదంతా చూసి కన్నులరమోడ్చి పైకి చూశాడు.

'నారాయణ నారాయణ' అన్నాడు.

కంస సారథ్యంలో రథం వనమార్గంలో ఉత్సాహంగా సాగుతోంది.

'చెల్లీ మనం వియ్యమందాలి. నీకు ముందు కూతురే పుట్టాలి. ఆ పాపను మా అబ్బాయికిచ్చి పెళ్ళిచేసి కోడలిగా తెచ్చుకోవాలి. బావగారితో చెప్పు కొడుకుని కంటే క్షమించనని!'

కంసుడి మాటలకి కొత్త దంపతులు ఆనందంగా నవ్వారు.

ఆకాశంలో పిడుగు పడింది. మేఘాలు గర్జించాయి. ఒక్కసారిగా చీకటి పడింది. మెరుపు మెరిసింది. కంసుడు ఆశ్చర్యపోయి రథం ఆపాడు.

'ఓ కంసరాజా! నీకా అదృష్టంలేదు. నీ చెల్లెలు నీతో వియ్యానికి రాదు. కయ్యానికే వస్తుంది. ఆమె కడుపున పుట్టే ఎనిమిదవ బిడ్డ నీ పాలిట యముడు. వాడే నిన్ను చంపుతాడు. ఇది సత్యం' అని పలికింది ఆకాశవాణి.

'ఇది సత్యం' అన్నమాట భూనభా లదిరేలా మారుమోగింది.

కంసుడు రథంమీదనుండి ఉరికాడు. చెల్లెలినీ బావనీ తదేకంగా చూశాడు.

వాళ్ళు భయభ్రాంతులై చూస్తున్నారు.

'ఇది సత్యం – దేవకీ దేవి అష్టమగర్భ సంజాతుడు నీ పాలిట మృత్యువు. ఇది సత్యం ఇది సత్యం.'

'దేవకీ' అంటూ పెద్ద కేకపెట్టి, కంసుడు ముందుకురికి దేవకి జుట్టు పట్టుకుని లాగాడు. రథం మీద నుండి ఆమె కిందికి ఉరికింది. కెవ్వున కేక పెట్టింది. 'అన్నా' అని ఆక్రోశించింది.

కంసుడు కత్తిదూశాడు. ఎడమచేత్తో ఆమె జుట్టుపట్టుకుని తల నరకబోయాడు.

వసుదేవుడు కిందకురికి అతని చేతిని పట్టుకు ఆపాడు. చేతులు జోడించి మొక్కాడు. పరిపరి విధాల బ్రతిమలాడాడు.

'చెల్లెల్ని చంపడం ధర్మంకాదు' అని వాదించాడు.

'తండ్రి శపిస్తాడన్న భయంతో కన్నతల్లినే గొడ్డలితో నరికి చంపాడు మీ పరశురాముడు. ప్రాణభయంతో నేను చెల్లెలిని చంపడం తప్పా?' అన్నాడు కంసుడు.

'ఆమెకి పుట్టే కొడుకుగదా నిన్ను చంపేది. వాడు పుడితేనే గదా! అసలు వాడు పుట్టడు. వాడేకాదు అసలు ఆమెకి ఈ జన్మకి సంతానం కలగదు. నేనీ క్షణంనించి బ్రహ్మచారినై సన్యాసం తీసుకుంటాను. ఆమెను చంపకు' అని బ్రతిమాలాడాడు వసుదేవుడు.

కంసుడు క్షణకాలం ఆలోచించాడు.

'వీల్లేదు' అని గర్జించాడు.

'మీ దేవుడు మోసగాడు. దొంగ దెబ్బల్లో వెన్నుపోట్లలో ప్రజ్ఞాశాలి. ఆనాడు హిరణ్యకశిపుడు జాతి జాతినీ పేర్కొని పగలూ రేయీ; నింగీ నేలా; కత్తీ గదా అన్నిటినుండీ చావు రాకూడదని వరం కోరుకున్నాడు. మీ దగాకోరు దొంగ దేవుడు మనిషీ జంతువూ కలసిన నరసింహుడై పగలూ రేయీకాని అసుర సంధ్యవేళ భూమి ఆకాశం కాకుండా తన వడిలో వుంచుకుని కత్తీ గదా కాకుండా చేతి గోళ్ళతో చీల్చి చంపాడు. ఎంత మోసం! అలాగే రావణబ్రహ్మ అన్ని జాతులను పేర్కొని చావులేకుండా వరంపొందితే- అతను చెప్పమరచిన నరవానర జాతులను ఎన్నుకుని ఆ రూపాల్లో చంపాడు. మీవాడిని నమ్మను. ఎనిమిదో గర్భం అంటే ఎనిమిదో గర్భమే! నిన్ను చావనివ్వను. సన్యాసం అంతకన్నా వీల్లేదు. వాణి ప్రకటన ప్రకారం ఈ దేవకి ఎనమండుగుర్నీ కనవలసిందే! ఎనమండుగురినీ వరసగా నేను' చంపవలసిందే! లేదా ఇపుడే దీన్ని చంపేస్తాను.

'వద్దు నీ మాట ప్రకారమేకానీ! ఆమెకు బిడ్డ పుట్టగానే నీకు సమర్పిస్తాను' అన్నాడు వసుదేవుడు.

'నువ్వెవడివి? నేనే ఆ పని చూస్తాను. మీ యిద్దర్నీ నా కోటలోనే ఒక పెద్ద సౌధంలో అన్ని సౌఖ్యాలతో బంధిస్తాను. సౌఖ్యాలు సమకూర్చి సంతోషం దక్కకుండా చేయడం నాకు అలవాటే, చాలా యిష్టంకూడా' అన్నాడు కంసుడు.

రథం వెనక్కు మళ్ళింది.

❀ ❀ ❀

దేవకీ వసుదేవులను చక్కని ఉద్యానవనంగల విశాలమైన సౌధంలో బందీలుగా వుంచాడు కంసుడు.

కాపలాకి పూతనని నియమించాడు.

ఆమెపై కాపలాకి ఆమె భర్తని వుంచాడు.

అతనిపై కాపలాకి అతని ప్రియురాలిని-

ఉగ్రసేన మహారాజు, రాణి వారించారు.

'నాయనా- నీవు నమ్మని దేవుడికి ఇంత భయపడడం ఎందుకు? కంటికి కనబడని వాడిగురించి ఉన్న వాళ్ళని బంధించి బాధించడం ధర్మంకాదు. వాళ్ళని విడిచిపెట్టు' అని బ్రతిమలాడింది తల్లి.

'తండ్రిగా, రాజుగా ఆజ్ఞాపిస్తున్నాను' అన్నాడు రాజు ఉగ్రసేనుడు.

'కంసుడు ఆజ్ఞలు పాటించడు. ఆజ్ఞలు ఇవ్వడం ఒకటే తెలుసు. మీరుకూడా ఒక చెరసాలలో పడి వుండండి-' అని భటులకు సైగచేశాడు. కంసుడి భటులు ఉగ్రసేనుణ్ణి బంధించారు.

'వినాశకాలే విపరీత బుద్ధిః' అన్నాడు ఉగ్రసేనుడు.

'మీకా మాకా?' అన్నాడు కంసుడు విరగబడి నవ్వి.

దేవకీ వసుదేవుల కలయికను సృష్టి ప్రేరేపించింది. ఇది కూడా కృష్ణలీలే!

వసంత ఋతువు మేలుకొంది. పురివిప్పి నాట్యమాడసాగింది. పువ్వులు రంగులు సంగీతం పిల్ల తెమ్మెరలు సెలయేళ్ళు అన్నీ చెలరేగాయి. పశువులూ పక్షులూ అన్నీ జత గూడుతున్నాయి. కొత్త దంపతులు దేవకీ వసుదేవులకు కూడా కోరిక లీరిక లెత్తాయి. నిర్బంధంలోనే అయినా వన విహారం చేశారు. ఆడారు పాడారు. ఒక వెన్నెల రాత్రివేళ మైమరచి కలిశారు. రతివేళ దూరాన ఆవుదూడ అంబా అని అరిచింది. దేవకి కెవ్వున కేకవేసి భర్తను దూరంగా నెట్టి వేసింది. ఆమె కళ్ళలో భయం కలవరం! ఆ తోపుకి పక్కనే వున్న పాలూ పళ్ళూ ఎగిరి చెల్లాచెదరై పడ్డాయి. పళ్ళెం చప్పుడు గది అంతటా దంపతుల గుండెల్లో భయంకరంగా మారు మోగింది.

వసుదేవుడికి అర్థంకాలేదు.

దేవకి భోరున ఏడ్చింది. భుజంమీద చేయివేసి తట్టి దగ్గరగా తీసుకున్నాడు.

'నేను పాపిష్టిదాన్ని, అభిశప్తురాలను. దాంపత్య సుఖానికి నోచుకోని ఇల్లాలిని. పుట్టబోయే బిడ్డని కన్ను తెరవగానే దారుణంగా మా అన్న చంపుతాడని తెలిసీ నేను గర్భం ధరించలేను. తొమ్మిది నెలలు నా రక్తమాంసాలు పంచి ఊపిరిపోసిన బిడ్డను ఆ కసాయివాడికి బలియివ్వలేను. ఒద్దు. నాకీ సుఖం వద్దు. మీరు మరో భార్యను కట్టుకోండి. నేనిలా గొడ్రాలుగానే చస్తాను' అంటూ ఏడిచింది.

కంసుడి కంఠధ్వనితో గది అదిరిపోయింది. 'వీల్లేదు. నీ ఎనిమిదో సంతానంవల్ల నాకు ప్రాణహాని వుంది. అందువల్ల ఏడుగురూ పుట్టి చచ్చితీరవలసిందే. లేదా వాళ్ళకి జన్మనిచ్చే తల్లిదండ్రులు బలవుతారు.'

ఇద్దరూ నివ్వెరపోయి చూశారు.

ఇది భ్రమా? నిజమా!?

దేవకి చేతులలో ముఖం కప్పుకుని భోరున ఏడ్చింది.

తూలి పడింది. మూర్ఛపోయింది.

❀ ❀ ❀

ఉదయం తోటలో వున్న చిన్న కోవెల దగ్గర దేవకి తలనువడిలో వుంచుకుని నిమురుతూ వసుదేవుడు ధైర్యం చెప్పాడు.

'ఇది శాపమో వరమో ఏదైనా భగవంతుడి నిర్ణయం. మీ అన్న కంసుడిది కాదు. ఏ జన్మలోనో చేసిన పాపానికి ఇలా ఏడుగురు బిడ్డలను తెలిసీ కని బలివేసే శిక్ష పడింది; ఎనిమిదవ సంతానంగా ఆ శ్రీమన్నారాయణుడే నీ గర్భఫలంగా ఉదయించే భాగ్యం కలిగింది. దేవకీ! ఈ రాక్షసుడిని సంహరించే జగన్నాటకంలో, పరమాత్ముడిని బిడ్డగా పొందడం కోసమైనా నువ్వీ గర్భశోకం భరించక తప్పదు. సృష్టి చరిత్రలోనే ఇంతటి విలక్షణమైన శిక్ష ఎవరూ అనుభవించివుండరు' అన్నాడు.



దేవకి కళ్ళు విప్పార్చి భర్తవంక చూసింది. ఆయన చేతిని చెంపలకు అద్దుకుని నిట్టూర్చింది.

❀ ❀ ❀

ఏకాంత మందిరం.

కంసుడు మధుపానం చేస్తూ-సుందరాంగుల ఆటపాటల మధ్య వినోదిస్తున్నాడు. కొత్త దంపతులను వేరు చేసి భర్తలను ఖైదుచేసి, భార్యలతో బలవంతాన క్రీడిస్తున్నాడు. రతిక్రీడ తారాస్థాయి చేరి తన్మయుడౌతున్న వేళ-కెవ్వుమంటూ పసిపాప పురిటికేక గుండె చీల్చుకుపోయేలా వినబడింది. ఒక్కసారిగా సంగీత నృత్యాలు ఆగి నిశ్శబ్దం ఆవరించింది.

కత్తిదూసి కదిలాడు కంసుడు.

రాజభవనం మెట్లు దిగే వేళకే- దేవకీ వసుదేవులు బిడ్డతో సిద్ధంగా వున్నారు. దేవకి నిస్పృహతో రథానికి చేరబడి నిలబడి వుంది. వసుదేవుడు బిడ్డని పొత్తిళ్ళలో చుట్టి పట్టుకున్నాడు.

'రాజా! అన్నమాట ప్రకారం తొలి చూలు బిడ్డని తీసుకువచ్చాను. కన్న తల్లిని ఉసురుపెట్టి తీసుకువచ్చాను.'

కంసుడు అందుకోబోయాడు.

వసుదేవుడు ఒక్కడుగు వెనక్కి నడిచాడు.

'నీకు హాని చేసేవాడు ఎనిమిదో సంతానంగదా. గుడ్డు తెరవని ఈ పసికందు మీద కనికరించి ప్రాణదానం చేయవా బావా' అన్నాడు దీనంగా.

కంసుడు బిడ్డవంక తేరి చూశాడు.

గుడ్డు తెరవని పసిబిడ్డ యోగనిద్రలో ఉన్నట్టుంది. దేవకిని చూశాడు. కళ్ళు విప్పార్చి ఆశగా చూస్తోంది. కంసుడు దూసిన కత్తిని ఖణేల్మంటూ విడిచిపెట్టాడు.

వసుదేవుడు శిరసా వందనం చేశాడు.

దేవకి ఆనందాతిరేకంతో బిడ్డని గుండెలలో పొదువుకుంది. దేవుడి మందిరంలోకి పరుగెత్తి బిడ్డని అక్కడ వుంచి మొక్కింది.

❀ ❀ ❀

కాలచక్రం తిరుగుతూంది.

దేవకి మందిరం ఆరుగురు బిడ్డల ఆటపాటలతో దేదీప్యమానంగా వెలిగిపోతోంది. పరుగెత్తే బిడ్డ, పారాడే బిడ్డ, ఉయ్యాలలో బిడ్డ, తండ్రి వడిలో బిడ్డ, తల్లి భుజాన బిడ్డ.

కంసుడు వచ్చాడు. దేవకీ వసుదేవులు బిడ్డలందరిచేతా మామకి మొక్కించారు. చివరి బిడ్డని పాదాలపై వుంచారు. కంసుడు అందుకుని బుగ్గ మీటాడు. చిరునవ్వు నవ్వి వెళ్ళాడు.

❀ ❀ ❀

కంస మందిరం-

నారదుడు విశాలంగా నవ్వాడు. 'నారాయణ! నారాయణ! ఏవయ్యా స్వామీ! ఈ వెర్రిబాగుల రాక్షసుల్ని అబద్ధాలతో దగా చెయ్యడం ధర్మంకాదయ్యా! దేవుడికి నీకు అన్నీ చెల్లినా భక్తుడిని నాకు చెల్లదే! సత్యం తెలిసి చెప్పకపోవడం అసత్యం చెప్పడం కన్నా ఘోరం' అన్నాడు నారదుడు పైకి చూస్తూ.

కంసుడు కంగారు పడ్డాడు.

నారదుడు అతనికి చెప్పాడు.

'కంసరాజా! ఎనిమిదో వాడుగదా నాకు గండం అని నువ్వు దేవకి పిల్లలు ఆరుగుర్ని హాయిగా బతకమని వదిలేశావు. అశరీరవాణి మాటవిని పాపం నువ్వు నమ్మి వీళ్ళమీద దయచూపావు కాని ఆ దేవుడు సూటిగా ఏదీ చెయ్యడు. సత్యం కాపాడటం కోసం అబద్ధాలు చెప్పించే ఆ దేవుడు, ధర్మాన్ని కాపాడటంకోసం అధర్మం చేయించే ఆ దేవుడు నీలాంటి అమాయకుల్ని, నోట్లో వేలుపెడితే కొరకలేని అమాయకులని, ఇలా దగా చెయ్యడం తగదు. నేను ఋషిని. అబద్ధం చెప్పనూ లేను- నిజాన్ని దాచనూ లేను. విను.

'నువ్వు కాలనేమివి. నీవాళ్ళంతా రాక్షసులు. దేవకి పిల్లలేకాదు, దేవకీ వసుదేవులూ, వ్రేపల్లెలో నంద యశోదాది గోపాలకులంతా మనుషులై పుట్టిన



దేవతలు! నిన్ను చంపడంకోసం దిగి వచ్చారు. అంతా పెద్ద కుట్ర. నువ్వు గెలవటం వాళ్ళు ఓడడం ఇది నాకనవసరం. ఉన్న సంగతి చెప్పడం మాత్రం నా ధర్మం. జాగ్రత్త!' అన్నాడు నారదుడు.

కంసుడు నివ్వెరబోయాడు.

భీకరంగా గర్జించాడు.

❀ ❀ ❀

ఒక్కసారిగా కోటి గోవులు మోరలెత్తి అరిచాయి. కోటి లేగ దూడలు 'అంబా' అని అరిచాయి. కోటిమంది తల్లులు ఏడుస్తున్నారు. కోటి పాపలు 'అమ్మా' అని అరుస్తున్నాయి.

పచ్చని అరటి చెట్లు, వాటికి చక్కని గెలలు. గోశాల దగ్గర పెద్ద కుండీ. అందులో కడవలతో పాలు గుమ్మరిస్తున్నారు భటులు. గుమ్మపాలు పున్నమినాటి సముద్రంలా నురగలు జిమ్ముతూ విజృంభిస్తున్నాయి. కంసుడి కత్తిపడి అరటిగెలని కసిగా తరిగింది. అరటిగెలలు ఆవుదూడల్లా అంబా అని అరిచాయి. పసిపాపల్లా అమ్మా అని ఏడిచాయి. పసిబిడ్డల తలలు నెత్తురు ముద్దలై ఎగురుతున్నాయి. కంసుడి కత్తి మెరుపుతీగలా వెలుగుతూ ఉరుముతూ గర్జిస్తూ విజృంభిస్తోంది. పాల నురుగుమీద నెత్తురు చిమ్మసాగింది. కళ్లాపి ముంతలో జల్లి కొట్టినట్టు నెత్తురు పడుతూంది. కోటి గొంతులు ఘోష పెడుతున్నాయి. ఆర్తనాదాలు ఆకాశాన్నంటుతున్నాయి.

పాల సముద్రం రక్త సముద్రమైపోయింది. కొండంత కెరటాలు లేచి విరుచుకు పడుతున్నాయి. పాలు సుడిగుండాలు కట్టితిరుగుతున్నాయి. సుడిగుండాల 'కన్ను' నెత్తురుతో ఎర్రగా గిర్రున తిరుగుతూంది. ఆ సుడిగుండాలు పసిబిడ్డల తలకాయలను లోపలకి పీల్చేసుకుంటున్నాయి. దేవకి ఆ బిడ్డల వెంట సుడిగుండంలోకి దూకుతోంది. కంసుడు తాటితో గాలం వేసి ఉచ్చు బిగించి బయటకు లాగుతున్నాడు. అట్టహాసం చేస్తున్నాడు.

వసుదేవుడు ఒకచెట్టుకింద పరిదీనుడై కూర్చున్నాడు. దేవకి రోహిణీదేవిని వెంటబెట్టుకు వచ్చింది.

'ఆరుగురు బిడ్డల్ని బలిగొన్న మా అన్న నిజంగా రాక్షసుడే. ఆ రాక్షసుడు మనకి పుట్టవలసివున్న మిగతా ఇద్దర్నీకూడా చంపి తీరతాడు. ఎనిమిదవ సంతానం వాడినే చంపుతుందన్న అశరీరవాణి వాక్కుని నమ్ముకుని, ఆ ఆశతోనే బిడ్డల్ని కని బలివేస్తున్నాను. ప్రభూ! పుత్రశోకం అనేది అలవాటైపోయేటంత హీనస్థితికి జారిపోయింది నా హృదయం. ఒక్కటే కోరుతున్నాను. ఎనమండుగురు బిడ్డల్ని కనిపోగొట్టుకున్న తల్లిగా అటుతరవాత ఒక బిడ్డ అయినా కనబడకపోతే బతకలేను. భగవంతుడికి మానవ జన్మమిచ్చిన తల్లిదండ్రులుగా మనకింత భాగ్యం కలిగినా మన బిడ్డల్ని ఒక్కసారైనా ఎత్తుకు లాలించే భాగ్యం మనకు దక్కదు. అందువల్ల నా సోదరి మీ పెద్ద భార్య రోహిణీదేవి గర్భంలో మన వంశాంకురాన్ని నిలపమని వేడుకుంటున్నాను. ఆ ఒక్క చెట్టునీడ, ఆ ఒక్క దీపం ఇచ్చే వెలుగు- ఇవే బతుకంతా మనకి వూపిరి అంది.

వసుదేవుడు రోహిణి వంక చూశాడు.

❀ ❀ ❀

వైకుంఠం-

జే గంటలు మోగుతున్నాయి. మంగళప్రదమైన సంగీతం శ్రీ మహావిష్ణువును అర్చిస్తోంది. దేవతలు స్తోత్రాలు చేస్తున్నారు. మానవుల ఆర్తనాదాలు చేరుకుంటున్నాయి. యోగనిద్రలో వున్న మహావిష్ణువు కనులు తెరిచాడు. సమస్త దేవతాగణం శిరసా మనసా వందనం చేసింది.

'దానవులనూ, దానవులావేశించిన దుష్ట మానవులనూ సంహరించే సమయం ఆసన్నమైంది. కంస వధతో ఆరంభమయ్యే ఈ ఉద్యమం-కురుక్షేత్ర సంగ్రామందాకా కొనసాగుతుంది. నేను కృష్ణ నామధారినై దేవకీ వసుదేవుల పుత్రుడిగా జన్మిస్తాను.'

'ధన్యులం' అన్నారు దేవతలు.

విష్ణువు ఆదిశేషువు వంక చూశాడు.

'రామావతారంలో నాకు తమ్ముడివై సేవలు చేశావు. ఇప్పుడు నాకు అన్నవై మన్ననలందుకోవాలి. అందుకై నువ్వు దేవకీమాత సప్తమ గర్భంలో శయనించు, ఆ పిమ్మట యోగమాయ నీ తేజాన్ని ఆకర్షించి వ్రేపల్లెలో రోహిణీదేవి గర్భాన ఆధానం

చేస్తుంది. ఓ మాయాదేవీ! అటుపిమ్మట నీవు నందుడి భార్య యశోదకు పుత్రికవై జన్మించు' అని ఆదేశించాడు భగవంతుడు.

దేవ దేవుడు దివినుండి భువికి తరలే మహోజ్వల సన్నివేశాన్ని ప్రకృతి వేనోళ్ళ గానం చేసింది.

❀ ❀ ❀

ఆదిశేషువు తేజం దేవకీదేవి గర్భంలో ప్రవేశించింది.

భవనం లోపల చుట్టూరా వుండే కాపలావాళ్ళందరికీ మాయ కమ్మి నిద్రకి ఒరిగిపోయారు.

యోగమాయ దేవకీ గర్భస్థ తేజాన్ని తిరిగి ఆకర్షించింది. ఆకాశమార్గాన వ్రేపల్లెకు కదిలింది.

❀ ❀ ❀

వ్రేపల్లెలో నిదురిస్తున్న రోహిణిలోకి ఆదిశేషువు అంశను ప్రవేశపెట్టింది.

సూర్యోదయంతోబాటు బలరామ దేవుడు రోహిణి గర్భాన ఉదయించాడు.

ఉత్తర క్షణాన మధురలో నిదురిస్తున్న దేవకి గుండెలవిసిపోయేలా కేక పెట్టింది. కాపలావాళ్ళు రాజసౌధంవైపు పరుగులెత్తారు.

కంసుడు కత్తి దూశాడు.

'మోసం! దగా! దేవకికి గర్భస్రావమా! ఎనమండుగురు బిడ్డలు పుడతారని చెప్పి ఏడోసారి గర్భస్రావమా! ఇదేదో నాటకంగా తోస్తోంది. ఎనిమిదవ గర్భానికింకెన్ని నాటకాలు సాగుతాయో! లెండి ఎవరక్కడ! వీళ్ళిద్దర్నీ చెరసాలలో బంధించండి. అహర్నిశలూ కాపలా వుంచండి. పూతనా! ఈసారి పూర్తి బాధ్యత నీదే. పొరబాటు జరిగిందా నువ్వు నీ భర్త నీ బిడ్డలు సర్వనాశనం అయిపోతారు జాగ్రత్త!'

అంతేకాదు మంత్రిని సేనానిని పిలిచి చెరసాలచుట్టూ వేయిమంది సైనికులను కాపలా వుంచాడు కంసరాజు.

'పసిబిడ్డ పుట్టీ పుట్టగానే మననేం చెయ్యగలడు? ఎందుకింత కలవరం ప్రభూ?' అన్నాడు వృద్ధమంత్రి.

'ఆ దొంగ దేవుడి కథలు వినలేదా? ఏడేళ్ళ కుర్రాడిగా వచ్చి బలిచక్రవర్తిని దేహీ అని చెయ్యిజాపి నెత్తిమీద కాలుపెట్టాడు. 'ఎదురు దెబ్బ కొట్టేవాడి గురించి భయపడక్కరలేదు. దొంగదెబ్బ కొట్టేవాడే ప్రమాదం' అని చెప్తారు చక్రవర్తి జరాసంధులవారు' అన్నాడు కంసరాజు.

❀ ❀ ❀

మహాదేవుడి కోవెలలో స్వామినీ, జగన్మాతనూ అర్చించి మొక్కుతున్నవారిని,

నదిలో నిలిచి అర్ఘ్యం విడిచి ధ్యానం చేస్తున్నవారినీ,

ఆనందంగా నడిచిపోతున్న ఆలుమగలను,

కంస భటులు అనుమానంగా చూస్తున్నారు. కొందరిని పట్టి ఈడ్చుకుపోయారు.

కంసరాజు ప్రతిమకి మొక్కిస్తున్నారు.

'ఏవని మొక్కావు? ఎవడికోసం? రాజహంతకుడు వస్తాడనేనా ఆ కులుకు? ఆకాశంనించి ఊడిపడమనా, అర్ఘ్యం విడుస్తున్నావు? చెప్పు' అంటూ వాళ్ళని కొరడాలతో కొట్టి హింసిస్తున్నారు.

కంసరాజు నిలువెత్తు విగ్రహం ఒక మంటపంలో వుంది.



'కంస మహారాజే దేవుడు. ఆయన చిరకాలం ఉండాలి. మా ఆయుస్సుకూడా పోసుకుని మమ్మల్ని చల్లగా పాలించాలి' అని వాళ్ళ చేత చెప్పించి కొడుతున్నారు.

కడుపుతో వున్నవాళ్ళని కడుపుమీద తంతున్నారు.

కంసుడు మద్యం సేవిస్తున్నాడు. వినోదాలు చూస్తున్నాడు.

మద్యం ఎక్కువై కన్నులు మూసుకున్నాడు. చీకటి అయింది.

చీకటి చెలరేగింది. మధురానగరి నంతటిని కారుమేఘాలు కమ్మేశాయి. హోరున వర్షం మెరుపులు పిడుగులు.

కంసుని చెరసాలలో కాగడాలన్నీ ఆరిపోయాయి. కాపలా వారంతా మాయకమ్మి నేలకొరిగి నిద్రపోయారు. దేవకీ వసుదేవులు మాత్రం మెలకువగా ఉన్నారు. దేవకికి పురిటినొప్పులు అధికమవుతున్నాయి. అయినా ఆమె ముఖంలో ఒక గొప్ప వెలుగు. కళ్ళలో సంభ్రమం ఆనందం ఉత్సాహం. తన తనువూ జన్మా తరించే తరుణ మాసన్నమైనట్టు ఆమె కళ్ళు చెప్పాయి వసుదేవుడికి.

ఆమెను తిన్నెపై పరుండబెట్టాడు. పైకి చూసి నమస్కరించాడు కన్నులరమోడ్చి.

భీకరమైన పిడుగులు వర్షం చప్పుడు అంతరించిపోయి ప్రశాంతత నెలకొంది. అందులోంచే భువనైక మోహన వేణుగానం సహస్రకంఠాలతో జగతిని ముంచెత్తింది. సృష్టి అంతా పరవశించిపోతూంది.

నక్షత్రాలు కోటిసూర్యప్రభలై దీప్తిస్తున్నాయి. జే గంటలు గుడి గుడిలో గుండె గుండెలో మారుమోగుతున్నాయి.

దేవకి ముఖం. దుర్నిరీక్ష్యమైన తేజంతో, బాధతో ఆనందంతో వెలిగిపోతూంది.

అంతలోనే ఆమె కన్నులు మూతపడ్డాయి. అలసిన సొలసిన ముఖం భువన మోహనంగా పక్కకు వాలింది. తృప్తిగా నిట్టూర్చింది.

జగన్నాథుడు, జగదోద్ధారకుడు, జగత్పతి, జగత్పిత, జగదేకవీరుడు, జగదేకమోహనుడు, జగదేక వంద్యుడు, జగద్గురువు, జగన్నాటక సూత్రధారి, జగదభిరాముడు, లీలామానుషవిగ్రహుడై - చిన్ని శిశువై ఉదయించాడు.



శ్రావణ మాసం, బహుళ పక్షం, అష్టమి తిథి, రోహిణీ నక్షత్రం, అర్ధరాత్రి, అభిజిన్ముహూర్తవేళ దుష్టశిక్షణకు, శిష్ట రక్షణకు, లోకకళ్యాణానికి మహోజ్వల ముహూర్తవేళ, మంచి వాళ్ళకు గుండెలు పొంగేవేళ, చెడ్డవాళ్ళకు గుండెలు కుంగేవేళ, కన్నులు తెరచీ తెరవకుండానే ఒక్క చిన్నారి చిరునవ్వుతో జగతిని కాంతి మయం చేశాడు.

సంభ్రమంతో భక్తులు; భయంతో ఆనందంతో దేవకీ వసుదేవులు పైకి చూసి చేతులు జోడించి మొక్కుతున్నారు.

జగదానంద కారకుడైన శ్రీమహావిష్ణువు చతుర్భుజుడై శంఖచక్ర శారఙ్గ గదా ధారియై దర్శనం ప్రసాదించాడు.

'పుణ్యదంపతులారా! నేను మీ దాంపత్య ఫలాన్ని కావాలన్న మీ కోరికను మన్నించి నాడు ప్రశ్నివర్ణుడుగా వామనుడుగా ఈనాడు కృష్ణవర్ణుడిగా మీ బిడ్డనై పుట్టాను. ఈ జన్మ తర్వాత మీకు ముక్తి లభిస్తుంది. వసుదేవా! నువ్వు శిశురూపాన వున్న నన్ను వ్రేపల్లె తీసుకువెళ్ళి అక్కడ నందుని సతి యశోదచెంత వుంచి,

ఆమె పొత్తిళ్ళలో ఉన్న యోగమాయను దేవకీమాత వడిలో చేర్చు. దుష్టశిక్షణకూ శిష్టరక్షణకూ కాలచక్రం ద్వారా నేను సంకల్పించి ప్రయోగించే జగన్నాటకం ఈ క్షణాన నేను జన్మిస్తూన్న ఈ అభిజిన్ముహూర్తాన ఆరంభమవుతోంది. మీకు శుభం' అంటూ శ్రీ మహావిష్ణువు అంతర్ధానం చెందాడు.

దేవకీ వసుదేవులను తిరిగి మాయ కమ్మింది. కొన్ని క్షణాలపాటు వసుదేవుడు కన్నులు మూసుకు ధ్యానంచేశాడు. నెమ్మదిగా కళ్ళు తెరిచాడు. దేవకి దేదీప్యమానంగా వెలిగిపోతోంది. దేవకి వడిలో బిడ్డ కేరుకేరున ఏడుస్తున్నాడు, ఏమీ తెలియని వాడిలా, వసుదేవుడు కర్తవ్యం గుర్తుచేసుకుని లేచి బిడ్డను అందుకున్నాడు.

దేవకిని మాయ ఆవహించింది.

వసుదేవుడు కన్నులతోనే జగన్నాథునకు మొక్కి కదిలాడు.

చెరసాల తాళం నిశ్శబ్దంగా దానంతటదే విడివడింది. తలుపులు తెరుచుకున్నాయి. కావలివాళ్ళు మాయ కమ్మి పడివున్నారు.

వసుదేవుడు నడుస్తుండగా ద్వారాలన్నీ తెరుచుకుంటూ దారియిచ్చి తిరిగి మూసుకున్నాయి. తాళాలు అవే పడిపోతున్నాయి.

వసుదేవుడు చెరసాల దాటి బయటకు వచ్చాడు. బిడ్డపైన చెంగుకప్పాడు. గుండెల్లో పొదువుకున్నాడు. అంతలో ఒక గాడిద పక్కకు వచ్చింది. అదిరిపడి చూశాడు. అది మోర పైకెత్తి ఓండ్ర పెట్టబోయింది. వసుదేవుడు భయంతో తటాలున మోకరిల్లి, బిడ్డను ఒక చేతిలో అదుముకుని రెండవచేత దాని పాదాలని తాకాడు. భయంగా అటూ ఇటూ చూసి బ్రతిమిలాడాడు. గాడిద ఆలోచించి ఓండ్రపెట్టే ప్రయత్నం విరమించుకుంది. వసుదేవుడు ముందుకు కదిలాడు.

యమునానది ఆనందంలో పరవళ్ళు తొక్కుతోంది, స్వామి వస్తున్నాడని. ఆ నాట్యానికి వర్షం ఉరుములూ మెరుపులూ తోడైనాయి. వసుదేవుడు భయపడి బ్రాన్పడి నిలబడిపోయాడు. బిడ్డను రెండు చేతులా పట్టి తన తలపైకెత్తి పట్టుకున్నాడు. చీకటిలో చిన్ని కృష్ణుడు చిరునవ్వు నవ్వాడు.

'రేపటినించి ఆటపాటలన్నీ నీ చెంతనేకదా కాస్త దారినివ్వు.' అంది చిన్ని కృష్ణుడి చిరునవ్వు.

యమున ఆనందావేశాన్ని నిగ్రహించుకుని శాంతించింది. పరవళ్ళు తొక్కడం మాని దారి నిచ్చింది, దారిని చూపింది.

కన్నులు మూసుకుని స్వామిని నమ్ముకుని యమునలో దిగి నడుస్తున్న వసుదేవుడు మొలబంటి నీరు నేలంటి పోయిన భావన రాగానే ఆశ్చర్యంతో కన్నులు తెరచి చూశాడు. యమునానది మధ్య చక్కని దారి ఏర్పడివుంది. ఆ దారికి అటూ యిటూ ముకుళిత హస్తాలతో నీటి తెరచాటున నిలిచి స్వాగతమిస్తున్న మత్స్యకన్యలూ, సర్పరాజములూ, జలగర్భంలోని జీవకోటి అంతా సంభ్రమానందాలతో కళ్ళు విప్పార్చి చూస్తున్నాయి. దేవుడు మన పేటకే వచ్చేశాడని మణులు ముత్యాలు వెలుగులు వెదజల్లుతున్నాయి.

పైనించి పడే పన్నీటి జల్లుకు ఫణిరాజు పడగవిప్పి గొడుగు పట్టి అనుసరిస్తున్నాడు.

వరుణుడు - వర్ష దేవకన్యలూ పంతంతో వానజల్లును పన్నీటి పాత్రలతో పట్టుకుని పక్కనించి జల్లి స్వామిని అర్చించబోయారు.

వేయిపడగల ఆదిశేషువు పడగలతో నాట్యమాడి ఆ పన్నీటి జల్లుకు అడ్డుపడుతున్నాడు.

వసుదేవుడికీ 'భాగవతం' తెలియదు. 'పైన' వున్న స్వామి చిరునవ్వు నవ్వుకున్నాడు.

చిన్నారి చేతితో పడగ గొడుగును దాటి పన్నీటి జల్లును అందుకున్నాడు.

స్వామి చిటికెన వేలుమీద నిలచిన చిన్నారి నీటిబొట్టు ముత్యమై తెల్లగా వెలిగింది.

స్వామి ఎర్రని పెదిమలకు చేరేవేళ అదీ ఎరుపెక్కింది. నాలికపై మాణిక్యమై వెలిగింది.

స్వామి తృప్తిగా నవ్వాడు. స్వామిని ఆహ్వానించిన భూదేవి నమస్కరించింది.

నిద్రలో యశోద నవ్వుకుంటోంది.

❀ ❀ ❀

వసుదేవుడు వ్రేపల్లె చేరాడు. అర్ధరాత్రి. ఇక్కడ వాన లేదు. అంతా ప్రశాంతంగా వుంది.

ఇంటిముందు నందుడూ పరిచారికలూ పచార్లు చేస్తున్నారు. వసుదేవుడు అల్లంత దూరాన ఉండగానే వారిని మాయ కమ్మింది. ఎక్కడి వారక్కడ మైకంలో పడుకున్నారు.

లోపల యశోదాదేవి మంచంపై పడుకుని వుంది. ముగ్గురు నలుగురు పరిచారికలు చుట్టూ వున్నారు. పురుడు పోస్తున్నారు.

బిడ్డ శీర్షోదయం అయింది. అంతలో వారినీ మాయ కమ్మింది.

ఆ బిడ్డను పక్కమీద ఉంచగానే నిదుర కొరిగింది. వసుదేవుడి భార్య రోహిణి మాత్రం మెలకువగా ఉంది.

వసుదేవుడు మండువా దాటి ఆ గదిలోకి వచ్చాడు. యశోద మగతగా పడుకుని వుంది. పక్కన పసిబిడ్డ. వసుదేవుడు స్వామిని ఆస్థానంలో పడుకోబెట్టాడు. బుగ్గలు నిమిరాడు ప్రేమతో. కంట నీరు తిరిగింది.

రోహిణి యశోద పక్కలోవున్న పాపను ఎత్తుకుని పొత్తిళ్ళలో చుట్టింది. వసుదేవుడికి అందించింది. కన్నుల కద్దుకున్నాడు.

నిదురించే యశోదకు నమస్కరించాడు. కదిలాడు. రెండడుగులు వేసి ఉండబట్టలేక తిరిగి వెనక్కు వచ్చాడు. తనకేమీ తెలియనట్టు కాళ్ళూ చేతులూ ఎగరేసి ఆడుకుంటున్న దివ్యమంగళ రూపుడిని, లీలా మానుష విగ్రహుడిని ఒళ్ళంతా కళ్ళు

చేసుకుని తనివితీరా చూశాడు. ఎంత చూసినా తనివి తీరలేదు. చేతులలో ఓడ్డ కేరుమని ఏడిచింది. కర్తవ్యం గుర్తుకువచ్చి కంగారుగా బయటకు నడిచాడు వసుదేవుడు.

నడవ దాటుతూండగా,

రోహిణి ఏడాది పసిబిడ్డని ఎత్తుకువచ్చి ఎదర నిలబడింది. మోకరిల్లి శిరసా వందనంచేసి తన బిడ్డను దగ్గరగా వుంచి చూపింది.

ప్రశ్నార్థకంగా చూశాడు వసుదేవుడు.

'మన ఇంటి దీపం. దేవుడికన్న ముందుపుట్టిన అన్న' అంది రోహిణి.

'పేరు?'

'రాముడు. బలరాముడు అని పిలుస్తున్నారు.'

'చిరంజీవ!' తన ఆశీస్సుమీద తనకే నమ్మకం లేక వసుదేవుడు నిట్టూర్చి, బాధ అణచుకుని కన్నులతోనే ఆకాశానికి మొక్కాడు. కంట నీరు తిరిగింది. కదిలాడు. త్వరత్వరగా అడుగులు వేశాడు.

❀ ❀ ❀

చెరసాల ద్వారపాలకులకు పసిపాప ఏడుపు కర్ణ కఠోరంగా వినబడింది. దిగ్గున లేచారు. గదిలో చూశారు. దేవకీదేవి పక్కలో పసిపాప!

ఏడుస్తున్నాడు.

అష్టమ గర్భం!

రాజుగారికి ప్రాణగండం!

యమదూత!

'మహారాజా' అంటూ కేకలువేస్తూ పరుగెత్తారు.

❀ ❀ ❀

రథాశ్వాలు మోరలు పైకెత్తి ముంగాళ్ళు నేలకి తన్ని ఒక్కసారి విసురుగా పైకి లేచాయి.

భూ నభా లదిరేలా భీకరంగా ఘోష పెట్టాయి. కొరడా ఛెళ్ళుమంది.

రథం ముందుకు కదిలింది.

కంసుడు మహోగ్రదగ్రుడై రథం తోలుతున్నాడు.

ఉదయపు నీరెండలో అందంగా హాయిగా మేలుకుంటున్న మధుర రథచక్రాల ధాటికి అశ్వపదఘోషకి అదరిపడసాగింది. వీధులలో కసువూడ్చే చోట్ల కొద్దికొద్దిగా లేస్తున్న ధూళి సుడిగాలికి ఎడారిలో ఇసుకలా చెలరేగి విజృంభించింది.

పసిబిడ్డలూ, ఆవులూ దూడలూ పుష్పలావికలూ నీళ్ళ పాల కావిళ్ళవాళ్ళూ కకావికలై పరుగిడుతున్నారు. పాలూ నీరూ కూరలూ పళ్ళూ నేలమీద చెల్లాచెదురుగా పడిపోతున్నాయి.

రథంలో కంసరాజు రౌద్రావేశంలో వణికిపోతూ గుర్రాలను మళ్ళీమళ్ళీ ఛెళ్ళు ఛెళ్ళున కొడుతున్నాడు. దేవకి చెరసాల ద్వారం పెద్ద చప్పుడుతో తెరుచుకుంది. పసిబిడ్డను చేతుల్లో పెట్టుకుని దంపతులిద్దరూ కంసుడికి ఎదురు వచ్చారు. కంసుడు కత్తి దూశాడు. చేయి జాచాడు.

'అన్నా ఇది ఆడపిల్ల! అశరీరవాణి మాట అసత్యం!'

కంసుడు కత్తిని దించి ఆశ్చర్యంగా చూశాడు.

'అష్టమ గర్భాన పుట్టే పుత్రుడు గదా నీకు హాని చేసేది! కాని ఇది పుత్రిక. దీన్ని చంపకు. ఈ ఒక్క బిడ్డ ప్రాణదానం చేసి నా పుత్ర శోకాన్ని చల్లార్చు.

'దేవకీ ఇదంతా మోసం. నీ దొంగ దేవుడు ఆడుతున్న కపట నాటకం. మొన్న ఏడవ బిడ్డ బదులు గర్భస్రావం. ఇవాళ కొడుకు కాకుండా కూతురు. ఇది నాటకం. ఆడా మొగా నా కనవసరం. అష్టమ గర్భం - అది నాశనమై తీరాలి. తే' అంటూ ఆ బిడ్డను ఎడమచేత లాగి పై కెగరేసి కత్తి ఝుళిపించాడు.

కాని ఆ బిడ్డ నేల కూలలేదు. అంతరిక్షంలో నిలబడిపోయింది.

దివ్యకాంతితో దేదీప్యమానంగా వెలిగిపోతోంది యోగ మాయాదేవి. ఎనిమిది చేతులు, ఆయుధాలు ఆభరణాలు, ఆమెను సేవించే దివిజకోటి.

కంసుడు నిర్విణ్ణుడై పోయాడు. నిస్తేజుడై పోయాడు. జీవచ్ఛవమైపోయాడు.

చేతిలో కత్తిజారి నేలమీదపడి ఆ నిశ్శబ్ధంలో ఖణేల్‌మని దీనంగా మోగింది.



'ఓరీ కంసుడా! నిన్ను చంపేవాడు ఇక్కడ లేదు. నీ వూహ కందని చోట నీకు దొరకని చోట పెరుగుతున్నాడు. నిన్ను చంపడానికి సిద్ధమవుతున్నాడు' అని అంతర్థానం చెందింది.

కంసుడు చేష్టలుదక్కి అలాగే కొద్ది క్షణాలు శూన్యంగా చూస్తూ నిలబడిపోయాడు.

❀ ❀ ❀

ప్రళయ వేళ మేఘంలా గర్జించాడు కంసుడు.

'నిన్నా ఇవాళ రేపూ పుట్టిన పుట్టబోయే బిడ్డలందరినీ చంపండి. రాజ్యం నలుమూలలా దండెత్తి వెదికి వెదికి చంపండి. ఆడా మగా ఎవరయినా సరే నిర్దాక్షిణ్యంగా చంపండి' అన్నాడు.

తలలు వంచి నిల్చున్న అతని మంత్రులు ముఖ్యానుచరులు ముఖముఖాలు చూసుకున్నారు భయంగా.

పూతన సాహసించింది.

'ప్రభూ! మన రాజ్యంలో తమ భక్తులు, బంట్లు, బంధువులు, తమ రాణివాసంలో, తమ విలాస మందిరాలలో పుట్టిన శిశువులు ఎందరో వుంటారు. వారందరినీ చంపితే మనవారే మనకి పగవారై పోతారుగదా' అంది.

'పూతనా! నా చెల్లి బిడ్డల్నే చంపడానికి వడిగట్టాను. ఆరుగుర్నీ నా చేతులతోనే చంపాను. భటులూ బంధువులూ నాకొక లెక్కా? రాజభక్తి వుంటే వారే స్వయంగా చంపి నాకు చూపాలి. వెళ్ళు. రాజు ప్రాణానికే ఆపద వచ్చినపుడు ప్రజల ప్రాణాలకి విలువేమిటి' అన్నాడు కంసుడు.

పూతన తలవంచుకుంది.

'వెళ్ళు. నువ్వు వెతుకు. వా దెవడో ఎక్కడ వున్నాడో ఎలా బతగ్గలడో చూడు. వాడిని చంపితే...' అంటూ ఆమె దగ్గరగా వచ్చి ఆగాడు. మందహాసం చేశాడు. ముందుకు వంగి నెమ్మదిగా అన్నాడు.

'పసిబిడ్డలను చంపడంలో నీకు చాలా ప్రజ్ఞ వుంది గదూ! చాలా కుటుంబాలలో ఆస్తికి ఇద్దరూ ముగ్గురూ వారసులు పుట్టినపుడు నీవు వాళ్ళకి సాయంచేసి ఆదుకున్నావు.'

పూతన కలవరంతో చూసింది.

'లేదు ప్రభూ! ఇప్పుడవన్నీ మానుకున్నాను. నాకూ ఇద్దరు పసిబిడ్డలున్నారు.'

'ఓ! అయితే ఓ పూతనా! శిశుహంతకీ! నీకో గొప్ప బహుమతి.'

పూతన అదిరిపడి భయంగా చూసింది.

'బహుమతి అంటే భయపడతావేం పూతనా?'

పూతన వణికిపోతూంది.

'నా చెల్లెలి అష్టమ గర్భాన్ని చంపితెస్తే నీకు గొప్ప బహుమతి. నీ బిడ్డ లిద్దరికీ నీ భర్తకీ ప్రాణదానం చేస్తాను. వాళ్ళని చూసి కలకాలం ఆనందించడానికి నీక్కూడా ప్రాణదానం చేస్తాను. మాట తప్పను.'

పూతనకి ముచ్చెమటలు పట్టాయి.

కంసుడు విరగపడి నవ్వుతున్నాడు.

'వెళ్ళు. వా దెవడో ఎక్కడున్నాడో ఏం చేస్తున్నాడో...'

❀ ❀ ❀

వ్రేపల్లెలో కోలాహలంగా వుంది.

నాయకుడు నందయ్యగారికి లేకలేక ఇన్నాళ్ళకి సంతానం! అదీ మగబిడ్డ! అందులోనూ ఎంత చక్కనివాడు ఎంత నల్లనివాడు ఎంత చల్లనివాడు! ఈ నల్ల చందమామ నవ్వులు వెన్నెలకన్న వెయ్యింతల తెలుపట!

ఆటలూ పాటలూ విందులూ వినోదాలూ దానాలూ ధర్మాలూ! పూతన మారువేషందాల్చి మందిలో కలిసింది. అజాపజా చూస్తోంది. ఆమె సమీపించినపుడు ఆవులూ దూడలూ కుక్కలూ పక్షులూ చెదిరి దూరంగా పోతున్నాయి.

పూతన ఒక గడ్డివాము చాటున నిలచి కన్నులు మూసుకు మాయ చేసింది.



తన బిడ్డలు వచ్చారు. గుండెకు హత్తుకు ముద్దులాడింది. చంక నొకణ్ణి, భుజాన ఒకడినీ వేసుకుని నలుగురిలో తిరుగుతోంది. కృష్ణుడి తొట్టికేసి వెళ్ళి చూస్తోంది. తన బిడ్డలని చూసుకుంటోంది. వాళ్ళని చూసి భయపడుతూంది. కృష్ణుడిని కసిగా చూస్తోంది.

చివరకు బిడ్డలను ఒక తోటలో ఏకాంత ప్రదేశంలో వదిలి కృష్ణుడి కోసం కదిలింది.

బిడ్డలిద్దరూ ఒక్కసారిగా ఏడుస్తూ ఆమె చేయీ చెంగూ పట్టుకులాగసాగారు.

పూతన వారికేసి జాలిగా చూసింది. 'ఈ ఒక్కసారి ఈ ఒక్క పిల్లాడిని చంపక తప్పదు. ఇంకెప్పుడూ ఈ పనులు చెయ్యను. ఇది చివరిసారి. ఇది మీ కోసం, మీ ప్రాణాల్ని కాపాడడం కోసం' అంది.



అయినా పిల్లలు మరింత గొడవచేసి ఆమెని ఆపసాగారు. పూతనకి ఓపిక పోయింది. వాళ్ళిద్దర్నీ మాయచేసి మధురకి పంపేసింది.

❀ ❀ ❀

పూతన ఒక చెట్టుచాటున నిలిచి రైకలో దాచిన ఒక విషపుమందును తీసి చనుమొనల చుట్టూరా అలమింది. ఆ వేలిని పక్కనే వున్న ఒక లేగదూడకి నాలికకి రాసింది. అది పిచ్చిగా అరచి కిందపడి గిలగిల తన్నుకుని చనిపోయింది. పూతన తృప్తిగా తలవూపి రైక బిగించుకుంది.

❀ ❀ ❀

నందయ్యగారిల్లు చాలా సందడిగా వుంది. చిన్ని కృష్ణయ్యకు కానుకలిచ్చేవారు, హారతులిచ్చేవారు, ముద్దులు పెట్టేవారు, మెటికలు విరుచుకునేవారూ, దిష్టి తీసేవారూ బిడ్డని ఒకరి చేతిలో ఒక్క నిమిషం కూడా వుండనివ్వకుండా ఎగరేసుకుపోతున్నారు. ఏదో ఒక నెపంతో కిష్టయ్యని తాకాలన్న తపన అందరిలో.

నందయ్యగారింట లేకలేక పుట్టిన బిడ్డ మగబిడ్డ కావడం.

ఆ బిడ్డ భువన మోహనుడు కావడం, ఊరందరికీ పండగగా వుంది. ఊరంతా తోరణాలతో ముగ్గులతో అలంకరించారు.

పూతన మనోహరమైన రూపం ధరించి 'ఊరంతా కలయదిరుగుతూంది. అందరూ ఆమె అందాన్ని చూసి మురిసిపోతున్నారు. మగవాళ్ళు గుడ్లు తేలవేస్తున్నారు. అప్పుడప్పు డామె గాలిలోంచి మంచిపళ్ళు, పిండివంటలూ పుట్టించి పిల్లలకి కానుకలిస్తోంది. నందుడి ఇంటచేరి కృష్ణయ్యకు ఒక రత్నాల హారం' మామిడి పిందెల మొలతాడు. కాలికి అందెలు, చిరుమువ్వల గజ్జెలు తీసి యశోదచేతి కిచ్చింది. యశోద ఆశ్చర్యంగా చూసింది.

'బుల్లావుల పాలెం పెత్తందార్లం, మా వారు జోడు కపిలగోవుల్ని తోలుకవస్తున్నారు. నేను ముందుగా వచ్చేశాను. ఏం పుణ్యం చేశావమ్మా ఏం పూజలు చేశావమ్మా' అంది పూతన. యశోద తలమీద రెండు చేతులూ నిమిరి మెటికలు విరుచుకుంటూ.

యశోద సిగ్గుపడిపోయింది. 'అంతా వాడి దయ'

'కాదు వీడి దయే' అంటూ కృష్ణయ్య బొజ్జలో ఓ పోటు పొడిచింది పూతన.

'మాలాటోళ్ళ కోటానకోట్ల మొక్కుబళ్ళు గాదని నీ ఇంటి కొచ్చి కొలువు దీరాడు. నాకూ వున్నారు పిల్లలు, కాని' అంటూ నొప్పి నటించింది. యశోద తెల్లబోయి చూసింది.

'ఏం జెప్పను! పద్నానుగునాళ్ళ బాలింత్రాల్ని. బిడ్డను వదిలొచ్చా ఈ నల్లబంగారాన్ని చూడగానే పాలు చేపేయి తల్లీ! చేపడంగాదు పొంగులెత్తాయి. ఇంత చక్కనయ్యను కనిపెంచే పుణ్యానికి నోచకపోయినా గుక్కెడు పాలిచ్చే అదృష్టం ఇస్తావా చెల్లెమ్మా?' అంది కళ్ళు కలువ పువ్వులా విప్పార్చి.

యశోదకి ఇష్టం లేకపోయినా ఏం చెప్పలేక అటూ ఇటూ చూసింది. తొట్టిలో కృష్ణయ్య కేరింతలు కొట్టి వూపుతున్నాడు.

'నాతో సైగొాదుతున్నాడు' అంటూ పూతన అమాంతం బిడ్డని తొట్టెలోంచి పైకితీసి గుండెలకు హత్తుకుంది.

యశోద ఏమీ చెప్పలేక చూస్తోంది.

నందయ్య పిలిచాడు 'యశోదా ఇట్రా ఒకసారి' అని.

నగలు పట్టుకుని కంగారుగా పరుగెత్తింది యశోద.

పూతన కృష్ణయ్యని ఎత్తుకుని పెరటికేసి నడిచింది. అరుగు మీద స్తంభానికి జేరబడి కూర్చుని పైట తొలగించి రైక సడలించి కృష్ణయ్యకు చన్నిచ్చి పైట కప్పింది.

ఉత్తర క్షణంలో ఆమె ఒళ్ళు జలదరించింది.

వేదాలను ప్రవచించిన పవిత్ర అధరాలు.

శ్రీ మహాలక్ష్మి కుచకుంభాలలో అమృతాన్ని ఆస్వాదించి ఆరగించిన పుణ్యాధరాలు.

సమస్త విశ్వాన్నీ ఉఱ్రూతలూగించే మురళికి వూపిరు లందించనున్న మధురాధరాలు. రాధమ్మ చెక్కిలిపై తీపి గురుతులు కానున్న మధురాధరాలు.

రాసక్రీడలో పదారువేల గోపికలను ముద్దులతో ముంచెత్తనున్న అధరాలు.

విశ్వమోహనంగా లాస్యం చిందించే అధరాలు, అతి మధురాలు.

భగవద్గీతోపదేశం కావించనున్న మనోజ్ఞ అధరాలు.

అసత్యాలు పలికించనున్న అధరాలు...

దైవత్వం చిలిపితనం నిండిన అధరాలు.

ఒక రాక్షసి విషాన్విత విషపూరిత కుచాగ్రాలను స్పర్శించాయి.

పూతన జన్మ తరించింది.

ఆ పుణ్యం అతిలోకమైన అనిర్వచనీయమైన అనుభవైకవేద్యమైన శారీరక సౌఖ్యాన్ని క్షణంలో సహస్రాంశంపాటు ఆమెకు కలిగించింది.

ఆమె నాడులు వేయి వీణలై, శతకోటి వేణువులై ఒక కొత్త రకమైన సంగీతంతో ఆమెను నింపివేశాయి. భరించరాని ఆనందంలో సుడులు తిరిగిపోతూంది. మరొక్క క్షణం తరవాత భరించరాని ఆనందం బాధగా మారిపోయింది. పారవశ్యంతో కన్ను లరమోడ్చిన ముఖం క్రమంగా వికారమై, భయంకరమై, బాధాసర్పదష్టమై ఆర్తనాదా లారంభించింది. అందంగా కోమలంగా వున్న పూతన నిజరూపం క్రమంగా ఆవిర్భవించ సాగింది.

'వద్దు! వదులు కృష్ణయ్యా వదులు, చచ్చిపోతున్నాను వదులు. తండ్రీ! ప్రభూ! జగన్నాథా! వదులు. ప్రాణాలు పోతున్నాయి. ప్రభూ వదులు. వదలొద్దు పీల్చెయ్. ప్రాణాలు తోడెయ్. నన్ను చంపెయ్. నన్ను విడుదలచెయ్. ప్రభూ! కృష్ణా!' పెద్ద కేకతో పూతన ఒక్కసారి పైకి లేచింది. ఆమె మహాశరీరం లేచిన తాకిడికి ఆమె

కూర్చున్న వసారా పై కప్పు ఫెడేలున బద్దలై పైకెగిరి పడిపోయింది. పూతన మొదలు నరికిన మహావృక్షంలా నేల కొరిగింది.



ఆమె చనుబాలు పెరడంతా తెల్లటి మడుగులా పడివున్నాయి. వాటి మధ్య ఆమె చనుమొన నుండి జలపాతంలా ఎర్రటి నెత్తురుధార కిందికురికి పాలతెలుపు మధ్య మంటలా ఎగజిమ్ముతోంది.

బాలకృష్ణుడు ఏమీ తెలియనట్టు పారాడుతూ ఆడుకుంటున్నాడు.

ఈ ఘోష విని నంద యశోదలు అంతా పరుగున వచ్చారు. హాహాకారాలు చేశారు. యశోద బిడ్డ నెత్తుకుని గుండెకు హత్తుకుంది. రోహిణి బిడ్డ వీపు చరిచి భయపడ వద్దంది.



మరి నలుగురు వాళ్ళని పక్కకికి తీసుకుపోయారు. ఇంకిద్దరు దిష్టి తీశారు. మరిద్దరు తావీదులు కట్టేస్తున్నారు. శ్రీరామరక్ష హరి రక్ష అంటూ రక్షలు వల్లిస్తున్నారు.

పురుషులంతా పూతన శవం దగ్గర నించుని ఆశ్చర్యంగా చూస్తున్నారు.

నందుడి ఆజ్ఞపై పూతన మహాకాయాన్ని గొడ్డళ్ళతో ఖండఖండాలుగా నరికి ఊరి చివరకు ఈడ్చుకుపోయి తగలబెట్టారు.

❀ ❀ ❀

కంసుడి ఉద్యానవనం - కంసుడి మంత్రులు, సేనానులు తలవంచుకు నించున్నారు. కంసుడు నిశ్చేష్టుడైపోయి ఆకాశంలోకి చూస్తున్నాడు.

ఎక్కడో తీతువు పిట్ట కసిగా గీపెడుతోంది. ఎక్కడో ఒక కుక్క అపశకునంగా ఏడుస్తోంది. అవి తప్ప అంతా నిశ్శబ్దం.

కొద్ది క్షణాల తర్వాత కంసుడు కదిలాడు. అప్రయత్నంగా మాటలు వెలువడ్డాయి.

'పూతనని చంపినది ఆ పసివాడే అయితే, పాలిచ్చే రొమ్ములోంచి నెత్తురు పీల్చి చంపాడంటే, కాలకూట విషాన్ని మింగి బతికాడూ అంటే...

వాడే! వాడే! నా శత్రువు. వాడే దొంగదేవుడు. పిరికిదేవుడు' అంటూ వుద్వేగంగా అరిచాడు. చేతిలో మధుపాత్రని విసిరికొట్టాడు. అది కొంచెం ఎడంగావున్న చిన్న కొలనులోపడి ఊగిసలాడి గుడగుడమని శబ్దం చేస్తూ మునగసాగింది.

సలహాదారులంతా తలెత్తి భయంగా చూశారు. కంసుడు వారి ముఖాలను చూస్తూ మెల్లిగా నడుస్తున్నాడు. కొలనులో మునుగుతున్న మధుపాత్ర గుడగుడ శబ్దం. చిరాకెత్తిపోయింది. కంసుడు ఒక్క అడుగులో అటు లంఘించి, ఒరలోంచి కత్తిదూసి తన కసినంతా ఆ పాత్రమీద చూపించి కొట్టాడు. అది ఆ దెబ్బకి మునిగి మరుక్షణంలోనే బంతిలా పైకి తన్నుకు వచ్చింది.

'ఇంక జాగేలా! పదండి - సైన్యాలను కదిలించండి. చతురంగ బలాలతో దండెత్తి నా దూతికను చంపిన ఆ హంతకుడిని ఖండించండి. ఆ వ్రేపల్లెని సర్వనాశనం చేసిరండి. పొండి' అన్నాడు.

అంతా ముఖముఖాలు చూసుకున్నారు. ఎవరూ కదలలేదు. ముఖ్యమంత్రి ప్రలంబుడు సాహసించి ఒకడుగు ముందుకు వేశాడు.

'ప్రభూ ముందు నా శిరసు ఖండించి పిదప వ్రేపల్లెను దండించండి' అన్నాడు తలవంచి.

'అదేమి వితండ వాదన?'

'నా ప్రభువులకి అపకీర్తి కలగడం, అపజయం వాటిల్లడం చూసి ఎలాగూ బతకలేను. అందువల్ల!'

'ప్రలంబా!'

'అవును ప్రభూ, ఒక సైన్యం ఇంకో సైన్యంతో పోరాడి గెలవవచ్చుగాని అది ఎంత పెద్ద సైన్యమైనా ప్రజా సముద్రాన్ని గెలవలేదు. ఒక నది సముద్రంమీదికి ఉరికితే, అది ఎంత కోపంగా ఉరికినా సముద్రమే నదిని మింగేస్తుంది గాని నది సముద్రాన్ని మింగలేదు.'

'వ్రేపల్లె గొల్లలు అంత గొప్పవాళ్ళా?'

'కోపంతో రెచ్చిపోయాక కొద్దివాళ్ళైనా గొప్పవాళ్ళని కొట్టగలరు. పిల్లి పులిని ఎదిరించగలదు. ప్రభూ! మీ సోదరి దేవకి సంతానం ఆరుగురిని చంపినందుకే ప్రజలలో కోలాహలం బయలుదేరింది. ఎనిమిదో శిశువు వేట పేరిట దేశంలో పసిబిడ్డలని వేలాదిగా చంపించారు. ఇవ్వాళ ప్రజలందరిలో చెప్పరాని బాధ, పట్టరాని కోపం అలముకున్నాయి. అగ్నిపర్వతం ఎపుడో పెటేలు మనవచ్చును. ఇవ్వాళ పూతనని చంపిన పసివాడిమీద పగతో మనం దండెత్తితే ఆమెని పంపింది మీరేనని శిశుహత్యలన్నీ మీ వల్లేననీ తేలిపోతుంది.

వ్రేపల్లె గొల్లలమీద కత్తిదూస్తే ఆ ప్రాంతపు చిన్న రాజ్యాలన్నీ ఏకమై మనమీద విరుచుకు పడతాయి. వాళ్ళదగ్గర కత్తులుండక్కరలేదు. వాళ్ళ ఆలమందల గిట్టలకింద మనం మన రాజ్యం బూడిదలో కలిసిపోతాం. మన రాజ్యానికి కావాల్సిన పాడీ-పంటా వ్రేపల్లె గొల్లలే పంపిస్తున్నారు. వారు ఆగ్రహిస్తే తమ ఏలుబడిలో ఆకలి చావులు కూడా తప్పదు. మన ఆర్థికవ్యవస్థ అస్తవ్యస్తమవుతుంది. కరువు కాటకాలూ చెలరేగుతాయి. మీ మీద కసివున్న శత్రువులు ఇంటా బయటా ఏకమవుతారు.'

కంసుడు మాట్లాడలేదు. పచార్లు చేస్తున్నాడు.

'ప్రలంబా నువ్వంటే నాకు అసహ్యం. పచ్చిగా నిజం చెప్పి వ్యతిరేకిస్తున్నావు. నిన్ను చంపడానిక్కూడా నాకు భయం, నీపాటి నిజం చెప్పే దుర్మార్గుడు ఒక్కడుకూడా వుండడని!'

ప్రలంబుడు చిరునవ్వుతో వందనం చేశాడు. మిగతా అంతా మనసులో తేలికపడి నిట్టూర్చారు.

కంసుడు తిరిగి బుసకొట్టాడు ఆవేశంతో.

'అంటే వాడు ఆ పసివాడు ఇంత చావుదెబ్బ కొడితే వానపాములా పడివుండనా?'

'ప్రభూ వాడెవడో చాటునించే పోరాడుతున్నాడు గదా! మీరు కొట్టిన చాటు దెబ్బకి దొంగదెబ్బ కొట్టాడు గదా! ఇంకోసారీ, ఇంకోసారీ తామూ అలాటి దెబ్బలే కొట్టండి. వజ్రాన్ని వజ్రంతో, మోసాన్ని మోసంతో కొయ్యాలి. ఈసారి గట్టివాళ్ళని ప్రయోగించండి. తమ చేతులకి మట్టి కాకుండా' అన్నాడు ప్రలంబుడు.

కంసుడు అతని వంక తేరిపార చూశాడు, గౌరవంతో, సాలోచనగా.



శ్రీకృష్ణుని జన్మనక్షత్రం రోహిణి. ఆనాడు యశోదా నందులు పెద్ద పండగ చేశారు. చెరసాలలో దేవకికూడా తన బొమ్మకి పండగ చేస్తోంది. అక్కడ తలంటి పోస్తుంటే ఇక్కడ బిడ్డ కంటిలో నలుసు. దేవకి తల్లడిల్లిపోయి చెంగుతో ఆవిరి పట్టింది.

అక్కడ కృష్ణయ్యకు పట్టుపంచెకట్టి కురులు దువ్వుతూంటే ఇక్కడ దేవకి పూలు ముడిచింది. వంకరగా వస్తున్న పాపిడిని సరిదిద్దింది. దిష్టిచుక్క పెట్టింది. నెమలి పింఛం కొప్పున తురిమి సరిచేసింది.

వసుదేవుడు నిస్సహాయంగా కంటనీరు పెట్టుకుని చూస్తున్నాడు.

అక్కడ కృష్ణయ్యకు యశోద చన్నిచ్చి పాలుపడుతోంది. కృష్ణయ్య రెండవ చేయి, కాలూ ఆమె రెండో రొమ్ముని కుమ్ముతున్నాయి.

కృష్ణయ్య బొమ్మని పైట చాటున పెట్టుకుని తన్మయురాలై కూర్చున్న దేవకికి పాలు చేపుతున్నాయి. పైట తడుస్తోంది.

కృష్ణయ్య చేయి కాలు రెండో రొమ్ముమీద తన్నుతున్నాయి. ఆ ఆనందం భరించలేక అలాగే సొమ్మసిల్లి పడిపోయింది.

కలగంది. అందులో చిన్నారి కృష్ణయ్య చిన్నారి కాళ్ళు జాచాడు. ఆమె ఆ వడిలో తలవుంచి పడుకుంది. చిన్నారి చేతులు కన్నీటిని తుడిచి జోకొడుతున్నాయి. లయ వేస్తున్నాయి. ఆమె చెంపలమీద ఆమె వెక్కివెక్కి ఏడుస్తోంది ఆనందంతో.

వసుదేవుడు చూశాడు. ఆమె చేతిలోని బొమ్మని తీసి పదిలంగా పూపొదల మాటున దాచి, ఆమెను లోపలికి తీసుకువెళ్ళాడు.

చిన్ని కృష్ణయ్యకు, బలరాముడికి మంగళారతులిచ్చారు. దిష్టి తీశారు. దీవించారు. కృష్ణయ్య ఎక్కడో చూస్తున్నాడు. ఆవులించి కన్ను లరమూశాడు. యశోద అది గుర్తించి వెంటనే ఎత్తుకుని వాకిటిముందు చెట్టుకు వేసిన ఉయ్యాల తొట్టిలో పడుకోబెట్టింది. చిన్ని కృష్ణుడు కాలి బొటనవేలు నోటపెట్టుకు పడుకున్నాడు.



భక్తులు ఋషులు చూస్తే జగత్తంతా ప్రళయంతో సంక్షోభించి నాశనం అవుతున్న వేళ సముద్రమధ్యాన రావి ఆకుమీద పసిపాపడై పడుకున్న 'వటపత్రశాయి' దివ్యరూపం స్ఫురించి, వాళ్ళు ముగ్ధులై స్తోత్రాలు చేసేవారే. కాని హాయిగొలిపే మాయ మధ్యవున్న యశోదమ్మ మాత్రం 'ఛీ తప్పు, నోట్లో వేళ్ళెట్టుకో కూడదు' అని ఆ కాలిని లాగేసి లోపలికి వెళ్ళిపోయింది.

పది అడుగుల దూరంలో ఒక రెండెడ్ల బండి కాడి వాల్చివుంది. బండినిండా కూరలు, పళ్ళు, వెన్నదుత్తలు. పాలకుండలూ వున్నాయి. యశోద వెళ్ళగానే క్రిష్ణయ్య నవ్వుకుని క్రీగంట అటు చూశాడు. బండి మీదకు ఒక గాలి దిగింది. వాడు శకటాసురుడు. బండిని పూనాడు. బండి కాడి లేచింది. లంఘించే సింహంలా పైకి లేచింది. బండి భయంకరంగా ముందుకు కదిలింది. కృష్ణయ్య గమనిస్తున్నాడు. చుట్టుపక్కల ఆడుకుంటున్న పిల్లలు ఎద్దులు లేకుండా బండి కాడి లేపడం, కదలడం గమనించి, ఆటలు మానేసి అటే చూస్తూ నిలబడిపోయారు.

బండి కృష్ణయ్య తొట్టిని ఒక్క వుదుటున వచ్చి కొట్టింది.

తొట్టిలో బిడ్డ ఎగిరి కింద పడ్డాడు.

కృష్ణయ్య మీదకు ఉరికింది బండి. కృష్ణయ్య ఎడమకాలితో ఒక తాపు తన్నాడు.



బ్రహ్మాండం బద్దలైనంత శబ్దంతో బండి పైకి ఎగిరింది. ఎగురుతూనే ముక్కముక్కలై పోయింది. బండి ముక్కలు జీలుగు బెండు ముక్కల్లా పైకి ఎగిరి నెమ్మదిగా నేల కొరిగాయి. ఒక్కొక్కటే భీకరమైన శబ్దంచేస్తూ అక్కడున్న పందిరిని. ఇంటి చూరుని కూల్చేశాయి.

లోపల్నించి యశోదా నందులు. రోహిణీ పరుగున వచ్చారు. యుద్ధరంగంలా వున్న ఆ చోటు, బండి ముక్కల మధ్య; చితికిపడిన పళ్ళు, చెదిరిన వడ్ల బస్తాలు, నేలపాలైన పాలు వెన్నల మధ్య చిన్ని కృష్ణయ్య కాలిమీద కాలేసుకుని ఆడుకుంటున్నాడు. అతని పక్కన బండి చక్రమంత అరచెయ్యి వుంది.

నందుడు ఆ చేతి దగ్గర ఆగి చూశాడు. అది శకటాసురుడి విరిగిన హస్తం. చుట్టూ శకటాసురుడి కాళ్ళు, తల ముక్కముక్కలుగా చెల్లాచెదరై పడివున్నాయి.

యశోద దిగ్గున ముందుకురికి బిడ్డను ఎత్తుకుని గుండెలకు హత్తుకుంది. ఆడుకునే పిల్లలు అరుస్తున్నారు.

'కిష్టయ్య బండిని తన్నాడు. బండి బూచాడు చచ్చిపోయాడు' అంటున్నారు.

నందుడు ఆకాశం వంక చూసి నమస్కరించాడు. రోహిణి' యశోద క్రిష్ణయ్యకు దిష్టి తీస్తున్నారు. తాయెత్తులు కడుతున్నారు.



ఉషఃకాలం

వ్రేపల్లె మోహనంగా మేలుకుంటూంది.

కోళ్ళు మేలుకొలుపులు పాడుతున్నాయి. తుమ్మెదలు ఝుమ్మంటున్నాయి. ఆవులూ దూడలూ 'అంబా' అంటున్నాయి. నూతిమీద నీరుతోడే గిలకలు కిలకిల కిచకిచ మంటున్నాయి.

పనులమీద తిరిగే గొల్లభామల కాళ్ళ అందెలు గజ్జెలు ఘల్లు ఘల్లు మంటున్నాయి. అందంగా వంగి ముగ్గులుదిద్దే అమ్మాయిల కూనిరాగాలు గుమ్మదేదే,

గోపిదేవీ పాటలు మెత్తగా మంచుతెర వెనుక చందమామ కనిపించినట్లు లీలగా వినిపిస్తున్నాయి.

ఆవుదూడలు చెంగుచెంగున దూకుతూ పరుగులెత్తేటప్పుడు వినిపించే మువ్వల చప్పుడు, తల్లి దగ్గర ఆత్రంగా పాలుకుడిచే చప్పుడు 'నెమ్మదినెమ్మది, పాలన్నీ నీకేనమ్మా' అని చెబుతూ గోమాతలుచేసే గంభీరమైన మంద్రస్థాయి మందలింపులూ, 'నీకు తెలీదులేమ్మా మళ్ళీ మమ్మల్ని దూరంగా కట్టేస్తారు' అంటూ పొదుగును ఎగబొడిచి కసిగా పాలు తాగేసే లేగదూడల మురిపాలు సంగీతమై వెల్లివిరుస్తున్నాయి.

లేగలు చెప్పినట్టే పాలుపితికే శబ్దం స్పష్టంగా వినబడుతూంది. ఒకచోట వంద ఆవులకి గొల్లభామలు పాలు పితుకుతున్నారు. పాలనురగతో వెలిగే లేగల నల్లని మూతుల్ని వాటి నాలికలతో తుడుచుకుంటున్నాయి. ఆవుల పొదుగులు మబ్బుల్లా వున్నాయి. పాలధారలు వెండి తీగెల్లా మెరుస్తున్నాయి. వంద ఆవుల పొదుగులు పితుకుతుంటే పాలవాన కురుస్తున్నట్టుంది.

ఆ పైన చల్ల కడవల్లో వెన్న కవ్వాలపాట ఘుమ్మఘుమ్మన మేలుకుంది. పాతికమంది ఇల్లాళ్ళూ, కన్నెపిల్లలూ స్థంభాలకు నిలువు కవ్వా లేసుకుని మజ్జిగ చిలికి వెన్న తీస్తున్నారు. తీసిన వెన్నని పక్కనేవున్న పెద్ద బానలలో వేసి నింపుతున్నారు. ఒక బాన నిండింది. పైన ఏపుగా గోపురం కడుతోంది వెన్న. ఆ బాన చాటున ఐదారేళ్ళ చిన్ని కృష్ణయ్య మోకాళ్ళమీద కూర్చుని మెల్లిగా లేచాడు. కవ్వమాడించే గోపిక అది గమనించనేలేదు. క్రిష్ణయ్య ఆ వెన్న గోపురం మీంచి అటునుంచి పట్టెడ వెన్న తీశాడు. అతని వెనకో ఆరుగురు పిల్లలు వరసగ పొంచి కూర్చున్నారు. ఈ వెన్న చిన్న కృష్ణుడు వెనకవాడి కిచ్చాడు. వాడు కొంచెం తిని తన వెనక వాడికి అందించాడు. గోపిక మళ్ళీ పట్టెడు వెన్న తీసి బానమీద వేసేసరికి· వెన్న గోపురం చదునుగా వుంది. ఒక్క క్షణం అనుమానంగా చూసి వెన్నముద్ద పడేసి



మళ్ళీ చిలుకుతూంది. కృష్ణయ్యా మళ్ళీ వెన్నతీసి పంచుతున్నాడు. గోపురం తరిగిపోయింది. గోపెమ్మ మళ్ళీ ఓ పెద్ద వెన్నముద్ద వెయ్యబోయి - చూసి ఆగింది. ధగధగలాడే కంకణం మురుగులు గల చిన్నారి నీలాల చెయ్యి వెన్న తియ్యబోతూంది.

'కృష్ణా' అంది గోపెమ్మ.

కృష్ణయ్యా, తోడు దొంగలూ ఉలికిపడి లేచారు. వెనక వాళ్ళు పారిపోయారు గాని - కృష్ణయ్యా చెయ్యి గోపికకి దొరికిపోయింది. ముందుకు వంగింది గోపిక.

'నిన్ను, నిన్నూ' అంటూ పక్క బానలోవున్న తెడ్డుతీసి ఎడంచేత్తో కొట్టబోయింది. తటాలున కృష్ణయ్య తన ఎడంచేత్తో ఇంత వెన్న తీసి గోపిక ముఖాన కొట్టడం. గోపిక తెడ్డు గురితప్పి కుండని పగలగొట్టడం ఒక్కసారే జరిగాయి.

కృష్ణుడు చెయ్యి లాక్కుని చప్పట్లు కొట్టాడు. అటూ ఇటూ వున్న గోపికలు వచ్చి పట్టుకోబోయారు. అందరినీ వెన్న బంతులతో కొట్టి. మధ్య మధ్యలో తనొకటి తింటూ నానా తిప్పలూపెట్టి, ఎగిరి ఉట్టిని అందుకుని ఊగి దూరాన దూకి పారిపోయాడు క్రిష్ణయ్య. వాళ్ళు తరిమారు. చివరికి ఎటూ పోడానికి వీల్లేక ఒక గోడ మూల దొరికిపోయాడు క్రిష్ణయ్య. పదిమంది గోపెమ్మలు గోడ కట్టినట్లు దిగ్బంధం చేశారు. నల్ల క్రిష్ణయ్య తెల్లగా నవ్వాడు. ఆ నల్ల క్రిష్ణుని నలుపు మీద వెన్నముద్దల పాలమీగడల చాయలు తెల్ల బంగారు నగలలా మెరిశాయి. మధ్యలో మట్టి మరకలు. మూతి బుగ్గలు భుజాలు ఛాతీ అంతా నలుపు తెలుపులమయం. గోపికలంతా ఒక్కసారి ఒకరి ముఖం మరొకరు చూసి పగలబడి విరగబడి నవ్వసాగారు.

❀ ❀ ❀

ఒకచోట ఇద్దరు గోపికలు ఒక ఇంటిపక్కన చెట్టుకింద నిలబడి మాట్లాడుకుంటున్నారు. చిన్ని క్రిష్ణయ్య, బలరాముడు, జతగాళ్ళు పైన చెట్టకొమ్మ మీదకి చేరారు. క్రిష్ణయ్య చేతిలో తామరతూడు వుంది. దాని చివర విరిచాడు. దాంతో గోపికల తలపైవున్న పాల కడవలపై కప్పిన గుడ్డని తొలగించాడు. బోర్లగిలా పడుకుని ఆ తామర గొట్టం కడవలో దింపి పాలు తాగాడు. తరవాత నేస్తాలకి ఇచ్చాడు. పాలన్నీ పీల్చేశారు జతగాళ్ళు. గోపికలు కదలబోయి కడవలు బరువులేవని అనుమానం వచ్చి. చేతులతో పైకెత్తి చూశారు. అనుమానం బలపడి కడవలు దించి చూశారు.

కడవలు ఖాళీ. తెల్లపోయి పైకి చూశారు. కృష్ణయ్యా జతగాళ్ళు కొమ్మమీంచి చూసి హాయిగా నవ్వుతున్నారు. కృష్ణ తన చేతిలోవున్న గొట్టాన్ని గోపెమ్మలమీద దులిపాడు. వాళ్ళ బుగ్గలమీద రెండు పాలబొట్లు నిలిచాయి.

❀ ❀ ❀

రాత్రి కృష్ణయ్యా జతగాళ్ళు ఒక ఇంట్లో జొరబడ్డారు. పాలు ఉట్టిమీద ఉన్నాయి. ఉట్టి అందలేదు. కృష్ణుడు కన్ను గిలిపాడు. జతగాళ్ళు ఒకడిమీద ఒకడు

ఎక్కి చిన్న గోపురం కట్టారు. కృష్ణుడు ఆ గోపురం ఎక్కి పాలకడవ అందుకోబోయాడు. కడవ పైకిలేచింది. కృష్ణుడు ఇంకోసారి ప్రయత్నించాడు మునివేళ్ళు కూడా జాపి. ఉట్టి అందినట్లే అంది మళ్ళీ పైకి వెళ్ళిపోయింది. కృష్ణుడు కదిలాడు. కిందవాళ్ళు చెదిరి పడిపోయారు. కృష్ణుడు కింద పడ్డాడు. లేచాడు. చూచాడు. దూరాన ఓ మూల ఉట్టితాడు పట్టుకున్న గోపబాల కిలకిల నవ్వింది. కృష్ణుడు తటాలున మొలలోంచి ఉండేలుబద్ద తీసి క్షణంలో ఉట్టిమీద కడవని కొట్టాడు. పాలు ధారకట్టి జారసాగాయి.



గోపిక కెవ్వుమంది. ఉండేలుని గోపికకి గురిచేశాడు. కదలద్దని ఆజ్ఞాపించాడు. గోపిక భయంతో అలా వుండిపోయింది.

పిల్లలంతా పాలధారను తృప్తిగా ఆరగించారు. అంతలో పక్కగదిలో అలికిడైంది. కృష్ణుడు గోపిక ముంజేతిమీద కొట్టాడు. పట్టు వదిలేసింది. ఉట్టి జారి పెద్ద చప్పుడుతో పాలకుండ నేలపడింది. కృష్ణయ్య జతగాళ్ళు కిటికీలోంచి దూకేశారు. ఈలోగా తలుపు తీసుకుని అత్తగారు వచ్చింది. భయపడుతున్న గోపెమ్మను చూసి చెయ్యెత్తింది.

బయట కృష్ణయ్య నవ్వుతున్నాడు.

మరో ఇంట్లో-

ఆలుమగలు పడుకున్నారు. ఆమె జడను, అతని కొప్పుకి కట్టేశాడు అటూ ఇటూ చక్కగా పిల్లల్ని కూర్చోబెట్టాడు. అరిసెలు, అప్పాలు, మీగడ, వెన్న, సున్నుండలూ అన్నీ మూతలు తీసిన కడవల్లో వున్నాయి.

'తినండ్రా' అన్నాడు. అందరూ కేరింతలు కొడుతూ తినసాగారు. ఆలుమగలు దిగ్గునలేచి పట్టుకోబోయారు. జుట్టు పీక్కుని కెవ్వున కేకలువేస్తూ మళ్ళీ మంచంమీదే పడ్డారు. క్రిష్ణయ్య వాళ్ళిద్దరి నోళ్ళలో వెన్న కూరి పారిపోయాడు.

❀ ❀ ❀

యశోద బెత్తం, తాడు పట్టుకుని తరుముతూంది. అమ్మా కొట్టకు అమ్మా కొట్టకు. అమ్మా... అమ్మా అంటూ పెరడంతా పరిగెడుతున్నాడు క్రిష్ణయ్య. యశోద కోపంగా తరుముతూంది...



❀ ❀ ❀

చెరసాలలో-

'రా బాబూ రా' అంటూ దేవకీదేవి చేతులు జాచింది. క్రిష్ణయ్య పరుగున వచ్చి అమ్మ సందెట్లో దూరి దాక్కున్నాడు. అమ్మ బిడ్డని గుండెల్లో పొదువుకుంది...

'నీకేం భయం లేదు బాబు. నేనున్నా. నిన్నెవరూ కొట్టరు!' అంటూ దేవకి ఒక బొమ్మని కౌగలించుకుని సతమతమై పోతోంది.

ఎదట గర్గాచార్యుడు. రోహిణి. వసుదేవుడు కంగారు పడుతున్నారు. వసుదేవుడు బొమ్మని లాక్కున్నాడు.

దేవకి కోలుకుంది. ఇదంతా భ్రమ అని గ్రహించింది. కన్నీరు పెట్టుకుంది.

'ఇలా అయితే ఇంక నేనేమీ చెప్పనమ్మా –' అంది రోహిణీదేవి.

'కాదు... నేనింక భ్రమపడను. కలగనను. బాధపడను... నా బంగారు తండ్రి కథలు చెప్పండి. కనే భాగ్యం లేనేలేదు. వినేభాగ్యం పోగొట్టకండి...' అన్నది దేవకి చేతులు జోడించి ఏడుస్తూ.

❀ ❀ ❀

వ్రేపల్లెలో–

ఒక ఇంట్లో లక్ష్మీనారాయణుల పటాలు. ఒక గోపిక పాలు వెన్న నైవేద్యం పెడుతూంది. కళ్ళు మూసుకు దండం పెట్టింది. క్రిష్ణయ్యవిలాసంగా అక్కడ నించుని వెన్న గిన్నెలో వేలుపెట్టి తీసుకు తిన్నాడు.



'ఆయ్! తప్పుకదూ – దేవుడి కివి నైవేద్యం... ఎంగిలి చేస్తావా...?'

'నేనే దేవుణ్ణి!' అంటూ మళ్ళీ వెన్న తీబోయాడు.

'హన్నా' అంటూ గోపిక లేచి పట్టుకోబోయింది. క్రిష్ణయ్య పరుగెత్తాడు. ఓ మూల దొరికిపోయాడు. ఆమె వంగి అతన్ని పిర్రమీద ఒకటి కొట్టింది. అంతలో కృష్ణుడు ఆమె రొమ్ము పట్టుకున్నాడు. కెవ్వున కేకవేసింది. బుగ్గన ముద్దుపెట్టుకు

కొరికి పారిపోయాడు వెన్నదొంగ - ఆమె భర్త తరుముతున్నాడు. కృష్ణుడు పరుగెడుతూ ఒకచోట - అరుగుమీద ఉన్న నేతిగిన్నెను అందుకుని ఆ వచ్చే ఆసామీ పాదాలకేసి విసిరాడు. వాడు జర్రున జారి, వెల్లకిలా పడ్డాడు.

మరోచోట ఆలుమగలు కలసి అన్నం తింటుంటే - విసనకర్ర ఇద్దరి మధ్య అడ్డంపెట్టి, గోపికకి కన్నుకొట్టి 'వస్తావా' అని సైగ చేశాడు.

ఊరి అమ్మలక్కలంతా యశోద ఇంటికివచ్చి క్రిష్ణయ్య దుడుకుతనం గురించి కోపంగా ఏడుస్తూ దీనంగా రోషంగా మొరపెడుతున్నారు. యశోద బుగ్గలు నొక్కుకుని ఆశ్చర్యంగా వింటోంది.

యశోదమ్మ అన్నీ విని 'అబద్ధాలు. అన్నీ అబద్ధాలు. మా వాడసలు నన్ను వదిలి ఎక్కడికి వెళ్ళడు. ఇపుడు కూడా ఇంట్లోనే వున్నాడు' అంది.

'కాదు మా ఇంట్లో రాటకి కట్టేసి వచ్చాను. రండి చూపిస్తాం.'

'కాదు. నేను మా వంటింట్లో పెట్టి తాళంవేసి వచ్చా. రా చూడు.

ఇలా అందరూ చెబుతుంటే యశోద నవ్వింది. తలుపు తెరచింది.

క్రిష్ణయ్య సావడిలోని తూగుటుయ్యాలలో నోట్లో వేలుపెట్టుకు నిద్రపోతున్నాడు. గోపెమ్మలంతా తెల్లబోయారు.

'కాదు ఇది మాయ. మీ వాడు దొంగ పిల్లడు - మాయదారి పిల్లాడు. ఏం కన్నా... ఇట్రా!' అంటూ క్రిష్ణయ్య మీదకి నడిచారు.

కెవ్వున అరిచింది - చెరసాలలో దేవకి. చేతులు బారచాపి అడ్డుపెట్టింది.

'వద్దు. నా కన్నయ్య మంచివాడు. బంగారు దేవుడు. వాడినేం చెయ్యకండి. రాకండి. కన్నా నా చిన్నారి కన్నా!' అంటూ వడిలో బొమ్మని గుండెలకు పొదువుకుని ఏడవసాగింది.

వసుదేవుడు అతని వెంట నారదుడు వచ్చారు. అక్కడే వున్న రోహిణీ, గర్గాచార్యులు అంతా కలసి దేవకిని ఊరడించారు.

దేవకి కృష్ణ విగ్రహాన్ని చూసి ఆక్రోశంలో దూషించసాగింది.

'కన్నయ్యా! నన్ను కన్న తండ్రీ! నేను కన్నబిడ్డా! ఇదేమి పరీక్ష. ఇదేమి శిక్ష. శ్రీమన్నారాయణుడు సర్వేశ్వరుడు నా కడుపున బిడ్డగా పుడతాడని ఆశపడ్డంతసేపు నిలవలేదు ఆనందం. ఇది వరమా? నరకహింసా? కన్నబిడ్డ లెవరూ తల్లిదండ్రుల నిలా హింసించలేదే - మనుషులూ రాక్షసులూ పెట్టని హింసని నువ్వు నాకు విధిస్తున్నావు.

"ఊరందరికి అమృతం పంచుతూ - నాకు మాత్రం చేదు పెడతావా? లోకమంతటికీ వెన్నెల వెదజల్లుతూ నన్ను చీకటిలో కుమలమంటావా? కన్నబిడ్డకి గుక్కెడు పాలిచ్చే భాగ్యం లేకుండా చేస్తావా? నా పాలు విషమని భయపడ్డావా? గోకులంలో గోపస్త్రీలకన్నా గోవులకన్న నికృష్టురాలినా? విషం పూసిన పూతన

రొమ్ములపాలు తాగేవటే, పోనీ నాకు కూడా ఆ అదృష్టం ఇచ్చి నా ప్రాణాలు పీల్చి చంపెయ్యి తండ్రీ. నేనీ బాధ భరించలేను' అంటూ ఏడవసాగింది.

నారదుడు ఆమెను ఓదార్చాడు.

'అమ్మా దేవకీదేవీ! జగన్నాథుని కన్న తల్లీ! నిన్ను మాయ కమ్మింది. నా మాటలు విను. దేవుడు మన కిచ్చిన భాగ్యాన్ని అనుభవిస్తూ ఆనందించే బదులు - మనకివ్వని వాటికి, మనం కోరని వాటికి ఏడవడం మానవ సహజం - కాని నువ్వు సామాన్య స్త్రీవి కావు. పుణ్యాత్మురాలివి. వేలాది సంవత్సరాలు తపస్సు చేస్తూ - ఒక్క క్షణంపాటు ఆ స్వామి రూపు మనసులో మెరిస్తే చాలని వాపోతారు ఋషులు. వారి కాపాటి భాగ్యంకూడా దక్కదు. నీకు - ఆ శ్రీమన్నారాయణుడు నీ కడుపున పుట్టాడు. నీ జఠరంలో శయనించి - నీ రక్తమాంసాలు పంచుకుని లీలామానుష విగ్రహుడై జన్మించాడు. అదెంత భాగ్యమో గ్రహించి ఆనందించడం మాని నీ దగ్గర పాలు తాగలేదని బాధపడిపోతున్నావు. పూర్వజన్మలో నువ్వు కోరిన వరం అంతేనమ్మా. ఆయన నీ కడుపున పుట్టాలనే. కాని యశోదానందులు ఆ వరం కోరక స్వామిని పెంచి పెద్దచేస్తూ సేవించే భాగ్యం అడిగారు; వారి కది లభించింది. ఈ సత్యాన్ని తెలుసుకో. నీకు కలిగిన అసదృశ భాగ్యాన్ని అనుక్షణం తలుచుకుని మురిసిపో. ఆ పరమాత్ముని నామం జపిస్తూ ఆయన దర్శనంకోసం ఎదురుచూస్తూ-



ఆ ఆశతో హాయిగా ఆనందంగా జీవించు' అన్నాడు. దేవకి కన్నులు అరమోడ్చి వింటూంది. క్రమంగా ఆమె ముఖంలో దుఃఖం ఉపశమించింది. ప్రశాంతత ఉదయించింది.

నెమ్మదిగా కళ్ళు తెరచింది.

నారదుడి వంక చూసి నమస్కరించింది. నారదుడు మందహాసం చేశాడు.

'మరో రహస్యం చెప్పనా? దేవుడు నీ కన్నబిడ్డ అని మీకు తెలుసు. కాని యశోదా నందులకు తాము పెంచుతున్న బిడ్డ దేవుడని, తాము కోరిన వరం పండిందని తెలీదు. సామాన్య బాలుడిగానే వాళ్ళు ముద్దుచేస్తున్నారు. కోప్పదుతున్నారు. కొడుతున్నారు. అంతా విష్ణుమాయ. కృష్ణమాయ.'

వ్రేపల్లెలో-

యశోద శ్రీమహావిష్ణువు విగ్రహానికి దండవేయబోతుంటే కృష్ణుడు తనకిమ్మని లాక్కోబోయాడు. యశోద నెట్టేసింది.

'తప్పు. ఇది దేవుడికి. నీకు వేరే కడతాను.'

అంటూ ఆ దండ దేవుడి మెడలోవేసి చేతులు జోడించి ధ్యానం చేస్తోంది. కృష్ణుడు కోపంగా వెళ్ళిపోయాడు.

అంతలో బలరాముడు పరుగున వచ్చాడు.

'పెద్దమ్మా తమ్ముడు మన్ను తింటున్నాడు. నేను వెన్న పెట్టినా వద్దని-'

యశోద పరుగెత్తింది.

మన్ను తింటున్న కృష్ణుడు తల్లి కేక విని వెనక్కు తిరిగాడు.



'అన్న చెప్పేవన్నీ అబద్ధాలు. అన్నయ్య నా మీద అన్నీ చాడీలే చెప్తాడమ్మా. నేనంటే వాడి కిష్టంలేదు అన్నాడు కిష్టయ్య.

'తప్పమ్మా: అన్నకి నువ్వంటే చాలా యిష్టం.'

'ఏం కాదు. తను తెల్లగా వుంటాడుగదా – నల్లవాళ్ళకన్న తెల్లపిల్లలు గొప్పొళ్ళుట. అసలు నేను మనబ్బాయినే కాదుట: ఎందుకంటే నువ్వూ నాయనా తెలుపు గదా. నేను నలుపు గదా. అందుకని నన్ను సంతలో కొనుక్కు తెచ్చుకున్నారుట!' అన్నాడు కృష్ణుడు బుంగమూతిపెట్టి.

'ఛీ తప్పు. అదేంకాదు. నువ్వు మనబ్బాయివే. నేను అమ్మనీ– నువ్వు కన్న తండ్రివీని' అంది యశోద బిడ్డని ముద్దాడి.

'అవునా? అయితే మరి అన్న చెప్పింది అబద్ధమే గదా. మరి మన్ను తినడం కూడా అంతే. కావాలంటే నా నోరు చూడు' అంటూ నోరు తెరిచాడు అమాయకంగా గుడ్లు తిప్పుకుంటూ–

యశోద ముఖాన ఒక్కసారి దుర్నిరీక్షమైన కాంతి పడింది. కళ్ళు కనబడనంత కాంతి––

చర్మ చక్షువులను మూసి – జ్ఞాన చక్షువులను తెరిపించే దివ్యకాంతి–

అపు డామెకు క్రిష్ణయ్య నోటిలో సమస్త విశ్వం గోచరించింది. సూర్య చంద్ర తారామండలం – సముద్రాలు. పర్వతాలు – సమస్త చరాచర జీవకోటితో చైతన్య వంతంగా పరిభ్రమిస్తున్న భూమండలం – అందులో వ్రేపల్లె – అందులో తాను తన భర్త, గోకులం, అలమందలు. అందులో తన ఇల్లు తాను. అందులో నోరుతెరచి విశ్వస్వరూపాన్ని ప్రదర్శిస్తున్న శ్రీకృష్ణమూర్తి. చూసి నివ్వెరబోతున్న తానూ కనిపించారు.

యశోద దిగ్భ్రాంతురాలైపోయింది. అప్రయత్నంగా చేతులు జోడించింది. కన్నులు మూసి భగవంతుని ధ్యానించింది. కలయో, వైష్ణవ మాయయో, ఇతర సంకల్పార్థమో అంటూ కంగారుపడింది.

'ఏ మహాత్మువల్ల నీ విశ్వరూపంబు గానబడిన బుద్ధి కంపమయ్యె, నా మహాత్ము విష్ణు నఖిల లోకాధారు నార్తులెల్లబాయ నాశ్రయింతు' అని స్తుతించింది.

చిన్నారి కృష్ణుడు నెమ్మదిగా నోరు మూసుకున్నాడు. చిరునవ్వు నవ్వుతూ కలువ కనులు మూసుకున్నాడు. తిరిగి నెమ్మదిగా తెరిచాడు.

యశోదని తిరిగి మాయ తెర కప్పేసింది.

కలవరంతో కృష్ణయ్య బుగ్గలు రెండు వేపులాపట్టి సాగదీసింది. నోటిలో వేలుంచి తడిమి చూసింది.

'చూశావా! అనవసరంగా నన్ను అనుమానించావు' అన్నట్టు క్రిష్ణయ్య చిత్రంగా తలవూపి భూజా లెగరేశాడు.

యశోద పకాలున నవ్వి, గాఢంగా కౌగిలించుకుని ముద్దులతో ముంచెత్తింది.

❀ ❀ ❀

యశోద బాలకృష్ణుడిని ఎత్తుకు చంకన వేసుకుని చకచక యింటికి పోతోంది.

పట్టపగలే అయినా హఠాత్తుగా చీకటి పడుతున్నట్టు అయింది. మబ్బులు కమ్ముకొస్తున్నాయి. గాలి జోరుగా వీస్తోంది. కృష్ణుడు హఠాత్తుగా బరువెక్కుతున్నట్టు అనిపించాడు. యశోద అతన్ని అటునించి ఇటు మార్చుకుంది. మరింత బరువెక్కసాగాడు. ఆమె అడుగులు భారంగా పడుతున్నాయి-

'ఏవిటిది క్రిష్ణా! ఇంత బరువెక్కుతున్నావు?' అంటూనే ఆమె బిడ్డని క్రిందకు దించి ఒక అరుగుమీద కూర్చోబెట్టి అలసట తీర్చుకోసాగింది. అంతలో గాలి జోరు హెచ్చింది. దుమ్ము లేచింది. సుడిగాలి పుంజుకుంది. చూస్తుండగా ఆ సుడిగాలి వచ్చి బాలకృష్ణుడిని ఎత్తుకుని పైకి లాక్కుంది. అతి వేగంగా అతణ్ణి ఆకాశంలోకి లాక్కుపోయింది. కళ్ళలో దుమ్ము తుడుచుకున్న యశోదకు బిడ్డ కనబడలేదు. కృష్ణా! కన్నయ్యా అంటూ తడుముళ్ళాడుతూ పడుతూ లేస్తూ వెతకసాగింది. కొద్ది సేపటిలో వ్రేపల్లె అంతా అలాగే గందరగోళం అయిపోయింది.

కృష్ణుడిని ఎత్తుకుపోయిన సుడిగాలి 'తృణావర్తుడు' అనే రాక్షసుడు. పైకి పోయినకొద్దీ కృష్ణుడు బరువెక్కి పోయాడు. రాక్షసుడు నిజరూపం ధరించి కృష్ణుడి పీక నులమ సాగాడు. కాని బరువు మోయలేక తూలిపోతూ గింజుకోసాగాడు. కృష్ణుడు వాడి పీకపట్టుకు నులిమాడు.



పెనుగులాట భీకరంగా సాగింది. తృణావర్తుడి నోట నెత్తురు కారసాగింది. మరో క్షణం తరువాత కృష్ణుడి గట్టిపట్టుకి, కంఠం దగ్గర రక్తనాళాలు చిట్లి బద్దలయ్యాయి. నెత్తురు చిమ్మనగ్రోవిలోంచి వచ్చినట్లు చిమ్మసాగింది. పెద్ద కేకతో నేలకూలిపోయాడు రాక్షసుడు. వ్రేపల్లె వీధులలో ఆ కళేబరం భయంకరంగా పడింది. చూస్తుండగా సుడిగాలి దుమ్ము ఆగిపోయాయి. చీకటి పోయి వెలుగు వచ్చింది.

పర్వతంలా పడివున్న ఆ కళేబరంమీద కృష్ణుడు ఏమీ ఎరగనట్టు పారాడుతూ దిగుతున్నాడు. యశోద రోహిణి పరుగున వచ్చారు. బిడ్డని అందుకున్నారు.

'బాబూ! కన్నయ్యా బాగున్నావా - భయపడలేదు గదా. దెబ్బలు తగల్లేదు గదా. భయపడకు. నేను వచ్చేశానుగా' అంటూ యశోద అతని వీపు చరిచి భయం పోగొట్టింది. రోహిణి నేలమీద దుమ్ము తీసి మంత్రించి అతని నొసట అద్దింది.

'ఏం జరిగింది బాబూ? అంది యశోద.

'వాడొచ్చి నన్ను గట్టిగా పట్టుకుని ఎగిరిపోయాడమ్మా? నేను వాడి పీక పట్టుకున్నాను. మరేమో వాడు కింద పడిపోయాడు. నేను వాడిమీద పడిపోయాను పాపం' అన్నాడు కృష్ణుడు చక్కగా కళ్ళు తిప్పుకుంటూ-



ఘుమ్ము ఘుమ్మని పాలు తరచగా...
గుమ్మడేడే గోపిదేవి

యశోద స్తంభానికి నిలువు కవ్వంచేసి లయబద్ధంగా పెరుగు చిలికి వెన్న తీస్తోంది. కవ్వం చప్పుడు ఆమె చేతి గాజుల సంగీతం అప్రయత్నంగా లయకలిపే పాద మంజీరాల మట్టెల తాళం. ఆ లయ ప్రకారం కదలాడే రొమ్ములు, సన్నటి నడుము నానుకుని ఊగిసలాడే జఘనాలూ - మోహనంగా ఉంది ఆ దృశ్యం.

భువనైక మోహనుడు బాలకృష్ణుడు వచ్చి వెన్నకుండ దగ్గర నించున్నాడు.

యశోద కవ్వం తిప్పుతూనే క్రీగంట చూసి ముద్దుగా నవ్వింది.

'అమ్మా! పాలు' అన్నాడు క్రిష్ణయ్య.

'కాగుతున్నాయి. కాస్సేపాగు ఇస్తాను' అంది యశోద వెన్నముద్ద తీసి పక్క కుండలో వేస్తూ-

'ఆ పాలు వద్దు. ఈ పాలు కావాలి' అన్నాడు కిష్ణయ్య వేలితో ఆమె పైటకేసి చూపిస్తూ-

యశోద కవ్వం ఆపి అలవోకగా ప్రేమతో చిరునవ్వుతో చూసింది.

'గుమ్మపాలకన్న అమ్మపాలే మంచివిట. ఇవి తాగితేనే అన్నయ్యకన్న పొడుగుజుట్టు వస్తుందిట' అంటూ కళ్ళు విప్పార్చి ఆశగా చూస్తున్నాడు కిష్ణయ్య.

నవ్వుకుని, కవ్వం వదిలేసి ముక్కాలి పీట లాక్కుని కూర్చుంది యశోద. బిడ్డను పడిలో పొదువుకుని పైట సడలించింది.

ఒళ్ళంతా మెరుపులు మెరిసినట్టయింది.

పరవశించి పోయింది.

లోకాతీతమైన ఆనందం అనుభవిస్తోంది. అప్రయత్నంగా క్రిష్ణయ్య కురులు నిమురుతోంది.

'జుట్టు పొడుగైందా?' అన్నాడు పైటచాటు కిష్టమ్మ చిన్నారి చేతులుజాచి తనుకూడా లోన కురులను తడుముకుంటూ.

యశోద పకాలున నవ్వింది. అంతలో-

'యశోదమ్మా పాలు పాలు... పాలు పొంగేను' అని కేక వినబడింది. ఆమె ఉలికిపడి చూసింది.

పాలు పొంగి దాలి గుంటలోపడి వాసన వస్తున్నాయి. ముక్కు పుటా లెగరేసి వాసన చూసింది.

'అయ్యో! ఒక్క క్షణం! ఇట్టె వచ్చె!' అంటూ కంగారుగా బిడ్డనోట పాలిచ్చే చన్ను తప్పించి బిడ్డని దించి పరుగెత్తింది.

క్రిష్ణయ్య నల్లని ముఖం కోపంతో ఎర్రబడింది.

'అమ్మా' అని అరిచాడు.

యశోద వినకుండా పరుగెత్తింది.

క్రిష్ణయ్యకి కోపం ఆగలేదు. అక్కడున్న చిన్న పిడతతో వెన్న కుండని కొట్టాడు. అది పగిలింది. చేతినిండా వెన్న తీసుకుని బొక్కేశాడు. ఇంకాస్త తీసుకు పరుగెత్తాడు.

అంతలో యశోద వచ్చింది. చేతిలో బంగారు గిన్నెతో 'రా కన్నయ్యా! రా! మీగడపాలు తెచ్చాను.'

కాని క్రిష్ణయ్య కనబడలేదు.

కంగారుగా అటూ ఇటూ చూసింది. అల్లంత దూరాన చిన్ని కృష్ణుడు రోలుమీదెక్కి కాళ్ళు పైకెత్తి నిలబడి వున్నాడు. .

గోడమీదవున్న కోతిపిల్లకి వెన్న తినిపిస్తున్నాడు.

యశోద అప్పుడు కిందకి చూసింది. కాళ్ళ దగ్గర పనికిరాకుండా నేలపాలైన వెన్న ముద్దలు.

'క్రిష్ణయ్యా' అంటూ చేతిలో గిన్నె పడేసి - ఆ పక్కనున్న బెత్తం తీసుకు పరుగెత్తింది.

క్రిష్ణయ్య చెంగున ఇటు దూకాడు. కోతి చెట్టుమీదికి దూకింది భయంగా-

'ఇట్రా... ఇట్రా... నీకు మరీ అల్ల రెక్కువైపోయింది' అంటూ తరమసాగింది. అల్లరి క్రిష్ణయ్య అందకుండా అటూ యిటూ పరుగులు పెడుతున్నాడు.

'అమ్మా కొట్టకే! ఇంకెపుడూ అల్లరి చెయ్యనే! అమ్మా కొట్టకే!' అంటూ తల్లికి దండాలు పెడుతూ ఏడుస్తూ అరుస్తూ పరిగెడుతున్నాడు.

యశోద పంతంతో మరింత రెచ్చిపోయింది.

'అయితే పోమాకు. రా యిట్రా.'

'అమ్మో నువ్వు కొడతావు.'

ఇంట్లో పనివాళ్ళు, పాలేళ్ళు, గోపెమ్మలు, గోడ వరసగా ఇరుగుపొరుగమ్మలూ చోద్యం చూస్తున్నారు.

'పోనీమ్మా యశోదా వదిలెయ్యమ్మా. కొట్టకమ్మా' అని సలహాలిస్తున్నారు. బ్రతిమిలాడుతున్నారు.

'ముందు మీరంతా ఇక్కడనించి పొండి' అని కేక వేసింది యశోద. పంతం పౌరుషంతో ఆమె కళ్ళు నిప్పులు కురుస్తున్నాయి. ఒళ్ళంతా చెమటలు కారుతున్నాయి. కొప్పు ముడివిడి జుట్టు చెదిరిపోయింది. పైట జారిపోయింది. రైక ముడి సడలింది.

ఆమె కేకలకి అంతా భయపడి సర్దుకున్నారు. చివరికి క్రిష్ణయ్య రెండు గోడలు కలిసే మూల ఇరుక్కుని దొరికిపోయాడు.

యశోద బెత్తం పైకెత్తి మీదికి వస్తోంది ఉగ్రంగా.

క్రిష్ణయ్య ఏడుస్తున్నాడు. చిన్నారి చేతులతో కాటిక కళ్ళు నులుముకుని అంతా పులుముకున్నాడు. కాటిక నలుపు, వెన్నముద్దల తెలుపు, కన్నీళ్ళు. దీనంగా చూసే కళ్ళు.

ఎత్తిన చెయి ఎత్తినట్టే ఉంచి ఆగింది యశోద.

'రెండు దెబ్బలు పడితేగాని పిల్లలకి బుద్ధిరాదు. కన్నయ్యా కొట్టన...' అంది.

'ఒద్దమ్మా ... బుద్ధి వచ్చేసింది. ఇంకెప్పుడూ అల్లరి చెయ్యనుగా.'

యశోద బెత్తం పడేసింది.

మోకాళ్ళ మీద కూచుని చేతులు జాచింది.

క్రిష్ణయ్య ఒక్క పరుగున వచ్చి కౌగిట యిమిడిపోయాడు.

ముద్దులతో ముంచెత్తింది. కొంచెం వెనక్కి జరిగి బిడ్డ ముఖాన్ని పరిశీలనగా చూసింది. 'నన్నింత యాతన పెట్టావు. నిన్ను వూరికే వదిలిపెట్టను.

రా, కాసేపు కట్టేస్తాను' అంటూ రాట దగ్గరకి లాక్కెళ్ళింది. కవ్వం నించి పగ్గాలు రెండు తీసి కృష్ణయ్య నడుముకి చుట్టి రోటికి కట్టేసింది.



'కాసేపేనా కుదురుగా కూచో' అంటూ వెళ్ళిపోయింది యశోద.

కిష్టయ్య బుద్ధిగా మఠం వేసుకుని చేతులు కట్టుకుని కళ్ళు మూసుకుని ధ్యానిస్తున్నట్టు కూర్చున్నాడు.

రెండు క్షణాల తర్వాత ఓ కన్ను కొంచెం తెరిచాడు.

తల్లి లోపలికి వెళ్ళినట్టే వుందని, మెల్లిగా రెండో కన్ను తెరిచాడు. చుట్టూ చూశాడు.

కోతిపిల్ల గోడమీదే కూర్చుంది.

'దా... ఇంకాస్త వెన్న పెడతాను' అంటూ కదిలాడు. రోలు బరువుకి ఆగాడు.

అలవోకగా వెనక్కి ఓ చూపు చూసి పాకుతూ కదిలాడు. రోలు పక్కకి వాలి దొర్లుకుంటూ వెనకాలే వస్తోంది.



పెరట్లో రెండు పెద్ద మద్దిచెట్లు జంటకట్టి పక్కపక్కగా దగ్గరగా నిలబడి వున్నాయి. కిష్టయ్య వాటి మధ్యనించి పాకుతూ వెళ్ళాడు. రోలు అడ్డుపడింది.

'హు' అని విసుక్కుని ముందుకు సాగాడు క్రిష్ణయ్య.

ఫెళఫెళ మంటూ పెద్ద చప్పుడు చేస్తూ రెండు చెట్లూ నేలకి ఒరిగాయి. క్రిష్ణయ్య చలించలేదు. ముందుకు పోతున్నాడు.

'ధన్యులం పరమాత్మా: ధన్యులం' అంటూ ఆ కూలిన చెట్లలోంచి కుబేర పుత్రులైన నలకూబర మణిగ్రీవులు బయటకు వచ్చి నమస్కరించారు. వారిద్దరూ ఒకప్పుడు మదిరాపాన మత్తులై మోహావేశంలో అప్సరసలతో దిగంబరులై విహరిస్తుండగా నారదముని అటు వెళ్ళడం జరిగింది. ఆయనను చూసికూడా వాళ్ళు లక్ష్యపెట్టకుండా అలాగే విహరించారు. నారదముని వాళ్ళను మద్దిచెట్లై పడివుండమని శపించాడు. శ్రీకృష్ణమూర్తి దయవల్లనే శాపం తీరి నిజరూపాలు లభిస్తాయని చెప్పాడు.

లీలామానుష విగ్రహుడైన బాలకృష్ణుడికి వాళ్ళు మొక్కారు.

'నారదముని శాపం మా పాలిట వరమైంది. అందువల్ల నీ అనుగ్రహం. దర్శనం లభించి శాపముక్తి పొందే భాగ్యం కలిగింది' అని వారు మాయమైపోయారు.

అంతలో నందుడు యశోద అంతా పరుగున వచ్చారు. కూలిన పెద్ద చెట్ల మధ్య ఏమీ ఎరగనట్టు ఆడుకుంటున్న కృష్ణుణ్ణి చూసి ఆశ్చర్యపోయారు.

యశోద క్రిష్ణుడిని ఎత్తుకుని గుండెలలో పొదువుకుంది.

'అమ్మో? ఎంత గండం తప్పింది నా కన్నయ్యకి' అంటూ కాపాడిన దేవుళ్ళకి మొక్కింది.

'గాలీ లేదు. వానా లేదు. మబ్బూ లేదు. కాని పిడుగులు పడిన శబ్దం. ఈ చెట్లు కూలడం అంతా ఇదేదో రాక్షస మాయలాగా వుంది' అంటూ నందుడూ ఉపనందుడూ ఆలోచనలో పడ్డారు.



ఆనాడు పూతన తృణావర్తుడు శకటాసురుడు...

'ఈ ప్రాంతం బాగాలేదు. నిత్యం రాక్షసులతో భూతాలతో పీడ పట్టింది. మన బిడ్డలకి - ఆలమందలకూ ఇక్కడ క్షేమం కాదు. అందువల్ల మనం బృందావనానికి తరలిపోదాము' అన్నాడు నందుడు.

'అవును, యమునానది ఒడ్డున - ఆ క్షేత్రం అన్ని విధాల మనకి బాగుంటుంది. అక్కడ గోవర్ధనగిరి కూడా చాలా పచ్చని కొండ. పశుల మేతకు పుష్కలంగా పచ్చిక, నీరు దొరుకుతాయి' అన్నాడు ఉపనందుడు.

'శుభం' అన్నారు పెద్దలు నలుగురూ.

భేరీ తూర్యనాదాలు. ఆ వెనక సన్నాయి డోలువంటి మంగళ వాద్యాలు. వేద మంత్రోచ్చాటన చేస్తూ పురోహిత జనం దారి చూపగా - ఆబాలగోపాలం వ్రేపల్లెనుండి బృందావనికి తరలింది. వేలాది పశువులు - తెల్లవి, నల్లవి, ఎర్రవి, మచ్చలవి, గేదెలు, నందీశ్వరుడివంటి వృషభాలూ, చెంగు చెంగున చెంగనాలువేసే లేగదూడలూ, మేకలూ, గొర్రెలూ, పెద్ద చదునుగా కట్టిన బళ్ళమీద గంపలలో కోళ్ళూ, పావురాలూ, బాతులూ, పంజరాలలో చిలకలూ, మైనాలూ యాత్ర సాగిస్తున్నాయి.

కావిళ్ళలో సామగ్రితో కొందరు బళ్ళ పక్క నడుస్తున్నారు.

గోధూళి ఎర్రటి మేఘంలా పైన నడుస్తూ వాటికి నీడ నిస్తోంది. ఆ వెనక బళ్ళమీద కడవలతో నీరు పెట్టుకుని పరిచారికలు పిడతలతో నీరుజల్లి లేచే గోధూళిని నేలకి అణుస్తున్నారు. వాటికి కొంచెం ఎడంగా రథాలూ, గూడుబళ్లూ సాగుతున్నాయి. వాటిలో నందుడూ, ఉపనందుడూ, వారి వారి కుటుంబాలవారూ కూర్చున్నారు. కొందరు మగవాళ్ళు బళ్ళు తోలుతున్నారు. వాళ్ళు ఏనుగు కుంభస్థలంపై కూర్చున్న సింహాలలా వున్నారు. కొందరు నడుస్తున్నారు. బళ్ళమీద, కంచర గాడిదలమీద రకరకాల సామగ్రి వుంది.

ఒక వయసు గొల్లభామలంతా కొన్ని బళ్ళలోచేరి గాజుల చేతులలో చప్పట్లు చరుస్తూ, బళ్ళమీదనే అందెల కాళ్ళలో చిందులు వేస్తూ పాటలు పాడుతున్నారు.

క్రిష్ణయ్య, బలరాముడు వాళ్ళ జతగాళ్ళ అల్లరికి, హడావుడికి పట్టపగ్గాలు లేవు.

బళ్ళమీంచి దూకి అటూ యిటూ పరుగెడుతున్నారు.

వెన్న పాలూ పళ్ళు నీళ్ళువున్న బళ్ళమీదికి చెంగుచెంగున దూకి దొరికింది తిని దూకి పారిపోతున్నారు.

బళ్ళ చక్రాల నడుమ ఇరుసుకి అన్నపు కుండలు వేలాడుతున్నాయి. కొన్నిటికి చిక్కాలలో పచ్చగడ్డి వుంది.

బళ్ళని దాటి చిమ్మిన గ్రోవితో నీళ్ళు తీసుకుని ఆడపిల్లల బండి మీదికి వచ్చి భామల రొమ్ములమీద నీరు చిమ్మి ఏడిపిస్తున్నాడు క్రిష్ణయ్య. వాళ్ళ మధ్య దూరి ఒక పిల్ల పిర్రమీద గిల్లుతాడు - మరో పిల్ల పైటలో చేయి దూర్చుతాడు, - మరోపిల్ల బుగ్గమీద ముద్దు పెడతాడు. మరోపిల్ల బుగ్గమీద ముద్దు పెడతాడు.



ఒకదాని కంటి కాటుక వేలితో తీసి ఇంకో పిల్ల ఎర్రటి పెదిమల మీద, బుగ్గలమీద నల్లగా పూస్తాడు.

అందరిలోకి రాధ అన్న అమ్మాయి క్రిష్ణయ్య కన్నా కొంచెం పెద్దది, గొల్లభామల్లో క్రిష్ణయ్యకి ఉజ్జీగా పోటీగా అల్లరి చేస్తోంది.

పారిపోయే క్రిష్ణయ్యని పైట చెంగుతో కట్టి లాగేసి పడేసింది. ముద్దు యిస్తా రమ్మని, దగ్గరగా వచ్చాక చెవి మెలేసి - తనే ముద్దుపెట్టి పారిపోయింది.

ఓసారి క్రిష్ణయ్య ఆమె చెవిలో ఏదో చెప్పాడు. రాధ ముఖం ఎర్రగా అయిపోయింది. పట్టుకోబోయింది. విడిపించుకు పారిపోయాడు. రాధ తరిమింది. క్రిష్ణయ్య బళ్ళన్నీ దాటి ఆలమందల్లో కలిసిపోయాడు.

రాధ తరిమింది. ఆవుకీ ఆవుకీ మధ్యనించి. ఆవుల కిందనించి, పైనించి పిచికలా దూరి పారిపోతున్నాడు.

వేలాదిగా వున్న ఆవుల వీపులమీద చిన్నారి పాదాలు మోపుతూ చెంగు చెంగున తూనీగలా ఎగురుతూ పరిగెడుతున్నాడు. ఒకసారి నల్లటి ఆవుమీద పడుకున్నాడు. రాధ పక్కనే వుండికూడా గమనించలేకపోయింది. 'భోయ్' మని అరిచాడు. జడుసుకుంది రాధ.

పొద్దు వాలింది.

ఒక చక్కని ఏరు దగ్గర విడిది చేశారు. నెగళ్ళు, వంట పొయ్యిలు, కాగడాలూ చీకటికి నగలై వెలిగాయి.

చీకటిలో నల్ల క్రిష్ణుడికి అన్నం పెట్టడానికి యశోదకు, పదిమంది గొల్ల భామలకూ కూడా సాధ్యం కాలేదు. ఇట్టిట్టే పారిపోతాడు. చెట్లకొమ్మ మీదికి ఎగిరిపోతాడు. చీకటి మధ్య నించుని తెల్లగా నవ్వి, పాములా బుసకొడతాడు. తోడేలులా, పులిలా అరుస్తాడు. కొమ్మనించి తలక్రిందుగా వేలాడి - అలాగే అన్నం నోట్లో పెట్టమంటాడు. నోటి దగ్గరవున్న అమ్మచేతిని పట్టుకుని అటు ఇటు తిప్పి కంగారుపెట్టి చివరకి అమ్మచేతి ముద్ద అమ్మ నోట్లోనే పెట్టేస్తాడు. యశోద కంటనీరు కారేదాకా నవ్వింది. ఆమె మూతిమీద పూమ్మన అన్నం ముద్దని చూసి నందుడూ - గోపెమ్మలూ అందరూ నవ్వారు. కిష్ణయ్య చప్పట్లు కొట్టాడు. చివరికి యశోద నిజంగానే ఏడ్వసాగింది.

క్రిష్ణయ్య బుజ్జి కుక్కపిల్లలా వచ్చి, బాసింపీట వేసుకుని చేతులు కట్టుకుని కళ్ళు మూసుకొని నోరు తెరిచాడు, 'అమ్మా ఆకలే' అంటూ. యశోద ఆ బాలకృష్ణుణ్ణి చూసి పరవశించిపోయి - చేతిలో అన్నం ముద్దతో అలాగే వుండిపోయింది.

రాత్రి - అంతా పడుకున్నారు. రాధ పాకుతూ వచ్చి క్రిష్ణుడి పాదాల దగ్గరకు చేరింది. కోమలమైన నల్లకలువ రేకుల్లాంటి పాదాలు కంది ఎర్ర కలువల రంగు తేలాయి. వాటిని మృదువుగా అదమసాగింది.

అది బ్రహ్మ కడిగిన పాదము.

బ్రహ్మము తానౌ పాదము.

శ్రీమహాలక్ష్మి సంసేవించే శ్రీమన్నారాయణ శ్రీపాదము.

రాధ ఎవరో... ఎక్కడిదో ఎంత పుణ్యాత్మురాలో... జాలి నెపంతో స్వామికి పాదసేవచేసే భాగ్యం పొందింది.

సూర్యుడు ఉదయించాడు.

వ్రేపల్లె వాసులు బృందావనంలో చక్కని పల్లె కట్టుకుంటున్నారు.

జండాలు ఎగురుతున్నాయి. ఒక వంక యమునా నది. దూరాన గోవర్ధనగిరి. ఎటు చూసినా కంటికి చల్లగా పండుగలా వెలిగిపోతూ వనలక్ష్మి శోభ...

❀ ❀ ❀

కృష్ణుడు, బలరాముడు పన్నెండేళ్ళ పిల్లలయ్యారు.

క్రిష్ణయ్యని నందుడు యశోద, గోపెమ్మలూ పశుల కాపరిగా ముస్తాబు చేశారు. ధోవతి గోచిపోసి కట్టారు. నడుముకి ధట్టీ... చక్కని పాగా చిన్న కర్రకి చివర చద్దిమూట కట్టి బుజాన అమర్చింది యశోద. ఒకడుగు వెనక్కి వెళ్ళి చూసింది. అంతలో రాధ వచ్చింది. పాగాలో చక్కని నెమలి పింఛం అమర్చింది. ధట్టీలో మురళి అమర్చింది. వేలుని నాలికతో తడిచేసి తన కంటి కాటిక తీసి బుగ్గన దిష్టి చుక్క తీర్చింది...

అందరూ మెచ్చుకున్నారు. ఒక్క క్షణం అటూ ఇటూ చూసి తెగించి బుగ్గమీద ముద్దాడింది.

యశోద హొరా అని ముక్కున వేలేసుకుంది.

నందుడు తల పక్కకి తిప్పుకున్నాడు.

మిగతా గోపెమ్మల. గుండె ఝల్లుమంది. తమకా ధైర్యం లేకపోయిందే - అదృష్టం లేకపోయిందే అని బాధపడ్డారు.

బలరాముడు చప్పట్లు కొట్టాడు - రాధ కదలబోయింది -

'మరి ఇటో...?' అన్నాడు కృష్ణుడు అమాయకంగా చూస్తూ.

'ఇటు...ఇటు నేనిస్తాగా!' అంటూ యశోద ఆ బుగ్గని చిదిపి ముద్దులాడింది. క్రిష్ణయ్య బయటకి పరుగెత్తాడు.

❀ ❀ ❀

చిట్టడివి...

పొదుగుపాటి వెదురుగడ వాలి వుంది. దానికి గోపాలకులంతా వాళ్ళ చిన్నారి చలిది మూటలను కట్టి ముడివేస్తున్నారు. క్రిష్ణయ్య గడ చివర విలాసంగా ఆని నించుని చూస్తున్నాడు - చిరునవ్వుతో. మూటలు కట్టడం పూర్తికాగానే చెయ్యి తీశాడు. గడ నిటారుగా పైకి లేచిపోయింది. దానితోపాటు చద్దిమూటలూను. పిల్లలు గొల్లుమన్నారు. క్రిష్ణయ్య పకపక నవ్వాడు. పిల్లలు తరిమారు క్రిష్ణయ్యని. అందరికీ అందీ అందక మాయచేసి పారిపోతూ తిప్పలు పెట్టాడు... చివరికో పెద్ద చెట్టు ఎక్కి సీమచింతకాయలు విసిరాడు. వాళ్ళ కోపం పోయింది. తరవాత కోతి కొమ్మచ్చు లాడారు. కుస్తీలు పట్టారు. ముష్టియుద్ధం చేశారు. క్రిష్ణ డొక్కడు శత్రువులు పదిమంది. పై నించి దేవతలు ఋషులు నివ్వెరపోయి చూస్తున్నారు. జగదేకవీరుడిని - ఈ చిన్న పిల్లలు యిష్టం వచ్చినట్టు కొడుతున్నారు. ఆయన నవ్వుతూ దెబ్బలు తింటున్నాడు. వాళ్ళంతా ఎంత పుణ్యాత్ములో...



అంతలో క్రిష్ణయ్య యమునలో దూకాడు. అందరూ ఈతలు కొట్టి ఆడుకున్నారు. మధ్యాహ్నం అయింది.

కృష్ణుడు వెదురు పొద దగ్గర మురళి వాయించాడు. చద్ది మూటలు కాసినట్టున్న వెదురుగెడ దానంతటదే వాలింది. పిల్ల లానందంగా పరుగెత్తి మూటలు విప్పుకున్నారు. నీడలో ఆనందంగా అందరూ భోజనాలకు కూర్చున్నారు. మట్టి తాబేటి కాయలతో నీళ్ళు పెట్టుకున్నారు.

అందరూ పోటీలుపడి క్రిష్ణయ్యకు తినిపిస్తున్నారు.

'మా ఇంట్లో పెరుగు బావుంది - కాదు మా మీగడ తిను - కొంచెం మా వెన్న ... ఇది కొంచెం ... ఇంకొంచెం... మరి కొంచెం... అంటూ తినిపిస్తున్నారు.

ఆకాశంలో దేవతలూ ఋషులూ యీ దృశ్యాన్ని చూసి ముగ్ధులయిపోయారు.

యాగభోక్త శ్రీమహావిష్ణువుకి గోపబాలురు చలిది తినిపిస్తున్నారు. ఇది అపూర్వం అసదృశం అని పరిపరి విధాల పొగిడారు. గొల్లపిల్లల భాగ్యానికి అసూయపడ్డారు.

కృష్ణుడు అందరు పెట్టినవీ తినేశాడు. ఆ సంతోషంలో, ఉత్సాహంలో - పిల్లలెవరూ ఏమీ తినలేదు. వాళ్ళ చలిది మూటలన్నీ ఖాళీ అయిపోయాయి.

'మరి మీకో?' అన్నాడు కృష్ణయ్య.

గొల్లపిల్లలు తెల్లబోయారు. 'మాకా...' అంటూనే పొట్టలు తడుముకున్నారు.

'అమ్మో... కడుపు లుబ్బరించుకుపోయాయి. ఇంకా ఏం తింటాం! మాకు నీళ్ళకక్కూడా చోటులేదు. అమ్మో ఆయాసం... నిద్దరొస్తోంది... అంటూ తలో చోట నీడ చూసుకుని కునుకు తీస్తున్నారు...

బకాసురుడు ఒక చిన్న కొండలా వున్నాడు. ఆ కొండకి చేరబడి నీడలో పిల్లలు పడుకున్నారు.

ఆవులు కూడా ఆ నీడలో విశ్రాంతిగా పడుకుని నెమరు వేస్తున్నాయి.

బకాసురుడి ముక్కు పెద్ద బాకుని భూమిలో గుచ్చినట్టు వుంది. తిరగేసిన కొండ మొనను భూమిలో పాతినట్టుంది. కృష్ణుడు దానికి చేరబడి పడుకుని - పరాగ్గా వేణువుతో ఆ ముక్కుమీద లయబద్ధంగా కొడుతున్నాడు. ముక్కుకి మరోవేపు ఒక గోపబాలుడు కూర్చుని - దానిమీద కొడవలికి పదును పెడుతున్నాడు.

ముక్కు మొనకి ముప్పై అడుగుల పైన బకాసురుడి ముఖంలో ఒక కన్ను తెరుచుకుంది. దొంగచూపు చూసింది.

ఒక్క క్షణంలో బకబకమంటూ అడివి అదిరిపోయేలాంటి చప్పుడు చేసి లేచింది. ఆవులు దూడలు 'అంబా' అంటూ రంకెలువేసి తలోవేపు పరుగెడుతున్నాయి. గోపాలకులు కూడా అయోమయంగా పరుగెడుతున్నారు. కృష్ణుడు ఉలికిపడి లేచాడు.

బకాసురుడి ముక్కు ఒక్కసారిగా తెరుచుకుంది. పైకి లేచింది. అమాంతం కృష్ణుడి మీదికి దిగి అతణ్ణి, బలరాముడిని, కొందరి పిల్లల్ని మింగేసింది.

బయట కోలాహలంగా వుంది. లోపల పిల్లలు ఊపిరి అందక వుక్కిరి బిక్కిరి

కృష్ణుడు నిశ్చలంగా నిలబడ్డాడు. భృకుటి ముడిచాడు. ఒక్కసారిగా ఎదగసాగాడు.

క్రమంగా బకుడి ముక్కు అంతా ఆక్రమించాడు. చేతిని జాపాడు. ఆ చేయి బకుడి తలలో దూరి కంటిని ఛేదించి బయటకు వచ్చింది. అలాగే రెండో చేయి రెండో వేపునించి వచ్చింది. రెండు చేతులూ బకుడి ముక్కు రెండు

పెడలనూ పట్టుకుని బలంగా లాగాయి. తేగను చీల్చినట్లు చీల్చసాగాయి. లోపల కృష్ణుడున్నాడు - బకుడు రెక్కలు విప్పి వాటితో, కాలి గోళ్ళతో కృష్ణుడిని పొడిచి గీరి హింసిస్తున్నాడు. కృష్ణుడు వాడి ముక్కుని ఇంకా చీలకొడుతున్నాడు. దేహాన్ని పెంచుతున్నాడు. కొద్ది క్షణాలలో కృష్ణుడి ముందు బకుడి శరీరం అల్పమైపోయింది. చీల్చి చెండాడి కింద పడేశాడు.



అంతలోనే తను తన పూర్వపు రూపానికి తగ్గిపోయాడు...

చీకటి పడింది.

బకుడి దేహం కూలిన కొండలా పడివుంది.

గొల్లపిల్లలంతా క్రిష్ణయ్య చుట్టూ చేరారు. దండం పెట్టారు.

'కృష్ణయ్య... మన ఆవులన్నీ తలోవేపు పారిపోయాయి. దారి తప్పిపోయాయి. ఇపుడీ చీకట్లో వెదికి తోలుకు రావడం ఎలా... అన్నారు.

క్రిష్ణయ్య మందహాసం చేశాడు...

'మీరు పదండి... అవి వస్తాయి. మీ వెంట వస్తాయి...' అని అభయం యిచ్చాడు.

వేణువు పూరించాడు.

ఎక్కడెక్కడో పొదల మాటున భయంతో దాగివున్న పశుగణం అంతా - వేణుగానం విని కృష్ణుడి దగ్గరకు పరుగున వచ్చాయి.



కృష్ణుడు వాటిని ఒక దారిలో పెట్టాడు.

గోపాలురు ఇళ్ళకు వెళ్ళారు గోవులతో...

కాని కృష్ణ భగవానుడు మాత్రం ఇంటికి వెళ్ళలేదు. వేణువుని వేదనాదంలా పూరిస్తున్నాడు. సకల చరాచర జీవకోటిని ఆకర్షిస్తున్నాడు - అమ్మలా నాన్నలా గురువులా దైవంలా బిడ్డలా బంటులా భార్యలా నేస్తంలా...

❀ ❀ ❀

వేణుగానం బృందావనం అంతటా విహరిస్తోంది. పిలుస్తోంది. స్నానంచేసే గోపెమ్మలనూ, భర్తలకు వీపురుద్ది నీళ్ళుపోస్తున్న గొల్లభామలనూ, అన్నం వడ్డించే సతులనూ, చెరోచేతినీ పట్టుకు రుద్దుతోన్న జంట భార్యలనూ, జడలల్లుకుని పూలు తురుముకునే బంతిపూల రథాలను, పంచకళ్యాణి గుర్రాలను, బంగారు తల్లులను, బాచాల కొండలను పలకరించి పులకెత్తించి చెవి పట్టుకుని లాక్కుపోతూంది.

జడలు పట్టుకుని కళ్ళెంలా తోలుతూంది. చెయి పట్టుకుని లాక్కుపోతోంది.

అందరిదీ ఒకటే గమ్యం - బృందావనం - కాదు క్రిష్ణమూర్తి.

అది వెన్నెలవేళ మల్లెలవేళ నవ్వులవేళ - వేయి వేణువులు మోగేవేళ... హాయిగా చల్లగా పాడేవేళ...

కొండమీద జలపాతం నేలను చేరినట్టు-

నదులు సముద్రాన్ని చేరినట్టు-

దూడ ఆవును చేరినట్టు-

అర్థం మాటని చేరినట్టు-

పార్వతి శివుని చేరినట్టు-

గోపికలు కృష్ణుడిని చేరుతున్నారు...



వెన్నెల వాళ్ళ మనసుల్లో ఆనందంలా వెల్లివిరిసింది.

పిల్లగాలి వాళ్ళ ముంగురులను సవరించినట్టు- వేణుగానం వాళ్ళ గుండెలలో కోరికలను సవరిస్తోంది.

కృష్ణుడు ఒక చెట్టుకు ఆనుకుని విలాసంగా నిలబడి వ్యత్యస్త పాదారవిందుడై వేణువు వాయిస్తున్నాడు.

ఒక గోపిక పరుగున వచ్చింది. ఆయాసంతో ఆమె ఒగురుస్తోంది. నెన్నుదుట చిరుచెమటలు...

కంగారుగా అటూ యిటూ చూసింది.

'ష్... వాళ్ళందరూ వచ్చి పడిపోతారు. ఇటురా. నాకు తెలిసిన ఒక చక్కని చోటుంది. అక్కడి కెవ్వరూ రాలేరు. మనిద్దరమే అంటూ కృష్ణుడి చేయి పట్టుకుని వెనక్కి చూడకుండా పరుగెత్తింది. నించున్న కృష్ణమూర్తిలోంచి మరో మూర్తి కదిలి ఆమె వెంట పరుగెత్తింది.



అంతలో మరో గోపబాల వచ్చింది.

'ఇట్రా ఇట్రా కన్నయ్యా చప్పున ... ఈపొదలో దాంకుందాం' అంటూ కృష్ణుడిని మరోవేపు లాక్కుపోయింది.

మరో అమ్మాయి వచ్చి పైటచెంగు మెడచుట్టూ వేసి తనవేపు లాక్కుపోయింది.

ఇంకో అమ్మాయి ఇంకోవేపు - ఇలా 24 మంది గోపికలు 24 గురు క్రిష్ణయ్యలూ యమునా తీరాన విహరిస్తున్నారు.

ఒక పొదరింటిలో - గోపిక పచ్చిక పరచింది. పూలు జల్లింది. కృష్ణుడిని కూర్చోపెట్టి తను ఆతనిని అనుకుంది. పరవశించి పోతూంది.

'మనమిలా దాంకుంటే పాపం వాళ్ళంతా వెతుకుతారు' అన్నాడు కృష్ణుడు.

'వెతుక్కోనీ... ఎవరికి వారే యమునా తీరే...' అంది రాధ.

ఒక చెట్టు కొమ్మన ఒక బాల, కృష్ణునితో నిలువుటుయ్యాల వూగుతూంది. ఉయ్యాల చుక్కల్నీ చంద్రుణ్ణీ తాకుతోంది. నక్షత్రాలు ఆమె పాద మంజీరాలలో తళుకులలా మెరుస్తున్నాయి. కృష్ణుడు భయపడ్డాడు.



'నీకేం భయంలేదు. నేనున్నానుగా. నన్ను గట్టిగా కావిలించి పట్టుకో!' అంది ఒక రాధ.

'ఒట్టు! నిజంగా!' అన్నాయి కృష్ణయ్య కళ్ళు.

మరోచోట కృష్ణుడికి తాంబూలం ఇచ్చి నాలిక చాపమంది – రంగు చూడ్డానికి.

'అబ్బో నీకు నేనంటే చాలా ఇష్టం...' అంటూ ముందుకు వంగి ఆ నాలికను తన నాలికతో తాకి ముద్దు పెట్టింది.

ఒకచోట గోపీ కృష్ణుడు చక్కని చిన్న పడవలో నదిమీద విహరిస్తున్నారు.

మరోచోట ఒక బాల, క్రిష్ణయ్య కురులను తన జడ చివర జుట్టుతో కలిపి పెనవేసి జడ అల్లుతూంది.

మరోచోట కృష్ణుడి వడిలో తల పెట్టుకు పడుకుంది. కృష్ణుడు వేణువు వాయిస్తున్నాడు.

ఒకచోట రాధాకృష్ణులు జలక్రీడలాడుతున్నారు.

కృష్ణుడు రాధ ఒకరిమీద ఒకరు నీళ్ళు చిమ్ముకుంటున్నారు.

జంట చేపల్లా ఈతలు కొడుతున్నారు.

అంతలో రాధ కెవ్వున కేకవేసింది–

నీటిలో ఎవరో మునిగి వచ్చి రాధ తొడ గిల్లారు. ఒక్క క్షణం తరవాత ఆ గిల్లిన కృష్ణుడు నాలు గడుగులు అవతల పైకితేలి కొంటెగా నవ్వి కన్నుగిలిపి ఈదుకుపోతున్నాడు.





రాధ - 'చూశావా... పాడు పిల్లవాడు...' అన్నట్టు చూసింది.

కృష్ణయ్య నవ్వాడు.

'ఎవడో నాలాంటి పోకిరియే!'

'వాడి మొహం... నీలాంటి పోకిరీ నువ్వొక్కడివే...' అంది రాధ.

ఒకచోట ఒక చంద్రలేఖ భుజాలమీద చేతులువేసి, వెనక్కివాలి ఆమె ముఖాన్ని పరిశీలనగా చూస్తున్నాడు.

'నీ ముఖం చందమామ... నీ ముక్కు' నువ్వు పువ్వు... నీ కళ్ళు...' అంతలో. కృష్ణుడికి కొంచెం దూరంలో ఇంకో సుందరి కనబడింది. ఆమె పైట సరిచేసుకుంది. 'ఊc... నీ కళ్ళు... చెప్పు' అంది చంద్రలేఖ. 'దబ్బ పళ్ళు... అన్నాడు కృష్ణుడు ఇంకో సుందరి పైట పొంగులను చూస్తూ-

ఒక పొదరింటిలో ఒక భామ తను కృష్ణుడి బట్టలు వేసుకుని, తననివి కృష్ణుడికి తొడిగింది.

కృష్ణుడు తలవంచి తన రొమ్ముకేసి చూసుకుని ప్రశ్నార్థకంగా చూశాడు భామకేసి, భామ తటాలున వెనక్కి వెళ్ళి గాఢంగా కౌగిలించుకుంది. కృష్ణయ్యకి రొమ్ములు పొంగాయి.

విశాలంగా చదునుగావున్న ఒక పచ్చిక బయలుమీద కృష్ణుడు గోపికలను వర్తులాకారంగా నిలబెట్టాడు. తాను వేణువుతో నృత్యం చేస్తూ ఒక్కొక్కరి మధ్యనుండి వెళ్తున్నాడు.

భామలు వున్నచోటే నర్తిస్తూ తమ చుట్టూ తాము తిరుగుతున్నారు...

అంతలో ఒక భామ ఎదర మరో కృష్ణుడు నిలిచాడు. ఆ చివర ఇంకో కృష్ణుడు గానం, నాట్యం క్రమంగా ప్రస్తారితమై పై స్థాయికి చేరేసరికి ఇరవై నలుగురు గోపికలకి ఇరవై నలుగురు కృష్ణమూర్తులు అమరారు. అందరూ కలసి చక్రాకారంలో తిరుగుతూ నర్తిస్తున్నారు. మధ్యలో ఒక కృష్ణుడు నిలచి వేణు వూదుతున్నాడు.



నారీ నారీ నడుమ మురారీ
హరికీ హరికీ నడుమ వయారీ!

❀ ❀ ❀

ప్రకృతి పురుషుల యుగళ గానం. యుగళ నాట్యం పరాకాష్ఠనందుకుంది. స్త్రీ పురుష సంయోగ వైభవం కొత్త సౌందర్యంతో వెల్లివిరిసింది.

ఆకాశాన నిలిచి ఈ మహోజ్వల ఘట్టాన్ని ముగ్ధులై చూస్తున్న ముక్కోటి దేవతలు పుష్ప వృష్టితో స్వామిని పూజించారు...

చంద్రుడు చెట్టు చాటుకు వెళ్ళిపోయాడు.

పచ్చిపాలలాంటి తెల్లటి వెన్నెలకి కాచిన పాల ఎర్రదాలు తోచింది. పక్షులు మేలుకున్నాయి. కోళ్ళు మేలుకొలుపుతున్నాయి. లేగదూడలు అమ్మని పిలుస్తున్నాయి.

యమునా తీరాన దృశ్యాలు చూసి తూరుపు సిగ్గుతో ఎర్రబారింది...

ఒక పొదరింటిలో రాధాకృష్ణులు బట్టలు వేసుకున్నారు. ఇద్దరూ అలసిపోయి వున్నారు. కన్నులు ఎర్రగా వున్నాయి. ఇంతసేపు రాని నిద్ర ఇపుడు మనకు వస్తోంది. రాధ కురులు మాధవుడి నగలలో, మాధవుడి సరాలు రాధ చెవులకు తగులుకుని చిక్కుపడ్డాయి. కృష్ణుడు రాధ ముంగురులను సవరించాడు.

మరోచోట చంద్రలేఖ రొమ్ముల మీద, బుజాలమీద నఖక్షతాలను చూసుకుంటోంది – మరోచోట ఒక బాల, కృష్ణుడి బుగ్గమీద పూసివున్న కుంకుమ మరకలని చెంగుతో తుడుస్తోంది. రాధాకృష్ణులు బయలుదేరారు. ఒక పొద దగ్గర దారులు విడిపోయే చోట ఆగారు–

రాధ కృష్ణుడి చేతులు రెండూ తన చేతులతో పట్టుకుంది–

'కృష్ణా! ఈ జన్మకే కాదు – శతకోటి జన్మలకి కూడా ఈ ఆనందం చాలు. కాని చాలదు... నన్ను నీలో కలిపేసుకో పాలలో నీరులా నీటిలో ఉప్పులా వేణువులో పాటలా మాటలో అర్థంలా చీకటిలో వెలుగులా పెదిమలో ముద్దులా మీగడలో రుచిలా కంటిలో చూపులా కలిసిపోనీ కరిగిపోనీ. కృష్ణా నిన్ను విడిచి వుండలేను. నిన్ను ఇంకొకరు ఎత్తుకుపోతే భరించలేను. నాకు మాటివ్వు కృష్ణా... నన్ను తప్ప ఇంకెవరినీ చూడనని – నాకు తప్ప నీ మనసెవ్వరికీ ఇవ్వనని ఒట్టుపెట్టు కృష్ణా!' అంది. అరచేయి జాచింది.

కృష్ణుడు కొంటెగా చూసి మందహాసం చేశాడు. తల పంకించాడు. తన చేయి ఎత్తి ఆమె చేతిలో గట్టిగా ఒట్టు వేశాడు.

'టప్'న చప్పుడైంది.

ఉత్తర క్షణంలో దానికి ప్రతిధ్వనిలా టపటపటప మని చప్పుళ్ళు వినిపించాయి.

కృష్ణుడు తెల్లబోయి చూశాడు.

రాధ అనుమానంగా పక్కకి చూసింది. ఇంకో భామకి ఇలాగే కృష్ణుడు ఒట్టేస్తున్నాడు. అలాగే మరోచోట... మరోచోట... ఇంకోచోట... ఇరవైనాలుగు ఒట్లు... చప్పట్లు...

మందిరే మందిరే మాధవం... మాధవం...

సుందరీ సుందరీ మాధవం... మాధవం...

  



బృందావనం-

ఒక రావిచెట్టుకింద కన్యకాపరమేశ్వరీ అమ్మవారి విగ్రహం వుంది. దానికి కొంచెం దూరంలో ఒక వెదురు పొద...

వేణుగోపాలుడు అటు నడిచివస్తూ వెదురుపొద దగ్గర ఆగాడు. తన చేతిలో వేణువుని చూశాడు. వెదుళ్ళని చూశాడు. లేత వెదుళ్ళు ఆనందంగా సన్నటి ఈలవేశాయి. ఉత్సాహంగా ముందుకు వంగాయి. నన్ను తీసుకో అంటే నన్ను తీసుకో అని పోటీలు పడుతున్నాయి. గోపాలుడు చిరునవ్వుతో ఒక వెదురు పిల్లను తాకి మునివేళ్ళతో నిమిరాడు. వేణువు వాయించినట్టే రెండుచోట్ల వేళ్ళు అనించి తీశాడు. ఆ కన్నె వేణువు ఒళ్ళు పులకెత్తింది. కిన్నెరలా పాడింది-

అంతలో కలకల నవ్వులు గలగల అందెల గాజుల చప్పుడు వినబడింది. గోపికాలోలుడు అటు చూశాడు. రావిచెట్టుకింద అమ్మవారి ఎదుట పదిపన్నెండుగురు కన్నెపిల్లలు కళ్ళు మూసుకుని మొక్కుతున్నారు.

కృష్ణుడు పొదమాటునుంచి చెట్టుచాటికి నడిచాడు.

పిల్లలు కళ్ళు గట్టిగా మూసుకుని దండాలు పెడుతూ అమ్మవారికి గట్టిగా మొక్కుకుంటున్నారు.

'అమ్మా! కన్యకాపరమేశ్వరీ - మా పన్నెండు మందికీ మొగుడిగా చెయ్యి. ఇంకెవరూ వద్దు. మేం పోట్లాడుకోకుండా సఖ్యంగా, సౌఖ్యంగా వుంటాం. క్రిష్ణమూర్తితో మాకు పెళ్ళయితే నీకు ఆ మర్నాడే ఉపారాలు పెట్టి పన్నెండు రోజులు జాతర చేస్తాము.'

కృష్ణుడు వారిని పరిశీలనగా చూశాడు. నవ్వుకున్నాడు.

అమ్మాయిలు యమునకేసి పరుగెత్తారు. పరుగెడుతూనే బట్టలు విడుస్తూ ఒడ్డుకు చేరగానే అవన్నీ గట్టున పడేసి నీళ్ళలోకి దూకారు. కేరింతలు కొడుతూ నవ్వుతూ పాడుతూ ఆటలాడుకుంటున్నారు. ఈతలు కొడుతున్నారు. అందరూ మత్స్య కన్యల్లా వెలిగిపోతున్నారు. ఈతలు కొడుతూనే చక్రాలుగా చదరాలుగా త్రికోణాలుగా పద్మాలుగా జల చిత్రాలు రచిస్తున్నారు.

కొంటె క్రిష్ణుడు వాళ్ళు చూడనివేళ ఆ బట్టల మధ్యకి దూకాడు. ఒక భామ చీర కప్పుకుని మెల్లిమెల్లిగా కదులుతూ చీరలన్నిటినీ లుంగ చుట్టాడు. వాళ్ళు చూడకుండా పొన్నచెట్టు మొదలు చేరాడు. చెట్టెక్కి కూర్చున్నాడు.



కన్నెలు జలక్రీడలు చాలించి ఒడ్డు చేరబోయారు - కెవ్వున కేక పెట్టారు.

'చీరలు... మన చీరలు!'

అందరూ అప్రయత్నంగా నీళ్ళలోకి దూకి పీకలదాకా మునిగి నించున్నారు.

కళ్ళలో భయం... కంగారు-

జుట్టు పైకి, చుట్టి కట్టుకున్న 'ఆజాను వేణీ' ఒకతె జుట్టువిప్పి, రొమ్ములను ఊరువులను కప్పుకుని, చేతులతో ఆ జుట్టుని అదిమి పట్టుకొని గట్టుదాకా నడిచివచ్చి అటూ ఇటూ చూసింది గాలి కెగిరాయేమోనని...

వేణుగానం వినబడింది.

ఒక్క కేకపెట్టి చేపలా నీళ్ళలోకి దూకేసింది.

అందరూ పైకి చూశారు.

పొన్నచెట్టు కొమ్మమీద - రసిక చక్రవర్తి బాలకృష్ణుడు కూర్చున్నాడు- కాలిమీద కాలు వేసుకుని. కొమ్మమీద చీరెలు వేలాడుతున్నాయి. అందరూ గోలపెట్టారు.

'అల్లరి పిల్లాడా - పోకిరీ పిల్లాడా - మా చీరెలు మా కివ్వు - లేకపోతే-'

'లేపోతే ఇలాగే వూళ్ళోకెళ్ళి అందరికీ చెప్తారుకదు? వెళ్ళండి. మిమ్మల్ని అలా చూసేసి, నేనూ వెళ్ళిపోతాను' అన్నాడు చిలిపి కృష్ణుడు.

గోపికలు బ్రతిమాలాడారు.

'మీరిందాక అమ్మవారి సేం వరమడిగారో నాకు తెలుసు. నేను విన్నాను. కాబోయే మొగుడిదగ్గర సిగ్గెందుకు - దాపరికమెందుకు... అయినా నాకు తెలీని రహస్యాలు మీదగ్గరేమున్నాయని... అంత గొడవ?' అన్నాడు.

'అన్నీ తెలిస్తే - ఇంకీ గొడవెందుకు...'

'అవి నేను తెలుసుకున్న రహస్యాలు. ఇవి మీరు మీఅంతట మీరు 'మనసు' విప్పి బైట పెట్టబోయే రహస్యాలు. కావాలంటే నా రహస్యాలన్నీ మీకు చెప్పేస్తాను. ముందు మీరు ఇటొచ్చి ఎవరి చీరలు వారు తీసుకోండి. నేను చెట్టుమీదే వుంటాను.

గోపిక లందరూ ఒకరితో ఒకరు గుసగుస లాడుకున్నారు. వాదించుకున్నారు.



'చలి తట్టుకోలేం పద' అని ఒకరు. చచ్చిపోతాను గాని పైకి రానని ఒకతె. కాసేపుంటే వూరివాళ్ళెవరైనా వస్తే అదేగతి - అని ఒకరూ అంటున్నారు.

ఒకరు ముందుండి మిగతా వాళ్ళందరం వెనకాలే నించుని వెళదాం అని ఒక పిల్ల అంది.

'ముందుండే దెవరుటా?' అన్నాడు కృష్ణుడు. నువ్వంటే నువ్వు అంటున్నారు గోపికలు.

'నాకు నిద్రొస్తోంది - పడుకుంటాను. ఇక పిలిచినా లేవను.' అన్నాడు కృష్ణయ్య.

'వద్దు వద్దు' అంటూ చేతులతో రొమ్ములు కప్పుకుని ముందుకు వస్తున్నారు.

'అలా కప్పుకుంటే నే నొప్పుకోను... అసలు అమ్మవారి నోము పట్టి దిసమొలతో స్నానం మహాపాపం. అందుకని ఆవిడకీ - కాబోయే ఈ మొగుడికీ చేతులెత్తి దండాలు పెడుతూ రండి' అన్నాడు గోపికా లోలుడు.

వాళ్ళు విధిలేక ఒకచేయి పైకెత్తి మొక్కుతూ రెండో చేత్తో మానధనాన్ని కప్పుకుని పైకి రాసాగారు.

'ఒంటి చేతి చప్పట్లు పేలవు... ఒంటి చేతి దండాలు పలకవు' అన్నాడు క్రిష్ణయ్య.

ఇరవై నాలుగు కళ్ళూ దీనంగా చూశాయి. కంట నీరు తిరిగింది.

కృష్ణుడు భువన మోహనంగా నవ్వాడు.

ఆ నవ్వుకి వాళ్ళ కళ్ళలో దైన్యం పోయి ఒక మహత్తరమైన ఆనందం మేలుకుంది.

ఇపుడు వాళ్ళ కళ్ళనిండా మనసునిండా గోపాల కృష్ణుడే. సమ్మోహన చంద్రహాసమే.

తనువంతా అణువణువునా వేణుగాన నాదమే. తమకు కనబడే ప్రభువే తప్ప - తమని ఎవరు చూస్తున్నారు. తామెవరూ అన్న ఆలోచనే పోయింది. నిర్మలమైన మనసుతో, కన్నులతో, నవ్వులతో నిస్సంకోచంగా చేతులు పైకెత్తి జోడించారు.

'శ్రీకృష్ణా! భువనైక మోహనా! మమ్మల్ని నీలో కలుపుకో!' అని కళ్ళతో మొక్కారు.

❀ ❀ ❀

బకాసురుడి తమ్ముడు అఘాసురుడు గోపకులంపై పగబట్టాడు. అతడిని కంసుడు రెచ్చగొట్టాడు.

'పెద్ద ముక్కున్నా మా అన్న నోరులేని అమాయకుడు... వాడిని ఒక్కణ్ణి చేసి కృష్ణుడూ గోపాలకులూ కలిసికట్టుగా కొట్టి చంపారు. ఇప్పుడు నేను ఒక్కడినీ వాళ్ళందరినీ మింగేసి చంపేస్తాను' అని ప్రకటించి కదిలాడు అఘాసురుడు.

గోకులం చేరి - ఒకచోట పెద్ద కొండంత కొండచిలవగా పడుకున్నాడు. వాడి నోరు పెద్ద కొండ గుహంత వుంది... పళ్ళ మధ్య ఇగుళ్ళ మధ్య ఉండే సందులే పెద్ద పెద్ద సింహపు గుహల్లా వున్నాయి. గోవులతో వెళ్తున్న గోపబాలకులు ఇది చూశారు.

'వీ డింకో కొత్త రాక్షసుడు... కొండ గుహలా నోరూ వీడూను మన్ని మింగేస్తాడు కాబోలు... శకటాసురుడినీ బకాసురుడినీ చంపిన మన క్రిష్ణయ్య ఉండగా మనకేమిటి భయం... రండి ఈ రాకాసి గుహలోకి మనమే వెళ్ళి లోపలేం వుందో చూదాం' అంటూ గోపాలకులందరూ ఆలమందలు తోలుకుని అఘాసురుడి నోట్లో ప్రవేశించారు. లోపలికి వెళ్ళిపోయారు. క్రిష్ణుడు ఇది చూశాడు.

'అయ్యయ్యో... వీళ్ళు నా అండ చూసుకుని - నిర్భయంగా లోపలికి వెళ్ళిపోయారు... వాడు వీళ్ళని మింగి చంపేస్తే పెద్దలకేం చెప్పాలి...' అనుకుని తనూ పరుగున వెళ్ళాడు. అఘుడి నోట్లో ప్రవేశించి కంఠం దగ్గర నిలిచి - శరీరం పెంచసాగాడు. పెరిగి పెరిగి కంఠ ద్వారాన్ని పూర్తిగా మూసేశాడు. వాడికి ఊపిరి ఆడకుండా దిగ్బంధం చేసేశాడు.

అఘుడు గాలికోసం గిలగిల తన్నుకుంటున్నాడు.



లోపల చీకటికీ సంచలనానికీ గోపబాలురు కలవర పడుతున్నారు. కొంచెం సేపటిలో అఘుడికి దేహం ఉంగ చుట్టుకుపోయి గిలగిల తన్నుకుంటూ పెఠేలున పొట్టబద్దలై చచ్చిపోయాడు.

గోప కుమారులు ఆవులను తోలుకుంటూ బయట పడ్డారు. ఆనందంతో చప్పట్లు కొట్టారు. 'మాకు తెలుసు కిష్టయ్య కాపాడతాడని...' అంటూ - రాక్షసుడిని తామే చంపేసినట్టు సంబరపడి పోయారు.

❀ ❀ ❀

గోవర్ధనగిరి సమీపంలో ఒక పెద్ద తాటితోపు వుంది. అక్కడ తాటిపళ్ళు చాలా రుచిగా వుంటాయి గాని ధేనుకాసురుడనే వాడు తన బలగంతో గాడిద రూపంలో అక్కడ వుంటున్నాడు. ఎవరు వెళ్ళినా - మనిషి, జంతువు, పండు, కాయ అని తేడా లేకుండా మింగేస్తున్నాడు.

బలరాముడి కిది తెలిసి ఒకనాడు ఆ వనంలోకెళ్ళి తాటి చెట్టును వూపి పళ్ళు నేలరాల్చాడు. పిల్లలంతా అపురూపంగా అవి తీసుకుతింటున్నారు.



దిక్కు లదిరేలా అరుస్తూ ధేనుకాసురుడు బలరాముడి మీదకు ఉరికాడు. బలరాముడి రొమ్ములమీద తన్నాడు. తిరిగి మీదపడి కరవబోయాడు. బలరాముడు వాడి నాలుగు కాళ్ళు ఒక్కసారిగా దొరకపుచ్చుకుని గిరగిర తిప్పి విసురుగా గిరవాటేశాడు.

ఆ గాడిద ఒక తాడి చెట్టుకు కొట్టుకుని పడి చచ్చింది. ఆ దెబ్బకు ఆ తాడి మరో తాడిమీద అది పక్కదానిమీద పడి - ఇలా వందల చెట్లు ఫెళఫెళమంటూ కూలిపోయాయి.

గోపాలకులు పళ్ళు కోసుకుంటున్నారు. అంతలో ధేనుకాసురుడి బలగం అంతా గాడిదల రూపంలో విరుచుకుపడింది. బలరామకృష్ణులు విజృంభించి వాటిన్నిటినీ వెనక కాళ్ళు పట్టుకు గిరగిర తిప్పి నేలకేసి కొట్టి చంపారు...

ఒకసారి కంసుడి పనుపున ప్రలంబాసురుడు వచ్చాడు. బలరామకృష్ణులు చెలికాళ్ళతో ఆడుకుంటూ వుంటే వాడు కూడా ఒక గోపాలకుడిలా వచ్చి వాళ్ళలో కలసి ఆడసాగాడు. కృష్ణుడిది కనిపెట్టి అన్న కేసి చూసి కన్నుగొట్టి హెచ్చరించాడు...

ఆట వరసలో ఒకరి భుజాలపై ఒకరెక్కి పరిగెట్టిస్తున్నారు. వాటం చూసి ప్రలంబుడు బలరాముడిని తన భుజంమీద ఎక్కించుకుని పరుగెత్తాడు. పదడుగులు వెళ్ళగానే దేహం పెంచి రాక్షస రూపం ధరించి పై కెగిరి పోసాగాడు. వెంటనే బలరాముడు వాడి పీకపట్టుకు నులమసాగాడు. భుజాలమీద నించుని పిడికిలి బిగించి వాడి నెత్తిమీద ఒక్క దెబ్బ కొట్టాడు. తల పగిలిపోయి నెత్తురు భళ్ళున బయటకు వచ్చింది.

కిందనించి చూస్తే గోపాలకులకు రాక్షసుడి రక్తం ఎఱ్ఱటి జలపాతంలా కనబడింది.

ఇంకో క్షణానికి రెక్కలు తెగిన పర్వతంలా రాక్షసుడు నేల కూలాడు. వాడి తలపై నించి బలరాముడు కిందకి వురికాడు.

రాకాసి నెత్తురుతో బట్టలు తడిసివున్న బలరాముడు వేసవి సూర్యుడిలాగా నిప్పులు చెరుగుతున్నట్టు వెలిగాడు...

❀ ❀ ❀

ఒకనాటి రాత్రివేళ బలరామకృష్ణులు గోపికలతో యమునా సైకతాన ఆట పాటలతో వినోదిస్తున్న వేళ-

కుబేరుడి భటుడు శంఖచూడు డనేవాడు మాయచేసి గోపిక లందరినీ మరోచోటికి ఎత్తుకుపోయాడు...

మహా మాయావి కనురెప్పపాటులో ఇది గ్రహించాడు.

గోపికలు ఆర్తనాదాలు చేసే వేళకే బలరామకృష్ణులు రెండు చెట్లు పెకలించుకుని వెళ్ళారు. వారిని చూసి శంఖచూడుడు బెదిరి పారిపోయాడు. గోపికలను అన్నకి ఒప్పచెప్పి కృష్ణుడు శంఖచూడుని వెంట తరిమాడు. ప్రాణ భయంతో వాడు అనేక మాయ రూపాలు ధరించి తప్పించుకోబోయాడు. వాడెక్కడికి వెళితే అక్కడికి, ఏ రూపంలో వెళితే ఆ రూపంలో కృష్ణుడు వెంట తరిమి చావగొట్టాడు. చేసిన తప్పుకి చంపడం అనవసరమని క్షమించి వదిలేశాడు. వాడి శిరస్సునవున్న పెద్ద రత్నాభరణాన్ని తీసుకుని అన్న బలరాముడికి కానుకగా సమర్పించాడు.

❀ ❀ ❀

మరోనాడు వృషభాసురుడు ఆలమందమీద పడి కుమ్మి బీభత్సం చేయసాగాడు. కృష్ణుడు వాడితో తలపడి వాడి తలపట్టి కొమ్ములు ఒడిసి పట్టి మెడ విరిచాడు. ఒక కొమ్మును పీకి దానితోనే పొడిచి నేల కూల్చాడు.

)లల కథలు, నమ్మశక్యంకాని పోరాటాలు, రాక్షస వధల కథలూ విన్న కొద్దీ కంసరాజుకి రోషం కసి కలవరం పెరిగాయి. భయం పట్టుకుంది... భయంతో శరణుకోరే బుద్ధి పుట్టలేదు. మరిద్దరు బలవంతుల్ని పంపించి చంపించాలన్న పట్టుదల పెరిగింది. తన సైన్యంలో అత్యంత శక్తిమంతులైన కేశి, వ్యోముడు అనే రాక్షలు లిద్దర్నీ రెచ్చగొట్టి పంపాడు.



కేశి ఒక మదించిన గుర్రం రూపం ధరించి వెళ్ళాడు. క్రిష్ణుడు వాడితో పోరాడి వాడి నోటిలో తన భుజాన్ని వుంచి పెంచసాగాడు... క్రమంగా అది వాడికి దిగ్బంధం చేసేసింది. ఊపిరాడక పొట్ట ఉబ్బి ఉబ్బి పఠాలున దేహం దోసపండులా బద్దలైపోయింది.

వ్యోముడు దొంగచాటుగా వచ్చి గోపాలకు లందరినీ ఎత్తుకుపోయి ఒక గుహలో పెట్టి పెద్ద బండతో ద్వారం మూసేశాడు. కృష్ణుడు అక్కడికి వచ్చి వాడిమీద కురికాడు. సింహం నక్కనిపట్టి కొట్టినట్టు కొట్టాడు. వాడు విలవిల తన్నుకుంటూ నేల కొరిగాడు. కృష్ణుడు గుహదగ్గర బండను కాలితో ఒక్క తాపు తన్నాడు. అది బంతిలా ఎగిరి దూరాన పడింది.



గోపాలకులూ గోవులూ బిలబిల మంటూ బయటకు వచ్చారు. దేవతలు పుష్పవృష్టి కురిపించారు.

నిశ్శబ్దం. ఒక కోడెదూడ తల్లిని విడిచి రెండడుగులు నడిచి పచ్చిక మేస్తోంది. పెద్ద పాముతోక విసురుగా వచ్చి పెద్ద శబ్దంచేస్తూ దూడని కొట్టి, చుట్టుకుంది. ఉత్తర క్షణంలో దూడని పైకి ఎగరేసి పట్టు విడిచింది. దూడ 'అంబా' అంటూ యమున మధ్యలో పడింది. పడీ పడుతుండగానే సర్పరాజు కాళీయుడి పడగ గప్పున నిప్పులు కక్కి, బుసకొట్టి వెనక్కివాలి దూడని కాటేసింది. యమున ఎఱ్ఱబారింది.

గట్టుమీదవున్న తల్లి ఆవు నీటిదాకా వచ్చి ఆగి - మోర పైకెత్తి 'అంబా' అని ఆర్తనాదం చేసి నీటిలోకి దూకింది బిడ్డకోసం... కాళీయుడి పడగ తిరిగి పైకొచ్చి విప్పార్చుకుంది. ఆవుని కొట్టడానికి వాటం కుదుర్చుకుంటోంది.



నది ఒడ్డున చెట్టు కొమ్మమీదకి ఎగిరి వాలి నిల్చాడు కృష్ణుడు. పంచెమీద ధట్టీని బిగలాగి కట్టాడు... పై కెగిరాడు... సుదర్శన చక్రంలా గిరగిర తిరుగుతూ కాటేయబోతున్న కాళీయుడి శిరస్సుమీదికి ఉరికాడు. కాళీయుడి పడగ పెద్ద శబ్దం చేస్తూ మంటలు కక్కుతూ ఒక్కసారి నదిలోకి దిగిపోయింది. నేలని తాకింది. కృష్ణుడు మాత్రం పడగమీద తాపు తన్ని అదే ఊతగా పైకెగిరాడు. అదుగుకు పోయిన పడగ సంభ్రమంతో పట్టరానికోపంతో తిరిగి ఉధృతంగా పైకిలేచింది. లేచిన క్షణానికి గాలిలో ఎగురుతున్న బాలకృష్ణుడు తిరిగి పడగమీద ఉరికాడు. పద ఘట్టనానికి కాళీయుడు అదిరిపోయాడు.

యమున అల్లకల్లోలమై కొండంత కెరటాలతో ఘూర్ణిల్లింది. కాళీయుడి పడగ లుమిసే మంటలూ - యమున కెరటాలు ఎగజిమ్మే నీటి జల్లూ అద్భుతమైన దృశ్యాన్ని కట్టాయి.

గుట్టమీదకి గోపబాలురు - నందుడు యశోద గోకులంలో పెద్దా చిన్నా అంతా రొప్పుతూ రోజుతూ వచ్చారు.

కాళీయుడు ఈసారి దెబ్బకాసి నీటిలో పడిన కృష్ణుడిని తోకతో కొట్టి చుట్టేశాడు. పడగతో విషజ్వాలలు చెరగుతూ కొట్టబోయాడు. కృష్ణుడు కాళీయుడి తోకనే అడ్డుపెట్టాడు. తన కాటు తనకి తగిలి తన నిప్పు తనని కాల్చి - అదిరిపడ్డాడు కాళీయుడు.



గట్టునున్న బలరాముడు - ఆదిశేషుని అవతారమూర్తి ఆనందంగా చప్పట్లు కొడుతున్నాడు.

నంద యశోదలు, రాధ, గోపభామలు అంతా ఆర్తనాదాలు చేస్తూ యమునలోకి ఉరకబోతున్నారు. బలరాముడు తన హలాయుధంతో వారిని బెదిరించి వారించి - నచ్చచెప్పాడు.

'మా తమ్ముడు నాటి పూతన నుంచి నిన్నటి బకాసురుడిదాకా మహా రాక్షసులను చంపిన మహాబలుడు. అవతార పురుషుడు.

మీరు నిర్భయంగా - నిశ్చింతగా కృష్ణలీలా సంగ్రామాన్ని చూసి వినోదించండి. కొద్దిసేపటిలో మన కృష్ణయ్య మన దగ్గరికి వస్తాడు' అన్నాడు బలరాముడు.

మడుగులో కాళీయుడికీ, కృష్ణుడికీ భీకరంగా పోరాటం జరిగింది.

కొంచెంసేపు నదిమీద నెత్తురు సుడిగుండాలూ కెరటాలూ తప్ప ఏమీ కనబడలేదు. తరవాత పాలకడలిలోంచి కామధేనువు కల్పవృక్షం. చంద్రుడు, శ్రీమహాలక్ష్మి, అమృత భాండం క్రమంగా పైకి వచ్చినట్టు - శ్రీకృష్ణుడి చేయి. చేత చుట్టిన పాముతోక. శ్రీకృష్ణుడి శిరస్సు. నీలమేఘశ్యామ దేహం - ఆ తరవాత

ప్రాణావశిష్టుడైన కాళీయుని శిరస్సుపై నర్తించే దివ్య చరణారవిందాలు పైకి వచ్చాయి.

గోకులం అంతా సంభ్రమానందాలతో ముగ్ధులై చూస్తూ - అప్రయత్నంగా చేతులు జోడించి నమస్కరించారు - లీలామానుష విగ్రహుడికి... జయజయ ధ్వానాలు చేశారు. స్తోత్రాలు చేశారు. ఆనందంతో ఆడారు, పాడారు, ఏడ్చారు నవ్వారు.

చిన్నారి కృష్ణయ్య కాళీయమర్దన తాండవం సాగిస్తున్నాడు.

కాళీయుని భార్యలు - సర్పాంగన రూపులై పైకి వచ్చారు. శ్రీకృష్ణదేవుని పరివేష్టించి మొక్కారు. భర్తకు ప్రాణదానం చేయమని ప్రార్థించారు. కరుణాకరుడైన గోపాలకృష్ణుడు శాంతించాడు.



ఈ మడుగు వదలి పొండన్నాడు.

గరుత్మంతుడు పగపట్టాడనీ - శాపంవల్ల యీ ఒక్క చోటకే రాడనీ, ఈ మడుగు వదిలితే అతడిచేత చావు తప్పదనీ - విన్నవించారు కాళీయుడి భార్యలు.

'మీరు సముద్రం చేరుకోండి... ఇటుపై ఎక్కడున్నా గరుత్మంతుడు మిమ్మల్ని బాధించడు.

'కాళీయుడి శిరసుపైన నా పాదాల ముద్రలు పడ్డాయి. వాటిని మన్నించ గలడు' అని అభయం ఇచ్చాడు శ్రీకృష్ణదేవుడు.

కాళీయుడు కన్నులతో నమస్కరించాడు. అతని తోక ఇంతకు ముందు తాను చంపిన లేగదూడను ముందుకు తెచ్చింది... కాళీయుడు ఆ విషాన్ని తిరిగి పీల్చుకున్నాడు. కొంచెం దూరాన నీటిలో తేలుతూ మూగకళ్ళతో చూస్తున్న తెల్లావుకు ఆ లేగను చేర్చాడు. ఆ గోవు ఆనందంతో మోర పైకెత్తి - ఆకాశంకేసి చూస్తూ 'అంబా' అని ఆనందంతో, కృతజ్ఞతతో అరిచింది. బిడ్డను ముట్టితో తాకింది. దాని కంట నీరు చిప్పిలింది.

గోపాల దేవుడు మందహాసం చేశాడు.



కృష్ణలీలలు కృష్ణమాయలు కనీవినీ అబ్బురపడ్డ అగ్ని దేవుడికి అతగాని మహిమ ఏపాటిదో చూడాలని ముచ్చట వేసింది. ఒకనాడు హఠాత్తుగా కార్చిచ్చును రేపి గోకులాన్ని చుట్టుముట్టాడు. ఆ వేడికి ఫెళఫెళార్భటులకు ఆబాల గోపాలం తల్లడిల్లిపోయారు. ప్రాణభయంతో కృష్ణా కృష్ణా అని కేకలు వేస్తూ కకావికలై నలువేపులా పరుగులెత్త సాగారు.

కృష్ణయ్య నవ్వుకున్నాడు. దోసిటతో నీరు తాగినట్టు ఒక్కసారిగా ఆ అగ్నిని దాహం పుచ్చుకుని మింగేశాడు...

❀ ❀ ❀

అహంకారాన్ని తరిమికొట్టి వినయంతో నమ్రతతో నడచుకొనేవాడు ఒక ఋషి. పదిమందీ ఆ మాట చెప్పి పొగిడేసరికి తనంతటి నిరహంకారి లేడన్న దురహంకారం కమ్మేసింది ఆయన్ని... తరవాత కథ ఎవరికి వారే ఊహించుకోవచ్చు..

అహం అనేది అంతటి మాయదారి జబ్బు. ఆ పొర కమ్మితే బ్రహ్మజ్ఞానికి ఉండే జ్ఞాననేత్రం కన్న గుడ్డివాడి తోలుకళ్ళు లోకాన్ని బాగా చూడగలవనిపిస్తుంది. బ్రహ్మజ్ఞాని అనే కాదు - సాక్షాత్తూ పరబ్రహ్మకే ఎనిమిది కళ్ళు. నాలుగు ముఖాలు ఉన్న సృష్టికర్తకే ఒకసారి ఆ మాయ కమ్మింది.

భూలోకంలో బృందావనంలో ఒక బాలకృష్ణుడు చాలా మాయలు లీలలు చేస్తున్నాడని విని - ఆయన మీద మాయాజాలం ప్రయోగించాడు బ్రహ్మ.

ఒకనాడు బృందావనంలో మేత మేస్తున్న గోవుల్నీ కాస్తున్న గోపాలకుల్నీ మాయం చేసేశాడు బ్రహ్మ.

క్రిష్ణయ్య కొంతసేపు వెతికాడు. అంతలో స్ఫురించింది - ఇది చిరంజీవి బ్రహ్మయ్య మాయ అని. కన్నతండ్రి కమలనాథుడు నవ్వుకున్నాడు.

వెంటనే మేసే గోగణాన్నీ, కాసే గోపగణాన్నీ సృష్టించాడు. అందర్నీ ఇళ్ళకు పంపాడు.

ఆయా ఇళ్ళల్లో అమ్మలు బిడ్డలనూ, లేగలు తల్లులనూ ఎప్పటిలాగే ఆనందంతో చూసుకోడం. ముద్దు మురిపాలు చెయ్యడం - బిడ్డలు, లేగలు మారాం చెయ్యడం, మాతలూ గోమాతలూ మురిసి ముద్దులు కురిపించడం ఎప్పటిలాగే జరిగాయి... ఎక్కడా ఎవరికీ సందేహం రాలేదు. ఆనాడే కాదు... ఆ యేడంతా కృష్ణమాయ అలాగే సాగింది.

అప్పటికి బ్రహ్మయ్యకి 'మెలకువ' వచ్చింది. నేనే సృష్టికర్తనన్న అహం కలిగి. నన్నే సృష్టించిన కర్త సకల జగత్కర్త ఒకడున్నాడని - ఒకడే ఉన్నాడనీ, జగతిలో తనుంటూ జగతిని తనలో నిలుపుకున్న - నీటిలో తానుంటూ నీటిని తనలో నిలుపుకున్న మహామాయావి, లీలా వినోది నారాయణుడు ఒక్కడే అని గుర్తు చేసుకుని వెళ్ళి శ్రీకృష్ణ చరణారవిందాలకు మొక్కారు.



మిణుగురు పురుగుల తళుకులు చీకట్లో మెరవచ్చు గాని పట్టపగలు సూర్యుడి వెలుగులో కాదు కదా...

ఈ మహత్తర సంఘటన తెలిసిన తరవాత బృందావన వాసులంతా - పెద్దలు సహా శ్రీకృష్ణుడికి చెయ్యెత్తి మొక్కారు.

గోవర్ధనగిరి... ఏటేటా చేసే ఇంద్రోత్సవాలను ఈసారి భారీ ఎత్తున జరపాలని నందాదులు నిర్ణయించారు.

కొండ మొదల దగ్గర విశాలమైన పందిరి వేశారు.

పశువుల కొమ్ములకు రంగుపూసి అలంకరించారు. బళ్ళమీద ప్రభలు కట్టారు.

పందిరిలో హోమ గుండం అమర్చారు. వేదఘోష, మంగళ వాద్యాలు మిన్నంటుతూండగా-

గోపాలకులు పందిరిని తోరణాలతో, పూలతో అలంకరిస్తున్నారు. పాలు, పళ్ళు, నెయ్యి, పెరుగు, వెన్న మొదలైన సంభారాలన్నీ చేర్చి అమర్చారు.

తేజస్వులైన బ్రాహ్మణులు, యోగులు, ఋషులు వచ్చారు...

ఒకవంక వంటశాలలో భోజనాదికాలకు ఏర్పాట్లు జరుగుతున్నాయి.

శ్రీకృష్ణ బలరాములు యాగ వేదికకు వచ్చారు. పెద్దలకూ తండ్రికి వందనం చేశారు...

'వయసులో పిన్నవాడివైనా - గోకులానికి నువ్వు చేసిన సేవలు, నీవు కల్పించిన రక్షలు, నీకు పెద్దపీట వేశాయి. అందువల్ల యీ ఇంద్రోత్సవానికి నిన్ను ముఖ్యుడిగా నియోగిస్తున్నాము' అని ప్రకటించి ఒక పళ్ళెరంలో నూతన వస్త్రాలు పూలు పళ్ళు వుంచి అగ్రతాంబూలం ఇవ్వబోయాడు నందుడు...

కృష్ణుడు నమస్కరించి నిరాకరించాడు. 'ఇంద్రపూజ దేనికని' అడిగాడు.

'పాడిపంట లన్నిటికీ ముఖ్యం, మూలం, ప్రాణప్రదం అయినది వర్షం. అది ఆయన మనకిస్తున్న వరం. ఆయన్ని అర్చించి హోమం చేసి నైవేద్యాలు పెడితే...'

'పెట్టకపోతే ...?' అన్నాడు కృష్ణుడు.

'నాయనా! అపచారం... ఆయనకి కోపంవస్తే వాన రాకుండా చేయగలడు. లేదా వాన విపరీతంగా కురిపించి వరదలో మనని ముంచెత్తి ప్రళయం సృష్టించగలడు.

'అంత కోపిష్టివాడు క్రూరుడు. దేవుడెలా అవుతాడు తండ్రీ... ఆ ఇంద్రుడు భగవంతుడేమీ కాదు. సృష్టి చక్రంలో ఒకానొక కార్యక్రమానికి నిర్వాహకుడు అంతే. సూర్యుడు చంద్రుడు ఉదయించడం, వానా వరదా అన్నీ ప్రకృతి ధర్మాలు. ఒకరి కోపంతో దయతో వచ్చే పోయేవి కావు...

'కర్మ-ధర్మం' ప్రకారం జరిగేవి. మీకు కనిపించే ఇలవేల్పులకి ఈ పూజలు చెయ్యండి. ఆ గోవర్ధనగిరి, ఈ పాడినిచ్చే పశుసంపద, పంటనిచ్చే నేల తల్లి,

యమునానది వీటిని పూజించండి... అంతేగాని కనిపించకుండా కోపతాపాలతో మనని దండించే చిల్లర దేవుళ్ళని కాదు...' అన్నాడు.

అంతలోనే ఎక్కడో పెద్ద పిడుగు పడింది. అంతా పైకి చూశారు. చూస్తుండగానే కారుమేఘాలు కమ్ముకొచ్చాయి. ఉరుములు మెరుపులతో కుంభవృష్టిగా వర్షం ఆరంభమైంది. పెనుగాలి చెలరేగి అక్కడున్న సంభారాలను మనుషులను చెల్లాచెదరు చేయసాగింది.

నందాదులంతా కలవరంతో కృష్ణుడిని చూశారు.

కృష్ణపరమాత్ముడు కన్నులరమోడ్చి ఒక్క క్షణం ధ్యానించాడు.

గోవర్ధనగిరి వంక రెండడుగులు వేశాడు. అభయముద్రపట్టి చేతిని పైకెత్తి గిరిని కదిలిరమ్మని ఆదేశించాడు.

ప్రళయవేళా పర్జన్య గర్జనలా నాదం పూరిస్తూ గోవర్ధన పర్వతం కదిలి పైకి లేచింది. జగదోద్ధారకుడు దానిని తన ఎడమచేతి చిటికెన వేలిపై నిలిపాడు. చేతిని పైకెత్తి వుంచాడు.

గోకుల వాసులంతా - ఆలమందలతో బాలపాపలతో ఆ కొండ కిందకు వచ్చారు.

జరుగుతున్న పరమాద్భుతం కలో నిజమో కానలేక దిగ్భ్రాంతులై చూస్తున్నారు.

సంభ్రమంతో ఆశ్చర్యంతో భయంతో చూస్తూ బొమ్మల్లా నిలబడిపోయిన గోకులాన్ని ఛత్రవర్తి కృష్ణుడు చిరునవ్వుతో మేలు కొలిపాడు.

'కొండ మీ నెత్తిమీద పడదు - భయంలేదు. అందరూ బిడ్డ పాపలతో ఆలమందతో రండి' అని చెప్పేవరకూ వాళ్ళు కోలుకోలేదు.

అవతల ప్రళయవర్షం కురుస్తూనే వుంది. ఏడు రోజులపాటు వర్షం కొనసాగింది. వర్షమేకాదు కొండల రెక్కలు నరికిన దండి మగడు ఇంద్రుడు రాళ్ళవాన కురిపించాడు. రెక్కలు తెగిన కొండే అయినా - చిన్ని కృష్ణుని చిటికెన వేలున చిలకలా కూర్చున్న గోవర్ధనగిరి చెక్కుచెదరలేదు. కొండ గొడుగై గోకులాన్ని కాసింది.

ఇంద్రుడు ఐరావతం ఎక్కి వచ్చాడు ఆశ్చర్యంతో - గోవర్ధనగిరి చెక్కుచెదరకుండా పదడుగులపైన గాలిలో నేలవిడిచి సాము చేస్తోంది. దాని అండన బృందావనం అంతా తల్లివడిలో పిల్లలా హాయిగా నిశ్చింతగా తల దాచుకుంది.

తలదాచుకోవడమేకాదు. - మహాద్భుతాన్ని చేసిన మహాపురుషుడిని ఆనందోత్సాహాలతో పూజించింది.

ప్రత్యక్ష నారాయణుడైన కృష్ణుడికి, బలరాముడికీ, కృష్ణుడి ఆదేశం ప్రకారం తమకి ఛత్రం పట్టిన గోవర్ధనగిరి, నేలతల్లికి, గోవు మా తల్లికి పూజలుచేసి ఆనందోత్సాహంతో వేడుకలు జరిపింది.

అలనాడు హిరణ్యాక్షుడు భూమిని ఎత్తుకుపోయినవేళ వరాహరూపంలో వాడిని వధించి, భూగోళం అంతటినీ కోరలపై నిలపగలిగిన దేవర ఈతడే అని వారికి తెలియదు. ఒక్క భూమినేకాదు – బ్రహ్మాండ గోళాలన్నిటినీ పూలచెండులా ఎగరేసి ఆడి ఒడిసిపట్టే పరమాత్ముడి కీ చిన్న కొండ ఒక లెక్కా... కొండంత ఏనుగు తొండంతో తామర తూడును తీసి పూవును పైకెత్తినట్టు అవలీలగా చిన్ని కృష్ణుడు గోవర్ధనగిరిని పైకెత్తాడు. దానిని ఆయన ఒక బరువులా భరించలేదు. ఒక ఆభరణంగా ధరించాడు. ఆయన చేత అమిరాక ఆభరణానికే కొత్త అందాలు చేరాయి.

అసలు బయట ప్రళయ వర్షం పడుతూందన్న ఆలోచనే లేదు వారికి. కృష్ణుడి కంటి వెలుగులు సూర్యచంద్రుల అవసరం కూడా లేకుండా చేశాయి.

ఎనిమిదవనాడు ఇంద్రుడు ఉగ్రుడైపోయాడు.

మేఘనాయకుడు వచ్చాడు.

'మహేంద్రా! మేఘాలన్నీ కురిసి కురిసి వట్టిపోయాయి. నింగినున్న నీరంతా నేలకి చేరింది. తిరిగి ఎండకాసి ఆ నీరు పైకొస్తే తప్ప వర్షాలు సాధ్యం కావు' అన్నాడు.

ఇంద్రుడికి అప్పటికే కనువిప్పింది. ఆ పర్వతాన్ని అవలీలగా ఆభరణంగా ధరించినవాడు లీలామానుష విగ్రహుడైన పరమాత్ముడేనని బోధపడింది.

వెళ్ళవచ్చని మేఘాలకు సైగచేశాడు... ఎండ వచ్చింది.

గోకులంలో అంతా ఆనందోత్సాహంతో ఘోష చేశారు. వాన పోయింది... ఎండ వచ్చిందని... కృష్ణుడు నవ్వాడు...

'అది ప్రకృతి ధర్మం...' అన్నాడు.

అంతలో ఇంద్రుడు, దేవతలు దిగివచ్చారు.

ఇంద్రుడు కృష్ణుడికి వందనం చేశాడు.

'ప్రభూ! నా అజ్ఞానాన్ని అహంకారాన్ని మన్నించు.'

కృష్ణుడు గోవర్ధనగిరిని యథాస్థానంలో వుంచాడు.

కృష్ణుడిపై దేవతలు పూలవాన కురిపించి పూజించారు.

❀ ❀ ❀

కంస మందిరం – రాత్రివేళ – కంసుడు ఒక బల్లమీద కాలుంచి, ముంజేతిమీద ఆని వంగి నించున్నాడు. వెనుక ఒక చారుడు చేతులు కట్టుకు నించున్నాడు.

వంగివున్న కంసుడు ఆరడుగుల పొడుగుకు ఒక్కసారి విజృంభించి లేచి అదే విసురులో వెనక్కి తిరిగి – అరచేత్తో చారుడిని ఛెళ్ళున కొట్టాడు... గుండెలు బద్దలయేంత పెనుకేకవేసి చారుడు ఎగిరి గోడకి కొట్టుకుని పడిపోయాడు. ఆ దెబ్బకి

భళ్ళున నెత్తురు కక్కాడు. మెడ విరిగి పక్కకి వాలిపోయింది. చేతులు తలని నిలప ప్రయత్నించినా తిరిగి పడిపోయింది.

'ద్రోహీ! గొల్ల కుర్రాడు కొండని పైకెత్తాడా? నువ్వు చూసొచ్చావా... దరిద్రుడా... నా కూడు తింటూ వాడి భజన చేస్తావా... నన్ను భయపెడ్తావా... చావు' అంటూ చేతిలో మధుపాత్రను వాడి మీదకు విసిరికొట్టి వెనుదిరిగాడు కంసుడు–

మందిరంలో నాట్యగత్తెలు – సంగీత వాద్యకారులు భయభ్రాంతులై కొయ్యబారిపోయి చూస్తున్నారు.

'ఏం నోళ్లూ చేతులూ పడిపోయాయా... ఆడండి పాడండి – చూస్తారేం' అని గద్దించాడు.

వాళ్ళు ఒక్కసారిగా మరబొమ్మల్లా ఆటపాటలు ఆరంభించారు.

కంసుడు నవ్వు తెచ్చి పెట్టుకుని ఏమీ ఎరగనట్టు మందిరం కలయదిరుగుతూ నాట్యమాడే యువతుల పిర్రలమీద కొడుతూ, మీద వాలి ముద్దు పెడుతున్నాడు.

కాని ఆ నవ్వు, ఆ పొగరూ, విలాసం కొద్ది క్షణాలు కూడా నిలవలేదు.

ఒక శయ్యమీద విలాసంగా వాలాడు... నలుగు రయిదుగురు వారాంగనలు ఎడాపెడా వెనకా ముందూ చేరి సేవలు సరసాలూ ఆరంభించారు... సువాసన ద్రవ్యాలు రాసేది ఒకతె – వింజామర వీచేది ఒకతె – బుగ్గలు నిమిరేది ఒకతె – ముద్దులు పెట్టేది ఒకతె.... రెండు క్షణాలలో వాళ్ళంతా రూపాలు మారి – కనుముక్కు తీరు మసకబారిన ముఖాలతో నలుగురు వీరులుగా కనబడ్డారు... వాళ్ళు కంసుడిని బంధించి పట్టుకుని కత్తితో పొడవ బోతున్నారు... వికటాట్టహాసాలు వినబడసాగాయి. పెద్ద గావుకేకపెట్టి వాళ్ళని రెండు చేతులతో విదిలించి విసిరికొట్టి లేచాడు. పరుగున మరో వేపుకి వెళ్ళాడు. మృదంగం వాయించే అమ్మాయిని దాటుతూ ఆ వాద్యాన్ని తన్నాడు. అది పెద్ద శబ్దంచేస్తూ దొర్లిపోయి – గాజు పాత్రలకు తగిలింది.

'మధువు' అని పెద్ద కేక వేశాడు. ఒక పరిచారిక బంగారుపాత్ర తెచ్చి అతని చేతికిచ్చి మధుకలశంలోంచి బంగారు రంగు మదిరను పోసింది. రోషంగా ఆయాసంతో రొప్పుతున్న కంసుడు ఆ పాత్రను నోటిదగ్గర పెట్టుకున్నాడు. అందులో మదిర ఎర్రటి నెత్తురై నురుగుతో పరవళ్ళు తొక్కుతూ పొగలు కక్కింది.

కంసుడి కళ్ళు ఆ రంగుకి నిప్పు కణాల్లా వెలిగాయి.

భయంతో పాత్ర విసిరికొట్టి. లేచి పరుగెత్తాడు.

భోజన మందిరం ప్రవేశించాడు. అక్కడ ఒక పరిచారిక చల్లని పన్నీరు పంపగా ముఖం కడుకున్నాడు. భోజనానికి కూర్చున్నాడు. ఇంపైన వంటకాలు – పళ్ళు. మధువు అమర్చి వున్నాయి. చెలులు వింజామర వీస్తున్నారు.

కంసుడు ఆరగించ బోయాడు... పళ్ళెంలో – ఒక పసిబిడ్డ పడుకుని కేరుకేరున, గోలుగోలున ఏడుస్తున్నాడు.

తల విదిలించి కళ్ళు నలుపుకుని చూశాడు కంసుడు.

బల్లనిండా పుర్రెలు ఎముకలు కటకట లాడుతున్నాయి. బల్లని ఎత్తి పడదోసి పరుగెత్తాడు...

అట్టహాసాలు... ఏడుపులు... ఆర్తనాదాలు... కంసరాజుకి జయజయ ధ్వానాలు... సంగీతం... అన్నీ కలగా పులగంగా వినిపిస్తున్నాయి-

ఆ మందిరం దాటి తలుపును భళ్ళున మూశాడు.

నిశ్శబ్దం... ఎదురుగా పొడుగ్గా వసారా దారి...

కంసుడు - ఇంతవరకూ తానున్నది దెయ్యాలకొంప అన్నట్టు భయంగా వెనక్కి చూస్తూ పరుగెత్తాడు...

నిశ్శబ్దం... అక్కడా అక్కడా కాగడాలు...

అతని అడుగుల చప్పుడు కూడా వినబడలేదు.

పెద్ద గాలివీచి వున్న కాగడాలు కొండెక్కాయి.

బహుశ పంచమి వెన్నెల భయంకరంగా పడుతోంది. కంసుడు ఆగి కాలితో నేలమీద బాదాడు. అప్పుడూ చప్పుడు వినబడలేదు. ఎవరక్కడ అని అరిచాడు. తనమాట తనకే వినబడలేదు. వరండా చివర వున్న పూలకుండీని పైకెత్తి నేలకేసిబాదాడు. అది ముక్కలుముక్కలై పోయింది. కాని శబ్దం లేదు. కత్తిదూసి గోడమీద కొట్టాడు. కళ్ళలో భీతాహం చెలరేగింది. గుండెలు దడదడ కొట్టుకుంటున్నాయి. వెనక్కి పోబోయి ఆగి రాజసభకేసి పరుగెత్తాడు. నిశ్శబ్దంగానే పరుగెత్తాడు.

సభా భవనంలోకి పరుగున వెళ్ళాడు. సింహాసనం ఇరవైఒక్క మెట్లపైన వుంది. పది మెట్లెక్కి కూలబడిపోయాడు - ఒగురుస్తున్నాడు. ఇపుడు ఒగర్చడం వినబడుతోంది.

ముక్కుపుటాలతో గాలిని పూరించి వదిలి పరీక్షించాడు.

ఆదిశేషువు బుసలు కొట్టినట్టు విన్పించింది.

కొంచెం ధైర్యం వచ్చింది. స్థిమిత పడ్డాడు.

అలా కూచునే సభా మందిరం కలయ చూశాడు.

బావురు మంటోంది మందిరం. ఖాళీగావున్న సింహాసనాలు గుడ్డి దీపాల వెలుగులో వెలాతెలాబోతున్నాయి... తల వంచుకున్నాడు... మెట్లమీదే విశ్రమించాడు.

ఆ మహా సభా మందిరంలో అతనొక కోడు విరిగిన సింహాసనంలా పరిదీనంగా పడివున్నాడు.

వందిమాగధస్తుతులు దూరాన్నించి వస్తున్నట్లు వినిపిస్తున్నాయి. కంసు డెంతటి వీరుడో శూరుడో, దేవుడో దేవాధిదేవుడో వర్ణిస్తూ పొగుడుతున్నాయి. కంసుడు చెవులు మూసుకున్నాడు. అయినా అవి ఆగలేదు. కంటనీరు తిరిగింది. నిస్త్రాణగా మళ్ళీ నడుం వాల్చాడు.

'జయోస్తు దిగ్విజయోస్తు... కల్యాణమస్తు..., అని వినబడింది. ఈ మాటలు శ్రావ్యంగా వున్నాయి. ఉలికిపడి చూశాడు. ఇద్దరు భటులు రెండు కాగడాలతో దారిచూపగా, అక్రూరుడు, నారద మహాముని వచ్చారు.

కంసుడు నీరసంగా లేచి వందనం చేశాడు.

'కల్యాణమస్తు' అన్నాడు నారదుడు. కంసుడి ముఖం వికసించింది. కళ్ళు చిరునవ్వుతో మేలుకుంటున్నాయి.

'...లోక కల్యాణమస్తు' అన్నాడు నారదుడు.

కంసుడికి ఛెళ్ళున కొట్టినట్టయింది. కోపం, రోషం ఎగజిమ్ముకు వచ్చాయి-

'అంటే - ఆ గొల్లవాడు గెలుస్తాడనా? మీరూ ఆ భజనేనా?'

నారదుడు మందహాసం చేశాడు.

'ఎవడు వాడు? ఎవడా దొంగ దేవుడు? ఏవిటీ దాగుడుమూతలు? నా చెల్లెలు ఎనిమిదో గర్భంగా పుట్టి నన్ను చంపుతానన్నాడు. అక్కడ దగా చేశాడు. పుట్టి పారిపోయి గొల్లపల్లెలో గోవుల పొదుగుల్లో దాంకున్నాడు. ఇరవై రెండేళ్ళ రెండమావాస్యల తరవాత బహుళ పంచమి - ఇప్పటిదాకా రాడు - ఏం...? ఏవిటీ దొంగాట... ఎదట బడి కొట్టడేం... నేనంటే అంత భయమా?'

'కాదు, దయ...' అన్నాడు నారదుడు.

'ఆఁ!' అన్నాడు కంసుడు అర్థంకాక.



'నువ్వు శరణాగతి కోరితే మన్నించాలని చూస్తున్నాడు. లేదా చంపుతాడు.'

'నేనా?'

'వద్దు. నువ్వు శరణుకోరవని నాకు తెలుసు. వద్దని కూడా హితవు చెబుతున్నాను.'

'మరి యుద్ధానికి రమ్మనండి - ఎదురొచ్చి పోరాడి...'

'కంసరాజా! పోరాటంలో కత్తిపోట్లు మూడు విధాలు. ఒకటి ఎదురొచ్చి ఎదుర్రొమ్మున పొడవడం. రెండు దొంగ వాటంగా వెనక నుంచి వెన్నుపోటు పొడవడం. మూడోది లోపల దూరి గుండెని తూట్లు తూట్లుగా పొడవడం. నీకు ఈ పద్ధతి ఏర్పాటు చేశాడు దేవుడు.'

'అంటే?'

'ఆయన తలుచుకుంటే చక్రం వేసి క్షణంలో చంపగలడు. ఎనిమిదో గర్భం అని ఎందుకు చెప్పాడు? తొలి గర్భంలోనే పుట్టి రావచ్చుగా. అసలు చావు ఎవరికీ చెప్పిరాదు. నీకు మాత్రం ఇరవై రెండేళ్ళ - ఏం చెప్పావు లెక్క? ఎనిమిదీ పధ్నాలుగూ - ఇరవై రెండేళ్ళ రెండమావాస్యల మీదట పంచమిదాకా బద్ధకించాడంటే - కారణం... మృత్యు భయంతో నిన్ను మెల్లిమెల్లిగా హింసపెట్టి చంపడం. ఆనాడు అశరీరవాణి అతని పుటక గురించి చెప్పిన క్షణానే నీ మరణం ఆరంభమైంది. నాటినుండి నేటివరకూ నీలో క్షణానికో కణం చచ్చిపోతూంది.'

'నారదా! మేమిచ్చే మర్యాదను నిలుపుకోండి. నేనిపుడే దండెత్తి వెళ్ళి...'

'రాజా! అది వద్దని చెప్పడానికే ఇంత రాత్రివేళ వచ్చా. నీ 'ప్రశాంత'తకి భంగం కలిగించాను. అతను దొంగ. దొంగాటల వాడని తెలిసింది గదా. నువ్వు దండెత్తితే అతను దాక్కుంటాడు. పారిపోతాడు. అందుకని దొంగని దొంగ దెబ్బే కొట్టాలి. వజ్రాన్ని వజ్రమే కొయ్యాలి. నువ్వక్కడ నెగ్గలేవు. అందువల్ల - ధనుర్యాగం ఏర్పాటుచేసి అతన్ని పిలిపించు. ఇక్కడ నీ చోటులో నీ కోటలో చుట్టుముట్టి తుదముట్టించు. ఇదొక్కటే మార్గం' అన్నాడు నారదుడు.

కంసుడికి యీ పథకం నచ్చింది.

'నారదమునీ మీరు దేవలోకం వారైనా...'

'నాకు పక్షపాతం లేదు రాజా. దేవతలైనా దానవులైనా మానవులైనా నేను కోరేది లోక కల్యాణం.'

'అదుగో మళ్ళీ -' అనబోయి ఆగాడు కంసుడు.

'అక్రూరుడు - బృందావనంలో అందరికీ ఇష్టుడు. గౌరవపాత్రుడు. ఈయనను దూతగా పంపి బలరామకృష్ణులను పిలిపించు' అన్నాడు నారదుడు.

అక్రూరుడు తల పంకించాడు.

❀ ❀ ❀

బృందావనం-

అక్రూరుడు గౌరవ పీఠంమీద కూర్చున్నాడు.

నంద యశోదలు రోహిణి ఎదురుగా వున్నారు. బలరామకృష్ణులు వారి కిరుప్రక్కలా నిలచి వున్నారు.

బలరామకృష్ణులు ఒకరి ముఖం ఒకరు చూసుకుని నవ్వుకున్నారు.

యశోద కలవరపడింది.



'ఆలమందలు కాసుకుని కడుపులో చల్ల కదలకుండా కూర్చునే మా యిళ్ళ పిల్లలు - రాజులూ యాగాలూ పోరాటాలూనా - వద్దు. నా బిడ్డల్ని పంపను. వాళ్ళు కంటికి దూరమైతే నే నుండలేను.'

'అమ్మా! మహారాజుగారి 'ఆహ్వానం' అంటే 'ఆజ్ఞ' కన్నా ఎక్కువ కఠినం. దాన్ని కాదంటే వారు కోపగించి మనకి 'కడుపులో- చల్ల' కదిపి తీరతారు' అన్నాడు కృష్ణుడు.

'నువ్వుండు కుర్రాడివి - నీకేం తెలీదు' అని గసిరింది యశోద.

అక్రూరుడు ఆమెకు కళ్ళతోనే వందనం చేశాడు. నందుడు నవ్వాడు.

'యశోదా! మాయతెర కమ్మితే చందమామదే కాదు సూర్యుడి వెలుగు కూడా కనబడదు. అలా నీ మమకారంవల్ల నీ బిడ్డని నువ్వు తేటగా చూడలేక పోతున్నావు' అన్నాడు నందుడు.

'నేనూ వస్తాను' అంది యశోద.

కిటికీ వెనకనించి, తెరచాటునించి చూస్తున్న పది పుంజీల కళ్ళు కంగారుపడ్డాయి.

'మేము ఉదయమే కదుల్తాం. రేపు సప్తమి. అష్టమినాడు ధనుర్యాగం.'

'అమ్మో! క్రిష్ణయ్య పుట్టిన రోజు.'

'అక్కడే వేడుక చేసుకుంటాను.'

'అందుకే రాజుగారు పిలిచారు. కొత్తరకం వేడుక' అంటూ కదిలాడు అక్రూరుడు.

❀ ❀ ❀

బలరామకృష్ణులకు గోకుల వాసులు ఆనంద బాష్పాలతో వీడ్కోలు చెప్పారు. రోహిణి, యశోద హారతు లిచ్చారు. రాధ వీరతిలకం దిద్దింది.

రామకృష్ణులు రథం ఎక్కారు.

అక్రూరుడు సారథి స్థానంలో రథం ఎక్కాడు.

వెనకాల చాలా రథాలు బళ్ళు పూన్చి వున్నాయి. వాటిలోకి సంభారాలు ఎక్కిస్తున్నారు.

ఒక ముత్తైదువ. బొట్టుపెట్టిన ఒక గంగిగోవు లేగదూడ శకునం వచ్చారు.

అక్రూరుడు సూర్యుడికి నమస్కరించాడు.

ముందుకు వంగి గుర్రంతో అన్నాడు. 'కల్యాణీ వేళయింది. మనం బయలుదేరవచ్చు...' రథం కదిలింది.

రథం వెళ్తుంటే వెనక గోకులమంతా చూస్తూ నిలబడిపోయింది.

కొందరు ఆకాశంలో వున్న దేవుళ్ళకి మొక్కుతున్నారు.

❀ ❀ ❀

బృందావనం శివార్లు...

అక్రూరుడు రథం తోలుతున్నాడు... రామకృష్ణులు ప్రేమతో వెనక్కి తిరిగి చూస్తూనే వున్నారు. దూరమౌతున్న బృందావన జనంకేసి...

ఒక మలుపు తిరుగుతూనే కల్యాణి పెద్దగా సకిలించి హఠాత్తుగా ఆగిపోయింది.

అక్రూరుడు, రామకృష్ణులూ ఉలికిపడి ఎదరకు చూశారు... ఎదర సముద్రం... గో-గోపికా సముద్రం'-

వందలాది గోవులూ, గోవత్సాలూ, గోపికలూ, రామచిలకలూ, పావురాలూ, దారిని దిగ్బంధం చేశాయి. ఎక్కడా చలనం లేదు. కేకలూ ఏడుపులూ లేవు. అన్నీ కృష్ణుడికేసే చూస్తున్నాయి.

అక్రూరుడు నిస్సహాయంగా కృష్ణుడి వంక చూశాడు. కృష్ణుడి కంటనీరు తిరిగింది.

అలాగే కూర్చోమని అక్రూరుడికి సైగచేసి తను దిగాడు.

ఆవు దూడలను సమీపించాడు. వాటిలో కలిసిపోయిన గోపికల మధ్య - చుక్కల్లో చంద్రుడిలా దూరంగా వెలిగే రాధను చూశాడు...

మాటలు వచ్చినవారూ, రానివారూ అందరూ మూగబోయారు.

అందరి కంఠాలూ - వాళ్ళ కళ్ళతో బ్రతిమాలుతున్నాయి - కన్నీళ్ళతో మొక్కుతున్నాయి.

అంతటా నిశ్శబ్దం...

క్రిష్ణయ్య దిగివచ్చినా ఏవీ కదలలేదు. ముద్దుగా చనువుగా ఒక గోవుని తోశాడు. కదలలేదు.

కృష్ణుడు మురళి తీశాడు...

సమ్మోహన రాగం కల్పించాడు. ఆరోహణ అవరోహణ పలికే సరికే సంచలనం కలిగింది.

వేణువూదుతూ స్వామి నడుస్తుంటే గోవులూ 'గోపికలూ' దారినిస్తున్నాయి...

స్వామి పాదాల సేవకే ఎక్కడెక్కడినించో పూలనూ పండుటాకులనూ గాలిదేవుడు తీసుకొచ్చి దారి ఏర్పరుస్తున్నాడు.

స్వామి అక్కడక్కడ ఆగి ఒక్కొక్క గోమాతకు ఒక స్వరావళిని చెవిదగ్గర బహూకరిస్తున్నాడు. ఒక లేగదూడకు 'ప' అని ఒక పంచమ స్వరం చెవిలో ఉపదేశిస్తున్నాడు. ఒక గోపిక దారిచ్చినా తనివి తీరక చేతిని తాకింది. ఆగి వెనుదిరిగి ఆమెకు మరి కాసిని స్వరాలు ప్రసాదించాడు.



ఒక చిన్నారి చిన్న పిట్ట వచ్చి మురళి చివర కూచుంది. వయ్యారంగా వంగి మురళి ముఖద్వారం దగ్గర చెవిపెట్టి వింది. దాని చెలికత్తెవచ్చి దాన్ని తోసింది. అది చోటిచ్చినా - రెక్కలాడించి గాలిలో తేలుతూనే తన జంటని విననిస్తూ తనూ వింటోంది.

స్వామి కుడి చేతిలో వేణుగానం ఆపి చూపుడు వేలిమీద దానిని నిలిపి, వినిపించాడు.

ముందుకు కదిలాడు.

గోపికలు ఆనందపరవశలై పోతున్నారు.

గానం విన్నకొద్దీ-

వాళ్ళంతా స్వామి మనసు గ్రహించి వాళ్ళే దారినిచ్చి దండాలు పెట్టి వెళ్ళమని సైగ చేయసాగారు.

స్వామి వెనుదిరిగి రథంకేసి చూసి - రావచ్చునని భువన మోహనమైన భంగిమలో వేణు వూదుతునే తల పంకించాడు.

అక్రూరుడు రథం దిగాడు. కల్యాణి పక్కకి వచ్చాడు.

'కల్యాణీ! పదమ్మా... జాగ్రత్త... గిట్టలు మెత్తగా అన్ను. ఊపిరి మెల్లగా పీల్చు... శ్రమైతే చెప్పు నేనూ సాయం చేస్తాను...' అన్నాడు.

రథం కదిలింది.

స్వామి చూపే దారిని అనుసరిస్తోంది కల్యాణి.

ఈ దివ్య దృశ్యాన్ని చూసి బలరామస్వామి చేతులు జోడించి శ్రీమహావిష్ణువుకి మొక్కి కన్నీటిని తుడుచుకున్నాడు.

ముందు స్వామి దారి తీయగా వెనుక రథం వస్తోంది.

స్వామి మధురనించి వ్రేపల్లెకు వచ్చినవాడు యమున దారి నిచ్చింది - ఈనాడు అంతకు మించిన మహోజ్వల ఘట్టం జరుగుతోంది.

గో గోపికా జన సముద్రాన్ని దాటి గట్టు చేరాడు స్వామి. ఒక చిన్నారి లేగదూడ - కంటికి ఏకధారగా ఏడుస్తోంది. 'ఏడవద్దని, స్వామిని బాధించవద్దని' ఆ లేగ తల్లి నాలికతో దాని ముఖాన్ని నాకి కన్నీటిని తుడుస్తోంది.

కాని లేగ - తల్లిని కాదని ముందుకు వచ్చి ఏడుస్తూనే వుంది.

స్వామి ఆగాడు. తల్లి శిరస్సుని నిమిరాడు.

'అమ్మా! బుజ్జాయి నేమనకు. మా అమ్మకూడా నీలాగే ఏడుస్తోంది - నువ్వేడిస్తే నే చూడలేను' అంటూ కన్నీరు తుడిచాడు. మోకరిల్లి బుజ్జాయి శిరస్సు మీద పెదిమలుంచాడు.



ఒక్కసారి వెక్కి వెక్కి ఏడ్వడం వినిపించింది. నెమ్మదిగా బుజ్జాయిని బుజ్జగించి లేచాడు స్వామి.

రాధ...

రాధ పసిబిడ్డలా ఏడుస్తోంది. రాధను దగ్గరకు తీసుకుని శీర్షాన్ని ఆఘ్రాణించాడు.

గాఢాతిగాఢమైన ఆ ఆఘ్రాణశక్తి రాధను పరవశురాలిని చేసింది. ఆమె మూర్ఛిల్లింది ఆమెచేత తన వేణువుని వుంచాడు.

రథం వచ్చింది.

తను పత్తిగిలి దారినిచ్చాడు.

రథం రాధను దాటింది.

స్వామి సారథి స్థానంలో ఎక్కాడు.

అర్థం చేసుకున్న అక్రూరుడు వెనుక ఎక్కాడు.

పంచకళ్యాణి ఆనందాతిరేకంతో పాంచజన్యంలా విజయనాదం పూరించి ఒక్కసారి ముందు కురికింది. వాయువేగ మనో వేగాలతో మధురకేసి పరుగెత్తింది రథం.

❀ ❀ ❀

నూతన రథసారథి కళ్ళెం పట్టుకోగానే కల్యాణికి ఒళ్ళంతా పులకలెత్తింది. ఉత్సాహంగా పరుగులు తీసింది.

ఆ నడక నాట్యంలా వుంది.

హుందాగా లయబద్ధంగా పరుగు సాగింది.

కళ్యాణి మనసులో ఆనందోత్సాహాలకు దాని జూలు ఎగిరిన తీరు అభినయం చేస్తూంది.

అక్రూరుడు ముగ్ధుడై చూస్తున్నాడు.

పుణ్యనది కాళింది తీరాన రథ మాగింది.

రామకృష్ణులు చల్లటి తీయటి నీటిని త్రాగి రథం ఎక్కారు.

మధ్యాహ్న సంధ్యకు వేళ.

అనుమతి తీసుకుని అక్రూరుడు పరమాత్ముడికి అర్ఘ్యం ఇవ్వడానికై నదికి వెళ్ళాడు.

కన్నెదుట వున్న కృష్ణదేవుని కానలేక – నదిలో కన్నులు మూసుకుని స్వామిని ధ్యానించి దర్శించబోవడమే... మాయ... మహా విష్ణుమాయ... కృష్ణమాయ.

అక్రూరుడు అంజలి ఘటించి కన్నులు మూయబోయే క్షణాన నదిలో బలరామకృష్ణులు కనిపించారు... ఆశ్చర్యపోయి నమ్మలేక – వెనక్కి తిరిగి గట్టుకేసి చూశాడు.

బలరామకృష్ణులు రథంమీద కూర్చుని వున్నారు.

కళ్ళు నలుపుకుని తిరిగి నదిలోకి చూశాడు.

దిగ్భ్రాంతుడై పోయాడు. ఇపుడు కనిపించినది రథంపై రామకృష్ణులు కాదు. శేషశయనంపై కొలువు తీరిన శ్రీమన్నారాయణుడు. మేఘంపై మెరుపు తీగలా ఆయన చెంత శ్రీమహాలక్ష్మి – స్వామి నాభిలో పద్మం – పద్మంలో పరబ్రహ్మ – ఆ పరబ్రహ్మలో వేద జ్యోతులు... శేషతల్పశాయిని సేవిస్తూ స్తుతిస్తున్న దేవతలు. ఋషులు... ఈమహోజ్వల దృశ్యాన్ని చూసి ఆనందాతి రేకంతో పరవశుడై స్వామికి నమస్కరించి భక్తిపారవశ్యంలో అలాగే నిలిచిపోయాడు...

క్రమంగా మాయ తిరిగి కమ్మింది. మెల్లగా కన్నులు తెరచాడు. చర్మ

చక్షువులు తెరుచుకోగానే - జ్ఞాన నేత్రాలు మూసుకున్నాయి... ఎదర రథారూఢులైన బలరామకృష్ణులు యథా రూపాల్లో కనిపించారు. అంతలో మాయమయ్యారు.

అక్రూరుడు ఏమి జరిగిందీ జరుగుతున్నదీ అర్థంకాక విస్మయంతో సంభ్రమంలో అతిలోకమైన ఆనందంతో మంత్రముగ్ధుడై రథం దగ్గరకు వెళ్ళాడు.

క్రిష్ణయ్య మందహాసం చేశాడు.

'నది పక్కనే వుంధి... రావడానికి ఇంతసేపెందుకయినట్టు... భూమ్మీదా ఆకాశంలోనూ కనబడని వింతలూ విడ్డూరాలూ ఏవైనా నదిలో కనిపించాయా...?' అని అడిగాడు.

అక్రూరుడు తేరుకుని వందనం చేశాడు.

'వింతలన్నీ నదిలో కాదు... నీలో ఉన్నాయి. నీలో లేని చోద్యాలు నింగిలో నేలలో ఎక్కడ వుంటాయి ప్రభూ' అంటూ శిరసా వందనం చేశాడు.

రథం కదిలింది.

❀ ❀ ❀

సాయంకాలపు ఎండలో మధురానగరి కోట బురుజులూ, సౌధాగ్రాలూ, కోవెల గోపురాలూ బంగారు పూతపూసుకుని ధగద్ధగాయమానంగా వెలిగి పోతున్నాయి. అష్టమినాటి ధనుర్యాగోత్సవానికి నగరాన్ని శోభాయమానంగా అలంకరిస్తున్నారు

❀ ❀ ❀

రాజ సౌధంలో-

కంస మందిరం-

అక్రూరుడు నిలబడి వున్నాడు-

కంసుడు లోపలనుంచి కంగారుగా వచ్చాడు.

వస్తూనే అక్రూరుడు ఒక్కడూ వుండడం గమనించాడు.

'ఏడీ... వాడేడీ... రాలేదా రానన్నాడా... భయపడ్డాడా... భయంతో చచ్చాడా... రాడు నాకు తెలుసు... వాడు దొంగ... ధూర్తుడు...' అన్నాడు కంసుడు.

'వచ్చారు ప్రభూ! మన అతిథి గృహంలో విడిది చేశారు.'

వెలాతెలా బోయాడు కంసుడు. అంతలోనే సర్దుకున్నాడు.

'వచ్చాడా... ఓహో... ఆయువు మూడిందిలే... అందుకే వచ్చాడు...' అని గొణుక్కున్నాడు.

'మంచిది. నువ్వెళ్ళి వారికి మర్యాదలు జరిపించు. పుకార్లు విని బెదిరి పారిపోకుండా కట్టుదిట్టంగా కాపలావుంచు. గూఢచారులను కూడా నియమించు' అన్నాడు కంసుడు.

'స్త్రీ లోలుడని - చపలబుద్ధి అని విన్నాను. అవసరమైతే... అక్కడ ఉద్యోగికి చెప్పివుంచు.'

అక్రూరుడు ముఖం పక్కకి తిప్పుకున్నాడు.



బృందావనంలో-

యమునా తీరాన-

రాధ, గోపికలు గోడలేని చిత్తరువుల్లాగా - నీడపడని రూపాల్లా. దారి తప్పిన పసిబిడ్డల్లా తిరుగాడుతున్నారు. క్రిష్ణయ్య ఎక్కడో దాంకుని ఏడిపిస్తున్నాడని వారి భ్రమ. 'నల్లనివాడు. పద్మనయనమ్ములవాడు. కృపారసమ్ముపై జల్లెడివాడు ఎక్కడున్నాడో చెప్పండమ్మా, ఎక్కడ దాచారో దాగాడో చెప్పండమ్మా. ఒక్కసారి చూడనివ్వండి' అని మల్లెపొదను, మామిడి చెట్టును, పొన్న కొమ్మను, ఉయ్యాలను, ఇసుక తిన్నెలను పేరుపేరునా బ్రతిమాలి అడుగుతున్నారు.

అక్కడక్కడ క్రిష్ణయ్య అడుగుజాడలు కనబడితే ఆగిపోయి కూర్చొని, మోకాళ్ళమీద పడుకుని కళ్ళ కద్దుకుంటున్నారు.

'నాలుగు పాదాలున్నాయి... ప్రభువూ గోపమ్మా ఇటు నడిచి వెళ్ళారే...

'ఇవిగివిగో ఆరు పాద ముద్రలు... ఒకరు కాదమ్మా ఇద్దరు గొల్లభామలు అటూ ఇటూ చెట్టాపట్టా లేసుకు వెళ్ళారే...'

'అడుగులు లోతుగా దిగి చెదిరాయి. చెల్లాచెదురుగా వున్నాయి. ఇక్కడ ఒకరినొకరు తరుముకున్నారే. ఈ పొదరింటి దగ్గర ఆగిపోయారు. ఇక్కడ విశ్రమించారే... ఇక్కడ స్వామి పాదాలకు ఎదురుగా భామ పాదాలు చూశారా... ఇక్కడ కౌగలించుకున్నారే...'

'ఇక్కడ ఒక పాదముద్రే వుంది. భామని ఎత్తుకున్నారే...'

'అదిగో ఉయ్యాల ఇంకా ఊపు తగ్గక ఊగుతోంది చూడవే!'

'ఇక్కడే వున్నాడే. మన పక్కనే వుండి కనబడకుండా మాయమవుతున్నాడే - మనమీద అలిగాడే, మనని ఏవగించుకున్నాడే. స్వామి ప్రసాదానికి పనికిరాని ఈ తనువులూ బతుకులూ మనకి వద్దే.'



'యమునలోపడి కొట్టుకుపోదాం. చచ్చిపోదాం. అప్పుడు కన్నీళ్ళు విడుస్తాడే. అవి వచ్చేనా మనకి తగిలితే అదే చాలే...' అంటూ గోపికలు యమునకేసి వెళ్ళారు.

క్రిష్ణయ్య స్నేహితుడు ఉద్ధవుడు వచ్చి ఎదట నిలిచాడు. వారిని వారించాడు.

అతన్ని చూడగానే ఆశతో వాళ్ళ కళ్ళు జ్యోతుల్లా వెలిగాయి.

ఉద్ధవుడు వారిని ఊరివేపు మళ్ళించి నడిపిస్తున్నాడు. వాళ్ళకి క్రిష్ణయ్య చెప్పిన కబురు చెప్పాడు–

'మీరిలా బాధపడితే ఆయన భరించలేడు. మీ కోసమే నన్ను పంపాడు. మీరు స్వామికోసం ఈ వనంలో వెదక్కూడదు; మీలో వెతుక్కోండి. ఆయన మీ కళ్ళలో వెలుగుతున్నాడు. మీ గుండెల్లో కొలువున్నాడు. మీ మాటల్లో మాటగా, పాటల్లో పాటగా, అడుగుల్లో అందెగా, పాలలో వెన్నలా వినిపిస్తాడు. కనిపిస్తాడు.

'మీరు ఇళ్ళకి వెళ్ళి మీ కాపరాలు చక్కగా నడుపుకోండి. ఆనందంగా వుండండి. అదే ఆ స్వామికి పూజ...' అని ఓదార్చాడు.

❀ ❀ ❀

యశోద, ఇంటి మునివాకిట దిగువ మెట్టుమీద కూర్చుంది. ఆమె వడిలో ఒక చిన్న అవుదూడ తలపెట్టుకుని పడుకుని వుంది. యశోద ఓ కంట ఏడుస్తూనే మరోకంట దానిని ప్రేమగా చూస్తూ – లేత గడ్డి పరకలు తినిపిస్తోంది.

ఎదర కొంచెం అవతలగా నందయ్య ఆవుకి కుడితి కలిపి తాగిస్తున్నాడు.

'వాడికి నా మీద కోపం వచ్చింది... అంతే. రాజాగారు పిలిచారని కాదు. నామీద కోపంవచ్చి 'వెళ్ళిపోయాడు' అంది యశోద ఏడుస్తూ...

'అబ్బే! అలాంటిదేం లేదు. పసివాడు – దేవుడులాటివాడికి నీ మీదా నామీదా కోపాలేవిటే. మహాయితే అలిగి వుండాలి' ఓదార్పుగా అన్నాడు నందయ్య.

'ఏం కాదు. పాపిష్టిదాన్ని - ఏ తల్లయినా బిడ్డ ఇంకాస్త తింటే సంతోషిస్తుంది. వాడు పాలు తాగితే, వెన్న మీగడలు తింటే - అరిచాను. తిట్టి కొట్టి సాధించాను...' అంది యశోద.



'బావుంది. వాడు తిన్నాడనా తిట్టావు... దొంగతనంగా తీసుకున్నాడని గదా...'

'అవును. నేను తంతానని భయపెడితే దొంగతనంగానే - అయినా వాడు దొంగ కాదు దొర... వాడు చేసింది దొంగతనం అయితే- అదే దొరతనం. అం...'

నందుడు నిట్టూర్చాడు.

వాణ్ణి తిట్టాను - కొట్టాను - రోటికి కట్టేసాను... నామీద విసుగేసి అసయ్యమేసి.. వెళ్ళిపోయాడు. బిడ్డ' అంటూ ఏడవసాగింది యశోద.

నందయ్య పరుగున ఆమె దగ్గరకు వచ్చి శిరసుమీద చేయివుంచి మృదువుగా అదిమాడు.

'అదేం కాదు. ఒకవేళ అదే నిజమైతే ఆ పాపంలో నాదే పెద్ద పాలు. నువ్వాణ్ణి సాధిస్తుంటే నేనేం జేస్తున్నట్టని. నేన్నిన్ను కోప్పడి అడ్డుపడాలి గదా - కోపంవస్తే మనిద్దరిమీదా వచ్చుండాలి...' అంటూ సముదాయించాడు నందయ్య.

  

బలరామకృష్ణులు, గోకులం నేస్తాలతో కలసి మధురానగర సంచారానికి బయలుదేరారు. ఊరంతా శోభాయమానంగా వెలిగిపోతోంది. స్వాగత తోరణాలు, మంగళ తోరణాలు కట్టారు.

వీధుల కటూ యిటూ చక్కని మొక్కలు, చెట్లు నిలిపారు.

మధురాపుర వాసులు రామకృష్ణులను చూసి ముగ్ధులై పోతున్నారు. మేడల మీదనుంచి ఆడవాళ్ళూ పిల్లలూ చూస్తున్నారు. కొందరు దండాలు పెడుతున్నారు. కొందరమ్మాయిలు కృష్ణుడి మీదకు పూలుజల్లి తెర వెనకకు తప్పుకుంటున్నారు.

కృష్ణుడు పైకి చూశాడో లేదో అని తొంగిచూస్తున్నారు. కృష్ణుడు పైకి చూడగానే వాళ్ళకి ఒళ్ళు ఝల్లుమని, చిరుచెమటలు ముత్యాలలా పుట్టుకొస్తున్నాయి.

కొందరు పెద్దలూ పూజారులూ 'ఇతడేనా దేవకి అష్టమ గర్భంగా పుట్టింది' అని పరీక్షగా చూస్తున్నారు.

'దేవకీ వసుదేవుల కన్నబిడ్డ, ఆ నల్లవాడు. పాలుపీల్చి పూతనను చంపిన పసివాడు వాడేనట. వెన్న దొంగ. బకాసురుడిని చంపాడట. బాగా చిన్నప్పుడు శకటాసురుడిని ఒక తోపుతో చంపాడు. శ్రీ విష్ణుమూర్తులవారే ఇలా పుట్టారుట. మంచి గ్రంథసాంగుడుట.'

'కంసరాజుకి ఆయువు మూడింది.'

'మనకి మంచి రోజులు వచ్చాయి' అని రకరకాలుగా చెప్పుకుంటున్నారు జనం.

ఒక చక్కని బండిమీద చాకలి రాజుగారి బట్టలు పేర్చి తీసుకువెళ్తున్నాడు.

కృష్ణుడి బృందాన్ని చూసి 'ఏయ్ తప్పుకో తప్పుకో. రాజుగారి బండి' అని గద్దించాడు.

కృష్ణుడు కదలకుండా వెనక్కు చూశాడు.

'ఏం బండి?' అన్నాడు.

'కంస మహారాజుగారి వస్త్రాలు. తప్పుకో.'

కృష్ణుడు వాటిపై కప్పిన దుప్పటి తొలగించాడు. పట్టుబట్టలు జరీ బట్టలు జిగేలున మెరుస్తున్నాయి. ఒకటి తీసి వల్లెవాటుగా వేసి చూసుకున్నాడు.

'బాగుంది... నా కివ్వు...' అన్నాడు.

'భలే పల్లెటూరి బైతువి - నీ ముఖానికి పట్టుబట్టలా... అదీ మహారాజుగారివా' అంటూ లాక్కున్నాడు. పోబోతుంటే కృష్ణుడు ఆపి-

'ఏవిటా తొందర... మీ రాజాగారికి బట్టల్లేవా?'

'బోలెడున్నాయి'

'రేప్పొద్దునకో జత వుంది గదా!'

'మారాజులా వుంది. ఏం?'

'ఉంటే అది చాలు. ఇంక వీటిని వేసుకునే పనుండదు' అంటూ ఉత్తరీయం వేసుకుని మిగతావి తీసి బలరాముడికీ, నేస్తాలకూ విసిరాడు.

చాకలి బొడ్డులోంచి చాకు తీసి మీద కురికాడు.

కృష్ణుడు ఎడంచేత్తో వాడికేసి చూడకుండానే ఒక్క దెబ్బ కొట్టాడు. వాడు ఎగిరి పదిగజాల అవతల పడిపోయాడు. - మళ్ళీ లేవలేదు.



జనమంతా దిగ్భ్రాంతులై చూస్తున్నారు-

ఇద్దరు రాజభటులు ముందుకు వచ్చి - కృష్ణుని పట్టుకోబోయి ఏదో ఆలోచించి పరుగున వెళ్ళిపోయారు.

కృష్ణుడు ముందుకు సాగాడు. చిన్నవి పెద్దవి బిగుతుగా వదులుగా వున్న దుస్తులలో గొల్లపిల్లలు వింతగా వున్నారు. గెంతులేసి నవ్వుకుంటున్నారు.

అంతలో కుబ్జ వచ్చింది. ఆమెని చూడగానే వీధిలోని వారంతా ఈసడింపుగా ముఖం పక్కకి తిప్పుకున్నారు.

కుబ్జ స్వామి పాదాలకు మొక్కింది.

ఆమె మెడదగ్గర, నడుందగ్గర, మోకాళ్ళ దగ్గర వంకర తిరిగి వికారంగా వుంది.

తాను తెచ్చిన పళ్ళెంపై మూత తీసింది.

సుగంధ పరిమళాలు గుబాళించాయి.

'రాజుగారి సేవలో వున్నాను స్వామీ! ఈ సుగంధాలు వారికని చేశాను. కాని నీకన్న రాజు లెవరు - అందుకో స్వామీ' అంది.

కృష్ణుడవి ఆఘ్రాణించి గంధం, కస్తూరి, జవ్వాది స్వీకరించాడు. అన్నకు, జతగాళ్ళకు యిచ్చాడు.

'వెన్నగాచిన నెయ్యెంత బాగున్నాయి' అన్నా డొకడు.

అంతా నవ్వారు.



కృష్ణుడు కుబ్జను దయతో చూశాడు.

ఆమె పాదంమీద తన పాదం బొటనవేలు మోపి - తన చేతి మునివేళ్ళు గడ్డం క్రింద వుంచి పైకెత్తాడు.

కుబ్జ పైకి సాగింది.

చూస్తుండగా ఆమె వంకరలు పోయాయి. అతిలోక సౌందర్యవతిగా మారింది. అప్సరసలా వెలిగింది.

అందరూ సమ్మోహితులై చూస్తున్నారీ అద్భుతాన్ని.

కుబ్జ కంట ఆనంద బాష్పాలు తిరిగాయి. చేతులు జోడించి మ్రొక్కింది.

'ప్రభూ! కృతజ్ఞత చెప్పుకోడం చేతకానిదాన్ని... ఇప్పుడు నువ్విచ్చిన అందం. ఈ శరీరం, ఆరోగ్యం అన్నీ నీ ప్రసాదాలే. నీ ప్రసాదాన్ని నీకే నైవేద్యం పెట్టి ధన్యురాలిని కావాలి. అనుగ్రహించు' అంది.

కృష్ణుడు ఆమెవంక కరుణతో చూసి, తల పంకించాడు.

ముందుకు కదిలాడు-

❀ ❀ ❀

కంసుడి ఆయుధాగారం - పెద్ద కోటలో వుంది.

కృష్ణ బృందాన్ని భటులు ఆపబోయి, చేతగాక వెనక్కి తగ్గి, తలవంచి స్వాగత మిచ్చారు.

కృష్ణుడు లోపలకి వెళ్ళాడు. పలురకాల ఆయుధాలు - కత్తులు, గదలు, ఈటెలు. బల్లేలు, చక్రాలు, బాకులు, విల్లమ్ములు, కవచాలు, శారస్త్రాణాలు చిత్ర చిత్రాలయినవి వేలాదిగా ప్రదర్శించి అమర్చివున్నాయి.

ఆయుధశాల మధ్యన ఒక పెద్ద శకటంపై కంసుడు ధరించే ఇనప విల్లును చూశాడు. దానిని సామాన్యులు వందమంది కలిసినా పైకెత్తలేరు.

కృష్ణుడు ఆ వింటిని అలవోకగా చూశాడు. అవలీలగా పైకెత్తాడు. లీలగా ఎక్కుపెట్టాడు. రాముడు శివధనుస్సును విరిచినట్టు ఇట్టే విరిచి పడేశాడు.

విల్లు ఫెళఫెళార్భటులతో విరిగింది.

ఆ భవనం దద్దరిల్లి పోయింది.

మధురా నగరమే సంచలించి పోయింది.

❀ ❀ ❀

విల్లు విరిగిన ధ్వనికి నిదురిస్తున్న కంసుడి గుండె గుభిల్లుమంది. అదిరిపడి లేచి కూర్చున్నాడు. పక్కన భార్యలు - అల్లంత దూరాన బిడ్డలు పడుకున్నారు. అందరూ అదిరిపడి లేచారు. బిడ్డలు గోలుగోలున ఏడుస్తున్నారు. కంసుడు ఆవేశంగా ఉయ్యాల దగ్గరకు వెళ్ళాడు.

'నోర్మూయ్యండి' అని అరిచాడు. వాళ్ళు మరింత ఏడవసాగారు. కోపావేశంలో కంసుడు చెరో చేతా బిడ్డలను పైకెత్తాడు... 'ముయ్యండి నోరు ముయ్యండి' అని అరుస్తున్నాడు.

'నాథా... బిడ్డలు... మన బిడ్డలు...' అంటూ భార్యలు పరుగున వచ్చారు.

బిడ్డల ఏడుపుకి మరో వేయిమంది బిడ్డల ఏడుపు తోడైంది.

కంసుడికి దుర్భరమైంది. పెద్ద కేకవేస్తూ వాళ్ళిద్దర్నీ నేలకేసి కొట్టాడు-

పరుగు పరుగున బయటకి వెళ్ళాడు. మందిరాలలో మార్గాలలో పిచ్చివాడిలా పరుగులెత్తాడు. ఒకచోట ఆగి మధువు తీసుకోబోయాడు. అది నెత్తురై పొంగువారుతోంది. నీరు తాగబోయాడు - అది పొగలు కక్కుతోంది.

విసురుగా వేరొక గదిలోకి వెళ్ళాడు. దారిలో పైనించి వేలాడే దీపం తలకి తగిలింది. నెత్తురు కారుతోంది. తల తుడుచుకుంటూ అద్దం ముందుకు వెళ్ళాడు. ఊగే దీపంలా తన ప్రతిబింబం కూడా అద్దంలో ఊగుతోంది. కాని అద్దంలో తన తల కనబడలేదు.

కళ్ళు పెద్దవిచేసి చూశాడు. కనబడలేదు.

'మంజరీ' అని కేకవేసి పక్కగదిలోకి వెళ్ళాడు. పక్కమీద 'మంజరి' ఆదమరచి నిద్రపోతోంది. వెళ్ళి ఆమె పక్కలో పడుకుని గాఢంగా కౌగిలించుకున్నాడు.

'మంజరీ నాకు భయంగా వుంది. నన్ను కౌగిలించుకో గట్టిగా. కౌగిలించుకో... వదలకు. ఎవరొచ్చినా వదలకు. మంజరీ మంజరీ' అంటూ ఆమెను గాఢంగా కౌగిలించుకున్నాడు.

చలనం కలగలేదు. అనుమానంతో లేచి చూశాడు.

మంజరి చనిపోయివుంది. గుడ్లు తేలవేసి నాలిక బయటికి పెట్టి, కొయ్యబారి పోయింది.

'అబ్బా!' అంటూ ఆమెను తోసి పరుగున బయటకు వెళ్ళాడు. ద్వారం దగ్గరవున్న తాడును పదేపదే లాగాడు.

గంటలు హోరెత్తి పోయాయి.

'చాణూర ముష్టికుల్ని పిలువ్... నించున్న పళంగా పిలువ్' అంటూ పరుగెత్తాడు.

సింహద్వారం చేరి పచార్లు చేస్తుండగా చాణూర ముష్టికులు వచ్చారు. వందనం చేశారు.

'వాడొచ్చాడు - చంపాలి. రేపు చంపాలి.. మాంచి మదగజాన్ని పంపండి - పొగరెక్కించి తోలండి. అదే చంపుతుంది. లేదా చచ్చేట్లు తొక్కి తొక్కి చస్తుంది. - ఆ తరువాత మీరు పోట్లాడండి... అదను తప్పితే పోటీ ధర్మాలకోసం చూడద్దు. కత్తితో పొడిచెయ్యండి. ఏదో చెయ్యండి. రేపు సభలో వాడు నా మొహం చూడకూడదు - వాడి శవం నేను చూడాలి' అన్నాడు కంసుడు ఒగురుస్తూ-



భేరీ తూర్యనాదాలు మోగుతున్నాయి. మంగళ వాద్యాలు ఊరంతా చెలరేగుతున్నాయి. వేలాది జనం - చక్కగా ముస్తాబై నవ్వుతూ ఉత్సాహంతో కోటలో ధనుర్యాగం మల్లయుద్ధం చూడడానికి వెళ్తున్నారు.

'రాత్రి మబ్బు లేకుండా పిడుగు పడింది...'

'కాదు... విల్లు విరిచేశాడట... నల్ల క్రిష్ణయ్య...'

'ఇవ్వాళ మల్లయుద్ధం కూడా...'

'ఆనక కంసుడి పనికూడా అంతే-'

'మధ్యలో కొండంత ఏనుగుందోయ్...'

'కొండ నెత్తిన వాడికి ఏనుగెంత?'

❀ ❀ ❀

రాజమందిరంలో ఎండ పడుతూంది.

కంసుడు నిద్ర లేవలేదు. పడుకుని పొర్లుతున్నాడు.

బలరామకృష్ణులు - కూడా అక్రూరుడు దారి చూపగా కోటలో ప్రవేశిస్తున్నారు.

మేడల పైనుండి వారిమీద పూలవాన కురిపిస్తున్నారు. మధుర పౌరులు.

కోట సింహద్వారం పక్కనే 'కువలయాపీడం' కట్టివుంది. దాని పక్కగా గొలుసుకి కట్టిన గసికల దగ్గర బలవంతులు నలుగురున్నారు. గోడమీద బల్లేలు పట్టుకుని నలుగురున్నారు.

రామకృష్ణులు లోపలకి రాగానే మావటివాళ్ళు గసిగ లూడదీసి గొలుసు లూడదీశారు. దాని కుంభస్థలంలో బల్లెంతో పొడిచి రెచ్చగొట్టారు. తోక దగ్గర మండే కాగడాపెట్టి పారిపోయారు.

ఏనుగు భూనభాలు అదిరేలా ఘీంకరించి ముందు కురికింది. ఆదమరచి కబుర్లాడుతూ వస్తున్న రామకృష్ణుల మీదకి ఉరికి తొండంతో కొట్టబోయింది.

కృష్ణుడు రాముడిని తృటిలో పక్కకి నెట్టి తాను ఏనుగు పొట్ట కిందికి తప్పుకున్నాడు. తొండం ఏనుగు కాళ్ళకే తగిలింది.

అంతటా గందరగోళం చెలరేగింది.

తరవాత రామకృష్ణులు ఏనుగుతో చెలగాటాలాడారు. కృష్ణుడు పుంజుకుని దానిని అటూ ఇటూ పరుగెత్తించాడు. గోడదగ్గర నిలబడి దాని తలని అదే గోడకి మోదుకునేట్టు చేశాడు. తోక పట్టుకు పది బారలు లాగి దాని ప్రాణం స్తంభింప చేశాడు.

అది ముందుకాళ్ళు తొండం పైకెత్తి నిలబడి మ్రోమని ఘోష పెట్టింది. కృష్ణుడు దాని తలమీద కురికి, వంగి కంటిని చితకపొడిచాడు. అది కిందపడి తొండంతో కంటిని అద్దుకుంది. కృష్ణుడు దాని దంతాన్ని పట్టుకుని, కాలు తన్నిపెట్టి లాగాడు - తొండంతో కృష్ణుడిని కొట్టేలోపల రాముడు రెండో దంతాన్ని పీకాడు. తొండం ఇటు కొట్టేలోగా కృష్ణుడు అటు దంతాన్ని ఊడలాగాడు. గుండెలు పగిలేలా ఘోషపెట్టింది. కృష్ణుడు అమాంతం వురికి దానికుంభ స్థలంమీద బలంగా పొడిచాడు. మరోసారి పెద్ద కేకపెట్టి ఏనుగు కూలిపోయింది. కుంభస్థలం నించి రక్తం ప్రవహించి మడుగు కట్టింది.

చూస్తున్న వేలాది ప్రేక్షకులు చప్పట్లు కొట్టబోయి భయ సంభ్రమాలతో బాలకృష్ణ దేవుడికి చేతులు జోడించి 'జయజయ' అని కేకలు వేశారు.

కృష్ణుడు వాటిని పట్టించుకోలేదు. దంతాన్ని భుజాన గదలాగా ధరించి ముందుకు సాగాడు...

అతని నుదుట చెమట బిందువులు మంచి ముత్యాలై, ఇంద్రనీలాలై, పుష్య రాగాలై శోభించాయి...

మల్లయుద్ధరంగం పదిబార లుండగానే అధాత్తుగా చాణూర ముష్టికులు రామకృష్ణుల మీదకు దుమికారు.

హోరా హోరీగా పోరు సాగింది. కృష్ణుడు చాణూరుడితో, రాముడు ముష్టికుడితో తలపడ్డారు.

వారిద్దరూ జగత్ప్రసిద్ధులైన యోధులు... కొండంత శరీరాలతో వున్నారు.



మబ్బుమీద మెరుపుల్లా, ఏనుగుమీద అంకుశంలా, జవనాశ్వం మీద రౌతుల్లా, మహావృక్షంమీద పిడుగుల్లా - శక్తికి రూపాల్లా· చెలరేగారు రామకృష్ణులు.

చాణూర ముష్టికులు వారి బారికి తట్టుకోలేక గుప్తంగా దాచిన బాకులు తీశారు.

ఉత్తర క్షణంలో రామకృష్ణులు ఏనుగు దంతాలను అందుకుని వారిని ఒక్క దెబ్బతో చేధించి చంపారు. సభలో హాహాకారాలు. హర్ష ధ్వానాలు. జయ ధ్వానాలు చెలరేగాయి.

సభా మందిరంలో - కంసుడు కత్తిపిడిమీద పిడికిలి బిగించి సింహాసనంమీద కూర్చున్నాడు. సభలో సభికులకన్నా సైనికులే ఎక్కువమంది వున్నారు.

నీలమేఘ శ్యాముడైన కృష్ణుడు - నెత్తురు చారల మరకల అలంకారాలలో - విజయ తేజంలా, సూర్యుడిలా ప్రకాశించాడు.

నీరసంగా నిస్తేజుడై తన నీడలావున్న కంసుడు ఓపిక తెచ్చుకుని అట్టహాసం చేశాడు. అది పరిదీనంగా వుంది.

'ధూర్తుడా! తుప్పట్టిన విల్లు విరవడం పిచ్చెక్కిన ఏనుగుని - తాగి తూలుతున్న యోధులను కొట్టడం గొప్పకాదు - ఈ కంససభ నీపాలిటి యమసభ. ఈ సభలో వున్నవారంతా నా భటులే. అందరి చేతిలో కత్తులూ ఈటెలూ వున్నాయి. నేను సైగ చెయ్యగానే నీ మీద వాన చినుకుల్లా కత్తులు కురుస్తాయి. ఒళ్లు తూట్లు పొడిచేస్తాయి... ఇవాళే నీ మరణం' అన్నాడు.

కృష్ణుడు మందహాసం చేశాడు.

'కంసమామా! ఇవాళ అష్టమి - నా పుట్టినరోజూ నువ్వు గిట్టే రోజూను. నీ భటులు నా మీద కత్తులు వెయ్యలేరు - పైకి చూడు. నీ ప్రతి ఒక్క భటుడి వెనుక

నా బృందావన వాసులు బాకులు పట్టి నించున్నారు... చూడు' అన్నాడు నిశ్చలంగా కంసుడిని కళ్ళతోనే జయిస్తూ-

కంసుడు అనుమానంతో తల పైకెత్తి మేడ వరసమీద బారులు కట్టి ఆయుధాలతో నించున్న భటుల్ని చూస్తున్నాడు.

శ్రీకృష్ణ భగవానుడు కొదమ సింహంలా గర్జించి పైకి లంఘించాడు.

కంసు దదిరిపడి చూశాడు.

కృష్ణుడు పదడుగుల ఎత్తునుంచి తన మీదకు ఉరుకుతున్నాడు.

బలిని పాతాళానికి తొక్కిన పాదాలు-

భయంకరంగా తన మీదకు వస్తున్నాయి.

అప్రయత్నంగా చేతులు జోడిస్తున్నాడు.

క్షణార్థంలో అవి వచ్చి అతని ఎదురు రొమ్మున దిగాయి. లేస్తున్న కంసుడు వెనక్కి ఒరిగి సింహాసనం మీదికి ఒరిగాడు.

ఉత్తర క్షణంలో కృష్ణుడు అతని జుట్టుపట్టుకులాగి విసురుగా తోశాడు. కంసుడు సభా మధ్యన వెల్లకిలా పడ్డాడు. రెక్కలు తెగిన పర్వతంలా పడిన ఆ కంసుడి మీదకు కృష్ణుడు వురికాడు.

ఎదురు రొమ్ముమీద కూర్చున్నాడు. పిడికిలి బిగించి పై కెత్తాడు.

నిన్ను ఇరవై రెండేళ్ళుగా సంహరిస్తున్నాను. నీ క్షోభ నీలాటి నికృష్టులకు గుణపాఠం హెచ్చరిక కావాలని నిన్నింత నిదానంగా చంపాను. ఇపుడు నీకు మూడే చావు - నిజానికి చావుకాదు: నీ నరక బాధనుండి విడుదల చేసే వరం' అంటూ ఒక్క పోటు పొడిచాడు.

కంసుడు ఎర్రటి విషం కక్కాడు.

సభ అంతా చేతులు జోడించి ప్రభువుకు వందనం చేసింది.

బేరీ తూర్యనాదాలు మోగాయి...

లేచి నడుస్తున్న స్వామిపై పుష్పవృష్టి కురిసింది.

❀ ❀ ❀

శ్రీకృష్ణ భగవానుడిపేర జయధ్వానాలు చెలరేగి మిన్నంటాయి. కంసుడి చెరసాల నుండి వేలాది స్త్రీలు పిల్లలు ఆనంద బాష్పాలతో బయటకి వచ్చి కృష్ణుడికి మొక్కి వెళ్తున్నారు.

కృష్ణుడు, రాముడు, అక్రూరుడు ముందుకుసాగారు.

దేవకీవసుదేవులు చెరసాలనుండి బయటకు రాగానే కృష్ణుడు వారి పాదాలకు నమస్కరించాడు.

ఆనందాతిరేకంతో పరవశులై - కర్తవ్యం తోచక రెండు క్షణాలు నిలబడిపోయారు వారు.

దేవకి తటాలున వంగి బిడ్డను లేవదీసి గాఢంగా కౌగలించుకుంది. శిరస్సున ముద్దుపెట్టి మూర్ధం ఆఘ్రాణించింది.

కృష్ణుడు తిరిగి చేతులు జోడించాడు...

'అమ్మా! కన్నతల్లివి - కన్నెత్తి చూడకుండా ఒక్క చుక్క పాలు తాగకుండా నీకు ఇన్నాళ్ళూ దూరమైపోవడం - విధి విలాసం... బాధ పడకమ్మా... ఇవ్వాళ నీ చేతి ప్రసాదం తినాలని వచ్చాను... ఇవ్వాళ అష్టమి... నా పుట్టినరోజు' అన్నాడు.

'ఇంకా వ్రేపల్లెకి వెళ్ళనివ్వను' అంది దేవకి. కళ్ళలో చిన్న భయం మెరిసింది - బిడ్డ చేతిని గట్టిగా పట్టుకుంటూ-

వాసుదేవుడు తండ్రికేసి చూసి మందహాసం చేశాడు.

'వ్రేపల్లె కాదు... బృందావనం' అన్నాడు.

'అన్ని వనాలూ ఇక్కడికే వస్తాయి... ఈ రాజ్యం నీ పాలనలో చల్లగా వుంటుంది' అన్నాడు ఉగ్రసేనుడు.

'మహారాజా మన్నించండి... రాజ్యపాలన నా మతం కాదు. అభిమతం కాదు. నేను నిర్వహించవలసివున్న ధర్మ ప్రవర్తన కార్యక్రమంలో కంసవధ తొలిపాదం మాత్రమే... కురుక్షేత్ర సంగ్రామం దాకా - నాకు విశ్రాంతి వుండదు... మన మందరం కర్మచక్ర నిబద్ధులం... ధర్మ సంస్థాపనే నా ధ్యేయం - నా జీవితం...' అన్నాడు శ్రీకృష్ణ భగవానుడు...

సర్వేజనా స్సుఖినో భవన్తు -



## పీఠికా రమణీయం

# మరల నిదేల..



శ్రీమద్రామాయణ కల్పవృక్ష రచన సంకల్పించినవేళ - కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు ఒక ప్రశ్న వేసుకున్నారు. "మరల నిదేల రామాయణం బన్నచో..." అని దానికి సమాధానం కూడా ఆయనే చెప్పారు.

"తన రుచి బ్రదుకులు తనని గాన...

తనదైన యనుభూతి తనది గాన...

తన భక్తి రచనలు తనవి గాన..." అన్నారు.

కాని వాల్మీకి రామాయణాన్ని వచన గ్రంథంగా తలపెట్టిన శ్రీనివాస శిరోమణిగారు - లోకరీతినీ, ప్రవృత్తినీ కాకుండా - ఖచ్చితమైన స్పష్టమైన కారణం మనసారా అనుకుని అది చెప్పి రచన ఆరంభించారు..." అందరి కోసం రాముడి కథ చెప్పాలి. అంతేకాదు. వాల్మీకి చెప్పిన కథ అంతా ఉన్నది ఉన్నట్టు చెప్పాలి." ఇదీ ఆయన ఉద్దేశం.

అంటే - అంతకుముందు తెలుగులో రామాయణాలు లేవా?

ఉన్నాయి. చాలా ఉన్నాయి. అవి పద్య గద్యాలతో, పెద్ద పెద్ద మాటలతో, క్లిష్ట సమాసాలతో, గూడార్థాలతో వ్రాసిన కావ్యాలు... కొంచెం తేలిక భాషలో ద్విపదలు కూడా ఉన్నాయి. ఎన్ని వున్నా తెలుగూ, సంస్కృతం చదువుకున్న వాళ్ళకే తప్ప- "ఇల్లాళ్ళకూ, పిల్లల్ళకూ" కూడా తెలిసేలా - చదివించేలా ఎంత బాగుందీ అనిపించేలా రాసినవి లేవు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారూ, పురిపండా అప్పలస్వామి గారూ, సరస్వతుల సుబ్బరామయ్యగారూ వాడుక భాషలో వ్రాసినా అవన్నీ పూర్తిగా వాల్మీకి చెప్పినదంతా తెలియచెప్పే కథనాలు కావు; కుదించి వ్రాసినవి.

అందువల్ల సమాసాలతో, సంధులతో బాధ పెట్టకుండా తేటతెలుగులో తేలిక మాటలతో హాయిగా చదివించే రామాయణం రాయాలని శిరోమణి గారి కోరిక... అదే ఆయన అక్షరాలా చేశారు. ఆ గొప్ప కార్యంలో నేను ఒక సేవకుడిగా పని చేశాను... అది నా అదృష్టం...

ఆంధ్రంలో ఉన్న పద్య గద్య రామాయణాలూ–, రంగనాథ, గోపీనాథ, భాస్కర, మొల్ల, ఆనంద, ఆశ్చర్య, ఆధ్యాత్మిక రామాయణాలూ, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, ఆంధ్రవాల్మీకి వావిలికొలను, తంజై తేవప్పెరుమాళ్ళయ్య రచనలూ, హిందీ, కన్నడ, తమిళ భాషలలో తులసీ, పంప, కంబ రామాయణాలూ, రాజాజీ రామకథ, రైటానరబుల్ శ్రీనివాసశాస్త్రిగారి ఉపన్యాసాలూ – ఇలా మొత్తం ఇరవై రెండు గ్రంథాలనూ నిఘంటువులనూ వ్యాఖ్యలనూ సేకరించారు. వాటన్నింటినీ చుట్టూరా పెట్టుకొని వాల్మీకి చెప్పిన ఒక్కొక్క శ్లోకంతో, అర్థంతో, భావంతో ఇతరుల అనువాదాలనూ కథనాలనూ పోల్చి చూసి మంచీ చెడ్డా అనుకునేవారము. అప్పుడు శిరోమణిగారు తెలుగులో వాల్మీకి శ్లోకానికి అనుగుణంగా ఒక వాక్యం చెప్పేవారు. నేను వ్రాయసకాడుగా అది వ్రాసేవాడిని.

ఈవిధంగా ఒకటి రెండు సర్గలు అయ్యాక నేను వ్రాసిన వాటిని నెమ్మదిగా చదువుతూ ఉంటే – అది వింటూ అర్థం చేసుకుంటూ తప్పులు దిద్దుకుంటూ – ఆయన తన చేత్తో వ్రాసేవారు. ఆ తరువాత ఆయన– తిరిగి చదివి చెబుతూ ఉంటే – నేను తిరిగి వ్రాసేవాడిని.. దుష్ట సంధులూ, క్లిష్ట సమాసాలూ, దుష్టాన్వయాలూ, వాక్యంలో దూరాన్వయాలూ లేకుండా చూసే వాళ్ళం. ఆయన భాషలో చెప్పాలంటే **"సిగ్గు లేకుండా"** పండితులు వెక్కిరిస్తారనీ, తిడతారనీ భయం లేకుండా – మాకోసం, అందరికోసం అనుకుంటూ వ్రాసేవాళ్ళం... ఇలా కాచి వడబోసిన తెలుగు రచనే **శిరోమణి రామాయణం.**

దానిని ఆంధ్రపత్రిక (దినపత్రికలో) ప్రతి ఆదివారం ప్రచురించేవారు. కొత్తలో మేము భయపడినట్లే కొందరు పండితులూ, రచయితలూ వెక్కిరించారు, విమర్శించారు. కాని పాఠకులనుంచి నిరసన రాలేదు. క్రమక్రమంగా అందరూ **శిరోమణి** రామాయణంలోని సులువునూ, సౌందర్యాన్నీ ఆస్వాదించారు, ఆదరించారు.. తరువాత పుస్తకరూపంలో వచ్చింది. ఎన్నో పునర్ముద్రణలు పొందింది.

1951–53లలో – అంటే నాకు యిరవైయేళ్ళ వయసులో పూజ్యులు శ్రీ **శిరోమణి** గారి వద్ద వ్రాయసకాడుగా పనిచేసి – ఈ మహాగ్రంథానికి ఒక సేవకుడనయ్యే అదృష్టం అబ్బింది...

ఆ సీతారాములకూ, గురువుగారు **శిరోమణి** గారికీ
కృతజ్ఞతాభివందనాలు సమర్పించుకుంటున్నాను.

**(10-10-2002న విజయవాడలో శ్రీ పేరాల భరతశర్మగారు ఆవిష్కరించిన శ్రీనివాస శిరోమణి విరచిత వాల్మీకి రామాయణము (వచనము) సందర్భంగా చదివిన ప్రసంగ వ్యాసం.)**



# ముబారక్

అచ్చుతప్పులూ అవకతవకలూ అయోమయాలూ సందేశాలూ సమస్యల పరిష్కారాలూ వున్న కథల గురించి రాయడం బలే జిల్లయిన పని. మన క్లవర్లూ చమత్కారాలూ మిరియాలూ గుప్పించి పే(ట్రేగి పోవచ్చు. 'వర్ధమాన' రచయిత తల నిమిరి వెన్ను తట్టి ఎంకరేజి చేసి షయినయిపోవచ్చు. కాని- ఆ 'వర్ధమానుడు' అయిదిదుగులు కాకుండా జైన విగ్రహంలామరీ అరవై అడుగుల ఎత్తున నిశ్చలంగా నిర్మలంగా చిరునవ్వుతో నిలబడి వుంటే వాడి వెన్నుతట్టడం ఎలా? ఇక రాసేదేముంది. చేసేదేముంది. చేతులు జోడించి నమస్కరించడం తప్ప.

వేదంలా ప్రవహించే తెలుగు జీవనదిలో ముస్లిం జీవన స్రవంతి ఇంతకాలం అంతర్వాహినిగా- కనబడకుండా ప్రవహిస్తూ వుండాలి. ఖదీర్‌బాబు- దర్గామిట్ట కతలతో భగీరథుడిలా ఆ నదిని మన ముందు మళ్లించాడు. ఈ నది నీటిలో ప్రతి బిందువు ఒక ఆణిముత్యం. మంచుని ఎగజిమ్మే అగ్నిపర్వతం. ఇందులో నాన్నలూ అమ్మలూ అవ్వలూ తాతలూ అందరూ భూలోకదేవతలు. సుఖసంతోషాలలాగే కష్టాలనూ కన్నీళ్లనూ కూడా నగలుగా వేసుకొని హుషారుగా తిరుగుతారు. పాలూ పూలూ పాపాలూ తాపాలూ అన్నీ ఒకటే.

ఘోషాలో వున్నట్టుగా ఇన్నాళ్లూ మనకి కనుపించని ఈ మనోహర జీవన చైతన్యాన్ని ఈనాడు ఆవిష్కరించిన వైతాళికుడు మహమ్మద్ ఖదీర్‌బాబుకు నా అభినందనాలు.

(28.02.1999)

సిఎస్: మచ్చుకి నాలుక్కథలని మెచ్చుకుంటే మిగతా ఇరవయ్యి... కోప్పడవు; నవ్వుతాయి. అంచేత...

# వ్యాస రమణీయం (వ్యక్తులు)



## జీవనది

రావిశాస్త్రి జీవనది.
ఆయన వచనం వరద గోదావరి. చెట్లను కుమ్మేస్తూ గట్లను
తరిగేస్తూ ఉరకలూ పరుగులూ తీసే శక్తి. చైతన్యం.
ఆ ఆవేశం అట్టడుగున బాధ, జాలి, రొమ్ము మీద తన్నే కసి, కోపం,
వెన్నుతట్టి ఓదార్చే ప్రేమా జాలి. ఆ భావోద్వేగాన్ని భరించలేకా
ధరించలేకా ఆయన వాక్యాలూ మాటలూ ఉక్కిరి బిక్కిరి
అయిపోతాయి. ఊపిరి కుదరక గిలగిల తన్నుకుంటాయి.
పాఠకులలో ప్రవేశించి ఒళ్లంతా వ్యాపించి గుండెను
కదిపేసి కుదిపేసి ప్రళయం సృష్టిస్తాయి...
చదివిన తరువాత కొన్ని క్షణాలు శూన్యం... నిశ్శబ్దం.
ఆలోచన, కలవరం, భయం...
మనం నేరస్తులను శిక్షిస్తున్నాం కాని
కారకులను దండించడంలేదు.
ఆకలి వేయడం నేరంకాదు. ఆకలి వేయించడం నేరం
ఎక్కడో ఎవడో అడుక్కు తింటే మనకేం అనే రోజులు పోయాయి.
దానమిచ్చి వుద్ధరించాలి అన్న వంచనా శిల్పం ఉరేసుకుంటోంది.
ఉద్ధరించకపోతే నీకే దెబ్బ అనే కఠోరసత్యం కర్కశ కిరణాలతో
తన్నుకు లేస్తోంది.

నీ పక్కింటికి నిప్పంటుకుంటే నాకేం అని వూరుకోవు
చెంబెడు నీళ్లు వాడి మంట మీద చల్లుతావు
పక్కవాడి ఆకలి మంటా అంతే... లేదా.
"గోవులొస్తున్నాయి జాగ్రత్త"
ఇది రావిశాస్త్రీయ మహావాక్యం.
హెచ్చరిక కాదు; హెచ్చెరుక
రావిశాస్త్రి జీవనది
ఆ నది చెప్పినది ఆలోచించ తగినది
రావిశాస్త్రి జీవనది.

౧౬-౮-౯౮



# ఏంహాయ్! కొండ్లావ్.......!

ఆయనా... నమస్కారం నమస్కారం మహాప్రభో సుఖులా?... ఇంతకీ తమరెవరూ - హనుమాన్లు గారూ?.... కళ్ళజోడు పట్రాలేదులెండి... ఎవరూ.... ఓరి మీరా... అరె నువ్వటా నీ యిల్లు బంగారం గానూ.... ఎన్నాళ్ళయిందిరా చూసీ....?

అవునుగాని ఒరే నువ్వముర్తం గాని పురిషెడు పుచ్చుకున్నావట్రా.... నా వయసు వాడివి - నీ మనఁవడు కొండల్రావు కన్నా కుర్రాడిలా కనిపిస్తున్నావు ఏఁ విటి కథ? ఏఁవైనా మన్మథ గుళికలు గట్రా... అఁ? అఁ? ఆ ఏవిటీ... నువ్వు... నువ్వు కాదా?? నీ మనవడు కొండల్రావేనా? ఎవడు? మన రావి?... నా క్లాసుమీట్సు.... నాదగ్గిర తెలుగు పాఠాలు చదువుకున్న గుంటవె... వాడే నువ్వా?? వార్నీ! అంటే నువ్వు - తమరు కాదన్నమాట.... నా స్టూడెంట్సు రావి కొండల్రావ్వీ! అంటే... నీ మీద ఒరే ప్రయోగం చెయ్యచ్చా?

రాస్కెల్.... నువ్వట్రా? గురువు గార్కే మస్కాయిచ్చి ఇలా తిప్పలు పెట్టేస్తావుట్రా? ఆ? ఏవిటీ? నువ్వు స్రియాకోళంనించి వుడాయించీసి చెన్నాపట్నం చెక్కేశావుటగా.... కథలూ గట్రా రాశావుట? డ్రామాస్లూ నాటకాల్సూ రాశావుట? వేశావుట? సినిమాల్లో కలిసిపోయావుట? నీకేనా రేపు సన్మానం? రెండొందల చిత్రాల రావికొండల్రావు? రాస్కెల్ ఎవడక్కడ తెలుగు? నీకు "రావి" అని ఒక యింటి పేరుండగా - "రెండొందల చిత్రాల" అని ఇంకో ఇంటిపేరా? - ఇంటిపేరన్నదీ - పవిత్రమైన వంశనామం... పితృపితామహులు మనకిచ్చిన అయొక్క వంశవృక్ష నామం. దాన్ని కాదని ఇంటిపేరు కింటిపేరా?-

అవుగాని రాస్కెల్.... ఏవిటా మవునం? ఏవిటా శాంతం? చిరునవ్వు?

ఓపక్క నేనిలా నిన్ను చీల్చి చండాడీసి చెమ్డా లెక్కదీసీసి పారేస్తుంటే బెల్లంకొట్టిన రాయిలా కిమ్మనవేం? అఁ? నాచేత వాగించి నా ముక్కోంకర్లూ, మూతొంకర్లూ, మాటొంకర్లూ పరిశీలించి పరిశోధించి చెన్నాపట్నంలో

ఇమిటేషనింగుగా వుండాలనా... ర్‌(రాస్కెల్... విన్నా విన్నా ఇక్కడుండగా నన్ను ధిక్కరించి గొప్పవాడివయ్యావు. అక్కడ నన్ను వెక్కిరించి చాలా గొప్పాడి వయ్యావ్.... దొమ్మరి రాస్కెల్... ఆ పప్పులిహ వుడకవు... నేను చాలా మారిపోయాను... మీ గాడిద లందరికీ దొరికిపోయేందికి పాత తెలుగు మేష్టర్ని కాను - చూశావుగా, నిన్నే గుర్తుపట్టలేనంత మారిపోయాను.

అవునూ కొండల్రావ్.... ఆ జోళ్ళు దిగి నేలమీదనించో... సినిమా వాళ్ళకి కాళ్ళు నేలమీదానవంటారు గదా.... రెండంగుళాలు... ఓహో సొంతూరొచ్చినప్పుడు ఆ మహిమలు చూపెట్టరు కాబోలు... అలాక్కానీ... ఒరే అక్కడ మీ సినిమా వాళ్ళక్కూడా హెడ్మాష్టర్లుంటారట గదా?

....ఆ? ఏవిటీ? అక్కడ హెడ్మాష్టర్లని డైరెక్టర్లంటారా?... అన్నీ.... అలాక్కాని. వాటీజినే నేమన్నాడురా ఇంగిలీషు కవి. పేరు లోన నేమి పెన్నిధియున్నది.... మన ముక్కలే అనుకో. ఏపేరెట్టి పిలిచినా ప్రతిజీవికీ ఓ హెడ్మాష్టరు బాధ వుండి తీరుతుంది....

అసలీ హెడ్మాష్టర్లనేవి టూ తవుజండ్ వెరైటీజ్ వాయ్... నోట్ చేసుకో....

మామూలుగా నా ప్రాణానికి స్కూల్లో మన హెడ్మాష్టరున్నాడు గదా. ఇంటో మా యింటిది నాపాలిటి హెడ్మాష్టరు. దానికి ఎదురింటి మేడగలవాడే హెడ్మాష్టరు... వాడికి మేడ తాకట్టేసుకున్న మారువాడీ హెడ్మాష్టరు - అలాగే మీ సినిమాల్లో - సినిమా తీసేవాడికి - చూసేవాడు హెడ్మాష్టరు. ఇండియాకి ఇందిర హెడ్మాష్టరు. ఆవిడికి ఓటేసేవాడు హెడ్డుమాష్టరు. హెడ్మాష్టరుకి డియ్యావో హెడ్మాష్టరు. వాడికి దేవుడు - దేవుడికి నాస్తికుడు - నాస్తికుడికి వాడి ఉపన్యాసం వినేవాడు హెడ్మాష్టరు. అదీ సంగతి...

ఇంతకీ సినిమాల్లో నీ హెడ్మాష్టరు పేరేవిటి? ఆ? చాలా మందుంటారా... ఓహ్ హెడ్మాష్టర్లు చాలామందీ అంటే, వింతే. అంటే తెలుగు మాష్టరు ఒక్కడే వుంటాడు కాబోలు. సరి నీ తాజా హెడ్మాష్టరుకి తెలుగెవ డక్కడ...? ఆ?... ఓహో అవును విన్నానులే - ఏ భాషవాడేనా ఎడ్మాష్టరవచ్చుట గదా... ఏ భాషా రానివాడు కూడా అవచ్చుటగదా, అలాక్కానీ... అలాక్కానీవోయ్.... వాడికి తెలుగెవదూ అన్నాను తప్పా - తెలుగు రాపోయినా ఫరవాలేదు అని చెప్పే అవసరం లేదు - నేనేం తెలుగు ప్రవేట్లు చెప్పడానికి రావటంలేదు. రాస్కెల్.... తెలుగువాడూ అన్నాను దట్సాల్.... భాషరాదూ... అక్కర్లేదూ. అవన్నీ ఎందుకురా - దట్సాల్ ఫో వెళ్ళిఫో..... ఒరే కొండల్‌రావ్?

వెళిపో అంటే పోడవేం?.... రా యిట్రా భాషరాదూ అక్కర్లేదూ అని గొప్ప బడాయిగా చెబుతున్నావు.... ఒరే ఒరే ఛందస్సూ గణాలూ చిన్నయ్యసూరి వ్యాకరణ సూత్రాలూ వీటన్నిటినీ కొట్టి పారేస్తావ్రా.... ఇవి లేకుండా కవిత్వాలూ, నాటకాలూ రాస్తావ్రా? తప్పుకాదురా? నాటకాలూ అంటే కాళిదాసుగారూ, తిరపతి

వెంకటకవులు వాళ్ళూ సుబ్బరంగా రాసీసి పడీశారు అదుకోండ్రా వెధవల్లాలా అని. మళ్ళీ నువ్వూ నేనూ రాసీడం ఎందుకురా....

ఏవిటా డ్రామా నువ్వు రాసిందీ? "కుక్కపిల్ల దొరికిందీ...." అసలు పోయిందా ఏవిటి?.... పోవడమూ అంటే కొంపలో అంతకు ముందుంచుకున్నట్టేగదా... ఐనా ఒరే ఇంటో కుక్కల్ని గాడిదల్ని వుంచుకుంటార్రా.... ఎవరేనా మధురవాణ్ణుంచుకుంటారు. ఆవకాయ నంచుకుంటారు. ఆస్తులు పంచుకుంటారు. కానీ కుక్కపిల్ల నుంచుకోడమేవిట్రా గాడిదా - కుక్కల్నింటో వుంచుకున్నావనుకో సెరిమొనీస్ అనగా తద్దినములు వగైరాలు పెట్టినపుడు అవి మడికూడు ముట్టుకుపోతే పుట్టగతులుంటాయట్రా?... అయినా అవేం డ్రామాస్‌రా... "కుక్కపిల్ల దొరికింది, ఆస్తిపోయింది, నాలుగిళ్ళసావిడి, ఆరుగదుల సత్రం"-చక్కగా భక్తియుతంగా "మార్కండేయులు బ్రతికాడు, సావిత్రి సత్యవంతులు కొన్నాళ్ళు కాపురం చేశారు. హరిశ్చంద్ర, కుచ్చల కుశలాయకం" ఇవన్నీ వున్నాయి. కావలిస్తే అవే మళ్ళా నువ్వోసార్రాయి.... చూసిరాత రాయి....

ఏవిటీ జీవద్భాషలో వ్రాశావా? అంటే? మామూలు మనుషులు మాటాడుకునే మామూలు మాటల్లో రాయాలని రాశావా? ఒరే మామూలు మనుషులు రోజూ వాళ్ళ గొడవలన్నిటికీ మామూలు మాటల్లోనే కిందామీదా పడతారు గదా అవన్నీ బుక్కుల్లో కెక్కించటం ఎందుకూ అని-?

ఆc ఏవన్నావ్.... భారతం, రామాయణం కథలు కూడా మీకు నేను మామూలు మాటల్లోనే పాఠాలు చెప్పానంటావా?.... అవునూ చెప్పాను. వెధవల్లాలా! అలా చెప్పకపోతే మీ బుర్రలకెలా ఎక్కిచస్తుందీ అని - ఏమన్నావ్? అందుకేనా? అందుకే నువ్వు మామూలు భాషలో రాశావా. ఓర్ ఓర్ నీ అసాధ్యంగూల - నీ యిల్లు బంగారం గానూ - గురువుకే ప్రేవేటు చెప్పేస్తున్నావురా రాస్కెల్ - నచ్చావురా. నాకు శిష్యుడవనిపించుకున్నావు....

ఒరే కాస్త ఇసుంతా రా- గోడలకి చెవులుంటాయిష.... నీకో రెండు పుంజీల దేవ రహస్యాలు చెప్పాలి - తెలుగు మేష్టారుగా కాదు - తెలుగు పౌరుడిగా, తెలుగుమ్మనిషిగా - రసికుడిగా - కాన్నిన్నూ - నీగొప్పనీ ఒప్పేసుకు మెచ్చేసుకోబోతున్నాను.... అయితే అది విని నీకు పొగర్రారాదు. కొమ్ములు మొలవరాదు. అన్నీ విన్నాక - మేష్టారూ! మీరుట్టినే ప్రేమతో అన్నారు గాని నేనుట్టి వెధవాయిని. నాకేం రాదు అని నువ్వు వినయంగా అనాలి. అదీ మన సంప్రదాయం. ఆచారం-నిజమని కాదు. నువ్వలా అనకపోతే మా ఆంధ్రులకోపం వొచ్చీగలదు జాగర్త - నేనివి చెప్పినట్టు ఈ సభలో జనానికీ, పత్రికలు చదివే వాళ్ళకీ, టి.వి., రేడియో వాళ్ళకీ, సినిమాలు చూసే వాళ్ళకీ తప్ప మూడో కంటికి చెప్పావో ఒట్టే.... ఎంత ఒట్టంటే....

సరస్వతి మీద ఒట్టు....

హెడ్మాస్టరుకి డియ్యావో గారు తెల్లారగట్ల కల్లో కనబడ్డంత ఒట్టు-

ఇంగ్లీషు మేష్టారు విష్వక్సేనుడు అన్న మాటని ఇంగ్లీషులో నిర్లక్ష్యంగా రాయబోయి స్పెల్లింగు తప్పినంతొట్టు-

హిస్టరీ మేస్టరు కొడుకు జాగర్ఫీలో ఫెలయితే, జాగర్ఫీ గారి బావమరిది హిస్టరీలో ఫస్టొచ్చినంతొట్టు-

హెడ్మాష్టరు తల్లితండ్రిగార్ల తద్దినములు అన్నీ ఆదివారాలు ఆగస్టు పదిహేనులు సమ్మెలు హర్తాళ్ళు లాంటి సెలవురోజుల్లో పడకుండా సోమవారం శుక్కరారాల మధ్య పడినంత ఒట్టు - డియ్యీవో ఇనస్పెక్షను రోజుల్లో పడినంత ఒట్టు...

డ్రిల్లు మాస్టారుకి... లేడీ టీచరుగారి వీధిలో నడుస్తుండగా నడుం బెణికినంత ఒట్టు....

నూకల చిన్నారావు సంగీతప్పాటలు జనం విని నేర్చేసుకున్నంత ఒట్టు. తెలుగు సినిమా హీరోలు విగ్గులు వదిలేసినంత ఒట్టు...

తెలుగు నాటకాల వాళ్ళు ఇతర భాషల నాటకాలు చూసి బావుంటే నేర్చుకున్నంత ఒట్టు.....

పీడిత ప్రజలకోసం పాటలూ, పద్యాలూ, కథలూ, నవల్సులూ రాసేవాళ్ళు - అవన్నీ ఆ పీడిత ప్రజలక్కూడా అర్థమైపోయే బాసల్లో తేలిక మాటల్లో రాసినం తొట్టు.....

ఇహ నే చెప్పేది చెప్పేస్తాను విను. చెప్పక తప్పదు. ఒప్పేసుకోక తప్పదు. నువ్వు గొప్పవాడివి. చాలా కష్టపడి చాలా మార్పు సాధించావు. నాకు నీ మాట నచ్చింది. నీ నటన నచ్చింది. చాలా నచ్చింది. నేను పెద్దవాణ్ణి కాబట్టి బావుందని పైకలా నటిస్తా గాని నేనూ, మా ఆవిడా నీ సినిమాలన్నీ సుబ్బరంగా చూసేశాం. రెండో ఆటకెళ్ళి తనివితీరా చూసీశాం... నీ యిల్లు బంగారంగానూ ఏవి వాయిస్‌వాయ్ నీది... ఏమి శారీరం! అనగా ఏవి కంఠస్వరం అని అర్థం. ఏమి ధాటీ ఏవి కంచులాంటి ఖచ్చితమైన ధ్వని... అంతెందుకు నేను "జెండాపై కపిరాజు" పాడేవాణ్ణి కదా - క్లాసులో.... నన్ను మించిపోయావోయ్ అంతే -- ఇంకేం చెప్పను?

ఒక్క సినిమాలేవిటి - ఇందాక హాస్యానికన్నాను గాని గ్రామరూగ్రత్రా లేకుండా కథలూ నాటకాలూ చాలా చక్కగా హాయిగా రాశావోయ్.... ఆయొక్క నాలుగిళ్ళ సావిడీ, ప్రొఫెసర్ పరబ్రహ్మం- "హెడ్మాష్టర్ పరబ్రహ్మం"గాని "తెలుగు మాస్టారు రామబ్రహ్మం" అని గాని ఓటి రాయిస్మీ - నీ కథలు దిదృక్షా, జిగీర్షా ముమూర్షా అవన్నీ... అహ నీ అసాధ్యం కూలా అవి చదివాక బహు తికమకపడిపోయా.... ఆయొక్క... వాడు తను చచ్చిపోతే జనం ఏం చేస్తారో ఎలా ఏడుస్తారో ఏమనుకొంటారో అన్నది చూడబోవడం - అమ్మో.... ఎంత వేదాంతం- ఎంత గూఢార్థం పెట్టావోయ్.... అలాగే.... ఇక్కడ ఆత్మహత్య చేసుకుని నరకానికి పోయి ఆ బాధ పళ్ళేక అక్కడ మళ్ళీ ఆత్మహత్య చేసుకుని ఇటు వచ్చీసేదు -

ఆ దేవుణ్ణే ఖంగారు పెట్టేగల్డుస్మీ.... అలాగే ఆ యొక్క ఈషణత్రయం మీద కథలు అన్నట్టు నీ పెన్ను బంగారం గానూ - రెండు శవాలు - ఆ కథ చదివాక మన వూళ్ళో వాగుడు బోతులకి - పుకార్ల మోతుబర్లకీ నోళ్ళు గట్రా పడిపోయాయంటే నమ్ము - లోకరీతి మీద ఏం వ్యాఖ్యానం! ఆహా!

వయసులో పిల్లడివైతేంగాక-

చాలామంది పెద్దవాళ్ళకి చాలా మంచి పాఠాలు చెప్పావోయ్. చాలా గొప్ప ఆలోచనలు కలిగించావోయ్. తలుపేసుకి చాటుగానైనా సిగ్గుపడేట్టు చేశావోయ్, కలవరపెట్టావోయ్ - కంగారు పెట్టావోయ్ - తెలుగువాడి బతుక్కి, నవ్వులకీ, ఏడుపులకీ, వెక్కిరింతలకీ, వంకరటింకర్లకీ కళ్ళు మిరుమిట్లు గొలిపే వెలుగులకీ అన్నిటికీ అద్దాలుపట్టి చూపెట్టావోయ్-

చాలు కొండల్రావూ - వూరికే బేళ్ళకి బేళ్ళ పుస్తకాలూ, మైళ్ళకొద్దీ పద్యాలూ రాయక్కరలేదు... "గంగిగోవు పాలు గంటెడైనను చాలు" అన్నాడు మహాకవి. అలాగే నీ రచనలు...

కొండల్రావ్? ఇదోటి గమనించావూ.... ఇందాకట్నించి నిన్ను ఒరే గిరే అంటున్న వాణ్ణీ - నీ గురించి నిజంగా ఆలోచించి మాట్లడ్డం మొదలెట్టాకా - ఏవోయ్ అంటున్నాను - గదా?

చూశావూ.... అదోయ్.... హద్దదీ... నిజమైన ప్రజ్ఞకి విలువ. గీటురాయి. మనకి తెలీకుండానే మనలో అణగారివున్న, మనం అణగదొక్కిన గౌరవం తేరుకుని రేకవిచ్చి వికసించి పరిమళం పైకి ఎగజిమ్మేట్టు చెయ్యడం. అదీ నిజమైన విజయం.... నిన్ను సరస్వతి నిజంగా కటాక్షించిందోయ్. కళామతల్లి చల్లగా చూస్తుందోయ్... రా ... ఇంకా వృద్ధికి రా.... నిన్ను ఒరే అన్నవాడు ఏవోయ్ అనడమే కాదు... ఏవండీ అనేంతగా, తమరూ అనేంతగా ఎదుగు - నీకన్నా చిన్నవాళ్ళే కాదు; వయసులో నీకన్నా పెద్దవాళ్ళూ నీవూరి గురువులూ, నీ వంశం పెద్దలూ, నీ వూరి తల్లులు, అక్కలు, బామ్మలు తాతలూ అందరూ - మా రావికొండల్రావు గారు, మా వూరి కొండల్రావు గారు అని గర్వంగా చెప్పుకునేంత వృద్ధికి రా- రెండొందల చిత్రాల రావి కొండల్రావ్ కాదు వెయ్యి - విథర్ విక్టరీ - వెయ్యి చిత్రాల కొండల్రావు వెయ్యేళ్ళు వైభవంతో వర్థిల్లు.

ఆనందంతో మా అందరికీ కంటనీరు తిరిగేట్టు చెయ్యి - గుండెలు వుప్పొంగేట్టు చెయ్యి - తెలుగునాడంతా మన శ్రీకాకుళం జెండా ఎగరెయ్యి... రాస్కెల్ ఇది నా ఆజ్ఞ - నా ఆశీర్వచనం -

*రావికొండలరావు రెండొందల చిత్రాల సంబరానికి రాసినది)*






మా వూరు ధవళేశ్వరం. రాజమండ్రి దగ్గర. గోదావరి ఒడ్డున రామపాదాలరేవులో మొదటి మేడ మా యిల్లు. పక్కనే కొండమీద జనార్ధనస్వామి కోవెల, కొండ కింద శివాలయమూ వున్నా వాటికన్నా మా యిల్లే కోలాహలంగా వుండేది.




గుమ్మంలో ఎప్పుడూ ఒక పందిరి. పందిట్లో హరికథలూ, అవి లేనపుడు సావిట్లో జై హరనాథ జై కుసుమకుమారి జై - భజనలూ. నట్టింట్లో దెయ్యాలను సీసాల్లో బిగించే ముగ్గుల పూజలూ, బైరాగులూ - పెరటి వసారాలో చుట్టాలూ - వాళ్ల చుట్టాలకి పెట్టుకునే (వాళ్లింట్లో వీల్లేక) తద్దినాలూ - పెరట్లో బావి అవతల పడవవాళ్లకి మా అమ్మమ్మ పెట్టే భోజనాలూ - బువ్వలు తిని దుంగలు కొట్టేవాళ్లు. మేడ వరండాలో హిందీ పాఠశాల - రాజమండ్రి నుంచి గుమ్మడిదల దుర్గాబాయమ్మగారు జటకాలో వచ్చి మా అమ్మకీ, పక్కింటి వాళ్లకీ మైతో హూం తూతో హై అంటూ చెప్పే హిందీ పాఠాలూ పూనకాలూ శాంతులూ తర్పణాలూ - పూజగది పక్కన భజగోవిందం పాడుకుంటూ మా నాన్నగారు.

ఆఫీసువేళకి వంటవక ఏమిటీ జనం - ఇది ఇల్లా సంత బజారా అని ఆయన ఎప్పుడేనా ఒక్కసారి చుట్టాల మీద విసుక్కుంటే అంతవరకూ అందరికీ అన్నీ అందిస్తూ సందడిగా తిరిగే మా అమ్మకి కోపమొచ్చి ఫిట్లొచ్చి నేలకి ఒరిగి పడిపోయేది. ఆవిడ చేతిలో వుప్పూ తాళంచేతులూ పెడితే లేచేది. మళ్లీ మామూలే.... అందుకే మా నాన్నగారు ఆదివారాలు కూడా ఆఫీసు కెళిపోయేవారు. ఒకసారి అస్పత్రికెళిపోయారు. అక్కడినుంచి ఎక్కడికో వెళిపోయారు. ఇంకరారు అని చెప్పారు. మా అమ్మమ్మ పడవెక్కి భద్రాచలం వెళ్లిపోయింది. అప్పుడు మా యిల్లు చీకటయిపోయింది. దేవుళ్లూ చుట్టాలూ బాబాలూ బైరాగులూ భజనవాళ్లూ ఎవరూ కనబల్లేదు. అందరూ పారిపోయారు. నాకు భయం వేసింది.




దుర్గాబాయమ్మగారి స్కూలావిడ రాజమండ్రీ నుంచి వచ్చి భయపడవద్దని మా అమ్మకి చెప్పారు. మెద్రాసు వెళ్లిపొమ్మని చెప్పారు. మా అమ్మా నేనూ మా తమ్ముడూ మెద్రాసెళ్లిపోయాం. అక్కడ మా బావ యింట్లో దిగాం.

మెద్రాసులో దుర్గాబాయమ్మగారు పెద్ద సభ పెట్టారు. ఆంధ్ర మహిళా సభ. "నువ్వు ధవళేశ్వరంలో నా దగ్గర హిందీ నేర్చుకున్నావు గదా. ఇక్కడ మన మహిళా సభలో వాళ్లకి నీ కొచ్చిన హిందీ నేర్పించు. నెల కిరవై రూపాయలు ఇస్తారు" అన్నారు. నెల కిరవై చాలదని తెలుసు. ఇంకో పనేదన్నా చేసి యింకో పది గడించు - అని చెప్పారు.




రెండు వందలు ఖర్చుపెట్టిన మేడలోంచి, రెండు రూపాయల అద్దెకి, ఒక మెట్ల కింద గదిలాంటి దాంట్లో దిగాం. చిన్నప్పట్నించీ మా అమ్మనీ చుట్టాలనీ తిట్టిపోసే ఇన్నాళ్లూ దూరంగా వున్న మా చిన్నమ్మమ్మ ఇప్పుడు సాయం వచ్చింది. ఒక చిన్న రేకు పెట్టె, తలగడా పట్టుకుని. ఆ రేకు పెట్టికి రెండు తాళాలు వేసేది. అందులో పది లక్షల రూపాయలు

దాచుకుందని మా అమ్మకీ నాకూ తెలుసు. కాని ఆవిడ - నా మొహం దమ్మిడీ లేదు పిచ్చి కుంకల్లారా అనేది.

❀ ❀ ❀ ❀

మెట్లమీద సామానులు సర్ది మెట్లదారి మీదే పడుకునేవాళ్లం. నలుగురం పడుకుంటే ఈ గోడ నించి ఆ గోడకి సరిగ్గా సరిపోయేది. అమ్మమ్మ కాశీ మజిలీ కథలు చెప్పేది. పొద్దున్న లేవగానే వీధరుగు మీద కూచుంటే ఆవిడ మెట్లమీద అన్నం కూరా చారూ టిఫినూ వండిపెట్టేది. ఈ అమ్మమ్మ పెట్లో బోల్డు దబ్బుంది. ఇంక భయం లేదు అనుకున్నాం. కాని లేదంటుంది గదా. మరి నెలకి యింకా పదిరూపాయలు కావాలి.

ఓ రోజున కొట్టుమీద బియ్యం చింతపండు ఉప్పుతోబాటు ఓ కాణీకి కుట్టుడాకులు కొన్నాం. కాణీకి మూడు యిచ్చాడు. కాని మేం నలుగురం. మా అమ్మమ్మ, అమ్మ తమ్ముడూ నేనూను. కాణీకి నాలుగిస్తావా అంది మా అమ్మ. నేను కొనేది కాణీకి అయిదు. మీకు నాలుగిస్తే నాకేం మిగిలేనూ, అన్నాడు కొట్టువాడు.

అయితే కాణీకి అయిదాకులు నేనే కుట్టిస్తా కొంటావా అంది మా అమ్మ. సరిదా అన్నాడు వాడు - ఆకు నువ్వే యివ్వాలి అంది మా అమ్మ. అయితే - కాణీకి ఎనిమిదాకులు యివ్వాలి కుట్టుకూలే మీకు - అన్నాడు వాడు.

సందెడేసి ఆకులూ చీపురూ పట్టుకుని సంతోషంగా యింటికొచ్చాం. నెలకో అయిదు రూపాయలు వస్తాయి అంది మా అమ్మమ్మ లెక్కలు వేస్తూ - రాత్రి పన్నెండు దాకా యిద్దరమూ ఆకులు కుట్టాము.

కొన్ని రోజులు పోయాక కొట్టువాడు బేరం మార్చాడు. మీకు నిండా లాభంగా వుంది. కాణీకి పదాకులు యివ్వండి అన్నాడు. మా అమ్మ యివ్వలేను నాయనా అంది. అయితే యింకోళ్లకిస్తాను. నిండా మంది వున్నారు - అన్నాడు వాడు - ఇచ్చుకో అంది మా అమ్మ. నిండా కష్టపడతావు అన్నాడు. పరవాలేదు అని వచ్చేశాం. మా అమ్మ భయపడలేదు. ఇదిగాపోతే ఇంకోటి అంది. నేనూ అదే నేర్చుకున్నాను. తరువాత జీవితంలో పత్రికలో పనిచేస్తూ వుద్యోగం వదిలేశాను. సినిమాలో ఇద్దరు గొప్ప డైరెక్టర్లతో తేడా వస్తే ఒక్కసారి ఆరు సినిమాలు వదిలేశాను. ఇంతలో మా యింటి



దగ్గరే స్టార్ టాకీసు పక్కనే మిలిట్రీవాళ్లు సిపాయిల కోసం బట్టలు కుట్టే మిల్లు పెట్టారు. గేట్లో చాలామంది వున్నారు. వెళ్లి చూశాం. అక్కడ పాంటులకీ, కోట్లకీ కాజాలు కుట్టి గుండీలు పెట్టాలి. కాజాకి అణా యిస్తారట.

మా అమ్మా నేనూ అక్కడి పెద్దాయనతో హిందీలో మాట్లాడాం. సందెడు బట్టలూ గుండీలూ దారాలూ సూదులూ యిచ్చారు. రాత్రి పన్నెండు దాకా కాజాలు కుట్టాం. మా అమ్మ వెళ్లి దుర్గాబాయిగారికి చెప్పింది.

రెండు పనులు తప్ప యింక దేనికీ భయపడక్కర్లేదు. సిగ్గు పడక్కర్లేదు అన్నారావిడ. మా అమ్మని భేష్ అని మెచ్చుకున్నారు. దేనికీ ఎవరికీ భయపడకు ఇలా స్వతంత్రం గానే బతకడం నేర్చుకో అన్నారు.

అన్నట్లు – కొత్తగా హాండ్‌మేడ్ పేపర్ సెక్షన్ పెట్టాం. చేతులతో కాగితం తయారుచేసే కుటీర పరిశ్రమ. వారం రోజుల్లో నేర్చుకోవచ్చు – తిండి ఒక్కటే కాదు – పిల్లల్ని చదివించాలి గదా – ఇంకో విద్య చేతిలో ఉంటే మంచిది – అని కూడా చెప్పారు. నేర్చుకుంది మా అమ్మ. అంతలో ఒక వేసం కాలం వచ్చింది. హిందీ నేర్చుకునే యిల్లాళ్లంతా ఊటీలకీ సొంత వూళ్లకీ పెళ్లిళ్లకీ వెళ్లిపోయారు. అప్పుడు ఈ విద్య అంది వచ్చింది.

ఏలూరులో వేంకట్రామా అండ్ కో యజమాని ఈదర వెంకట్రావు పంతులు గారు – కొన్ని పుస్తకాలు ఖద్దరు పుస్తకాల్లో (హాండ్ మేడ్ పేపర్ పై) వేస్తారని తెలిసింది. దుర్గాబాయి గారి సహాయంతో ఏలూరుకి పది మైళ్ల దూరంలో – చాటపర్రు గ్రామంలో మా అమ్మ హాండ్‌మేడ్ పేపర్ యిండస్ట్రీ పెట్టి యజమానురాలైపోయింది. ఏలూరులో ఇంటద్దే కూరా నారా ప్రియం అని చాటపర్రులో పెట్టింది. పల్లెటూళ్ళో అద్దెకి యిళ్లుండవంటారు గాని మాకు నాలుగ్గదుల యిల్లు – పాక దొరికింది. నెలకి రూపాయిన్నర అద్దె. అంటే ఆ యింటి వాళ్లు వాళ్ళబ్బాయికి పట్నంలో ఉజ్జోగం అయితే అక్కడికి వెళ్లి పోయారు. ఆ యింటికి మేము కాపలా వున్నట్టూ వుంటుంది. అద్దె కూడా వచ్చినట్టూ ఉంటుంది వాళ్లకి. అద్దె ఒకటే కాదు. దోసకాయలూ చవకే. అవొక్కటే చవగ్గానూ ఊరికేనూ దొరికేవి. అందుకని మా అమ్మమ్మ దోసకాయ కూరా – దోసకాయ పచ్చడీ – దోస వరుగులూ – దోసావకాయ – కాల్చిన దోసకాయ పచ్చడీ – దోసగింజల వడియాలూ ఇన్ని రకాలు చేసి పెట్టేది.

రోజూ దోసకాయేనా అని గునిస్తే – చక్రవర్తీ రోజు అన్నమే తింటున్నాం గదా అనేది మా అమ్మమ్మ. దానిక్కూడా రకం మార్చాలంటే గోధుమన్నం జొన్నన్నం చేస్తాను అంది. వద్దులే దోసకాయే బాగుంది అన్నాను.

(తమాషా - ఈ దోసకాయ మళ్లీ నా పెళ్లిలో విశ్వరూప దర్శనం యిచ్చింది.

ఆరుగొలనులో నండూరి వారి స్వగృహంలో జరిగింది. ఇంటి ఎదురుగా పెద్ద చెరువు - చెరువు గట్టున యాభై అరవై దోసకాయల బళ్లు బెజవాడ వెడుతూ మజిలీ చేసేవి. అందువల్ల పెళ్లిలో పైన చెప్పినట్టు దోసకాయతో వంద రకాలు వడ్డించారు.

రవణ గారు కట్నం తీసుకోవటం లేదని వెయ్యిన్నూట పదహార్లు దోసకాయలు చెల్లించారు - అని ఢూండీ గారూ వాళ్లూ జోకులు చేశారు.)



దోసకాయతో
వందరకాలు



చాటపత్రులో వ్యాపారం గిట్టుబాటు కాలేదు.

ఒక పెద్దరేకు టబ్బులో నానేసిన గుజ్జును కర్రతో ఝూడించి కొట్టడం - అది పలచని గంజిలా వచ్చేది. దానిని, జల్లెడతో పేపరు తెట్టులా తియ్యడం - పూత రేకుల్లా తీసి ఆరవెయ్యడం ఆరాక గాజు పేపరు వెయిట్లతో వాటిని రుద్ది రుద్ది గ్లేజు చెయ్యడం - దాన్ని మిషనులో వేసి అంచులు కట్ చేయడం బలే సరదాగా వుండేది. వింత చూడ్డానికి వచ్చేవాళ్లు కూడా ఓ చెయ్యి వేసేవారు. వారానికి మూడు రీములు తీస్తే ఆ కట్టలు కూడా మెడ్రాసులో విస్తళ్ల కట్టల్లా గానే నెత్తిన పెట్టుకుని నేనూ మా అమ్మా దొడ్డమ్మా ఏలూరు నడిచి వెళ్లి వెంకట్రామా ప్రెస్సులో ఇచ్చేవాళ్లం. మూడు మూళ్లు తొమ్మిది విచ్చు రూపాయలు ఇచ్చేవారు. వచ్చే వారం పద్దెనిమిది - ఆ తరువాత వంద, వెయ్యి వచ్చేస్తాయని లెక్కలు చెప్పుకుంటూ ఝూమ్మని తిరిగి వచ్చేవాళ్లం.

దార్లో తేళ్లూ మండ్రగబ్బలూ కుడుతూ వుండేవి. నాకు తేలు మంత్రం వచ్చును. ఒకసారి సూర్య గ్రహణం అప్పుడు మెడ్రాసు బీచి సముద్రంలో మా అమ్మమ్మ నేర్పింది. మంత్రం ఎన్నిసార్లు వేసినా ఆ నెప్పి తగ్గేది కాదు. నేను భూతాల వాడిలా ఒక మొక్క పీకి దాంతో వాళ్లని కొడుతూ - దిగిందా నెప్పి దిగిందా అంటూ మంత్రం మళ్లీ మళ్లీ చదివే వాడిని - తగ్గలేదంటే కోపం ఏడుపూ వచ్చేవి. అప్పుడు ఒరే నీది తేలుమంత్రం కదా - కుట్టింది మండ్రగబ్బేమోలే - పద

యింటికి వెళ్తే అమ్మమ్మ మందేస్తుంది - అంటూ నాలుగడుగుల దూరం నన్నెత్తుకుని నడిచేవారు - (తేలు నన్ను కుట్టకుండా).


మంత్రం ప్ప చేసేది కాదు

కొన్నాళ్లు జరిగాక పద్దెనిమిది రూపాయలు కూడా రావడం మానేశాయి. ఖద్దరు పుస్తకాలు బాగా అమ్మటం లేదుట. ఓ పక్క నేను - మెడ్రాస్ వాడిని యిక్కడుండనని గోల. మా తమ్ముడు మా బావ గారింట్లో మెడ్రాసులో వున్నాడు. స్కూళ్లు తెరిచే నెల. చెడి చెన్నపట్నం చేరమన్నారు. పదండి అక్కడికే పోదాం. అంది మా అమ్మమ్మ. మళ్లీ మెడ్రాసులో మహిళా సభకి

మహిళాసభలో పనిచేసే వాళ్లందరికీ సాయంత్రం అరిటి దొప్పలలో చక్రపొంగలి వుప్మా యిలాటివి టిఫిను పెట్టేవాళ్లు. అది మా అమ్మ నా చేతికిచ్చి కూచోబెట్టి తింటూ వుండు. యిపుడే వస్తాను అని పాతాలకి వెళ్లిపోయింది.

ఒకసారి ఒక బోయీ వచ్చి (అక్కడ పనివాడిని బోయీ బోయీ అని పిల్చేవారు) నా చేతిలో పొట్లాం లాక్కున్నాడు. నువ్వు నంబరువా నీకెవరిచ్చారని - అంతలో మా అమ్మ వచ్చి అది నాదే బాబూ - వాడు మా అబ్బాయి అంది. కొంచెం దగ్గర్లో కూర్చున్న కృష్ణవేణమ్మగారు (దుర్గాబాయి గారి తల్లి) ఇది చూసి వాడిని కేకలు పెట్టింది. ఇంకోటి కూడా పట్రా - రేపట్నించి ఆ అబ్బాయికూ్కడా యివ్వాలి అంది.



మత్స్యావతారానికి
రూపాయిచ్చారు

మహిళా సభ వాళ్లు వీపీ హాల్లో దశావతారాలు డ్రామా వేసినపుడు నా చేత మత్స్యావతారం వేషం కట్టించారు. ట్రాములో తీసుకెళ్లి టిఫిను పెట్టి మా అమ్మకి రూపాయిచ్చారు.

**మా** ఇంటి దగ్గరే స్టార్ టాకీసు వుండేది. ఇపుడూ వుంది.

అమ్మా సినిమా కెళ్దాం అంటే కాజాలు కుట్టడం ఆపి తీసుకెళ్ళేది. గేటు దగ్గర నుంచుంటే సినిమాలో పాటలు, మాటలు ఏడుపులూ అన్నీ వినిపించేవి. రతన్, దహేజ్ లాంటి సినిమాలన్నీ ఇలాగే వినేవాళ్ళం. ఎప్పుడేనా నేను కొంచెం గేటుదాటి తొంగి చూస్తే కొంచెం సినిమా బొమ్మ కనపడేది. గేటువాడికి మేము అలవాటయిపోయి - ఓసారి ఇంటర్వెల్ తర్వాత లోపలికి వదిలి తలుపు యివతల నుంచి చూడనిచ్చాడు. నాకప్పటికే రాజమండ్రిలో చూసిన అబుతేరసివా కోను మెరాకిష్ణ కనయ్యా - సునోసునో బనుకేరాణీ పాటలు వచ్చును. గేటువాడు సెబాస్ అనేవాడు.

యుద్ధం అయిపోగానే మాకు మిలిట్రీ కాజాల ఉద్యోగం పోయింది. అప్పుడు మా అమ్మమ్మ భయపడింది. కాని మా అమ్మ భయం లేదని చెప్పింది. రాయపేట కేసరి కుటీరంలో గృహలక్ష్మి ప్రెస్సు వుంది. అందులో మా అమ్మకి కంపోజిటర్ ఉద్యోగం ఇచ్చారు. దగ్గర్లోనే కేసరి గారు స్కూలు కూడా పెట్టారు. నన్నక్కడే చేర్పింది. ఇద్దరం పొద్దున్నే ప్రెస్సుకి వెళ్ళేవాళ్ళం. పొద్దున్న ఏడునుంచి సాయంత్రం ఏడుదాకా నిలబడి కంపోజింగు చేసేది మా అమ్మ. నేను తొమ్మిది గంటలకు స్కూలుకి వెడితే నాకు రెండు యిడ్డెనులు కొనిపెట్టి మిగిలిన పచ్చడి తను తినేది. సాయంత్రం నాలుగున్నరకి వెళితే ప్రెస్సువాళ్ళు ఏదేనా పెట్టేవాళ్ళు. మేమిద్దరం తినేవాళ్ళం. ఏడు అయ్యాక కబుర్లు చెప్పుకుంటూ నడుచుకుంటూ ట్రిప్లికేను వెళ్ళేవాళ్ళం. ట్రాము డబ్బులు పెట్టి మషాళా దోసె కొనుక్కుని పొట్లాం మా అమ్మ చేతిలో పెట్టుకుని తింటూ ఇట్టే వెళ్ళిపోయేవాళ్ళం. దోసెలో బంగాళాదుంప కూరకోసం మా వేళ్ళు పోట్లాడుకునేవి - నువ్వంటే నువ్వని - ఒరే పూర్వజన్మలో మనం క్లాసుమేట్సులుగా పుట్టి వుంటామురా అంది మా అమ్మ ఓసారి. దారిలో జాంబజారులో బంగాళ దుంపలు, ఉల్లిపాయలు కొనుక్కుని వెళ్ళేవాళ్లం. చితికిన ఉల్లిపాయలు చూట్టానికి



అసయ్యంగా వుంటాయిగాని రుబ్బి వడియాలు పెడితే ఎండకి పురుగులన్నీ ఛస్తాయి. వడియాలు బాగుండేవి - తీరా ఇంటికి వెళ్తే మా అమ్మమ్మ బంగాళ దుంపలు రేపు - పొద్దుటి తోటకూర. - అలాగే వుండిపోయిందనేది. ఇవాళే బంగాళ దుంపలు రేపే తోటకూర అన్నా వినేది కాదు. అప్పటికి నేను ఫోర్తు ఫాం. ఇంగ్లీషులో అరిచినా వినేది కాదు.

అప్పుడు నేను ప్రైవేట్లు కూడా చెప్తున్నాను. పొద్దున్నే ఏడునుంచి తొమ్మిది దాకా రెండిళ్ళు - సాయంత్రం ఆరు నుంచి ఎనిమిది దాకా రెండిళ్ళు - నెలకి మా అమ్మకి అయిదు రూపాయిలూ నాకు రెండేసీ.

చూస్తుండగా గొప్పవాళ్ళం అయిపోతున్నాం. కాని మా అమ్మకి రోజంతా ప్రెస్సులో నిలబడి - తర్వాత నడిచి కాళ్ళు నెప్పెట్టేవి. నేను అమ్మమ్మకి నడుముతొక్కి అమ్మకి కాళ్ళు పట్టేవాడిని.

చక్రవర్తీ నీకేం ఖర్మ పట్టిందిరా అని మా అమ్మమ్మ ఏడిచేది. ధవళేశ్వరంలో చిన్నప్పుడు నన్ను బుడుగూ అనీ చక్రవర్తీ అని పిలిచేవారు. నాకప్పుడు ఇద్దరు సేవకులుండేవారుట కూడాను.

అందుకని నేను పడుకోగానే వాళ్ళు నా అరికాళ్ళకు కొబ్బరినూనె రాసి తోమేవాళ్ళు. బలేగా 'మొగలాయీ'గా వుండేది.

ఇలా వుండగా నిడమర్తి వారింట్లో ఒక తరుదు ఫారం అమ్మాయికి రుక్మిణీ కళ్యాణం ప్రైవేటు చెప్పమన్నారు. ఆ నిడమర్తి వారింట్లో బామ్మగారు - నన్ను నించోబెట్టి రెండు పద్యాలిచ్చి అర్థాలు చెప్పమంది. చెప్పాక 'పాసయ్యావురా - రేపణ్ణించి రా' అంది. 'ఇలా నిక్కర్లేసుకు రాకూడదు. ఇది ఆడపిల్లా - అంచేత పొడుగులాగేసుకు రావాలీ' అంది. జీతం అయిదు రూపాయిలంది.

ఆ రాత్రి మా అమ్మమ్మా అమ్మా నాకు పొడుగు లాగూ కుట్టేశారు. ఎమ్మెన్ 55 అనే సైను గుడ్డకొన్నారు. నన్ను నేలమీద వెల్లకిలా పడుకోబెట్టారు. బొగ్గుతో నా నడుం నించి కాళ్ళదాకా కాళ్ళ నించి మళ్ళీ నడుం దాకా గీతలు గీశారు. దాని ప్రకారం గుడ్డమీద గీసి కత్తిరించారు. చెరో వేపునీ కూచుని రాత్రి పన్నెండు గంటలకల్లా కుట్టేసి బొందు కట్టారు. ఇంక మనం కాజాలు మానేసి లాగూల షాపు పెట్టేద్దాం అన్నారు. కాని లాగూ సరిగ్గా రాలేదు, అందరి లాగూల్లా కాకుండా కాళ్ళ మధ్య ఆర్చిలా వచ్చింది.



తొడుక్కుని నడిస్తే పడబోయాను. వాళ్ళకే నవ్వొచ్చింది. రేపొక్కరోజూ ఇలా వెళ్ళు. సాయంత్రానికి మిషను వాడికిచ్చి కుట్టిస్తాను అని చెప్పింది మా అమ్మ.

అప్పుడు సిగరెట్టు కాల్చాను ఒక ఫ్రెండు చెప్పితే - ఓసారి కొన్నప్పుడు కొట్టువాడు తిట్టాడు. మా నాన్నకి అని చెప్పాను. ఓసారి రోడ్డుపక్కన నుంచుని కాలుస్తుంటే చూసి ఒకాయన నోట్లో సిగరెట్టు పీకి విసిరేసి వెళ్ళిపోయాడు. అప్పణ్ణించి గంటకి అణన్నర చొప్పున సైకిలు అద్దెకు తీసుకుని అందుమీద తిరిగేవాణ్ణి - సిగరెట్టు కాలుస్తూ.



నా కీర్తి ట్రిప్లికేను నుంచి రాయపేట మైలాపూరు అడయారు దాకా వ్యాపించింది. అంటే సిగరెట్లది కాదు, ప్రైవేట్లది. టంగుటూరి, నిడమర్తి, గోవిందరాజుల, కాశీనాథుని వంటి పెద్దపెద్ద ఇళ్ళలో ప్రైవేట్లు చెప్పాను. ఇంకా బెస్టేమిటంటే మా తెలుగు మాస్టారు జనార్దనశర్మ గారు నన్ను వాళ్ళింటికి రమ్మని వాళ్ళమ్మాయికి ప్రైవేటు చెప్పించారు. క్లాసులో కూడా ఒరే కుర్రమాస్టారూ అని పిలిచేవారు. నాకు సిగ్గు వేసేది. ఆయన కూడా - వద్దని చెప్పినా వినకుండా రెండ్రూపాయలు జీతం మా అమ్మ చేతికిచ్చేవారు. మా అమ్మ కూడా వద్దంటే మనందరం టీచర్లమేనమ్మా ఫరవాలేదు అని చెప్పేవారు.

అమ్మ గురించి మొదలుపెట్టి నా హరికథలో పడిపోతున్నాను. నేను మా వూళ్లో పుట్టినప్పుడు నాకు ఒక్కమ్మేగాని మెడ్రాసులో పెరిగినప్పుడు తొమ్మండగురు అమ్మలు దొరికారు. కొన్ని రోజుల నుంచి కొన్ని నెలలూ ఏళ్ళు కూడా నన్ను తమ బిడ్డలా సాకారు. ఒక ఇల్లాలు వాళ్ళాయనతో షికార్లు తిరగాల్సిన కొత్తకాపురం వయసులో ఏడెనిమిదేళ్ళ వాణ్ణి నన్ను ఏడాది పిల్లాడిలా ముద్దు చేసి పెంచి సంతోషించింది. ఇంకో ఇల్లాలు తన కొడుక్కీ నాకూ ఒకే తానులో చొక్కా గుడ్డలు చింపించేది. కొట్టువాడు నన్ను చూసి ఇంకా చవకరకం వున్నాయమ్మా అని చెప్పినా నవ్వేసి అదే తానులో చింపమనేది. ఇంకొక అమ్మ వాళ్ళబ్బాయి కన్నా నాకే ఎక్కువ



పెరుగూ మీగడా వేసేది. వాడు గొడవ చేస్తే పాపం వాళ్ళమ్మ వూరెళ్ళింది కదా - వాడు బెంగ పెట్టుకోకుండా నవ్వించాలి అనేది. ఇంకో తల్లి గారు - నాకు స్కూల్లో ప్రైజుగా వచ్చిన చిన్న కంచుగ్లాసు వాళ్ళ వంటింట్లో పెట్టేసి రవణా యిది నీ గ్లాసు - ఇందులో కాఫీ నీదే నీకే సిగ్గుపడకు అనేది. మరొక సీతమ్మతల్లి కొడుకుని పిలిచి - ఒరే సుబ్బారావూ వాడు ఎంత కొంచెం పెట్టినా చాలు చాలు - అంటాడు. అందుకని నేను వడ్డించను. వాడికి చాలేదాకా మీరిద్దరే పెట్టుకుని తినండి అని తలుపేసి సావిట్లో కూచునేది. ఒరేయ్ మడివూరగాయ కుండలు మాత్రం ముట్టుకోకండి అని మధ్యమధ్యలో కేకలు వేస్తుండేది. ఆవిడకి నేనిప్పటికీ రెండు రూపాయలు బాకీ. అలాగే నాకు అణా బేడా పావలా ముప్పావలా ముందుగా అప్పులిచ్చీ రావని తెలిసీ డబ్బులిచ్చి సాధించి దబాయించి కథలు రాయించి వాటికి తన బొమ్మలు వేసి పెట్టిన బాపు, నన్ను పెద్ద యూనివర్సిటీ లైబ్రరీలోకి తీసుకెళ్ళి గొప్పగొప్పవాళ్ళ పుస్తకాలు చదివించి తన గదిలో చాప, పాత న్యూస్‌పేపర్లు, సబ్బు బిళ్ళా పంచి దువ్వెన కొనిపెట్టి నన్ను పెంచిన మహాకవి అజంతా, స్కూలు ఫైనలు వాడికి పత్రికలలో సబెడిటరు ఇవ్వరంటే నా కథలు వినిపించి అయ్యవారిని (శ్రీ శంభుప్రసాద్) ఒప్పించి ఆంధ్రపత్రికలో ఉద్యోగం ఇప్పించిన కామాక్షమ్మ గారూ, నేను పని చెయ్యకుండా పడుకుంటే నన్ను బుజ్జగించి హెచ్చరించి సాధించి రాయించిన సూర్యకాంతమ్మగారు (బాపు అమ్మగారు) ఇందరు తల్లులు నన్ను రక్షించి ప్రేమించి పెంచారు.

ఒకసారి ఎవరోవచ్చి రవణకు పెళ్ళి సంబంధం వచ్చిందన్నారు. మా రవణకేనా అన్నారావిడ ఆశగా. ఈ రవణకెవరిస్తారు. చుట్టాల రవణకి. వాళ్ళు గొప్పవాళ్ళు- అన్నారు వాళ్ళు. సూరమ్మగారికి చాలా కోపం వచ్చింది. మా రవణకేం తక్కువా - ఇవాళ ఇలా కనిపించినా రేపెంతటి వాడవుతాడో నాకు తెలుసు. మీరే ఆనక నాలిక్కరుచుకుంటారు అని కోప్పడ్డారు - తరువాత బావుకి చెప్పారు.




అప్పుడు మా అమ్మ కాశీయాత్రకి వెళ్ళింది. బాపు నండూరి రామ్మోహనరావు గారితో ఇంగ్లీషులో మాట్లాడేశాడు. వాళ్ళ చెల్లెలు శ్రీదేవితో నాకు పెళ్ళి నిశ్చయించారు. పిల్లని బాపు చూసి బాగుందని చెప్పాడు. నేను పాదాలు చూసి బాగున్నాయని అనుకున్నాను. చిన్నప్పుడు మేమిద్దరం ఏ అమ్మాయైనా ఎదురొస్తే

ముందు పాదాలు చూసి బాగుంటేనే తల పైకెత్తే




నా పెళ్ళికి చుట్టాలెవర్నీ పిలవలేదు. అందరూ స్నేహితులే. చాలామంది రచయితలు - శ్రీశ్రీ, ఆరుద్ర, కొడవటిగంటి, దాశరథి, రావికొండల రావు, వి.ఏ.కే. రంగారావు, నిర్మాత డూండీ, నవోదయ రామ్మోహనరావు గారు, జ్యోతి రాఘవయ్యగారు ఇలా అందరూ స్నేహితులే.

నా పెళ్ళిపెద్ద బాపు అమ్మగారు సూరమ్మగారే. తనకి చెప్పకుండా పెళ్ళి చేసుకుంటున్నందుకు మా అమ్మ కోప్పడలేదు కాని నాకు అయిష్టులూ, తనకిష్టులూ అయిన ఒక్క చుట్టాలింటికి మాత్రం బలవంతాన తీసుకెళ్ళి క్షమాపణలు చెప్పించి కాళ్ళకు దండం పెట్టించింది.

1964 నాటికి రక్తసంబంధం, మూగమనసులు, గుడిగంటలు లాంటి చిత్రాలకు పనిచేసి సినిమా రైటరు బాటలో నడుస్తున్నా నా పెళ్ళి ఖర్చులు మాత్రం రెండువేలే. కాని ఆతర్వాత కథకి మాత్రం అయిదారు వందలు బడ్జెట్ వేశారు. పెళ్ళి తర్వాత మేమందరం బెజవాడ నుంచి విశాఖపట్నం వెళ్ళాలి. అప్పటికింకా రైల్లో ఫస్టు, సెకెండ్, ఇంటర్, తరుదు క్లాసులుండేవి. 14 టిక్కెట్లు సెకెండ్ క్లాసులోనూ, రెండు మాత్రం ఫస్ట్ క్లాస్ కూపేలోనూ ఏర్పాటు చేశారు నవోదయ రామ్మోహనరావుగారు. రైలు ప్లాట్ ఫారం మీదికి వస్తుండగా నా గుండెలు దడదడలాడాయి. ఈ సెపరేషన్ కేసు మా అమ్మకి చెప్పడం ఎలాగని. రైలాగ్గానే అటూ ఇటూ పరుగులు నటించి ముందు 14 మందిని సెకెండ్ క్లాసులో ఎక్కించేశాము. అయ్యో పెళ్ళికూతురేదిరా అంది మా అమ్మ కంగారుగా.

అదే - ఇంకో పెట్లో ఎక్కింది,, ఒక్క దాంట్లో అందరికీ దొరకలేదు. నేనూ ఆ అమ్మాయి, ఇంకో దాంట్లో వస్తాంలే అన్నాను.

గంభీరంగా తలపంకించింది మా అమ్మ. ఇందాకటి నుంచీ గమనిస్తూనే వున్నాను నీ గాభరా నీ పరుగులూ అప్పుడే దూరం చేస్తున్నావురా మమ్మల్ని. పోనీ ఆ పెళ్ళికూతురు చెల్లెల్ని అయినా ఎక్కించుకో మీ పెట్లో. పాపం చిన్నపిల్ల బిక్కమొహం పెట్టుకుని చూస్తోంది - అంది.

ఆ అమ్మాయికిక్కడే బెటరండి. వాళ్ల వాళ్లు నలుగురున్నారు - అన్నాడు ఒక మిత్రుడు.

గార్డు ఈలవేశాడు. నేను పరుగెత్తుకెళ్ళి పోయాను కూపే వైపు.

❀ ❀ ❀ ❀

మద్రాసులో బాపుగారి ఇంటి వరసలోనే ఒక చిన్న వాటాలో కాపరం పెట్టాము. ఒకటే చిన్న గది. ఒక చిన్న నడవ. చిన్న వంటిల్లూను. మా అమ్మ గది గడప మీద తలపెట్టుకుని పడుకుంది. గదిలో గోడలనిండా నల్లులు. వెంటనే ఉపాయం తోచింది. అమ్మా ఇటేపు నల్లులున్నాయి. తల అటేపు పెట్టుకో – తూర్పు అని చెప్పాను. ఆ తర్వాత మూడొందలు పెట్టి డాబామీద చిన్నపాక వేయించాడు బాపు.

రాత్రి భోజనాలయ్యాయి. – అబ్బ ఈ గది నిండా నల్లులు. పైకిపోదాం అంటూ దిండూ దుప్పటీ తీసుకుని డాబామీద పాకలోకి చేరాం.

కాసేపు తర్వాత చూస్తే మా అమ్మ చాపాదిండూ తెచ్చుకుని డాబా మీద పడుకుని వుంది.

అబ్బబ్బ ఈ డాబా అంతా దుమ్ముగా వుంది అని జనాంతికంగా ప్రకటించి తిరిగి గదిలోకి చేరాం. ఇలా నాలుగైదు రోజులు జరిగింది. మా అమ్మ చాలా గంభీరంగా వుంది. మాటల్లేవు. హిందీ పుస్తకాలు చదివేస్తోంది. ఒక పూట కోడలు స్నానానికి వెళ్లగా చూసి భోరుమంది. ఏమిటమ్మా ఏమయింది అని అడిగాను.

నేన్నీకేం అపకారం చేశానురా – నాతో మాటాడవు. తలుపేసుకుంటావు. నేను కిందుంటే డాబా మీదికి వెళ్లిపోతారు. పైకొస్తే కిందికి దిగొచ్చేస్తున్నారు. ఎందుకు నన్నింతదూరం చేస్తున్నావు. నాకు తెలీకడుగుతున్నాను ఎందుకు? అంది.

❀ ❀ ❀ ❀




కొద్ది కాలంలోనే కొడుకుకన్న కోడలు మంచి ఫ్రెండయి పోయింది. “ఒరేయ్ ఆ పిల్ల ఏం అడిగినా కాదనకు. కోడలు కాలు పెట్టాకే మన బతుకులు బాగుపడ్డాయి. రెండు పూటలా అన్నం తింటున్నాం – పెడుతున్నాం” అంది.

నాకున్నంతలో అవిడకి ఒక గది కేటాయించాను. ఆవిడ ఖర్చులకని నెలనెలా వంద రూపాయిలిచ్చేవాడిని. ఒరేయ్ ధరలు పెరిగాయి. జీతం భత్యం పెంచు అందోసారి. అదేం మాటలమ్మా అని నవ్వేసి రెండు వందలు ఇచ్చేవాడిని.

ఒరేయ్ పండగొస్తోంది బోనసు ఇవ్వు అనేది. ఆవిడ చెంగుముడి నుంచి తీసుకున్న అర్ధణాని దాటడానికి వందలూ వేలూ చాలవు. అలాగే యిస్తున్నా. ఒకసారి అడిగాను - నీకు నాలాగా సాదరు ఖర్చులు లేవుగదా. ఇంత డబ్బు ఏం చేస్తున్నావు - మనవల కోసం దాస్తున్నావా అన్నాను నవ్వుతూ. నీకోసం మీనాన్నే దాచలేదు. నేనెందుకు దాచాలి. అయినా ఒకరికేమన్నా ఇచ్చాక ఏంచేశారని అడక్కూడదురా అంది.

నేను మళ్ళీ ఎప్పుడూ అడగలేదు.

ఆవిడ కాలధర్మం చెందినప్పుడు అంతిమ కర్మలకు పదిహేను వందల మంది వచ్చారు. నాకు తల తిరిగిపోయింది. ఈవిడకి ఇంతమంది స్నేహితులు వున్నారా అని ఆశ్చర్యపోయాను - తర్వాత తెలిసింది. తన కష్టాలు తీరి కొడుకు సంపాదనకి రాగానే ఆవిడ పూర్వం ధవళేశ్వరంలాగే - ఇతరుల గురించి ఇన్నేళ్లూ కష్టపడింది. ఆంధ్రమహిళాసభ, స్త్రీ సేవా సదన్, చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలు వంటి సంస్థలకు వెళ్ళి తనలా మద్రాసుకు వస్తున్న తల్లులకూ బిడ్డలకూ సాయం చేసింది.

స్కూళ్లలో హాస్టళ్లలో సీట్లూ ఉద్యోగాలూ, ట్రెయినింగులూ ఇప్పించింది. జీతాలు కట్టింది. అనాథలు సనాథలై స్వయంకృషితో వృద్ధికొచ్చి గౌరవంగా సుఖంగా బతకడానికి దార్లు చూపింది. దార్లు వేసింది. పని జరగని చోట తిట్టి సాధించింది. తిట్లు తిని భరించింది. నా దగ్గర ముక్కుపిండి తీసుకున్న ప్రతి వందరూపాయలకూ నూటొక్క రూపాయలు అలాటివాళ్లు ఎందరికోసమో ఖర్చు పెట్టింది. వాళ్ళందరికీ ఆవిడ ముళ్లపూడి వెంకటరమణ తల్లి అని తెలీదు. ఆవిడ పేరు కక్కిగారు. అంతే. ఎవరో ఎక్కడినుంచి వచ్చారో ఎవరికీ తెలీదు. నాపేరు కక్కిగారబ్బాయి.



ఒరే - నేను పోతే ఎవరూ ఏడవకూడదు. అంతా పెళ్లిలా జరగాలి అనేది. అలాగే జరిగింది. పెళ్లిపందిరిలాగా వేసిన పెద్ద పందిరిలో పెళ్లివిందులాగే జరిగింది. ఆ పందిట్లో అందరూ నన్ను తమ్ముడూ అని పిలిచేవారే. కక్కిగారు చాలా గొప్ప మనిషి. పెద్దమనసు అని చెప్పారు. వున్నవాళ్ళు ఇవ్వడం సహజం. ఇలా లేనావిడ ఇవ్వడం, ఇప్పించడం, తెచ్చివ్వడం ఇదీ అన్నారు.

ఇచ్చుటలో వున్న హాయి వేరెచ్చటనూ లేనేలేదన్న ఆరుద్రగారి పాట నాకు ఆరోజున సరిగా అర్థమయింది. ఇవ్వడం అంటే దానాలూ, డబ్బులూ, బిస్కట్లూ, దుప్పట్లూ కాదు - స్నేహం, ఆదరణ, మనసు.

మా అమ్మ నాకు జన్మరీత్యా అమ్మ. జీవితం రీత్యా ఫ్రెండు. గురువు. భయం లేకుండా బతకడం నేర్పిన గురువు. తెచ్చుటలో కన్న ఇచ్చుటలో వున్న హాయిని రుచిచూపిన దైవం.

(1999)

# శ్రీ ఫ్రెండూరీ

**చి**న్నప్పుడు - అంటే మేము ఆంధ్రసచిత్ర వారపత్రికలో సహచరులుగా వున్నప్పుడు - ఆయన అమిత మితభాషిగా వుండేవారు. ఆయనా ఆ సరస్వతీదేవీ తలుపులు మూసుక్కూచునేవారు.

వారు బయటకు రారు. మమ్మల్ని లోనికి రానీరు.

మీరు నాకన్న కుంచెం చిన్నవాళ్లుగదా! మీతో ఎలా స్నేహం కట్టడం కాని నాకూ ఫ్రెండ్సు లేరనుకోండి - అనేవారు.

అపుడు బాపూ రమణలు పెద్ద పెద్ద మీసాలూ నెరసినగడ్డాలూ పెట్టేసుకుని, లావుపాటి ప్రబంధపుస్తకాలూ, గ్రాంఫోను రికార్డులూ పట్టుకు లోపలికి జొరబడిపోయాం. తరవాత మీసాలూ వేషాలూ తీసేసినా ఫ్రెండ్సయిపోయాం. ఆయన దగ్గర ఎన్నో నేర్చుకున్నాం.

చీకట్లో సైగల్ పాటలు పాడించుకున్నాం. లైట్లార్పేసి ఆంధ్రపత్రిక దినపత్రికని పొడూగ్గా గొట్టాంలా చుట్టి అందులోంచి సైగల్‌లా పాడేవారు. ఒకసారి పాట సరిగ్గా రాలేదు. ఏవిటి చెప్మా అని లైటేసి చూస్తే - అది ఆంధ్ర'ప్రభ' దినపత్రిక. మేము నవ్వేసి బోల్డు సిగ్గుపడిపోయాం వినయంగా.

అందుకే మిమ్మల్ని ఫ్రెండ్సుగా తీసుకోడానికి భయం - అన్నారు. ఆయనలో (కారల్) మార్క్సు.

ధైర్యం చెయ్యక తప్పదు. అదే మీకు బెటరు - అన్నాడు. మాలో (గ్రూచో) మార్క్సు. ఫక్కున నవ్వేశారు.

అప్పణ్ణించి ఇంకా ఫ్రెండ్సులయిపోయాం.

అప్పుడే ఆయనకి నండూరి ఇంటిపేరుని 'ఫ్రెండూ'రి గా మార్చేశాం.

ఇంకా ఆ రోజులు రావుగదా అని మణుగు బరువున నిట్టూర్చం. మేమందరం ఆ వూళ్లోనే హాయిగా జోకులేసుకుని నవ్వుకుంటున్నాం. ఎందుకంటే ఆ రోజులు పారిపోలేదు. మా జేబుల్లో - ఉత్తరాల్లో చిత్తరాల్లో పదిలంగా యమా తోడుగా వున్నాయి.

సాధారణంగా కళాకారులు ఏదో ఒక విద్యలో ఘనత సాధించి ఒక జెండా ఎగరేస్తారు.

మూడు జండాలు సగర్వంగా ఎగరేసి రొమ్ము విరుచుకు నిలబడ్డ అపురూప రామ మోహనరావు నండూరి వారు.

అవి - సాహిత్యం జర్నలిజం, వేదాంతం.

పిల్లలకోసం టామ్‌సాయర్, హక్‌ఫిన్ - ఇవన్నీ అనువదించలేదు. తెలుగులో చెప్పారు. రామమనోహరంగా చెప్పారు.

'మంచు కురుస్తోంది - చలి కరుస్తోంది' వంటి వాక్యాలు అనువాద వాక్యాలు కావు. అనితరసాధ్యమైన ప్రయోగాలు.

న్యూటన్ Third law - "Every action produces equal reaction' కి - 'ప్రతి క్రియకూ ప్రతిక్రియ' అని చెప్పగల్గిన శిల్పి పలుకుమీద ఆయన పలుకుబడి

జర్నలిజంలో కాశీనాధుని నాగేశ్వరరావు, ముట్నూరి, నార్ల, శివలెంక శంభుప్రసాద్ వంటి పెద్దలను తల్చుకుని, వారి ఆదర్శాలను గౌరవిస్తూ తనదైన మార్గంలో నడుస్తూ - ఆంధ్రజ్యోతి సంపాదకుడిగా, పత్రికా సంపాదకత్వానికి ఒక డిగ్నిటీ - ఒక బాలన్సు - (ఈ మాటలకు నాకు తెలుగు తట్టడం లేదు - రామమోహనరావుగారే అనువదించాలి) తీసుకువచ్చారు.

వచ్చిన కీర్తి చాలని, నడుంవాల్చి నిద్రపోకుండా - ఆయన మరో మహాప్రపంచంలో అద్భుతమైన పరిశీలన చేసి - 'నరావతారం', 'విశ్వరూపం', 'విశ్వదర్శనం' రాశారు. ఇనుప గుగ్గిళ్లు అని మనం భయపడే సరుకుని సాతాళించిన శనగలుగా పరిమార్చి రుచి చేర్చి మామూలు వాళ్లందరికీ ఎన్నో గొప్ప సంగతులను విందుగా అందించిన మేధావి -

నిత్యకృషీవలుడు.

14-12-97

# వ్యాస రమణీయం (విషయాలు)

## పాల (కృష్ణ) నవనీత గీత

### కుండ, పెరుగు, కవ్వం, కష్టం

# అన్నీ మీవి వెన్న నాది



వాన కురిసింది. నేల తడిసింది. గడ్డి మొలిచింది. ఆవు మేసింది. పాలు చేసింది. అమ్మ

నా వా నేంజేశావు–నా గడ్డెవరు తిన్నారు – నా పాలెవరు తాగారు అని మబ్బూ, నేలా, ఆవూ ఎవరూ అడగరు. పట్టించుకోరు. వాళ్ల పని వాళ్లు చేసుకుపోతారు. ఫలితం జోలికి వెళ్లరు.

కాని మన అమ్మా, నాన్నా వాళ్లూ మాత్రం పాలు తీస్తారు. కాస్తారు. తోడేస్తారు. కవ్వం ఆడిస్తారు. వెన్నతీస్తారు. అన్నీ ఉట్టిమీద దాస్తారు. వాళ్ల పనులు వాళ్లు చేశాక అవన్నీ మన కోటలెయ్యాలి గదా! కాని వాళ్లివ్వరు. మనం తీసుకుంటే అరుస్తారు. బెదిరిస్తారు. కట్టేస్తారు. లేపోతే ఇలా అందర్నీ ఓ గదిలో పడేసి గొళ్లెమేస్తారు.

నేను పెద్దాడినయ్యాక వీళ్లకోసం కర్మణ్యేవాధికారస్తే లాటి సంస్కృతం పద్యాలు, భగవద్గీతలూ రాసేస్తాను. సంస్కృతం నాకు ఇంకా బాగా రాదనుకో.

అసలు తెలుగు రాదుట.

ఆ పద్యాని కర్థ మేమిటా?

మబ్బూ వానా, ఆవూ దూడలా ఎవరి పనులు వాళ్లు చెయ్యండి. ఫలితాలు మీకనవసరం.

కుండ, పెరుగు, కవ్వం, తాడు, కష్టం అన్నీ మీవి. వెన్న మాత్రం నాది. అది నా కొదిలెయ్యండి అని. అలా అంటే ఈ పెద్దాళ్లు నవ్వుతారు గాని – నమ్మరే! దూడ పాలు తాగితే వాళమ్మ కోప్పడిందా – ఇంకాసిని తాగమ్మా అంటుంది. అమ్మా వాళ్లలాక్కాదే. అదొద్దూ – ఇది చాలూ అంటారు. వీళ్లకసలు మాట నిలకడలేదు. అన్నం వద్దంటే ఇంకొక్క ముద్ద తినూ అంటారు. ఇంకాస్త వెన్న పెట్టూ అంటే

వద్దింక చాలూ అంటారు. వెన్న ఎక్కువ తింటే కడుపునొప్పి వస్తుంది అంటారు. వెన్న బాగుంటుంది కదా మరీ....

అసలు ఆ బాగుండే వెన్నా, మీగడా ఇవన్నీ చెడ్డవంటారు. కారప్పొడీ, అల్లం, వామూ, ఆవదం - ఇవన్నీ మంచి వంటారు. మన కిష్టమైనవన్నీ చెడ్డవీ, వాళ్ల కిష్టమైనవన్నీ మంచివీనుట. హు-పిచ్చాళ్లు.

బురద చూట్టానికి బాగోదు - కాని అందులో పద్మం పుట్టింది. బాగుందని దాన్ని కోస్తే అందులో తేనెటీగ కుడుతుంది. తేనెపట్టులో తేనె బాగుంటుందని తాగితే మర్నాడు కారంగా, చేదుగా ఉండే అల్లం రసం, ఆవదం తాగమంటారు. ఇలా మంచి వాటన్నిటికీ చెడ్డ ముళ్లుంటాయి మరి. ఉంటాయో.... వాళ్లంటారో.

మనం పడుకుంటే పొద్దెక్కింది లే అంటారు. రాత్రి ఆడుకుంటే పొద్దుపోయింది పడుకో అంటారు. వెన్న కావాలంటే అన్నం తినమంటారు. అన్నం పెట్టమంటే పాలు తాగమంటారు. వాళ్లకి ముద్దొస్తే ఎత్తుకుని గట్టిగా మన్ని ముద్దులు పెట్టేసుకుంటారు.మనం వాళ్లని ముద్దులు పెట్టుకుంటే ఛీ! పోకిరీ పిల్లాడా అంటారు. పైట లాగితే తప్పంటారు. పైటలు లాగటానికే కదా. వద్దంటే నాన్నలా అంగరఖా కండువా వేసుకోవాలి. కండువా లాగితే నాన్న కోప్పడరు గదా....

ఇంతకీ మనం కుండంత వెన్నకోసం ఆశపడితే కొండంత కష్టం వచ్చేసింది. మనందరినీ గదిలో పడేసి గొళ్లెం వేశారు.... ఎంత అన్యాయం.... మనం వెన్న తీసుకుంటే - అది చేసింది మనం కాదు గద..... మన బొజ్జ లోపలి దొంగాడు. వాడిని కొట్టకుండా మన్నితిడితే? పుట్టమీద కొడితే పాముకి దెబ్బ తగుల్తుందా? పిచ్చాళ్లు గాని. అందుకని ఇంక మన పొట్టలో దొంగబ్బాయిని మనమే కోప్పడదాం... ఇంక నీ మాట మేం వినమూ, మా కాళ్లు ఎగరవూ, మా చేతులు పాలకుండని లాగవూ. మానోళ్లు వెన్న తినవూ. నువ్వు ఏడిచినా అంతే - అని వాడికి చెప్పేద్దాం.... దీన్నే వైరాగ్యం అంటారుట. వైరాగ్యం అంటే మనం కావాలనుకున్న దాన్ని వద్దనుకోవడం అన్నమాట. అప్పుడు ఛీ పాడు వెన్న మాకొద్దు అనేసి జాంకాయలు కోసుకుంటాం గదా.... అదీ.

అలాగే అమ్మ కిటికీలోంచి చూస్తున్నప్పుడు ఎగరడం మానేసి ఛీ నాకేం వెన్నక్కర్లేదు హి - అంటాం.... అదీ వైరాగ్యం. ఒకోసారి చాలా వెన్నా మీగడా తినేశాక ఇంకో కుండ కనిపిస్తుంది. కాని కడుపు నిండుగా ఉంది. కడుపులో దొంగాడు కూడా వద్దులేరా అంటాడు. మనం సరేలేరా మనకెందుకీ పాడు వెన్న అనేసి పడుకుంటాం. అదీ వైరాగ్యమే....

అంచేత మనం ఎవ్వరం ఇంక వెన్నా, మీగడా ముట్టుకోకూ... అరే! అటు చూడూ కిటికీలోంచి యాదయ్య చూస్తున్నాడు. ఒరే యాదూ - అమ్మెక్కడరా? గుళ్లోకెళ్లిందా?! ఎర్రగా ఉన్న మీగడ. రండి దూకండి.... పదండి....

(ఆగస్టు 1993)

# పొగడ్త

**చ**దువులూ, సలహాలూ అంచూ వీడెవడో ఇక్కడ తిష్టెయ్యాలని చూస్తున్నాడుగాని ఈ శషభిషలేం కుదరవని చెప్తూ అంటూ కుండ బద్దలు కొట్టేస్తున్న ముసలాయన్ని చూసి వినయంగా నవ్వి.... తవరేనా నులక అగ్నిహోత్రావధాన్లుగారు. ఈ పట్టున జటలో తమంతవారు లేరని డిప్టీ కలెక్టరుగారు తరుచు సెలవిస్తూ వుండేవారండి.... అన్నాడు గిరీశం. అగ్నిహోత్రుడు అమాంతం చల్లారి అయిసైపోయినాడు. ఆ ఒక రస్సాతో గిరీశం కథని చాలాదూరం నడిపాడు.

పొగడ్త మహత్యం అంతటిది. అది అహంకన్న ఎత్తు. దురాశకన్న చిన్న. దుర్మార్గుడి ఆలోచనకన్న లోతు. మంచివాని మనసుకన్న విశాలం. అణువంత చిన్నది, బ్రహ్మాండం కన్న పెద్దది. కుటిల రాజనీతికన్న వక్రం. పొగడ్త విశ్వరూపాన్ని దర్శించడం బ్రహ్మతరం కాదు. వర్ణించడం వేయి నాలుకలున్న ఆదిశేషువు తరంకాదు. దేవతలు, దానవులు, మానవులు, శిశువులు, పశువులు, పక్షులు, అందరూ, అన్నీ దానికి దాసోహం అనక తప్పదు. భగవంతుడితో పనంతా స్తుతితోనే మొదలవుతుంది. తొందరగా పనికాకపోతే భక్త సులభుడివి అంటూ ఓ రస్సా వేస్తారు.

## ఇంద్రజాలం



అహంకార మమకారాలను ఆత్మవంచనలో రంగరించి ఉడకేసి ఆహా ఓహోలు పోపువేస్తే హుషారైన పొగడ్త తయారవుతుంది. అక్కడినుంచి ఆయా వ్యక్తుల రుచులనుబట్టి పరనింద, పరవంచన, ద్వేషం, హేళన, ఆనందం, ఆహ్లాదం, దిగులు, అసూయ, స్పర్థ వగైరాలను పాళ్ళ ప్రకారం కలిపితే మసాలా గుమాయిస్తుంది. చెప్పిన ముడి సరుకులనుబట్టి యిది విషమని అనుకోవద్దు. ఒకవేళ చెప్పినా అదే

అమృతమని మీరు పురిషెడు పుచ్చుకోకమానరు. ఎందుకంటే యిచ్చేవాడి హృదయాన్నిబట్టి పుచ్చుకునేవాడి బుద్ధినిబట్టి దీని రంగు, రుచి, ప్రభావం, ఫలితం మారుతాయి. ఇచ్చింది విషమైనా, పుచ్చుకోడం చేతనైతే ఔషధం అవుతుంది. కొందరికెంత మేలు చేస్తుందో మరికొందరికి అంత కీడూ చేస్తుంది. అది అగ్నిలాటిది, అణుశక్తిలాటిది. ఎలా వాడుకుంటామన్నది మన చేతిలో పని. పొగడ్తకి విధిగా కనీసం రెండు శాల్తీలు వుండాలి. పొగిడేది, పొగిడించుకునేది. చూసి ఆనందించడానికో లేదా కామేశ్వరరావుగారు అన్నట్లు.... నన్ను పొగడలేదనో ఆ వెధవని పొగిడేస్తున్నాడే అనో దుఃఖించడానికో మూడో శాల్తీ పక్కనుంటే మరింత రక్తికడుతుంది. ఎవరికి? వినేవాడిక్కాదు. నాలుగోవాడికి. పొగిడించుకునేవాడికి జనం వుంటే ఆనందమేకాని, లేకపోయినా దిగులువుండదు. గంటల తరబడి, రోజుల తరబడి ఇంకోడి నోట వినగలిగే మాటలు మన గురించిన పొగడ్తలే. ఎంత గొప్ప కథ, కావ్యం, పురాణం అంత రక్తికట్టవు. అదో ఇంద్రజాలం లాంటిది. ఎదటివాడు మన్ని పొగుడుతున్నాడని తెలిసికూడా, మనం అలా జారిపోయేది యీ పొగడ్తల అగడ్తలో మాత్రమే.

## ఉగ్గులాంతో అలవాటు

భగవంతు డంతటివాడికిది అలవాటు. కాగా, మనుషుల దేముంది? మనుషులేకాదు - కాకిబావ? తను గానకోకిలను కానని తెలిసినా నక్కబావ వచ్చి ఒక్కపాట పాడమనేసరికి కాకిబావ పొంగిపోయి సావాసాలు పట్టుకుని మాంసం ముక్క నక్కపాలు చేసుకుంది.

మనం పిల్లలకి యీ కథ చెప్పినపుడు ముఖస్తుతివల్ల మోసపోయి కాకిబావ నోటిదగ్గిర కూడు ఎలా పోగొట్టుకుందో తెలియజెప్పం. నక్కబావ ఒక్క మస్కాతో ఎలా కాకిని బోల్తాకొట్టించిందో చెప్తాం. ఆవదం పట్టేవేళ అమ్మనాన్న, నాయనమ్మ, అన్నయ్య, ఉంటేగింటే తాతయ్య, పక్కింటి పిన్నిగారు యావన్మందీ చేరి - బాబూ ఎంత బంగారు తంద్రమ్మా అంటూ బృందగానం చేస్తారు.... వీలైతే పక్కింటి పిల్లడో, తమ్ముడో ఎంత దుర్మార్గుడో కూడా చెప్తారు. ఆ తరువాత అన్నం తినడానికీ, ఎక్కాలు చదవడానికీ, ఆడడానికీ, పాడడానికీ, అల్లరి మానడానికీ అన్నిటికీ భయభక్తులను మించి పనిచేసే చిట్కా -- 'నీ అంతవాడు లేడురా' అన్న ఒక్కముక్కే. అలా ఎదిగి



వాడికి వయసొచ్చేసరికి, వాడు దాన్ని స్వయాన ప్రయోగించడంలో ఆరితేరుతాడు. అందువల్ల పిల్లలకిది విధిగా అలవాటు చెయ్యాలి. అబద్ధాలు చెప్పడం, ఎదుటివాడిని ఒడుపుగా పొగడ్డం ఈ రెండూ ఈనాటి జీవితానికి నిత్యావసర వస్తువులు. ఎంత మంచివాళ్ళకూ, గొప్పవాళ్ళకూ కూడా తప్పనిసరి విధులవుతున్నాయి. అందువల్ల పిల్లలు అబద్ధాలు చెబితే కోప్పడకండి. నేర్చుకోనివ్వండి - అని ఇటీవల ఒక అనుభవశాలి అన్నాడు.

## భట్రాజ యోగం

ఎందుకంటే ప్రశంస అన్నది ఒక పెద్ద శాస్త్రం. దానికో వ్యాకరణం, లయ, ఛందస్సు వున్నాయి. శాస్త్రం నేర్చాక ఎవడి మటుకువాడు లలితకళగా అందులో కృషి చెయ్యాలి. చాలా కష్టసాధ్యమైన కళ అది. పూర్వం రాజయోగం తరవాత భట్రాజయోగానికి విలువుండేది. రాజుగారిని నిత్యం పొగిడేవాడు కాబట్టి, వారి దగ్గిర మంత్రికన్న ఎక్కువ పలుకుబడి గలవాడుగా చెల్లేవాడు భట్రాజు. ఇప్పుడు - ప్రజలు రాజులై, రాజులు మంత్రులై, మంత్రులు మామూలు ప్రజలై, ప్రజలు ఎక్కువై, ప్రపంచం రద్దీ అయిన రోజుల్లో అందరికీ భట్రాజయోగం పట్టింది. ఎవరి అవసరం లేకుండా ఎవరూ బతకలేరన్న సత్యం రుజువై నోమాన్ ఈజ్ నైలెండ్ అన్నది మహాకావ్యమైంది. ఆఫ్రికా వాడికీ ఆలమూరువాడికీ పరస్పరం అవసరాలు ఏర్పడుతున్నాయి. అందువల్ల ఎదటివాడి గురించి ఓ మంచిమాట అనడం అందరికీ మామూలే.

## మాటలు, చేతలు

అయ్యా, మీ మీసాలు బాగున్నాయి. మీ చొక్కా అంతగొప్పది మీరే కొనగలరు. నాకో పదిరూపాయలు అప్పుకావాలి అంటే ఎదటివాడు దేవుడిలా పొంగిపోడు. అప్పివ్వడు సరిగదా పాతబాకీ వుంటే వసూలు చేస్తాడు.

పొగడ్త స్థూలంగా రెండు విధాలు. ఒకటి మాటల ద్వారా పొగడడం. రెండు - చేతల ద్వారా పొగడడం. అంటే వాళ్ళకిష్టమైన పనులు చెయ్యడం, వాళ్ళకి గిట్టనివాళ్ళని తిట్టడం, వాళ్ళలాగే బట్టలు వేసుకోవడం, వాళ్ళు అనే పదాలే అలవరచుకోవడం వగైరాలు.



మాటలద్వారా చేసే స్తుతి మళ్ళీ రెండు రకాలు. ఒకటి స్తుతి, రెండు నిందాస్తుతి - తిడుతూ మెచ్చుకోడం, మొదటిదాంట్లో గుంభన వుంటుంది. గొప్పగొప్ప కళాకారులు పొగడ్తగా చేసే ప్రసంగాలు వింటే ఇందులో ఒడుపులు

తెలుస్తాయి. "పిన్నిగారూ మీరు మంచివారు, కాస్త కాఫీపొడుం బదులిస్తారా?" అని బయటపడేబదులు, "పిన్నిగారూ, మీ నాగపూరు కప్పుతో నాగపూరు కప్పుడివ్వండి. కప్పుకూడా ఓసారివ్వండి. మావాడు దాంతోగాని కాఫీ తాగడు" అనో "మావారోసారి చూస్తానన్నా"రనో అంటే కాస్త కాఫీతాగించి మరీ పంపుతారు పిన్నిగారు.



"అదేవిటోనండీ, మీయింట్లో కాకరకాయ కూరేనా సరే యెంతిష్టంగా తింటానో... మా ఆవిడ దెప్పుతుంది కూడాను... నేనేం చెయ్యను చెప్పండి. నోటికేది హితవుగా వుంటే....." అనడం ఒక రకం శిల్పం.

నిందాస్తుతి ఇంతకన్నా శ్రేష్ఠం..... "ఏవండీ, తిడుతున్నానని మీరేమీ అనుకోకండి - మీరొట్టి ఫూల్స్. ఎందుకూ పనికిరారు. బొత్తిగా ఇంత మొహమాటం. ఇంత జీవ కారుణ్యం అయితే ఎలాగండి? అందుకే ఇలా వున్నారు. ఛీ! ఐ హేట్ యు...." ఈ ధోరణిలో ఎన్ని తిట్లుతిట్టినా రాణిస్తాయి. ఎంత తిడితే అంత ప్రేమ. ఆ తరవాత మీరు ఆయనింట్లో షేరుహోల్డరులాగా తిరగొచ్చు.

పరనిందాస్తుతి మరో రకం. "వాళ్ళ కొత్తిల్లు చూశానండి"".... కాస్త ఆగాలి.... 'హు' నిట్టూర్చాలి.... మీరు పొగడదలచుకున్న సుబ్బయ్యగారిల్లంతా ఓసారి కళ్లు విప్పారి చూడాలి... హుఁ నిట్టూర్పు. ఈపాటికి శ్రీమతి అండ్ శ్రీ సుబ్బయ్యగారు చెవులు రిక్కించుకుని కూర్చుంటారు నరసన్నగారింటి మీద మీ తీర్పుకోసం.... "హుఁ... టేస్టుండాలి సార్. ఏంలాభం. మీకన్న ఓ లక్ష ఎక్కువే ఖర్చయిందని చెప్పుకుంటున్నారు... ఏదీ అంతా వేస్టు.... సత్రమే" ఆనందంతో వెలిగే సుబ్బయ్యగారి మొహాన్ని వేరే లైట్లు లేకుండా కలర్ ఫోటో తియ్యొచ్చును. రెండోశాఖ - చేతలద్వారా, సూచనగా మెచ్చుకోవడం. యజమాని తొడిగే చొక్కాల్లాంటివే కుట్టించి ఆయన చేతులు మడిచినట్టే మడవడం, ఆయన ఊతపదాలు అనడం వగైరాలు యీ కోవలోకి వస్తాయి. అందుకే ఇమిటేషన్ ఈజ్ ది బెస్ట్ ఫారమ్ ఆఫ్ ఫ్లాటరీ - అన్నారొకరు.

## సందర్భశుద్ధి

ఎలక్షను సీజన్‌లో ఇంకో టెక్నిక్ బాగా కనిపిస్తుంది. ముక్కూమొహం ఎరగని వాళ్ళంతా మీ యింట్లో అందరిని కుశలం అడుగుతారు. మీరు చూస్తుండగా మీ పిల్లల్ని చీవిడి ముక్కుతోసహా (ఏవనుకోకండి) ముద్దెట్టేసుకుంటారు. చీవిడికూడా

తుడవరు. తుడిస్తే మీరు నొచ్చుకోవచ్చు. ఒకటి మాత్రం నిజం. వ్యక్తికన్న వాడి సృష్టిని - రచన, చిత్రం, పిల్లలు వగైరాలను - మెచ్చుకోడం గొప్పపద్ధతి.

పొగిడేటపుడు సందర్భశుద్ధి చూసుకోవడం ఒకటి చాలాముఖ్యం. బొటనవేలు పగిలో, ఇంట్లో కష్టం వచ్చో ఏడుస్తున్నప్పుడు ముందూ వెనకా లేకుండా ఆయన రచననో, నటననో మెచ్చుకోగూడదు. అలాగే, పొగిడేవాడు కొండంత దుఃఖంతో వెళ్ళి వెక్కెక్కి ఏడుస్తూ మెచ్చుకోగూడదు. పొగిడే అంశంగూడా చాలా జాగ్రత్తగా చూసుకోవాలి. రచయిత దగ్గరకెళ్ళి "మీ చిత్రాలన్నీ కళాఖండాలుసార్... నాకు వేషం కావాల"ంటే చెడుతుంది. ముఖ్యంగా ఆడవాళ్ళ దగ్గర ఒక సూత్రం పాటించాలి. మరీ అందవికారినీ, మహా సౌందర్యవతినీ పొగిడేటప్పుడు అందంకన్నా వాళ్ళ మేధను మెచ్చుకోవడం శ్రేయస్కరం. అందమైన స్త్రీకి మనం కొత్తగా చెప్పేదేంలేదు. అందం లేదని ఖాయంగా అనుకునే స్త్రీకి - అలాంటివారు అరుదు - - ఆ సంగతి చెప్తే మోసగిస్తున్నామని కోపం వస్తుంది. అందువల్ల వాళ్ళ తెలివినే మెచ్చుకోవాలి. అందమైన అమ్మాయికి అది మరీ ఆనందం కలిగిస్తుంది. అటూఇటూ కాక మధ్యరకం అందంగల అమ్మాయిని ప్రబంధకవిలా పొగడొచ్చు. పొగడిన కొద్దీ ఫలితం.

## అతి వినయం

పొగడడం ఎంత గొప్పకళో పొగడ్త అందుకోవడం కూడా అంతగొప్పదీను. అందులో ఒక సంస్కారం ఉండాలి. కనీసం పైపైకన్నా చూపాలి. ఎదటివాడు మనని మెచ్చుకుంటున్నప్పుడు - ఆ పోదురూ నేను వెధవని, అని మనం అంటే, వాడు అవమానపడతాడు. సవినయంగా స్వీకరించి కృతజ్ఞత తెలపాలి. మన రాజకీయ సన్మాన సభల్లో కవితా సన్మాన సభల్లో ఇంచక్కగా చూస్తాం. కొందరు సన్మానితులు అతి వినయానికి పోయి అప్పుడే ఎవరో దగ్గర బంధువులో, మహా నాయకుడో మరణించిన వార్త వచ్చినట్టూ తప్పనిసరిగా ఇక్కడీ సన్మానసభ మధ్య తను తగులడాల్సొచ్చినట్టూ భంగిమ పెడతారు. వినయం ఎంతమంచిదయినా కొన్ని రకాల ప్రశంసల దగ్గిరమాత్రం బొత్తిగా కూడదు. ఒకసారి ఒక పతివ్రత సినిమాలో ఋషులు దేవతలు వచ్చి.... నువ్వు మహాపతివ్రతవు అంటూ పొగుడుతారు. ఆవిడ ఆ మీరేదో అభిమానానికంటున్నారుగాని నేను మీరనుకున్నంత గొప్పదాన్నిగాను.... అన్న ధోరణిలో ఒక ముద్ర ప్రదర్శించింది. ప్రేక్షకులు గొల్లున నవ్వారు. అలాగే సన్మానసభ "వీరు దేశసేవా ధురంధరులు. నిస్వార్థ జీవులు. నిజాయితీకి పెట్టిందిపేరు...." అని మెచ్చుకున్నప్పుడు వినయం ఆవంతకూడా ప్రదర్శించడం క్షేమంకాదు.

## ఇంకా కావాలనే ఆరాటం

ఈ వినయపరులు కొందరు దొంగలు. పొగిడితే అబ్బే అనేవాళ్లు చాలామంది ఇంకో నాలుగుసార్లు పొగిడించుకుందికిలా అంటారని - ఏనాడో షేక్స్‌పియర్ అన్నాడు.

నాటికీ నేటికీ ఏనాటికీ ఎంతటివారికీ పొగడ్త ఇంద్రజాలమే. వ్యసనమైతే మనిషి నెంత దిగలాగుతుందో, తగు మోతాదులో వుంటే మనిషినంత పైకెత్తుతుంది. తోటివాళ్ళ పొగడ్తవల్ల అసాధ్యాలయిన పనులు చేసిన అర్భకులున్నారు. ఆంజనేయుడంతటివాడు లంకకి ఎగరడానికి పనికొచ్చిన యింధనం, నీ అంతటివాడు లేడయ్యా అన్న పొగడ్తే.





రావి కొండలరావు కొడవటిగంటి కుటుంబరావు

తెన్నది అరక్క భాషను గురించి తర్జన భర్జన చేసేవాళ్ళు భాష అనేదాంట్లో చాలా రకాలు చెబుతారు - గ్రాంథికం, సులభగ్రాంథికం, శిష్ట వ్యావహారికం, వ్యావహారికం, గ్రామ్యం ఇత్యాది. కాని యింకా భాషలున్నాయి. వాటిని నాటక కర్తలూ తదితర కళాకారులూ వాడుకుంటున్నారు. ఉదాహరణకు, సాయిబు తెలుగు, దొరల తెలుగు. బ్రాహ్మణ తెలుగు మొదలైన కులాలభాష; నెల్లూరు, పల్నాడు, విశాఖపట్నం, గుంటూరు, రాయలసీమ వగైరా ప్రాంతీయ భాషలు, ఓయబ్బ, భాషల్లో చాలా రకాలున్నాయి.

ఎన్ని భాషలుంటే అన్ని యాసలూ, ఉచ్చారణలూ ఉండక తప్పదుగదా! అయితే ఉచ్చారణల దగ్గిర మరో మడతపేచీవుంది. ప్రతాపరుద్రీయంలో పిచ్చివాడు శిష్యులతో చెప్పినట్టు రాసిందల్లా ఉచ్చరించలేం. దేర్ ఫోర్ - వారి నాలుగు అనే అర్థంలో కాదు - ఈ అర్థాల గొడవ గురించి మరెప్పుడన్నా రాయాలి - ఉచ్చరించిందల్లా రాయలేం కూడానూ. (ఏవిటన్నారూ? ఉచ్చారణ అనగూడదా? తొందరపడకండి. అంథా మనవిచేస్తాం.)

రాసింది ఉచ్చరించలేకపోవటం ఒహ సంగతి; రాసింది ఉచ్చరించక పోవటంలో మరొక సంగతి - టూ డిఫరెంట్ థింగ్స్ అల్ టుగెదర్.

ఒకసారి "సశేష" అని దేవభాషలో రాసి ఒక బెంగాలీ మిత్రుణ్ణి చదవమన్నారు. "షొషేష్" అని అవలీలగా చదివేశారు. అన్ని అక్షరాలూ ఒకటిగా చదువుతున్నావేమంటే పోట్లాడి, తాలవ్యషా, దొంతవ్యషో మొదలైన "షో"లను గురించి గంటన్నర గ్రామరు మాట్లాడాడు.

ఒక బెంగాలీ ఏమిటి, హిందీ ఏమిటీ! అన్ని భాషల వాళ్ళూ రాసినట్టు ఉచ్చరించకూడదని శపథాలు చేసుకున్న వాళ్ళే. హిందీవాళ్ళు శాలను షాలుగా మార్చటమేగాక ఇంకొన్ని శపథాలు కూడా చేశారు. ఉదాహరణకి, "తికమక" అనమంటే వాళ్ళనరు. కావాలిస్తే "తిక్‌మక్" అంటారు.

## తమిళ్ భాష

తమిళ సోదరులను తీసుకుంటే వాళ్ళది వేరొక గొడవ. టైప్ రైటరు రాబోతుందని వాళ్ళ "సంగం" కాలానికి ముందే ఎలాగో పసి కట్టేసి చాలా అక్షరాలు అవతల పారేసి అక్షరాలకి ఒకటి చొప్పున మిగుల్చుకున్నారు - సముద్రంలో పడవమునిగి పోతుంటే వర్తకులు సరుకు పారేసినట్టుగా! ఆ తరవాతనుండి తమిళంలో మాటల ఉచ్చారణకు బ్రహ్మాండమైన నియమాలేర్పడ్డాయి. "రెడ్డి", "బుడ్డి", "ముద్దు", "బుద్ధి"లాటి మాటలకు తమిళంలో స్థానంలేదు. "రెడీ" అనే ఇంగ్లీషు మాట నైనా వారు నిర్దుష్టంగా పలుకుతారుగాని రెడ్డి రెట్టి అవ్వలిసిందే. "బుడ్డి" మరీ అన్యాయం - ప్రొహిబిషన్ ప్రమేయంలేక పోయినాను దాన్ని "పుట్టి" అని తప్ప వారు అనరు.

అదేవిధంగా ముద్దు "ముత్తు" అవుతుంది. బుద్ధి "పుత్తి" అవుతుంది. ఇలా ఉదాహరణ లిచ్చుకుంటూ పోతే అవాచ్యాలు కూడా దొర్లవచ్చు. అందుచేత ఇది ఇంతటితో వదిలేద్దాం.

"గకారమును హకారముగాను, హకారమును గకారముగను పలుకునది " అని తమిళ వ్యాకరణ సూత్రం. అందుకే మహాత్మా అనటానికి తమిళ సోదరులు "మగాత్మా" అనీ, "వరుగిరదు" అనటానికి "వరుహిరదు" అనీ అంటారు. ఇది వాళ్ళ ఉచ్చారణానియమం.

ఇదేవిధంగా ఇంగ్లీషు, ఫ్రెంచి, రష్యను మొదలుగా గల భాషలన్నిటికీ రాసినట్టు ఉచ్చరించరాదనే నియమాలుండటం మనకు కనిపిస్తుంది. ఒక్క యు అక్షరాన్ని "పుట్"లో "ఉ"గానూ, "బట్"లో "అ" గానూ ఉచ్చరించటం ఇంగ్లీషు మొదటి తరగతి వాడికి కూడా తెలుసు. రాసినట్టు ఉచ్చరించవచ్చు ననుకొని "థరో" అనటానికి "దొరగ్" అనీ, "పెన్‌నైఫ్" అనటానికి "పెంక్‌నైఫ్" అనీ, "ఫారిన్" అనటానికి "ఫంగ్న్" అనీ -- ఈ చివరది మరొకరి కాపీ రైట్ గనక ఎవరూ తస్కరించకండి - అనేక విధాల ఉచ్చరించటం జరుగుతోంది.

ఇక ఫ్రెంచిలో అడగే అక్కర్లేదు. (చెప్పనక్కర్లేదు) Peauxzbfhh అని రాసి "పో" అంటాడు ఫ్రెంచివాడు. మనం చక్కా వెళ్ళిపోవటంతప్ప చేసేదేమీలేదు.

రష్యన్ భాష మరీ దారుణం. ప్రతి హల్లునూ నాలుగేసివిధాల ఉచ్చరించవచ్చు. గుడ్డిలోమెల్ల - లేక కీడులో - మేలు - ఏవిటంటే అచ్చుల్ని మూడుకన్న ఎక్కువ విధాల ఉచ్చరించటానికి లేదు. అదీగాక దీర్ఘాక్ష రాలేవో, హ్రస్వాక్షరాలేవో వాళ్ళు దాచిపెడతారు. ఒకచోట ఇవ్వవలసిన దీర్ఘం మరోచోట ఇస్తే మాటకు అర్థం కాస్తా మారుతుంది. ఇలా విభాషీయులచేత తప్పుడు ఉచ్చారణలు చేయించి నవ్వుదామని రష్యనుల ఉద్దేశంగా కనబడుతుంది.

చీనావాళ్ళ ఉచ్చారణ చెప్పకండి. వాళ్ళు ఏనాడో మనవేదాలు ఎత్తుకుపోయి అందులో ఉండే ఉదాత్తానుదాత్తాలను కాజేసి వాళ్ళ బొమ్మల భాషలో

చేర్చేసుకున్నారు. "స-రీ" అనేట్టు ఉచ్ఛరిస్తే "మొయ్" అనేదానికి కొనటమని అర్థం. అదే "స-నీ"గా ఉచ్చరిస్తే అమ్మటమని అర్థం - లేక అట్నుంచి ఇటో. తొమ్మిది అర్థాలు గల మాటలు కూడా ఉన్నాయట చీనామాటల్లో. ఇది కూడా వాళ్ళు సంస్కృతంనుంచే కాజేసి ఉంటారు.

"తెలుగు అన్ని భాషల్లాకాదు. అందులో ఎలా రాస్తామో అచ్చు అలానే ఉచ్చరిస్తాం" అని తెలుగు వాళ్ళకి చాలా గర్వం. కాని కొంతవరకు "జరుక్" ఇది అబద్ధమని రుజువు చేశాడు. "సూనాణ" అని మనం పిలుస్తావేఁ ఆ మాటని ఎలారాస్తాం? "సూర్యనారాయణ" అని కాదూ? "సత్యనారాయణ"ని "సచ్నాణ' అనమా? సత్యాన్ని "సత్తెం" అంటావా, అనవాఁ? మకారాన్ని ఓష్ఠ్యంగా ఉచ్ఛరించే పాపాత్ముడెవడన్నా ఉన్నాడూ? కొద్దిమంది స్టేజినటుల్ని మినహాయిస్తే? "చెయ్యటమ్" అని తెలుగువాడనడు "చెయ్యటం" అంటాడు. లేదా ఇంకొంచెం శ్రద్ధాసక్తులుగల వాడైతే "చెయ్యటంవ్" అంటాడు.

కొందరికి రకారం పలకదు. ఒక బడి పంతులు పిల్లలకు తెలుగు డిక్టేషను ఇస్తూ "గుయ్యము" అనేవాట్ట; "గుర్రము" మళ్ళీ మాట్లాడితే "గుఱ్ఱము" అని కుర్రాడెవడన్నా రాయకపోతే వీపు చిట్లగొట్టేవాట్ట.

## స్పీకర్లు - ఫిల్టర్లు

రకారం పలకలేనివాళ్ళలో మరోరకం కూడా ఉన్నారు. వాళ్ళు "ర" అనవలసినప్పుడల్లా ఉర్దూలో ఉండే ప్రత్యేకమైన గకారం ("ఐన్" తరవాత వచ్చే "గైన్") పలుకుతారు. తరగతి అనవలిసొస్తే "తగగతి" అంటారు. అయితే రెండు గాలకు తేడా వినిపిస్తుంది గనక కొద్ది అనుభవంతో మనం వాళ్ళ మనోభావాన్ని గ్రహించవచ్చు. వీళ్ళది మైక్ డిఫెక్టు.

అలాంటి అవకాశంలేని ఉచ్చారణలు కూడా ఉంటాయి. వీళ్ళది లౌడ్ స్పీకరు డిఫెక్టనవచ్చు. ఒక్కొక్కళ్ళు మాట్లాడుతుంటే ప్రతి రెండో అక్షరంలోనూ సకారం ఉన్నట్టనిపించి ఒక అరడజను పాములు బుసకొడుతున్నట్టుంటుంది. ఫోటో కలర్ ఫిల్టర్లున్నట్టు వీళ్ళ లౌడ్‌స్పీకర్లు కొన్ని ప్రత్యేకమైన అక్షరాలను మిగిలినవాటిని ఫిల్టరు చేస్తాయనిపిస్తుంది.

ఈ ఫిల్టర్ల మూలకంగా వీళ్ళ ఉచ్చారణ ఎలా ఉండేదీ మనం తెలుసుకోలేం. యాదాలాపంగా వినేవాళ్ళకి ఒక్కోసారి వాళ్ళు ఏ భాష మాట్లాడుతున్నారో కూడా తెలీదు.

ప్రత్యక్షానుభవంలో నన్ను కాల్చుకు తినేవాడు ఆలిండియా రేడియోలో ఇంగ్లీషు వార్తలు చెప్పేవారిలో ఒకడున్నాడు. అతనికి పెద్దబుగ్గలుంటాయో ఏంపాడో, అతను అనేదంతా అతని నోట్లోనే రివర్బరేటై-- బయటికి శుద్ధమైన ధ్వని వస్తుంది. మరలో గింజలు పోస్తే పిండి బయటి కొచ్చినట్లు ఆ మహానుభావుడు తన భాషని తానే గానుగాడేస్తాడు!

## టెలుగూస్

ఒక బడిలో ఒక ఇంగ్లీషు మాష్టారు కుర్రాణ్ణి ఇంగ్లీషుపాఠం చదవమని "నీ మొహంలా వుంది. ఏమిటా చదువు చక్కగా దొరల్లాగా చదవాలి" అని చదివి చూపించాడు. దర్జాగా – అక్షరాలు వినిపించనీయకుండా. ఎక్కడికక్కడ తెగ్గొట్టేస్తూ "నాది యూరపియన్ ఇంగ్లీషు" అన్నాడాయన పైగా. అంతేగాని. "దేరు ఈజు బుక్కు" అని చదవటం ఏడిసినట్టుంటుందని ఆయన నమ్మకం. అదే బడిలో మరో ఇంగ్లీషు మాష్టారుదగ్గర, ఈయన చెప్పిన పద్ధతిలో చదివితే ఒప్పుకునేవాడు కాదు. "అదేంటబ్బాయ్ ఆ చదువు? విదేశాల్లో చలి ఎక్కువగా వుంటుంది. ఆ చలికి తట్టుకోలేక ఇంగ్లీషువాడు, వణికిపోతూ ---- అని మాట్లాడతాడు. అట్లా మాట్లాడ్డానికి మనకేం ఖర్మం? మనం ---సుబ్బరంగా ప్రతీ మాటా---- ప్రతి అక్షరం ఉచ్చరించ---- అని ఈయన వాదం.

ఇంకో మాష్టారు ఇంగ్లీషు ఇంకో పద్ధతిలో ఉచ్చరించేవాడు. "యూ కెనాట్ --- ?-సిట్టు. నెక్ట్సు" అని రాగం--- తెలుగులో. ఆయన పద్ధతి అది ఆయనదే మరో సిద్ధాంతంవుంది. "ఇంగ్లీషులో MAN అంటే మాన్ (ఇంగ్లీషులో ఈ పదాన్ని ఉచ్చరించినట్టు తెలుగులో వ్రాయలేము) అవుతుంది. దాన్ని నువ్వు----. "మాన్" అని రాయగలవు. లేదా "మేన్" అని రాయగలవు అంతేగాని సరిగ్గా రాయలేవు. అందుకనే తెలుగువాళ్ళం ఈ మాటలు రాసినప్పుడు, దానికింద ఓ యకారం పడేసి "మ్యాను" అంటున్నాము, అని బోధచేసి, తాను పలకవలసి వచ్చినప్పుడు కూడా అట్లాగే పలికేవాడు. "ఏ మ్యాను ఈజు లుకింగు ఇంటూ ఏ మ్యాపు" అని. కుర్రాళ్లూ అట్లాగే చదవాలిగాని ఇంగ్లీషు ఉచ్చారణలో మాత్రం చదవకూడదనేవాడు. ఎవడి వెర్రి వాడికి ఆనందం అని వూరుకోవాలిగాని, ఎవరేం చెయ్యగలరు?

ఒక తెలుగు మాష్టారికి ఇంగ్లీషు మీద మహాచిరాకు. అంత చిరాకయినాసరే ఆయన తప్పో ఒప్పో ఆ భాషే మాట్లాడేవాడు సమయం వచ్చినప్పుడల్లా. ఆయన చిరాకంతా ఇంగ్లీషువాడు ఒకటి రాసి, ఇంకోలా చదవమంటాడనే. "టైమ్ టేబిల్" అనేదాన్ని ఆయన అక్షరాలకేసి చూస్తూ "టిమేటాబ్లే" అని చదివి తర్వాత సర్దుకునేవాడు. ఆయనకు చిరాకొచ్చిందంటే రాదూ మరి?

KNIFE లో K సైలంట్ అని ఆయనకు తెలుసు. అది పట్టుకొని ఆయన ఇంగ్లీషును తెగతిట్టడం. "అక్కడ నువ్వు కె రాయటం ఎందుకు? మళ్ళీ అది సైలంటూ సింగినాదమూ అనటం ఎందుకు? తీసిపారేయ్. ఏ బాధలేదు. వుంచావూ, అను. తీరావుంచి చదవద్దనే భాష ఏం భాషయ్యా అది? అక్షరాలూ అట్లా వేస్టు చెయ్యడం ఎందుకు?" అని కోప్పడేవాడు. ఇంగ్లీషు ఉచ్చారణలో రాసినట్టుగా చదవము. అది ఒక్కో వేళావిశేషాన్నిబట్టి ఒక్కోలా చదవాలి. తెలుగులో రాసింది రాసినట్టుగా చదువుతాము. ఐతే కొందరు మాత్రం కాదన్నారు. "హృదయము" అన్నదాన్ని చాలామంది ఖచ్చితంగా "హ్రిదయము" అనే అంటాడు – రెంటికీ తేడా

వుందన్నాసరే. అట్లాగే "వహ్ని" అనే పదాన్ని "వన్హి" అనీ, "చిహ్నము" అనేదాన్ని "చిన్హము" అనీ చాలామంది ఉచ్చరిస్తారు. అందువల్ల రాసింది రాసినట్టుగా చదవకపోవటం అనేది మనకూ వుంది.

## మూసలో భాషలు

ఒక్కొక్క భాషవాళ్ళు ఇంకో భాషను ఉచ్చరిస్తే తమాషాగా వుంటుంది. 'కీ'లు ఎక్కువగా వాడే తెలుగు తెలియని మహమ్మదీయులు తెలుగు మాట్లాడుతూనే "మీకీ హేమ్టీ తెలుసూ, మాకీ తెల్సూ" అంటూ మాట్లాడతారు. "నువ్వుండుమీ, నాను దా సెప్పుతాను. వాడికిదానిండా కోపం జాస్తి..." అని మాట్లాడేవారు మద్రాసు తెలుగువాళ్ళు. రెండూ తెలుగులే, ఏంచేస్తాం. ఉచ్చారణలో అట్లా ఐనై.

ఇంకో గమ్మత్తుంది. 'హిందూ' అనే పదం వుంది. దాన్ని ఇంగ్లీషులో రాయాలంటే "HINDU' అని రాయాలి. కాని అది 'హిందూ' అన్న మాటే. ఐతే ముందుగానే మనమే దాన్ని "హిందూ" అని ఉచ్చరిస్తున్నాము. అట్లాగే తమిళ్ అన్నదాన్ని 'టామిల్' అని. 'తెలుగు'ను టెలుగూ అని అంటున్నాము ఉన్నదున్నట్టుచ్చరించడమే సంప్రదాయం అన్నట్టుగా.

తెలుగువాళ్ళు ఇంగ్లీషును తెలుగులో మాట్టాడినట్లే హిందీ మొదలైన భాషలు కూడా అట్లాగే మాట్లాడతారు. మనం తెలుగులో హిందీని మాట్లాడినట్టే హిందీవాళ్ళూ హిందీలోనే తెలుగుమాట్లాడతారు. మలయాళవాళ్ళు ఏ భాష మాట్లాడినా మలయాళంలాగే వుంటుంది. తీరా జాగ్రత్తగా వింటే, అందులోంచి ఏ ఇంగ్లీషో - తమిళమో నిదానంగా తేలుతుంది. అది ఆ భాష వాళ్ళ ఉచ్చారణ. వాళ్ళ కే భాషిచ్చినా దాని వాళ్ళ మూసలో పోసేస్తారు.

ఉచ్చారణ దోషాలవల్లనే వూరిపేర్లు మారిపోతూ వుంటాయి. "ముత్తరాసు చెన్నప్ప" అనే వ్యక్తి మొట్టమొదట మద్రాసులో స్థిరనివాసం ఏర్పరుచుకున్నాట్ట. అందుకని అతని పేరుమీదనే. దానికి "ముత్తరాసు" అని పేరుపెట్టారు. కాలక్రమాన అది ఒక్కొక్కరినోట్లో ఒక్కొక్కలాగా నలిగి, తిరిగి, చివరకు "మద్రాసు" ఐంది.

అట్లాగే శ్రీకాకుళం వూరిపేరుకూడా అది కాదన్నారు కొందరు. గురజాడ అప్పారావుగారు అవునని నిరూపించినా. (శ్రీకాకుళంలో శ్రీకాకుళేశ్వరుని దేవాలయం వుండేది. అందుకని దానికాపేరు వచ్చింది అని అప్పారావుగా రన్నారు.) మొగలాయీలు పరిపాలిస్తున్న రోజుల్లో తపాలాసంచుల మూతలు ఆవూళ్ళో విప్పేవారట, ముద్రలు వేసేవారో, ఏం చేసేవారో మళ్ళా మూసేసేవారట. అందుకని, ఆవూరికి "శిఖాఖోల్" అని పేరొచ్చిందని, క్రమేణా చికాకోలు శ్రీకాకుళమూ ఐందనీ కొందరివాదం.

సంవత్సరాలు గడుస్తూవుంటే ఉచ్చారణ మారుతూ వస్తుందని నమ్మకం వున్నది. కాబట్టి నమ్మేవాళ్ళు నమ్ముతూనేవున్నారు. అట్లాగే రాజమహేంద్రవరం, రాజమండ్రి ఐంది. విజయవాడే బెజవాడ ఐందని కొందఱు అంటూ వుంటే బెజవాడే

విజయవాడ ఐందని మరికొందరంటున్నారు. అసలిదేమీకాదు. దొరలు అక్కడ వేడిని భరించలేక దానికి "బ్లేజవాడ" అని పేరు పెట్టారని అదే బెజవాడ ఐందనీ కొందరు ఆధునికులు అంటున్నారు.

కొన్ని వందల సంవత్సరాలు గడిచేటప్పటికి, నానాభాషలవాళ్ళ నోళ్ళల్లోనూ ఒక మాట నలిగి ఇంకోలా కూడా మారిపోవచ్చును. కాలాన్ని బట్టి ఉచ్చారణ మారుతుంది కాబట్టి.

## హామిల్టన్ పేరుకు క్షురకర్మ?

ఇలాంటి మార్పులలో అత్యద్భుతంగా రూపాంతరం పొందినది మద్రాసులోని హామిల్టన్ బ్రిడ్జి. అరవవాళ్ళ వాడకంలో అది అంబట్టన్ బ్రిడ్జిగా మారింది. (అంబట్టన్ అంటే మంగలి) మరికొంతకాలానికి చారిత్రక పరిశోధకులువచ్చి - ఇక్కడ క్షురకర్మలు విరివిగా జరిగేవనీ అందువల్ల ఈ పేరు వచ్చిందనీ ఖాయపరచారు తరువాతి తరంవారు. దానిని ఇంగ్లీషులోకి తర్జుమా చేసి బార్బర్స్ బ్రిడ్జి అని పేరు పెట్టారు. ఇటీవల ఆ బ్రిడ్జిని బాగుచేయడం సందర్భంగా ఒక గుమాస్తా దాని శంకుస్థాపన వాలకంచూసి కెవ్వుమని - "దీని పేరు హామిల్టన్ బ్రిడ్జి" అని వెల్లడి చేశాడట.

చిన్నపిల్లలకు ముందుగా "తా" అనే అక్షరం పట్టుపడుతుంది. అందుకనే వాళ్ళు "నాన్న" కంటే ముందు "తాత"ను పలుకుతారు. వాళ్ళ శబ్దోచ్చారణలో రాలూ సాలూ ఇవన్నీ ఎగిరిపోతాయి. "తూత్తాను" "ఉత్తలం లాయి" "నే తెత్తాను" లాంటివన్నీ అవే. ఐతే, అది ముద్దుగావుండే ఉచ్చారణ కాబట్టి దోషంలేనిది.

పిల్లలకు టా పలకనట్టు కొందరు పెద్దలకు తా పలకదు. "టాగు టాను" "టమరు టాగండి" వంటివన్నీ అవే. అది ముద్దయితే ఇది స్టయిలు. అది ఆనందిస్తాం. ఇది నోరు మూసుకుంటాం.

పెద్దవాళ్ళలో చాలామందికి 'ణ' 'ళ' 'ష' పలకవు. మళ్ళీ ప్రాణానికి బహు కష్టం. 'పెల్లి' 'ప్రానం' 'కస్టం' - ఇవే. కొందరికి ఒత్తులు పెట్టడం చాలా చిరాకుట. అందుకని సాపుగా హాయిగా ఏ బాదరబందీలు లేకుండా మాట్లాడేస్తారు - "నాకు ఏ బాదా, ఏ బయమూ లేవు" అని. కొందరికి ఒత్తులు పలకడం చిరాకయితే, మరికొందరికి ఆనందం. అడ్డమైనచోటల్లా గాఠ్ఠిగా ఒత్తేసి మాట్లాడేస్తారు వీళ్ళు. "ఏమ్యోయ్, ఎఖణ్ణుంచేమిఠి రావఠం? అంథా ఖులాసా యేన్హా?" అని; వాళ్ల వుద్దేశంలో వాళ్ళు "ఉచ్చారణోద్ధండులం" అనీ ప్రతి అక్షరం చక్కగా, శుభ్రంగా మాట్లాడతాం అనీను.

పొడుంపట్టు పట్టేవాళ్ల ఉచ్చారణ వేరు. వాళ్ళకు కొన్ని అక్షరాలు పలకవు. "బీరుడిడ్డ గడిబిచ్చలేదే" అని వాళ్ళంటే "మీరు నిన్న కనుపించలేదే" అని మనం అర్థం చేసుకోవాలి. ఉచ్చారణను మార్చగలిగే శక్తి ఒక్క కాలానికేకాదు, ముక్కు పొడుంకూ వుంది. ఆవులించేవాడూ తాంబూల సేవకుడూ ఇంకోలా మాట్లాడతారు.

సందర్భాన్నిబట్టి, సమయాన్నిబట్టి యాక్షన్‌ను బట్టి మనం అర్థం చేసుకోవాలి. "శిద్దళొస్తూల్డి" అని ఆవులించేవాడంటే "డిద్రపో" అవి తాంబూల సేవకు దంటాడు.

అసలు ఇంతకూ 'ఉచ్చారణ' అనే పదం ఎట్లా ఉచ్చరించాలో చాలామందికి తెలీదు. "నీ ఉచ్ఛారణ బాగులేదు బ్రదర్" అని ఎదుటివాళ్ళను సరిదిద్దడమేగాని, తనేం చేస్తున్నాడో తెలియదు. "అది వట్టి "ఉచ్చారణ మాత్రమే బ్రదర్, వత్తులేదు" అని ఎవరైనా వచ్చి అతన్ని సరిదిద్దాలి. ఆ మాటకు ఒత్తు లేదని తెలిస్తే తెలుగువాడు అరగంటసేపు ఆశ్చర్యపడక మానడు!

## మరికొంత విగ్నానం

ఇలాగే జకార ఞకారాలను గకార నకారాలుగా ఉచ్చరించేవారిది తప్పు అనీ యజ్ఞము విజ్ఞానము కృతజ్ఞత వగైరాలను యగ్నము విగ్నానము కృతగ్నత అని పలకడం కేవలం అగ్నానమనీ ఆడిపోసుకునే దుర్మార్గులందరికీ కనువిప్పుగా వాఙ్మయ మహోధ్యక్ష ఫద్లమూడి గోపాలకృష్ణయ్యగారు తమ "వ్యావహారిక భాషా వ్యాకరణం"లో ఈ విషయమై సుదీర్ఘమైన చర్చ చేశారు.

ఇట్లా యజ్ఞంలో జ్ఞని రాసినప్రకారం జ్ఞ అని పలికేవారేకాదు - పలక గలిగేవారు - కోటి కొకరు కూడా లేరని. సరిగ్గా లెక్కకడితే - ఆంధ్రులు నాలుగు కోట్లమంది ఉంటే రెండుకోట్లకి ఒక్కరు చొప్పున ఉన్నారని రుజూ చేశారు. వారిలో ఒకరు ఏలూరులో, మరొకరు విజయవాడలో ఉన్నారని కూడా వెల్లడించారు. తానుకూడా జకార ఞకారాలను గకార నకారాలుగానే పలుకుతానని, తొలిసారిగా ఆ యిద్దరూ విజ్ఞానం అజ్ఞానం అంటూ జ్ఞను శాస్త్రోక్తంగా - కాదు కాదు వర్ణక్రమం ప్రకారం పలకడంతో తాము చాలాసేపు ఆశ్చర్యపోయామనీ శ్రీ గోపాలకృష్ణయ్యగారు ప్రకటించారు; ఇంతకాలం జకార ఞకారాలను గ్నగా పలుకుతూ అది తప్పేమో అని బాధపడుతున్న అస్మదాది యాంధ్రులందరకూ..... ఈవిగ్నాన దీపం కనువిప్పై ఆనందమే కలిగించినది. ఇందుకు వ్యావహారిక వ్యాకరణ శాస్త్రగ్నులకు మేము కృతగ్నులము.

ఉచ్చారణమీద పరిశోధన విగ్నానమేకాదు వినోదంకూడా కలిగిస్తుంది.

కాళిదాసుగారు వెర్రిగొల్లడి అగ్నానపు కంబళీ వేసుకు రాజసభ కేగినపుడు రావణాసురుడి ఫోటోచూసి "రాభణాసురుడు" అని మహాకవి వాక్యం సెలవిచ్చాడు. కంగారుపడ్డ రాజుగారికి మంత్రిగారు మనోహరమైన వ్యాఖ్యానం చెప్పారు. అమ్మకన్న సంతానం ముగ్గురిలోనూ చిన్నవాళ్లు విభీషణ కుంభకర్ణులికి భకారాలుండగా రావణాసురుడికి లేకపోవటమేవిటీ అన్న తాత్పర్యంలా కవిగారలా సెలవిచ్చారని. ఇంత చక్కని స్వారస్యం ఉచ్చారణ ధర్మమేగదా.

# భేదాభేదాభేదాలు

ఈ భకార బకారాలకి గల భేదం తమాషాగా ఉంటుంది. ఆమాటకొస్తే భేదానికీ బేధానికీ భేదం వుందని కొందరు గమనించరు. అలాటి పక్షపాతం తగదని వారి నమ్మిక. దీనిగురించి మాట్లాడినా కొందరు భాదపడతారు మరికొందరు బాధపడతారు.

ఒక నాటకంలో ఒక నటుడిలాగే చేశాడట. ఏదో పద్యం చదువుతూ యుద్ధము నందున అన్నాడట - వెంటనే ప్రాంప్టరు "ఒత్తురోయ్ వత్తు" అని వెనకనుంచి ఉసిగొలిపాడు. తక్షణం ఆ నటుడు ఆ పద్యంలో తరువాత మాటలో చోటున్న చోటుచూసి "మదియుబ్భగ" అని సర్దుబాటు చేసేశాడు. రంగస్థల సమయస్ఫూర్తి కిదొక ఉదాహరణ అని శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావుగారు చెబుతూవుంటారు.

ఉచ్చారణలో ఎదటి కవిపండితుని బెదరగొట్టిన తెనాలి రామకృష్ణుడి కథ మీకు తెలుసు. అయినా చెప్పక మానము. చెప్పినంత వేగంలో రాస్తానని పందెం వేసిన ఆ పండితుడికి "తృవ్వటబాబా తలపై-" అన్న పద్యం చెప్పాడు రామకృష్ణ కవి. అందులో తొలి అక్షరానికి వత్రసుడో కరారావుడో తేల్చుకోలేక తికమకపడిపోయాడు వ్రాయసకాడు. బహుశా తెనాలిరాముడు తృ అని వుండదని "ఫ్తృర్" అని వుండాలని కొందరి వాదం. వీరికి వత్రాసుడికి,. కరారా వుడికి భేదం లేదు. కేవలం - తప్పుపట్టేరన్న కారణంతో పంతంపట్టి ఇప్పటికి మిత్రుదు, శతృదు అని, ధృవతారలనీ రాసే పాత్రికేయులున్నారు.

ఈ సందర్భంలో ఒక్కమాట. ఎవరూ "తప్పులు ఎరగని" వారు కారు. అందువల్ల ఈ వాక్యాలు వ్యక్తుల్ని హేళన చెయ్యాలన్న దుర్బుద్ధితో మాట్లాడటంలేదు. కేవలం ధోరణులనే. విమర్శబదులు హేళన చెయ్యడం సంస్కార లక్షణం కాదని కూడా ఈ వాక్యాలు ఎరుగును.

ఒకసారి ఇవి "ఇకనామిక్స్" అంటే "యు మీన్ ఎకనమిక్స్ అని ఎదుటి మనిషి అర్జంటుగా తప్పుసర్దబోయాడు. నో ఐమీన్ "ఇకనమిక్స్" అన్నాయి యివి - నొచ్చుకున్నా - మొండిగా, ఇది వింటున్న మూడో ఆయన భరించలేక "దేరార్ 26 కైండ్స్ ఆఫ్ ప్రొనౌన్సియేషన్స్ ఫరెవ్వెరివర్డ్" అంటూ తీర్పు చెప్పాదు.

మొత్తంమీద ఉచ్చారణ చిన్న విషయం కాదు. ఒకళ్ళు నొచ్చుకుంటారని చర్చమానలేము. జనం ఒకలా అనేస్తున్నారని అన్నిటిని సర్దుకుపోలేము. వ్యక్తులకు సమాజానికీ నీతి నియమాలు ఎంత అవసరమో, చాల మంది పాడుపన్లు చేస్తున్నారు గదా అని వాటిని నీతులుగా ఎట్లా అంగీకరించలేమో అట్లాగే భాషకీ "శాస్త్రం" నియమ నిబంధనలు మన్నించడం అవసరం. అలాగని ఉరెయ్య మనటంలేదు. ఎందుకంటే మనదేశంలో మొన్నటివరకూ వేదాలన్నీ - ఉచ్చారణే ప్రాణంగా, దేహంగా, తరతరాలుగా మనకి లభిస్తూ వచ్చాయి. బోధనలో ఎంతో పరిశోధన

జరిగిన తరువాత పాశ్చాత్యులు (ఉచ్చారణ తప్పని తెలుసు. కాని తిరిగి చావటంలేదు) ఆడియోవిజువల్ (ఆ లిపి తప్పు - ఉచ్చారణకి తగ్గ అక్షరం లేదు) ఎజుకేషన్ (వ్యావహారికంగా చూస్తే డ్యు, జులాగే వినబడుతుంది మరి) అంటూ తిరిగి శ్రవణేంద్రియం ప్రధానమని తేల్చారు.

అందువల్ల, ఉచ్చారణ శుద్ధంగా ఉండేట్లు చూడడానికే బాల్యంనుంచి (మనదికాదు; ఈతరం పిల్లలది) మనం శ్రద్ధతీసుకుంటే దేశాని కేవిధంగాను అపారనష్టం వాటిల్లదనీ, ఇందువల్ల చైనావాళ్ళు గెలవడానికి అవకాశాలు లేవనీ, కాశ్మీరు పాకిస్తాన్ పరంకాదనీ, జీవితావసర వస్తువుల ధరలు తగ్గడానికి ఆటంకాలు ఏర్పడవనీ, రైళ్ళలో రద్దీతగ్గే ప్రమాదం జరగదనీ, మద్యనిషేధం జయప్రదం అని చెప్పుకుందికి అభ్యంతరం ఉండదనీ, తెలుగుసినిమాలు బెంగాలీ పిక్చర్లస్థాయిని (వాళ్ళ కథలు కొనడంద్వారానే అయినా) అందుకోవడానికి అడ్డుండదనీ, బెజవాడలో మురుగుపారుదల అసౌకర్యాల పరిస్థితి మారదనీ, బహుమతి కథలు గొప్పవి రావడానికి ఆటంకం ఉండదనీ హామీయిస్తున్నాము.

*(జ్యోతి - ఆగష్టు 1964 సంచికలో*
*శ్రీయుతులు కొడవటిగంటి కుటుంబరావు, రావికొండలరావు గార్లతో*
*కలిసి రాసినది)*

స్త్రీ రమణీయం

# మనమాటల మరమ్మత్

నాది "ఆత్మ విశ్వాసం" నీది "తిక్క" దానిది "మరీ మొండిపట్టు."

పట్టుదల అనే ఒక్క విషయం గురించి చెప్పుకున్నప్పుడు మనుష్యులనిబట్టి ఈ పేర్ల రూపాలు మారుతాయి. మనం మారుస్తాము అన్నమాట. తెల్లారి లేచింది మొదలు అస్తమానం వరకూ మనం అనేక విషయాల గురించి, అనేక మంది గురించి మాట్లాడినప్పుడు, మనం అభిమానాలు, అహంకారాలు, పక్షపాతాలు, ఈర్ష్య మొదలైన వాటి ఫలితంగా ఒక్క విషయాన్నే అనేకరకాలుగా చెప్తాం.

నేను, నువ్వు, వాడూ అనే మూడు కర్తలను బట్టి ఈ మాటలు మారుతాయి. మనకి బాగా వంటబట్టిపోయిన రాగద్వేషాల మూలంగానే మనం కొన్ని రకాల మాటలని ఉపయోగిస్తామని, న్యాయంగా, సబబుగా ఆలోచిస్తే ఆ మాటలు నిందతో కూడినవి, నిష్కారణంగా అనేవి, ఎదటి మనుష్యుల మనస్సులను నొప్పించేవి, ఎదటివాళ్ల దృష్టిలో మనలను చులకన చేసేవి అని నా అభిప్రాయం.

"తన్నుత్తమ, ఎదట మధ్యమ, ఎక్కడో ప్రథమ" అని పురుషత్రయానికి మా తాతగారు కొండగుర్తులు చెప్పేవారు. అంటే, తెలుగు వ్యాకరణంలో ప్రథమ పురుష అంటే వాడు, మధ్యమ పురుష అంటే 'నువ్వు', ఉత్తమ పురుష అంటే "నేను" అన్నమాట.

ఇంగ్లీషులో ఈ వరస తిరగబడుతుంది. వాళ్లు "నేను"కే ప్రథమస్థానం ఇచ్చారు. ఇంగ్లీషు గ్రామరులో ఫస్ట్ పర్సన్ (ప్రథమ పురుష) అంటే నేను, సెకండ్ పర్సన్ (మధ్యమ పురుష) తెలుగులోలాగే, నువ్వు, తెలుగులో ప్రథమ పురుష అయిన "వాడు" ఇంగ్లీషులో తర్డ్ పర్సన్ అవుతుంది.

వ్యాకరణం మన కల్చర్‌కి ఆధారం అని నేనేమీ అనటంలేదు గాని, రోజూ మనం మంచీ చెడ్డా మాట్లాడినపుడు మనకి తెలియకుండానే తేడాలతో మాట్లాడుతాము అనిపిస్తుంది. ఈ మాటల్ని కొంచెం ఆలోచించి మరీ వాడితే, స్వంతానికి కొంచెం మరమ్మతు చేసుకున్నట్లవుతుందని నా అభిప్రాయం. నోరు మంచిదైతే ఊరు మంచిదన్నారు. అందువల్ల అపుడు మనతోపాటు, మన చుట్టూ వుండే వాళ్లూ - లోపాలుంటే పోగొట్టుకుని మారుతారు అని నా అభిప్రాయం.

నేనేం నీతిపాఠాలు చెప్తాననటం లేదుకాని, కొన్ని శాంపిల్స్ నేను విన్నవీ కన్నవీ (అన్నవి కూడా లెండి) ఇక్కడ రాస్తాను. ఆపైన మీ యిష్టం.

## కొత్త చోళీ

ఉత్తమ పురుష: (మనం తొడుక్కున్నపుడు) "ఇది లేటెస్ట్ ఫాషన్ తెలుసా?"

మధ్యమ పురుష: (ఎదటి పిల్ల వేసుకుంటే) "అదేమిటోయ్, ఆ చేతులు అంత పొడుగు పెట్టించావు - మరీ సోలగొట్టాల్లాగ?"

ప్రథమ పురుష: (ఎదట లేని పిల్లగురించి) "ఆ సీత తొడుక్కుంటున్న 'రవిక' 1904లో మా బామ్మ తొడుక్కున్న రకం."

## డాబుసరి చీర

ఉత్తమ: చాలా బ్రైట్‌గా కంటికి నదరుగా ఉందికదూ ఈ చీర?

మధ్యమ: (ఆ చీరే ఇంకో అమ్మాయి కట్టుకుంటే) ఇదుగో ఏవండో; నువ్వేమనుకున్నా సరేగాని, నీ చీరరంగు మరీ లౌడ్‌గా ఉంది సుమీ.

ప్రథమ: (సీత ఆ చీర కట్టుకుంటే) ఓర్తి గంగిరెద్దులా ఉంది. దానికసలు 'టేస్టు' లేదు.

## అతి వాగుడు

ఉత్తమ: వినేవాళ్లుంటే అలా సరదాగా కబుర్లు చెప్తూ ఉండడం నాకెంతో సరదా. నేను లేకపోతే ఇల్లు చిన్నబోతుందంటారు మా నాన్నగారు.

మధ్యమ: ఇదిగో ఏవండో; మనం - ముఖ్యంగా ఆడపిల్లలం - మితంగా మాట్లాడ్డం నేర్చుకోవాలి. ఒక్క చిన్నసంగతి చెప్పడానికి అంతసేపెందుకు పడుతుంది నీకు?

ప్రథమ: ఆ పోదూ, ఆ సీత మరీ ఎడతెరిపిలేకుండా, వసపోసిన పిట్టలాగ బడబడ వాగుతుంది. చెవులు హోరెత్తి పోతున్నాయి, నాకు.

## కోపం

ఉత్తమ: నాకు ఒళ్లు మండిపోతోంది అన్యాయం చూస్తున్న కొద్దీ.

మధ్యమ: నువ్వు అలా కంగారుపడిపోకూడదు.

ప్రథమ: ఆ పిల్ల గోరంతని కొండంత చేసి ఎందుకలా గోలెత్తిపోతుందో! ఛీ, మరీ అన్యాయం.

## తీరు

ఉత్తమ: ఎవరేమనుకున్నా నాకు భయంలేదు. నేను నిర్మొహమాటంగా కుండబద్దలు గొట్టినట్టు ఉన్నమాట అనేస్తాను.

మధ్యమ: మీరు తొందరపడుతున్నారు. అనవసరంగా, అలా ఫెళ ఫెళమంటూ మాట్లాడ్డం మంచిది కాదు..

ప్రథమ: అతను మరీ ముందూ వెనకా లేకుండా నోటికొచ్చినట్లల్లా వాగుతాడు. కల్చర్ లేదు బొత్తిగా. పల్లెటూరి గబ్బిలాయిలా ఉన్నాడు.

## మాట తప్పుట

ఉత్తమ: నేను మళ్ళీ జాగ్రత్తగా ఆలోచించి నా అభిప్రాయం మార్చుకున్నాను.
మధ్యమ: నువ్విలా ఇట్టే నిమిషానికోసారి మనసు మార్చుకుంటే ఎలా చెప్పు.
ప్రథమ: దానికసలు మాట నిలకడ, నిజాయితీ లేవు. రెండు మూడు నాలిక లున్నట్టున్నాయి. పచ్చి అబద్ధాలనుకో దాని మాటలన్నీ.

## అహం

ఉత్తమ: నాది దృఢనమ్మకం.
మధ్యమ: నీది మొండి పట్టుదల.
ప్రథమ: దానికి ఎంత అహంకారం. ఎంత పొగరు.

- ఆంధ్రపత్రిక, 26-12-56

# మీరే చెప్పండి



ఎవరు దుబారా? — నేనా — మావారా?

**ఆ**యన: అసలు నిన్నే కాదు మీ జాతినే అనాలి. దుబారా ముందు పుట్టి తరవాత మీరు పుట్టారు. ఎక్కణ్ణించొస్తుంది డబ్బు, ఎలా వస్తుందన్న జ్ఞానం పిసరంతేనా లేదుగదా!

**ఆ**విడ: మాటాడితే ఇదొహటి నేర్చారు దుబారా దుబారా అని ఎత్తిపొడవడం. మొగుణ్ణి కొట్టినమ్మ మొగసాలకెక్కి మరీ ఏడ్చిందిట. దుబారా చేసేది మీరూ, దులిపేది నన్నూను. ఈ నెలనించి పద్దువేసి చూపిస్తా నుండండి.....

**ని**జం ఒకటే అయినా ఎప్పుడూ మరో దానిలా కనిపిస్తుందిట. దానికది మహాచెడ్డ అలవాటు. తాడు పాములా కనిపిస్తుంది. ఉప్పు కప్పురంబులా ఉంటుంది. మంచితనం చేతగానితనం అనిపిస్తుంది. మితభాషణ గర్వంలా ఉంటుంది. ఆత్మవిశ్వాసం పొగరు కింద జమఅవుతుంది. (కొందరి) అవసరం అనవసరంలా ఉంటుంది (మరి కొందరికి). ఆడదాని ఖర్చు దుబారాలా కనిపిస్తుంది మొగాళ్ళకి. ఏంచేస్తాం అది సృష్టిధర్మం కాబోలు.

అని సర్ది చెప్పుకుందామనుకున్నా సాగనివ్వరు కొందరు. రెచ్చగొట్టి మరీ ఏడిపిస్తారు. నేను ఏడవననుకోండి. ఎప్పుడూ ఏడవలేదు మరీ పసితనంలో తప్ప. ఇష్టంలేక కాదు; అసలు చేతకాదు. కాని, చేతగాకపోయినా నేర్చుకు ఏడిచేవాళ్లెందరినో చూశాను. వాళ్ళకేనా అది సరదా అనుకోను. హాబీ కూడా కాదు. తప్పనిసరి. కలకంఠికంట కన్నీరొలికిన సిరి ఇంటనుండ నొల్లదంటూ సుమతిగారు పద్యం రాసిందిగాని, మొగాళ్ళకి కలకంఠికంట కన్నీరొలక్కపోతే తోచదనుకుంటాను. తిట్టినన్నీ తిట్టేసి, ఆనకేమో, "నువ్వు ఏడుస్తూవుంటే ఎంత బావుంటావూ. నీక్కోపంవస్తే ఎంతసేపు చూసినా తనివితీరదు" అంటూ కవిత్వాలు చెబుతారు.

'హా! నేటి విద్య!'

కాలేజీలో మా నేస్తురాలి మాటల అర్థం ఇపుడు తెలుస్తోంది.

"ఆడదానికేడు పందమోయ్. మొగాళ్ల కది సరదా. అందికే పెద్దన్నా వాళ్ళూ ఏడుపు మీదా అలాటి చక్కటి పద్యాలు రాశారు. ఏడిచి సాధించలేని దుండదు. చంటిపిల్లలకి అదే ఆయుధం గదా. అలాగే మనకీని. అంచేత అసలు మనకి కాలేజీలో ఏడుపు మీద ట్రెయినింగివ్వాలి. ఆయుధపూజరోజున బాష్పాలకి పూజలు చేయించాలి. క్షణాలమీద ఏడవడం, ఆపడం, గ్లిసరిను లేకుండా ఏడవడం, సహజంగా ఏడవడం, వేళపట్టున ఏడవడం, కృత్రిమంగా ఏడవడం అన్నీని. అలాటిదిలేక, మనవాళ్లు చాలమంది సాంసారిక జీవితంలో అడుగుపెట్టాక, నిజంగా ఏడుపువచ్చినా నిజాయితీ కనబడేలా ఏడవలేక ఏడిసినట్టేడుస్తున్నారు.... కాలేజీ చదువు జీవితంలో కొరగాకుండా పోతోంది..." అనేది.

పోవోయ్ నువ్వంతా బడాయని కొట్టి పారేసీదాన్ని గాని ఇప్పుడు తెలిసొస్తోంది. ఆడపిల్ల ఒక్క మంచిమాట అంటే ఎలా పొంగిపోతుందో, ఒక్క చురుకుమాట అంటే అంతగాను కుంగిపోతుందని తెలుసు. కాబట్టే మొగాళ్లు నిమిషానికో రకంగా మాటలాడేసి ఆడిస్తున్నారు. అందులో ఏడిపించడమే ఎక్కువ అనిపిస్తోంది చూసినకొద్దీను.

## అసలు సంగతి

ఇలా ఏడుపుగురించి ఏడుపుగొట్టు వ్యాసం రాయడం నా ఉద్దేశం కాదు. నేను రాయదలచుకున్న దాంట్లో దీనిగురించి ఇంత రాయొచ్చునా అని కూడా తెలీదు. టెక్నికల్‌గా ఇది తప్పు అనీ, అసలు విషయం వదిలేసి ఇవన్నీ రాస్తే పత్రికలవాళ్లవతల గిరాటేస్తారనీ మావారు అన్నారు. అసలు ఇలాటివి వేసుకోరనీ ఇలా భర్తమీద భార్య ఫిర్యాదు చేయడం మహాపతివ్రత లక్షణం కాదనీ కూడా అన్నారు. నేను ఇలా వ్యాసాలు రాసినంతమాత్రాన తాను మారబోయేది లేదనీ రాసేది తనను మార్చడంకోసమే కాబట్టి రాయడం మానేయవలసిందనీ సలహా చెప్పారు. ఆడదానికి అక్షరమ్ముక్కలు నేర్పడంవల్ల వచ్చే అరిష్టాలలో ఇదొకటన్నారు. నీ వ్యాసం అచ్చయినా చదవను అన్నారు. కావలిస్తే ఆ పదిరూపాయలూ తనే ఇస్తానన్నారు. చెప్పినట్టు వినకపోతే మా అత్తగారికి చెప్తాను జాగర్త అన్నారు. అప్పటికీ వినకపోతే ఖద్దరు చీరలూ బనార్సు చీరలు కట్టించి కాళ్లకి కడియాలూ, గొలుసులు, ముక్కుకి నత్తు, పాపిట బింద్రీలూ, వడ్డాణం ఒంకీలూ చేయించి అవన్నీ పెట్టుకోమని ఫోటో తీయించి హాల్లో వేళ్ళాడగడతానన్నారు. మా అబ్బాయి పెద్దవాడయ్యాక వాడికి పెళ్లి చేసుకోవద్దని నూరిపోసి బ్రహ్మచారిగా ఉంచేస్తానన్నారు. నాచేత బలవంతాన భారత రామాయణాలు చదివించేస్తానన్నారు. ఆఖరికి కోపం రెచ్చిపోయి మూడో సిగరెట్లకొట్లోకూడా (ఒకటోది ఆఫీసుదగ్గిర రెండోది ఇంటిదగ్గర ఉన్నాయి) అరువు పెట్టేస్తాననీ, వాడు పిల్లలవాడనీ, ఎప్పట్నించో బతిమాల్తున్నాడనీ, వాడికి మా సరుగుడు తోటలమీద ఎప్పటినించో ఆశగా ఉందనీ చెప్పారు. అయినా

సరేనని మా అత్తగారు నేను కలిసి ఇది రాసేశాం. అసలు పోట్లాటంతా ఇక్కడే - ఈ సిగరెట్లకొట్లదగ్గిరే రచ్చ కెక్కింది.

## పోనీగదా అనీ....

అంతవరకూ "అయ్యో పాపం మొగాడు కష్టపడి పనిచేస్తున్నాడు ఓ లక్షసిగరెట్లు కాల్చుకోనీ పాతిక సినిమాలు చూడనీ" అని నాలో నేను సర్ది చెప్పుకుని ఆయన దుబారా సహిస్తూ వచ్చాను. ఆయనకూడా, "అయ్యో పాపం, ఆడపిల్ల! ప్రేమించి పెళ్లాడాంగదా. రోజుకో మలారం గాజులూ, నెలకో డజను చీరలూ, మహా అయితే ఓ పీపాడు పౌడరు, ఓ గ్రోసు సబ్బులూ, 70 సినిమాలూ, 63 చోళీలూ కొని తగలేస్తోంది. ఇంతేగదా" అని తనలో తాను సర్దిచెప్పుకుంటూ సహిస్తూ వచ్చారట. ఈ సహనం సంగతి మొన్ననే బయటపెట్టారు. ఆవేళ చాలా గట్టిగానే వాదించుకున్నాం. నాకు చాలా కష్టం కలిగింది. మా నాన్నకూడా ఎప్పుడూ అలా వాదించలేదు. అయినా, తను ఆఫీసు కెళ్లాక నేను అన్నం మానేసి ఏడుస్తూ పడుకోలేదు. అంటే అన్నం మానేక ఏడిచానని కాదు, అలా అయితే ఆకలేసి ఏడిచిం దంటారు. నేను అన్నమూ మానలేదు. ఏడుపూ ఏడవలేదు. అందుకనే మా అత్తగారు జాలిపడలేదు ముందర. నీ కంఠమే వినబడిం దెంతసేపూను. వాడేమీ అన్లేదన్నమాట అన్నారు అసంతృప్తిగా నా కళ్లకేసి చూసి.

కాని, మా యిష్టాగోష్ఠిలో, తన గురించి కూడా చర్చ జరిగిందనీ, తాను వేలకొద్దీ అప్పడాలు వత్తడాలూ అందరికీ పంచిపెట్టడాలూ వగైరాలను ఆయన దుబారా ఖర్చులన్నారనీ చెప్పగానే ఆవిడకీ నా కష్టం అర్థమై నాయందు సానుభూతి కలిగింది. తనకష్టం వేసి అయితేనేమి, నామీద జాలివల్లనయితే నేమి కంట తడిపెట్టారు.

లోకం అలాఉంది. స్త్రీలు తమ హక్కుల కోసం పోరాడాలనుకున్నా స్త్రీలే ఓపట్టాన కలిసిరారు గదా.

అయినా కొన్ని అపనిందలు తొలిగించడం కోసం కొన్ని సంగతులు చెప్పదలచుకొన్నాను. తరవాతేనా, మా అత్తగారిలా మీరంతా నన్ను సమర్థిస్తారని.

## తన సంగతి

అసలు తను మంచివారు. కాపోతే నా సంగతి తెలిసి తెలిసి బ్రహ్మదేవుడు మా యిద్దరికీ రాసిపడేసే వాడేకాడు. ఎంత వేదాంతికైనా వేపకాయంత వెర్రి ఉంటుందన్నారు కాబట్టి అంత మంచివారూ తనొక అభిప్రాయం పట్టుకు కూర్చున్నారు. దుబారా ఆడవాళ్ల జన్మహక్కనీ, ఆడవాళ్లలో నేను అగ్రగణ్యననీ ఆయన నమ్మకం.

అసలు దుబారా అంటే ఏమిటి? మితిమీరిన ఖర్చు. మితి ఎంత? అనేది లోకమ్మీద అందరికీ పట్టించేలా ఒక్కసూత్రంలో చెప్పడం కష్టం. అలా అయితే

పూటకి పట్టెడన్నం, ఒక్క కూరముక్క, కాస్త చిక్కటి నీడ ఇచ్చే చెట్టూ చాలు. ఆపైదంతా దుబారానే. కాని అలా అంటే ఒప్పుకోరుగదా. ఒకొక్కమనిషి అవసరాలనుబట్టి తాహతునుబట్టీ, ఖర్చుయొక్క ప్రయోజనాన్ని బట్టీ ఫలానా రూపాయి దుబారా అవునా కాదా అనేది తేలాలి.



"అదే నేను చెప్పేది. రెండేసి కూరలూ, లేక జాయింటుకూరలూ, ద్వంద్వ పచ్చడులూ, పిండివంటలూ, పొరుగువారికిచ్చేవీ, పనివాళ్ళకి పంచేవీ, పారవేసేవీ, రెండేసి కుంపట్లు గాడిపొయ్యిల్లా మండుతూ ఉండడం వచ్చేపోయే జనాభా అందరికీ ఉచిత కాఫీలూ, ఇరవయ్యారో చీరా, డెబ్భై పదకొండో చోళీ, పావడాకి లేసులు, మలారంనిండా గాజులూ, రెండో నెక్లసూ, ఇంకో సిల్కుచీర, వేరే పవుడరుడబ్బా (తనకి ఒకటి కావాలి అది ముఖ్యావసరం), ఈ పధ్నాలుగున్నూ పరమ దుబారా ఖర్చులనబడును. నేనుగనక సరిపోయింది. పార్లమెంటులో అయితే అపోజిషన్‌వాళ్లు మిమ్మల్ని మీ ధోరణినీ ఉతికేసేవారు" అన్నారు తను.

## మన సంగతి

నాకు ఒళ్లుమండినా, చిరునవ్వుతోనే తనకి జవాబుచెప్పాను. తను చేస్తున్న ఖర్చులన్నీ జ్ఞాపకంచేసి (ఆ జాబితా పెద్దది. ఇక్కడ చోటుచాలదు. నాకు ఓపికాలేదు.)

ఈ 276 రున్నూ దుబారా ఖర్చులకు ముఖ్య ఉదాహరణలు అని లోకం కోడైకూస్తోంది అని చెప్పాను.

అసలు ఒక మహిళా మండలివారు 'మొగాళ్ళ దుబారాలు' గురించి స్టాటిస్టిక్స్ తీసించి ఒక పుస్తకం వేశారు. దానిమీద ఒకమహిళ పుస్తక విమర్శ రాస్తూ, 'ఈ పుస్తకం ఎవరో పురుషుడు రాసి ఉండాలి. లేదా "రచయిత్రి" (కొటేషను గమనించండి) పురుషపక్షపాతిని అయిఉండాలి. లేకపోతే పురుషుల దుబారాఖర్చుల జాబితా ఇంత చిన్న దివ్వటం ఏమిటి నామొహం' అని తీవ్రంగా ఖండించింది.

తను పకపక నవ్వేశారు. ఇదేదో విట్టు అన్నట్టు. కాని జవాబు చెప్పలేక నవ్వి ఉంటారని నా అనుమానం. హాస్యం కాదని నిరూపించేసరికి, కోపం వచ్చింది. స్నానానికి వెళ్ళిపోయారు టైము దుబారా చెయ్యలేనంటూ.

భోజనాలవేళ "బహుశా మనం స్విట్జర్లాండు వెళ్ళడం ఈ యేడాది కుదరదు. వెళ్ళినా ఐదార్నెల్లు హాలీడేకే వెళ్తాం, అప్పుడెలాగా హోటల్లో ఉంటాం. హీటింగు సదుపాయాలు వాళ్ళే చేస్తారు. మనం సొంతిల్లు కట్టించుకుని అక్కడ స్థిరనివాసం ఏర్పరుచు కున్నప్పటిమాటగదా" అన్నారు. అత్తయ్య, ఈ అర్థం కానిమాటలు విని అర్థంలేనివనుకుని గబుక్కున మైలబడి కొడుకు కణతలమీద చెయ్యివేసి చూశారు. ఉష్ణం వచ్చి కలవరిస్తున్నాడేమోనని.

## వంట సంగతి

ఆవిడ తులసికోటదగ్గరికి వెళ్ళాక, "మరేంలేదు. అమ్మని కంగారుపడొద్దను. చలిదేశాలలో ప్రతి గదిలోనూ కుంపట్లు పెట్టుకుంటారు వేడికోసం. ఇప్పట్నించీ సాధన చేస్తున్నావేమో మనం ఇప్పట్లో జినీవా వెళ్లటంలేదూ అని చెప్పొచ్చాను" అన్నారు. వంటింట్లో గాడిపొయ్యిలా మండుతున్న రెండు కుంపట్లూ చూడగానే నా కర్థమైంది. కాని నేను నవ్వలేదు. తను మాత్రం చివరంటా చెప్పేలోగానే పకపక నవ్వేశారు. పలకమారింది. నేను ముభావంగా ఉండడం చూసేసరికి కోపంవచ్చి కాబోలు గబగబ తినేసి వెళ్లిపోయారు.

ఎప్పుడు లేంది ఆ మధ్యాహ్నం ఒంటిగంట కింటికి వచ్చారు ఇద్దరు స్నేహితుల్ని తీసుకుని. నా కాతాలో కాస్త కాఫీ దుబారాచెయ్యి అన్నారు. కాఫీతాగాక, స్నేహితులు ముగ్గురూ కలిసి ఆడవాళ్ల దుబారాతనం గురించి రెండువందల యాభైవిట్లు కొటేషనులు వేశారు. శక్తివంచన లేకుండా విమర్శించారు. మాది డాబా కాబట్టి సరిపోయింది. పెంకులయితే ఎగిరిపోయేవి. రెండయినందువల్ల తప్పనిసరిగా సభ చాలించారు. వెళ్తూ వెళ్తూ నా గదిలోకివచ్చి గర్వంగా చూశారు. "విన్నావుగా లోకుల అభిప్రాయాలు" అంటూ జవాబు వినకుండా వెళ్ళిపోయారు.

## సిగరెట్ల సంగతి

సాయంత్రం వచ్చి దెప్పిపొడవడానికి సిద్ధపడుతూండగా సిగరెట్ల కొట్టువాడొచ్చాడు. సోషల్‌విజిటు కాదని, చూడగానే అనుకున్నాను.



"తమరటువేపు దయచేయటంలేదు. ఆఫీసు మారిందేమోనని అనుకున్నా నండి. లేదంటే, ఇల్లు మారారనుకున్నాను" అన్నాడు భావగర్భితంగా.

'ఎంత' అన్నారు తను.

"అద్దురుపాయండి..." (అంటే 50 రూపాయలట. ఈ సంకేతాలాయనే చెప్పారు ఓమారు) అంటే యాభైరూపాయలన్న మాట అని మా అత్తగారి చెవులో చెప్పాను.

"మీదేం దుకాణమోయ్. బట్టలకొట్టా? గడియారాల షాపా?" అన్నారు అక్కడే వున్న మా అత్తగారు.

"కాదమ్మా. అంత తాహతేదీ. సిగరెట్ల కొట్టండి. పక్కనే హోటలు పెట్టడానికి లైసెన్సు కేశానండి. ఇంకా రాలేదు" అన్నాడతను.

"ఏం సోడాలూ, కలర్లు, బిస్కట్లు, కిళ్లీలూ, నోటుబుక్కులూ, పెన్నులూ - సిరాలూ, సబ్బులు, పవుడర్లూ, నల్లమందూ అవన్నీ అమ్ముతావుగా. సిగరెట్ల కొట్టంటావేం?" అన్నారు తను చాలా కోపంతో మండిపడుతూ.

వాడు తెల్లబోయాడు. తమాయించుకుని "బాబూ నా వ్యాపారంపోతే అదేపాయగాని మీరు సిగరెట్ల ఖర్చు తగ్గించాలి. నాకే కళ్లు తిరుగుతున్నాయి" అన్నాడు.

❀ ❀ ❀ ❀

"జరిగిందేదో జరిగింది. పిల్లా రేపు చీరలవాడు రాగానే నిన్న కొన్న వాట్లో రెండు వాపసిచ్చెయ్యి. మిగతావాటికైనా పైజీతానికిస్తామని చెప్పు. ఈ నెల వీడి యదాన కొట్టమన్చెప్పు అబ్బాయికి" అన్నారు అత్తగారు ఆలోచించి.

ఇలా జరుగుతుందని నాకేం తెలుసు. మంచి ఎవర్సిల్వరు డబ్బా వస్తే ఉన్న వాటిలో మూడు చీరలిచ్చి అది పుచ్చుకొని కొత్తవి నాలుగు తెప్పించాను. తీరా ఇపుడు రెండిస్తే రెండే మిగిలాయి. కొత్తనీరొచ్చి పాతనీటిని కొట్టేసిందన్నట్టయింది.

యాభయిరూపాయలు కేవలం కాల్చి నుసిచెయ్యడానికి ఖర్చుపెట్టే మనిషి ఆడవాళ్ల చెయ్యి దుబారా అంటే ఏం చెప్పగలం. పైగా అందులో సగానికి పైగా తను కాల్చినవి కావు. కొని ఊరువాళ్లకి ధర్మం చేసుకునేవి. మర్యాద కోసం అంటారు ఏమన్నా అంటే.

కూరలు కొనడంనించీ ఇంతే, వెధవది బేడకోసం వాడితో పోట్లాడమంటావా అంటారు - పావలా వంకాయల్ని పద్ధాలుగణాలకి తనుకొనుక్కొచ్చి. నగలకెంత అవుతుందో, చెరిపించి చేయించే వాటికెంత మజూరీ అవుతుందో; చీరెలకెంత అవుతుందో అంటారు పైగా. ఈ దుబారాముందు తమ దుబారా ఎందుకూ పనికిరాదట.

## బేరీజు

కాని ఆయన చెప్పేవి దుబారాలుకావు. వాటిలో కాణీ పొల్లుపోదు. నగచేయించుకుంటే డబ్బు బాంకిలో ఉన్నట్టే. ఎప్పుడు కావాలంటే అప్పుడు ఆ డబ్బు చేతికొస్తుంది. చీరలు కొత్తవి కొన్నా, పాతవాటితో జర్మను సిల్వరు గిన్నెలూ డబ్బాలూ గ్రాటావస్తాయి. (పవుడర్లు ఖర్చులో మొగవాళ్లు ఆడవాళ్లని ఏనాడో దాటిపోయారు.) కాని సిగరెట్లకీ, సినిమాలకీ, హోటళ్లకి అయ్యే ఖర్చులో దమ్మిడీ కూడా మళ్లీ మనకిరాదు, పై పెచ్చు డాక్టరు బిల్లు పెరుగుతుంది.

పెళ్లికానివాళ్లలో కూడా అంతే. ఆడపిల్ల చీరెలకి (నగలు మానేశారుగదా) చోళీలకీ, రిబ్బన్‌లకీ అయ్యేఖర్చు, మొగపిల్లాడు గాబర్డీన్‌లకీ, డెక్రాన్‌లకీ, సిగరెట్లకీ, సినిమాలకీ, ట్రూ రొమాన్సు స్టోరీల పుస్తకాలకీ, పినప్ బొమ్మల పుస్తకాలకీ, ఆడపిల్లల్ని ఎక్కడికెళ్తే అక్కడికి వెంబడించడానికీ అయే ఖర్చులో ఎన్నోవంతు? ఇంకా పసిపిల్లల్లో కూడా అంతే. మొగపిల్లడు విరక్కొట్టే పలకలకీ, చింపేసే పుస్తకాలకీ, పారేసే పెన్సిళ్లకీ అయ్యేఖర్చు ముందు - ఆడపిల్ల జరీ పరికిణీలకీ, రిబ్బన్లకీ అయేది సగంకూడా ఉండదు.

అయినా మొగవాళ్లు బుకాయిస్తూనే ఉంటారు. ఎన్నిసార్లు చెప్పినా నగల గురించే చెబుతారు. చిరునవ్వు, లజ్జ, మంచిమనసు, సహజాభరణాలనీ - తలిదండ్రులు పెట్టని సొమ్ములు పెన్నేరులనీ (తలిదండ్రులు పెట్టినవి రోల్డుగోల్డునగలు) ఉన్న జుట్టు చాలకపోతే ఓ సవరం కొనుక్కోమనీ సలహాయిస్తారు. అంతకుమించి నగలుంటే అందం వెగటిస్తుందిట. ఏం చెప్తాంలెండి!

***(1960)***

# జడలు; వాటి తీరు

మద్రాసు మెడికల్ కాలేజీలో ఈ మధ్య స్టూడెంట్సు కట్టూ బొట్టూ ఎలా వుండాలో శాసించే రూల్సు కొన్ని అమలులోపెట్టారు.

ఆడామొగా అందరూ సాధ్యమైనంత వరకు తెల్లటి బట్టలే వేసుకోవాలనీ ఆడపిల్ల రంగు చీరలు కట్టుకున్నా అవి లేతరంగులో ఉండాలనీ ఆ రూల్సులో ఉంది. పైగా ఆడపిల్లలు జడవేసుకోకూడదు. పువ్వులు బొత్తిగా పెట్టుకోకూడదు అని కూడా ఉంది.

ముఖ్యంగా ఇందులో ఆడస్టూడెంట్ల రూల్సు విషయంలో చాలామందికి కోపంగా ఉంది. హక్కుల గురించి ముఖ్యంగా స్త్రీల హక్కుల గురించి ఇంగ్లీషులోనే మాటాడే మా ఒదినె ఫ్రెండు ఒకావిడ 'ఎట్రాషస్' 'హారిబుల్' 'టూమచ్' అంటూ కోప్పడింది. మా వదిన కాస్త తటపటాయించి 'యస్' అనేసింది. మా వదిన కూడా సోషలైటు. (ఈ మధ్యనే ఒక సొసైటీ పత్రికలో ఎవరి బొమ్మ క్రిందనో మా వదిన పేరు రాసేసి, ఈవిడ గొప్ప సోషలైటు అని రాసేశారు) ఆ పైన జడ, జడలో పువ్వులూ నిషేధించడం ఎంత తప్పన్న విషయమై ఇద్దరూ మాట్లాడుకున్నారు. మీరు చెప్పేది రైటేనండీ అన్నాను నేను. వినయంగా నవ్వుతూ. "రైటు కాక?" అంది ఆవిడ ఓ మోస్తరుగా నవ్వుతూ. నావేపు కొంచెంసేపు చూడగానే ఆవిడకి అనుమానం కలిగింది కాబోలు: మొహంలో ఓ మోస్తరు చిరాకు ప్రదర్శించింది.

నాకు నవ్వొచ్చింది. అందుకని నవ్వాను. అందుకని ఆవిడకి కోపం వచ్చింది.

కల్చర్ ఉన్నవాళ్ళు కోపం వచ్చినపుడు కోపాన్ని చూపించకూడదు. అందుకని ఆవిడ మళ్ళీ ఓ మోస్తరుగా నవ్వేసింది. ఆవిడ ఎప్పుడూ ఇంతే. పారిస్ నగరంలో ఫాషన్‌లు మారిపోయినంత దబ్బున ఆవిడ మొగంలో మోస్తర్లు మారిపోతాయి. మనుషులంటే తగని అనుమానం. నేనంటే మరీని. అందర్నీ హేళన చేసానని. ముఖ్యంగా ఆవిడని. నేను వినయంగా నవ్వుతూ చెప్పినా సరే.

స్త్రీల హక్కుల గురించి ఆవిడ మాట్లాడుతున్నపుడు నేను ఇలా నవ్వడంవల్ల ఆవిడకు కోపం వచ్చింది.

"హక్కులు లేవు లేవని గోలపెడతారు. ఉన్నవాటి గురించి, ఆడపిల్లవి నువ్వే ఇలా తేలిగ్గా నవ్వితే ఎలా" అని విసుక్కుంది. మెడికల్ కాలేజిలో రూల్సు మొగాళ్ళకి కూడా పెట్టారుగా అంది వదిన.

మొగాళ్లకి ఆ రూల్సు ఏమంత ఇబ్బంది కలిగించేవి కావు అని నా అభిప్రాయం. ఎందుకంటే మొగాళ్లు ఎంత ఫాషనబుల్‌గా ఉండాలన్నా, ఎంత ఖరీదైన

గుడ్డలు కొన్నా, సాధారణంగా సూట్లు, కన్ను చెదరగొట్టే రంగుల్లో కుట్టించుకోరు. బూడిదరంగు, లేత క్రీం కలర్, లేతనీలం లాంటివే. చాలా మంది తెల్లటివే కొంటారు. అమెరికన్ ఫాషన్‌లు ఇమిటేట్ చేసేవాళ్లు మాత్రం రంగుల బొమ్మలు, రాజకీయవార్తలూ, అచ్చుకొట్టిన న్యూస్‌పేపరు చొక్కాలూ అవీ కుట్టించుకుంటారు. ఇంక ఉంటేగింటే, కంటికి నదురుగా ఉండేది 'టై' ఒక్కటే. ఇది దండుగ అని చాలామంది అనుకుంటున్నారు. ఆ మధ్య బ్రిటనులో కూడా కొందరు ఇలాగే అనుకున్నారు. అందుకని, చిన్న దుమారం లేవతీశారు. చలి బాధ లేకుండా చొక్కాను బిగించి ఉంచడానికి కదా టై అనేది వచ్చింది, చలిలేనప్పుడు కూడా టై ఉండడము ఎందుకూ, కొన్ని ఫాషన్ రూల్సుకు బానిసలం అవడం కాదా అంటూ వాళ్లు వాదించారు. అసలు ఆ దేశంలో వేషధారణ పద్ధతులు సంఘంలో ఆచారాలు, మర్యాదలుగా కాక, రాసిపెట్టని శాసనాలుగా తయారయ్యాయి. చాలా రోజుల క్రితం వీటిని కూడా కొందరు ఎదిరించారు. ముఖ్యంగా ఈ 'టై' మర్యాద మీద బయలుదేరిన బానిసత్వ సిద్ధాంతం మన దేశంలో బాగా వర్తిస్తుంది అని నా అభిప్రాయం.

ఇందువల్ల ముఖ్యంగా ఆడపిల్ల డ్రెస్ విషయంలో రూల్సుని కొందరు విమర్శించుతున్నారు. ఈ రూల్సు ఒక కాలేజీవే కావచ్చును. కాలేజీవాళ్లకి అందుకు అధికారాలూ ఉండవచ్చు. అక్కడ చదువుకునే చాలా మందికి నచ్చవచ్చు. నచ్చకపోయినా సర్దుకు ఊరుకోనూవచ్చు. గవర్నమెంట్ ఆఫ్ ఇండియా వారు ఏణ్నర్ధం క్రితం శార్టోరియల్ రూల్సు పెట్టారు. ఉద్యోగులు ఆఫీసు టైములో వాటిని అమలుజరుపుతూనే వున్నారు.

కాని, అసలు ప్రిన్సిపుల్ దగ్గరికి వస్తేనే చిక్కు. హిందూదేశంలో ఆడపిల్ల పువ్వులు పెట్టుకోకూడదని ఆజ్ఞాపించడం బాధాకరం. పువ్వులు ఫాషన్ కాదనుకునే వాడి సంగతి వేరు. ఇలాంటివారు అట్టే మంది లేరు. పువ్వులు అందమైన ఆభరణాలు. గొప్పవి. వాటిని, మనదేశంలో ఉపయోగించినంత చక్కగా అద్భుతంగా ఏ యితర దేశంలోనూ 'ఇంతమంది' వాడరు. హవాయిలాంటి పసిఫిక్ ద్వీపాలలో ఆడామగా కూడా దండలు వేసుకుని తిరగడం అమెరికన్ సినిమాలలో చూస్తాం – పారిస్, లండన్, లాస్ ఏంజిల్స్, న్యూయార్క్ వంటి చోట్లు ఆడవాళ్లు టోపీలకి పువ్వులూ, ఆకులూ, కొంతమంది పళ్లు కాయలూ గుచ్చుకుని ఫోటోలో పడతారు. కాని, నొసట చక్కని బొట్టు పెట్టుకుని తలలోపల చెండుతురుముకునే వాళ్లు. మనదేశంలో, ముఖ్యంగా దక్షిణ భారతంలోనే కనబడతారు.

జవహర్లాల్ నెహ్రూగారు ఒక చక్కని గులాబి పువ్వుని కోటు బటన్ హోల్‌లో పెట్టుకుంటారు. పువ్వుల్ని అలంకారంగా ఇళ్లలో పెడతారు. రోగులకు అందంగా కనబడి ఆనందం కలిగిస్తాయని, పువ్వుల కుండీలను గవర్నమెంటు ఆస్పత్రిలలో పెడతారు. ఇలా పువ్వుల గురించి నేను పెద్ద కాంపోజిషన్ రాయగలను.

మా వదినె ఫ్రెండు కూడా పువ్వులు మంచివే అని ఒప్పుకుంటుంది. ఆడపిల్లలు పువ్వులు పెట్టుకోకూడదనడం ఇంజస్టిస్ అంటుంది.

"మీరు చెప్పింది రైటేనండి. ఈ ఇండియన్స్ అందరికీ పువ్వులంటే చాలా ఇష్టం" అన్నాను నేను వినయంగా నవ్వుతూ.

ఆవిడ మొహంలో గబగబ రంగులు మారాయి. కోపం వచ్చేసింది, నేను హేళన చేస్తున్నానని. ఆవిడ పెద్ద సోషలైటు కాబట్టి ఇండియనే అయినా, మన దేశం వాళ్ళ సంగతి మాట్లాడినప్పుడు (తరచుగా ఈ సంగతి రాదు) ఈ ఇండియన్స్, ఈ ఇండియా అంటుంది. ఆవిడ అంటుంది గదా అనీ నేనూ అన్నాను వినయంగానే.

కోపం వచ్చినా కల్చరుంది కాబట్టి ఆవిడ మృదువుగా నన్ను చూపులతో దాడి చేస్తూ లేచి నిల్చుంది. ఏమైనా "యిండియన్ గాళ్స్ వాలు జడ వేసుకోకూడదు పువ్వులు పెట్టుకోకూడదనడం నాకు నచ్చలేదు" అనేసి చక్కాపోయింది.

ఆవిడ వెళ్ళగానే మా అన్నయ్య వచ్చేశాడు. ఆవిడ ఉండగా మా అన్నయ్య ఎపుడూ రాడు. ఆవిడ ఇంగ్లీషులో తప్ప ఇంకో భాషలో మాట్లాడదు. మా అన్నయ్య సిగ్గుపడిపోతాడు బాధపడలేక.

"మీరు ముగ్గురూ ఇప్పటివరకూ జరిపిన చర్చ పరమ చెత్త" అన్నాడు మా అన్నయ్య గంభీరంగా. నాన్నగారు కూతవేటు దూరంలో ఎక్కడా లేకపోతే అన్నయ్య చాలా విషయాలు గంభీరంగా చెబుతాడు. అయితే ఒకటి. ముఖ్యంగా ఈ విషయంలో వాడు కొంచెం గంభీరంగానే మాట్లాడవచ్చు. ఎందుకంటే ఎం.బి.బి.యస్. చదువుతున్నాడు.

"మీరు ఇన్ని మాట్లాడుతున్నారు గానీ మా కాలేజీలో ఎవరూ బెంగ పెట్టుకోవటం లేదు. పువ్వులెవ్వరూ పెట్టుకురారు. జడలు కూడా అంతే" అన్నాడు.

"జడలంతే అంటే? జడలు వేసుకురారంటావా?" అన్నాను నేను.

"ఏడిశావు. ఎవరూ జడవేసుకోరు అన్నానేను" అన్నాడు అన్నయ్య బలే విట్టీగా మాట్లాడుతూ.

ఎక్కడనించి వచ్చారోగాని హఠాత్తుగా మా నాన్నగారు హాల్లోకి వచ్చేశారు. "ఏమిటోయ్ మాట్లాడుతున్నావ్" అన్నారు అన్నయ్యని చూసి.

నాన్నగారూ, అన్నయ్యా మాట్లాడుకుంటున్నప్పుడు చూస్తూ ఉండటం నాకు సరదా. ఐసెన్‌హోవర్, ఈడెన్, బుల్గానిన్ పినోల లాంటి బిగ్‌త్రీలు, బిగ్ ఫోర్‌లు కలుసుకున్నంత అరుదు వీళ్ళ సమావేశం. మా అన్నయ్య త్రుళ్ళిపడి, జడేసుకోవటం లేదన్నానండీ అన్నాడు.

"ఎవరూ?" అన్నారు నాన్నగారు మమ్మల్ని అన్నయ్య కోప్పడుతున్నాడనుకుని. కాని కంగారులో అన్నయ్య బుర్ర ఇంకోలా నడిచింది. ఈ మాట ఎవరన్నారని నాన్నగారడుగుతున్నారనుకుని "నేనేనండి" అన్నాడు.

"నువ్వు జడేసుకోవడం లేదంటావా? ఎలా వేసుకుంటావు. క్రూకటూ నువ్వును."

(అన్నయ్య తల క్రూకట్ ఫాషన్. ఇది అరంగుళం మేకుల్లా జుట్టు కత్తిరించే పద్ధతి. అయినా చూచేవారికి మాత్రం పెద్ద క్రాపింగ్ అన్న భ్రమ కలిగిస్తుంది(ట). ఈ ఫాషన్ "మేడిన్ అమెరికా." దీనికి మూలం – జి.ఐ.కట్. అమెరికాలో సోల్జర్లకి, తుప్పజుట్టు వల్ల జలుబు గట్రా చేస్తుందన్న అభిప్రాయంతో అంటకత్తెర వేయించేవారు.)

నాన్నగారి మాటకి అన్నయ్య మరింత కంగారుపడి తల తడుముకున్నాడు. "నేనుకాదండి. ఐమీన్ ఆడపిల్లలు. మా కాలేజీలో ఆడపిల్లలు జడేసు కోరంటున్నానండి."

"మరెవరేసుకుంటారు మొగాళ్ళా?"

"అబ్బే అది కాదండి. బన్ చుట్టుకుంటారండి చాలమంది" అన్నాడన్నయ్య సిగ్గుపడుతూ.

"ఎవరూ?" అన్నారు నాన్నగారు ఆశ్చర్యం అభినయిస్తూ.

"ఆడపిల్లలండి."

"వెరీగుడ్. మీ బళ్ళో ఆడపిల్లలు జడేసుకోరంటావు. అంతేకాక బన్ చుట్టుకుంటారంటావు. అయితే ఇప్పుడేమొచ్చిందట?"

"అబ్బే వీళ్ళకి చెబుతున్నానండి"

"ఎవళ్ళకి?" అన్నారు నాన్నగారు నవ్వుతూ.

"వీళ్ళకే" అంటూ వెనక్కి తిరిగాడు అన్నయ్య. మేము అక్కడ లేముగా.

నాన్నగారితో అన్నయ్య ఇంటర్వ్యూ చూడడం వదినకి అట్టే సయించదు. అందుకని ఆరంభంలోనే లేచి పక్కగదిలోకి వెళ్ళిపోయింది. నేను వెళ్ళిపోయి, కర్టెన్ అవతలనించి చూస్తున్నానన్నమాట.

నాన్నగారు వెళ్ళిపోయాక అన్నయ్య గజం బద్ద మింగేసినవాడిలా నిటారుగా నిలచి నడుస్తూ వచ్చాడు.

"అంచేత నామాట నిజం. చాలామంది సిగ చుట్టుకుంటారు. కొందరు బన్ చుడతారు. కాటన్ రోల్స్ పెట్టి. అసలు ఈ విషయంలో మా ఫ్రెండు అభిప్రాయం ఏమిటంటే–"

అన్నయ్య ఫ్రెండ్స్ చాలా మంది ఫాషన్‌బుల్ సర్కిల్‌లో తిరిగే మనుషులు. ఆ మధ్య ఒక ఫ్రెండు తన చెల్లెలి స్నేహితురాలితో మాట్లాడుతూ "ఆడ్రీ హెప్‌బర్న్" కట్ ఆ అమ్మాయికి చాలా బాగుంటుందని సలహాయిచ్చాడు. అంటే క్రాపింగ్ చేయించుకోమని భావం. ఆడ్రీ హెప్‌బర్న్ సినిమాస్టార్. చాలా బాగుంటుంది. ఆ దేశం (బ్రిటన్)లో ఆ సమాజంలో ఆమె క్రాపింగ్ చేయించుకున్నా నప్పుతుంది. ఒప్పుతుంది. వరవడి అవుతుంది. "రోమన్ హాలిడే" "సబ్రినా" సినిమాలలో ఆమెను

చూచిన బ్రిటిష్ అమ్మాయిలు చాలామంది ఆ ఫక్కీలో క్రాపింగ్‌లు చేయించుకున్నారట!

అలాగే ఈ మధ్య, సోవియట్ డిప్యూటీ ప్రై మినిష్టరు మాలెంకోవ్ బ్రిటన్ వెళ్లాడు. మాలెంకోవ్ పచ్చగా బొద్దుగా ఉంటాడు. ఆయన ముఖం గుండ్రంగా నిండుగా ఉంటుంది. నుదురు మీద క్రాపింగ్ ముంగురుల కట్ట ఒకటయి (స్ట్రాండ్) "S" ఆకారంలో ఉంటుంది. అది చాలా ఆకర్షణీయంగా ఉన్నదని బ్రిటిష్ ఫాషన్‌బుల్ సర్కిల్స్‌లో అనుకున్నారు. పురోగాములైన మహిళలు కొందరు తక్షణమే జుట్టు ముందరి భాగం ఆ ఫక్కీలో కత్తిరించుకుని నుదురు మీద అటువంటి స్ట్రాండ్ పెట్టుకు ముచ్చటపడ్డారు.

వాళ్లు కాపీ చేశారని, మన దేశంలో మనము బయలుదేరలేముగదా. మన సమాజములో మనకు లక్షణమైన కట్టు బొట్టూ తీరు తెన్నూ ఉన్నాయి. ఇప్పుడు కాలేజిలో జడ వేసుకోకూడదని సిగ చుట్టు కోవాలన్నారు.

నామటుకు నేను ఇటు సిగ అటు జడా (ఒకటి కాదు మూడు జతల జడలలాటివి) కూడా ఉండే పద్ధతిలో తల దువ్వుకుంటాను. కొంచెం కష్టమే. చెల్లాయో వదినో సాయంచెయ్యాలి కూడా.

## పద్ధతి:

మధ్య పాపిడతీసి జుట్టును రెండు పాయలు చెయ్యడం, చెరోపాయలోనూ ముంగురుల దగ్గర నుండి కొంత జుట్టు విడతీయాలి. దాన్ని నున్నగా దువ్వి రెండేసి పాయలు (కావాలంటే మూడు) చేసుకోవడం ఆ పైన ఆ పాయలను ఉంగరాలు తిరిగేలా మెలిపెట్టి, ముందరవేపు 'వేవ్' వచ్చేలా తీర్చిదిద్దుకోవాలి. మిగతా ఉంగరాల కట్టలను చెవుల వెనకనించి మెడమీదుగా కిందికి దింపాలి. అక్కడ నించి భుజం మీదుగా ముందరకి వదిలేయవచ్చు. ఉంగరాలుగా చుట్టినందువల్ల ఇవి పొట్టిగానే ఉంటాయి.

ఇంక, మిగతా జుట్టుకు చివరకంటా పాపిడతీసి, రెండు పాయల్ని (బన్ సిగలకిలాగే) ఉలెన్ రోల్సు సహాయంతో కజ్జికాయలలో చుట్టేసుకోవాలి. అప్పుడు వెనకసిగ, ముందు జడా తయారవుతాయి. అప్పుడు సిగలో పువ్వులు తురుముకుంటే బాగుంటుంది.

***(1959)***




"గృహమేకదా స్వర్గసీమ" అని హాయిగా పాడుకోవటానికి తోడ్పడే ముఖ్యాంశాల్లో ఒకటి- అత్తాకోడళ్లు అన్యోన్యంగా, ఆప్యాయంగా ఉండటం. అత్తాకోడళ్లు అస్తమానం కీచులాడుకునే ఇంట్లో మగవాడు క్షణంసేపైనా నిలవటం కష్టమైపోతుంది. కీచులాటలకు కారణం అత్తగారు కావచ్చు, కోడలు కావచ్చు, లేక ఇద్దరూ కావచ్చు. కనిపెంచి పెద్దచేసిన కొడుకు తన చేతుల్లోంచి జారిపోయి పరాయిచేతుల్లోకి పోతున్నాడేమోనని, ఇన్నాళ్ళు తను పెత్తనం చెలాయించిన ఇంట్లోకి పరాయమ్మాయి అడుగుపెట్టి నెమ్మదిగా అధికారం స్వాధీనం చేసుకుంటోందనీ బాధపడి అత్త, తన భర్త తనమాట వినాలి గాని ఆయన్ని శాసించేందుకు అత్త ఎవరని కోడలూ తగూలాడతారని అంటారు. తనూ ఒకప్పుడు కోడలేనని అత్త, తనూ ఒకనాటికి అత్త కాబోతున్నానని కోడలు గ్రహిస్తే కీచులాటలకు ఆస్కారం ఉండదు.

ఈ దిగువ కోడళ్ళకు కొన్ని ప్రశ్నలు, అత్తలకు కొన్ని ప్రశ్నలు ఇవ్వబడ్డాయి. ఆయా సందర్భాల్లో మీరెలా ప్రవర్తిస్తారో నిర్మొహమాటంగా మీకు మీరే సమాధానాలిచ్చుకుని, వాటినిబట్టి మార్కులు వేసుకోండి. మార్కులను బట్టి మీరెలాంటి అత్తలో, కోడళ్లో మీకు మీరే నిర్ణయించుకోండి. ఈ శీర్షిక కొంచెం కాలక్షేపానికీ, చాలావరకు మనస్తత్వ నిర్ణయానికీ కూడా తోడ్పడుతుంది. ఒకసూచన: ఒకరి స్వభావం ఒకరికి తెలుసుగదా అని అత్తగారి ప్రశ్నలకు కోడలూ, కోడలు ప్రశ్నలకు అత్తగారు తమంతటతాము సమాధానాలు వెయ్యకూడదు. ఎవరి ప్రశ్నలకు వారే సమాధానాలు వేసుకుని ఊరుకోవాలి.

## కోడళ్ళు

1. మీ పిల్లడు మీరు చెప్పినమాట వినకుండా అల్లరి చేస్తున్నాడు. మీకు కోపంవచ్చి నాలుగు అంటించి "పోయి చదువుకో" అని ఆజ్ఞాపిస్తారు. మీ అత్తగారు

వాణ్ణి వెనకేసుకొచ్చి "ఇప్పుడేం చదువు? పోయిఆడుకో" అంటారు. మీరు:



(అ) అత్తగార్ని "మీ సంగతి మీరు చూసుకుందురూ?" అని. పిల్లణ్ణి "నేను చెప్పినట్టు చేస్తావా? లేదా?" అని కసురుతారా? (ఇ) పిల్లడు ఉండగా అత్తగారితో వాదించటం మంచిది కాదని వాడు లేనప్పుడు "అది కాదత్తయ్యా! మీరలా గారాబం చేస్తే వాడు చెడిపోడూ?" అంటారా? (ఉ) "ఏదో పెద్దావిడ" అని ఊరుకుంటారా? (ఎ) మీరు చెప్పినట్టు చెయ్యటమే పిల్లాడికి మంచిదని మర్యాదగా ఆవిడతో చెబుతూనే, పిల్లడు మీమాట వినేట్టు చేసుకుంటారా?

2. అత్తగారు "గుళ్ళోకెడదాం, రావే" అనో, మరెక్కడనో వెడదాం రావే అనో ఆప్యాయంగా పిలుస్తారు. పక్కింటావిడ మధ్యాహ్నం ఆటకి సినిమాకి వెడదామని బలవంతం చేస్తుంది. మీరు:

(అ) అత్తగారిమాట కాదని సినిమాకే వెడతారా? (ఇ) ఆవిడతో గుడికివెళ్ళి, గబగబా వచ్చి సినిమాకి వెడతారా? (ఉ) సినిమా మానేసి అత్తగారితోనే వెడతారా? (ఎ) "పక్కింటావిడ పిలిస్తే వెళ్ళకపోతే బావుండదు" అని చెప్పి సినిమాకి వెడతారా?

(3) అత్తగారు మీవంట ఏమీ బాగులేదని అభిప్రాయపడుతుంది. మీరు:

(అ) "ఏదో నా చేతైనట్టు నే చేస్తున్నాను. పోనీ, మీరు చెయ్యరాదూ?" అంటారా? (ఇ) మీవంటని మీరు గట్టిగా సమర్థించుకుంటారా? (ఉ) మీవారు చప్పిడి వంటలే ఆరోగ్యం అన్నారని చెబుతారా? (ఎ) "పోనీ నేర్చుకుంటాను. చెప్పండి" అని సలహాలు అడుగుతారా?

4. మీరు తెమ్మని చెప్పిన ముఖ్యమైనదేదో తేవటం మర్చిపోయినందుకు, మీ భర్తని మీరు గట్టిగా కేకలేస్తూంటారు. అత్తగారు సంగతేమిటో తెలుసుకోకుండా కలగజేసుకుని కొడుకుని వెనకేసుకొస్తుంది. మీరు:

(అ) కోపంగా అక్కణ్నుంచి నిష్క్రమిస్తారా? (ఇ) "అది కాదత్తయ్యా. సంగతిది" అని, విడమరిచి చెప్పి అక్కడ కావిషయం వదిలేస్తారా? (ఉ) "నా విషయాల్లో కలగజేసుకోకండి మీరు" అని గట్టిగా చెబుతారా? (ఎ) "ఆ, ఏంలేదు" అని మాటమారుస్తారా?

5. మీవారు తల్లి ఎదట మీ వంటనీ, ఆవిడ వంటనీ పోల్చి, మీ వంట అమోఘమైనది కాదనే అభిప్రాయం వెల్లడిస్తారు. అత్తగారు ఇదివిని లోపల మురిసిపోతున్నా పైకి ఏమీ అనరు.

అమృతమని మీరు పురిషెడు పుచ్చుకోకమానరు. ఎందుకంటే యిచ్చేవాడి హృదయాన్నిబట్టి పుచ్చుకునేవాడి బుద్ధినిబట్టి దీని రంగు, రుచి, ప్రభావం, ఫలితం మారుతాయి. ఇచ్చింది విషమైనా, పుచ్చుకోడం చేతనైతే ఔషధం అవుతుంది. కొందరికెంత మేలు చేస్తుందో మరికొందరికి అంత కీడూ చేస్తుంది. అది అగ్నిలాటిది, అణుశక్తిలాటిది. ఎలా వాడుకుంటామన్నది మన చేతిలో పని. పొగడ్తకి విధిగా కనీసం రెండు శాల్తీలు వుండాలి. పొగిడేది, పొగిడించుకునేది. చూసి ఆనందించడానికో లేదా కామేశ్వరరావుగారు అన్నట్లు.... నన్ను పొగడలేదనో ఆ వెధవని పొగిడేస్తున్నాడే అనో దుఃఖించడానికో మూడో శాల్తీ పక్కనుంటే మరింత రక్తికడుతుంది. ఎవరికి? వినేవాడిక్కాదు. నాలుగోవాడికి. పొగిడించుకునేవాడికి జనం వుంటే ఆనందమేకాని, లేకపోయినా దిగులువుండదు. గంటల తరబడి, రోజుల తరబడి ఇంకోడి నోట వినగలిగే మాటలు మన గురించిన పొగడ్తలే. ఎంత గొప్ప కథ, కావ్యం, పురాణం అంత రక్తికట్టవు. అదో ఇంద్రజాలం లాంటిది. ఎదటివాడు మన్ని పొగుడుతున్నాడని తెలిసికూడా, మనం అలా జారిపోయేది యీ పొగడ్తల అగడ్తలో మాత్రమే.

## ఉగ్గులాంతో అలవాటు

భగవంతు డంతటివాడికిది అలవాటు. కాగా, మనుషుల దేముంది? మనుషులేకాదు - కాకిబావ? తను గానకోకిలను కానని తెలిసినా నక్కబావ వచ్చి ఒక్కపాట పాడమనేసరికి కాకిబావ పొంగిపోయి సావాసాలు పట్టుకుని మాంసం ముక్క నక్కపాలు చేసుకుంది.

మనం పిల్లలకి యీ కథ చెప్పినపుడు ముఖస్తుతివల్ల మోసపోయి కాకిబావ నోటిదగ్గిర కూడు ఎలా పోగొట్టుకుందో తెలియజెప్పం. నక్కబావ ఒక్క మస్కాతో ఎలా కాకిని బోల్తాకొట్టించిందో చెప్తాం. ఆవదం పట్టేవేళ అమ్మనాన్న, నాయనమ్మ, అన్నయ్య, ఉంటేగింటే తాతయ్య, పక్కింటి పిన్నిగారు యావన్మందీ చేరి - బాబూ ఎంత బంగారు తండ్రమ్మా అంటూ బృందగానం చేస్తారు.... వీలైతే పక్కింటి పిల్లడో, తమ్ముడో ఎంత దుర్మార్గుడో కూడా చెప్తారు. ఆ తరువాత అన్నం తినడానికీ, ఎక్కాలు చదవడానికీ, ఆడడానికీ, పాడడానికీ, అల్లరి మానడానికీ అన్నిటికీ భయభక్తులను మించి పనిచేసే చిట్కా -- 'నీ అంతవాడు లేడురా' అన్న ఒక్కముక్కే. అలా ఎదిగి



9. మీ నాన్నగారూ, మామగారూ కూడా మీ దంపతులిద్దర్నీ దీపావళికి రమ్మని రాశారు. మీరు:

(అ) దీపావళికి ఒకచోటికి వెడుతూ, సంక్రాంతికి ఇంకోచోటికి వస్తామని రాయిస్తారా? (ఇ) మీ తల్లిదండ్రుల్నీ, మీ వారి తల్లిదండ్రుల్నీ కూడా మీ దగ్గిరికే రమ్మని రాయిస్తారా? (ఉ) మీ పుట్టింటికే వెడదామని పట్టుపడతారా? - (ఎ) అత్తవారింటికే వెడతారా?.

10. మీ అత్తగారు వయసుకి పెద్దదైనా, ఇంకా వంటచేసే ఓపిక ఉంది. మీరు:

(అ) ఒకపూట ఆవిడా, ఒకపూట మీరూ వంటచేసి పద్ధతి పెట్టుకుంటారా? (ఇ) ఆవిణ్ణి 'కృష్ణా రామా' అనుకుంటూ కూర్చొమని రెండుపూటలా మీరే చేస్తారా? (ఉ) రెండు పుటలా ఆవిడనే చెయ్యమంటారా? (ఎ) వంతు ప్రకారం ఒకపూట ఆవిడ చేస్తున్నా, మీరు అవీ ఇవీ అందిస్తూ చేదోడుగా ఉంటారా?

## అత్తయ్య

1. మీ మనమళ్లో లేక మనుమరాళ్లో తెగ అల్లరి చేస్తారని మీరు చికాకు పడుతుంటారు. మీ కోడలు వాళ్ల విషయమే పట్టించుకోదు. మీరు:



(అ) సరాసరి కోడల్ని నిందిస్తారా? (ఇ) కోడల్ని దగ్గిర కూర్చోబెట్టుకుని పిల్లల్ని ఎలా పెంచాలో నెమ్మదిగా బోధిస్తారా? (ఉ) మీ పిల్లల్ని మీరు ఎలా పెంచారో, ఎలా దిద్దారో సూచనగా చెబుతారా? (ఎ) నాకెందుకులే అని ఊరుకుంటారా?

2. మీకోడలు వంటలో ప్రవీణురాలు కాదని మీ నమ్మకం. మీరు:

(అ) ఆ సంగతి నిష్కర్షగా చెప్పేస్తారా (ఇ) మాట్లాడక ఊరుకుంటారా? (ఉ) వంట బాగానే ఉందని చెప్పి సర్దుకుపోతారా? (ఎ) "అత్తయ్యా, ఈకూర ఎలా చెయ్యాలి" అని కోడలు అడిగితే మాత్రమే సలహాలిస్తారా?

3. సాధారణంగా మీరు:

(అ) ఇంటిపనుల్లో కోడలికి సహాయపడుతూ ఉంటారా? (ఇ) మీ పూచీ ఏమీలేనట్లు, ఇవతల పూచీ పుల్ల అవతల పెట్టకుండా ఊరుకుంటారా?

(ఉ) కోడలికి సహాయం చెయ్యటం అవసరమని మీకు తోచినప్పుడల్లా చేస్తారా? (ఎ) ఏదో మీకు చెయ్యాలని తోచినప్పుడు చేసి, లేనప్పుడు మానేస్తారా?

4. మీ అబ్బాయికి, కోడలికి పడటంలేదని మీరు గ్రహిస్తారు. మీ అబ్బాయి "ఏం చెయ్యి మంటావమ్మా" అని అంటాడు. మీరు:

(అ) కోడలికి లాలనగా హితవు చెబుతారా? (ఇ) కొన్నాళ్ళపాటు పుట్టింటికి పంపించెయ్యి అంటారా? (ఉ) "మీరు మీరూ సర్దుకుపోవాలిగాని మధ్య నాకెందుకూ?" అని ఊరుకుంటారా? (ఎ) ఇద్దర్నీ కూర్చోబెట్టి ఇద్దర్నీ మందలించి బుద్ధి చెబుతారా?

5. మీకూ, మీ అబ్బాయికి తెలియకుండా మీ కోడలు బట్టల కొట్లో అరువు పెట్టి పెద్దచీరె ఏదో కొనుక్కుందని పొరుగింటావిడ మాకు చేరేస్తుంది. మీరు:



(అ) వెంటనే కోడల్ని పిలిచి కోప్పడతారా? (ఇ) నిజమో కాదో తేల్చుకుని మరీ మందలిస్తారా? (ఉ) మీ అబ్బాయితో చాటుగా చెప్పేస్తారా? (ఎ) ఏమీ మాట్లాడకుండా ఊరుకుంటారా?

6. మీ అబ్బాయి తెచ్చే జీతంరాళ్లు నెల మధ్యకే హరించుకు పోవటంవల్ల అప్పులతో అవస్థపడుతూ ఉంటారు. మీ కోడలు వరస చూస్తే ఆవిడే దీనికి ముఖ్యకారణమని మీకు తోస్తుంది. వెంటనే మీరు:

(అ) కొడుకు నెదట పెట్టుకుని కోడలే ఈ అవస్థల కారణమని దులిపేస్తారా? (ఇ) కోడలు అడిగితేనే ఖర్చులు తగ్గించి పొదుపు చేసే పద్ధతులు బోధిస్తారా? (ఉ) కొడుకుతో "డబ్బు నీ దగ్గరే ఉంచుకుని, ఇల్లు నువ్వేనడుపు" అని చెబుతారా? (ఎ) కోడలికి పొదుపుచేసే పద్ధతి లాలనగా నేర్పుతారా?

7. మీకు మడీ, ఆచారం, పూజా పునస్కారాలూ ఉన్నాయి. కోడలికి ఇవేవీ లేవు. మీరు:

(అ) మీ మటుకు మీరు మడీ ఆచారం పాటిస్తూ వేరేవంట పెట్టుకుంటారా? (ఇ) కోడలు ఎడ్డెమనిషి శుచి శుభ్రత లేవని సాధిస్తూ ఉంటారా? (ఉ) కోడలికి నెమ్మదిగా నచ్చచెప్పి మీ పద్ధతులు అలవాటు చెయ్యటానికి ప్రయత్నిస్తారా (ఎ) ఈ కాలపువాళ్ళు ఇంతేనని ఊరుకుంటారా?

8. మీ కోడలు ఎప్పుడూ సినిమాలకెడుతూ, మహిళాసంఘాల కార్యక్రమాల్లో పాల్గొంటూ, పొరుగిళ్ళకు పెత్తనాలు చేస్తూ మొగుడి సంగతి, పిల్లల సంగతి పట్టించుకోవటం లేదని మీ అభిప్రాయం. మీరు:

(ఆ) పద్ధతులు మార్చుకోవాలని, లేకపోతే పిల్లలు చెడిపోతారనీ నచ్చ చెప్పటానికి ప్రయత్నిస్తారా? (ఇ) మీ అబ్బాయితో చెప్పి మందలించ మంటారా? (ఉ) నీ తిరుగుళ్ళు నాకేమీ నచ్చలేదని నిష్కర్షగా చెప్పేస్తారా? (ఎ) మాట్లాడక ఊరుకుంటారా?



(9) మీ అమ్మాయికీ, మీ కోడలికీ తరచు పచ్చగడ్డి వేస్తే భగ్గు మంటుంది. కోడలి నోటి దురుసుతనమే కారణమని మీ అభిప్రాయం, మీరు:

(అ) మీ అమ్మాయినే వెనకేసుకొస్తారా? (ఇ) అమ్మాయినే కేకలేసి కోడలినే సమర్ధిస్తారా? (ఉ) పట్టించుకోనట్లు ఊరుకుంటారా? (ఎ) ఇద్దరినీ కేకలేసి సర్ది చెబుతారా?

(10) మీ అబ్బాయి ఎప్పుడూ కోడలి పక్షమేనని, మీ యోగక్షేమాలేమీ చూడడని మీకు కష్టంగా ఉంటుంది మీరు:

(అ) ఈమాట తరుచు కోడలిమొహానే అనేస్తారా? (ఇ) ఇరుగుపొరుగుల వాళ్ళతో కష్టసుఖాలు చెప్పుకుంటున్నప్పుడు అంటూ ఉంటారా? (ఉ) కొడుకుతో చాటున చెప్పుకుంటారా? (ఎ) కడుపులో పెట్టుకుని ఊరుకుంటారా?

## మీ స్వభావం

మీరు ఎటువంటి కోడలో, ఎటువంటి అత్తగారో ఈ కిందిమార్కులవల్ల తెలుసుకోవచ్చు. 10 ప్రశ్నలకూ 10 సమాధానాలు ఇచ్చుకుని ఆయా సమాధానాలకు ఇక్కడ ఉన్న మార్కులను చూసి గుర్తుపెట్టుకుని, వచ్చిన మార్కులన్నీ కూడండి. 30-40 మధ్య మార్కులువస్తే మీరు ఆదర్శప్రాయమైన కోడలో, అత్తగారో అవుతారు. 20 లోపు మార్కులువస్తే స్వభావం కొంచెం మార్చుకోటానికి ప్రయత్నించాలన్న మాట. 20-30 మధ్య మార్కులు వస్తే ఒక మోస్తరు.

## కోడళ్ళకు

| ప్రశ్న | అ. | ఇ. | ఉ. | ఎ. | స్కోరు. |
|---|---|---|---|---|---|
| 1 | 1 | 3 | 2 | 4 | |
| 2 | 1 | 3 | 4 | 2 | |
| 3 | 1 | 2 | 3 | 4 | |
| 4 | 2 | 4 | 1 | 3 | |
| 5 | 4 | 3 | 2 | 1 | |
| 6 | 1 | 2 | 3 | 4 | |
| 7 | 3 | 1 | 4 | 2 | |
| 8 | 4 | 1 | 3 | 2 | |
| 9 | 3 | 2 | 1 | 4 | |
| 10 | 2 | 4 | 1 | 3 | |

## అత్తగార్లకు

| ప్రశ్న. | అ. | ఇ. | ఉ. | ఎ. | స్కోరు |
|---|---|---|---|---|---|
| 1 | 1 | 4 | 3 | 2 | |
| 2 | 1 | 2 | 4 | 3 | |
| 3 | 4 | 1 | 3 | 2 | |
| 4 | 3 | 1 | 2 | 4 | |
| 5 | 1 | 3 | 2 | 4 | |
| 6 | 1 | 3 | 2 | 4 | |
| 7 | 2 | 1 | 4 | 3 | |
| 8 | 4 | 3 | 1 | 2 | |
| 9 | 1 | 4 | 2 | 3 | |
| 10 | 1 | 2 | 3 | 4 | |



# వైవిధ్య రమణీయం

## లక్ష్మి

పరీక్షలు అయిపోయాయి. బీచి వొడ్డున పోతూ మాట్లాడుకుంటున్నాం నేనూ, రాముడూ. కొంత దూరం వెళ్లి మళ్లీ వెనక్కి తిరిగొచ్చి ప్లాట్‌ఫారం గట్టుమీద కూచున్నాం. అటూ ఇటూ ఏదో పోయినట్టు కొంపలు మునిగిపోయినట్టు తిరిగే యువ కవిపుంగవుల్ని పరికిస్తూ. మా రాముడు మంచి పిల్లవాడూ, బుద్ధిమంతుడూ అన్న మాట. డబ్బు విషయంలో ఓ మహా పొదుపు. వాడి పెట్లో మహా జాగ్రత్తగా ఖాళీ స్నో బుడ్లూ, చిన్న లడ్డు ముక్కకి గుచ్చి రెండు సూదులూ మొదలైనవి దాచుకుంటాడు. అవసరానికి పనికివస్తాయట. పెందలకడనే లేస్తాడు. చల్ది అన్నం భుజించడనుకోండి. హోటల్లో కాస్త కాఫీ పోసుకువచ్చి శ్రద్ధగా పుస్తకాల ముందు కూచుంటాడు. నాగభూషణరావుగారింట్లో ముందరిగదిలో వుండేవాడు. ఆయనైనా వీళ్ళ నాన్న ఆయనకు తెలిసినవాడు కనకా, వీడి వాటం అదీ చూసి ఫరవాలేదనుకునే యిచ్చాడు గది. లేకపోతే యీ రోజుల్లో ఫ్యామిలీ మనుషులు స్టూడెంట్సుకి గదులిస్తారా? నేను హాస్టల్లో వుండేవాణ్ణి. అది ఆఖరేడు మన చదువు.

అలా అరుగుమీద చల్లగాలి పీలుస్తూ కూచున్నాం. రాముడు మాత్రం ఏదో వాగుతూనే వున్నాడు. వాడి కక్కర్లేని విషయం లేదు. వంట చేయడం వచ్చు. ఆ నాగభూషణరావుగారి భార్యకీ, వీడికీ మహా స్నేహం. "ఏవండి పిన్నిగారూ యివాళ కూరలేం చేశారు?" అంటూ అడుగుతాడు తిప్పుకుంటూ. కూరలేం చేస్తారు? తింటారు....!

ఇంతలో కారొక టాగింది అంతదూరంలో. రాముడు "అదుగో ఆవిడ చూశావా షోకు యిందాకా ఓ చీరా యిపుడు బీచి షికారు కీవిడ కింకో చీర" అన్నాడు యీసడిస్తోను. ఆవిడ అంటే ఆ దిగినది ఓ అమ్మాయి కమలం రాముడుంటూన్న భూషణరావుగారి కూతురు. నాజూగ్గా వుంటుంది. అమ్మాయిని కాలేజీలో చూశా. తరవాత రాముడు గదికెళ్ళినప్పుడు వాళ్లమ్మాయని తెల్సింది. ఏమిటో అమ్మాయంటే ఒక విధమైన యిష్టం. అమ్మాయి కనిపిస్తే ఏం మాటాడకుండా చూపుదాటేవరకూ అలా నిలపడిపోతా. మళ్ళీ స్నేహితుల కార్లో వచ్చింది. రెండు జడలేసింది. పసుపు రంగు జార్జెటు చీర గాలికి ఓ పక్క కెగుర్తుంటే అమ్మాయి సన్నటి నడుమూ, ఒళ్లూ అందంగా కనిపిస్తున్నాయి. ఆ వేళ చాలా బాగుంది. వాళ్ళలా కాంటీన్‌వైపు పోయారు. చీకటిపడ్తోందని మేమూ లేచి బయల్దేరాం.

మర్నాడు మా వూరికి ప్రయాణం. రైల్లో కూచుని తోచకపోతే ఏదో పత్రిక తిరగెయ్యడం మొదలెట్టా. కిటికీలోంచి చూస్తే బయటంతా చీకటిగా వుంది. ఎంచేతో చీకటి నలుపు చూస్తూంటే సరోజ కళ్లు జ్ఞాపకమొచ్చాయి. సరోజ మా మావయ్య కూతురు. నేను ఫోర్తు ఫారం అయేదాకా మా వూర్లోనే వున్నా. మా మావయ్య వాళ్లూ వెనకవీధిలో వుండేవారు. బాగా చిన్నప్పటి నుంచి వాళ్ళింట్లో నాకు మహా చనువు. మావయ్య పెద్దాడు సుబ్బారావుకంటే సరూకీ నాకూ ఎక్కువ దోస్తీ వుండేది. సరూ కళ్లు నల్లగా, విశాలంగా వుండేవి. నాకు ఎంతో అందంగా కనిపించేవి. ఎప్పుడూ ఆ కళ్లల్లోకి చూస్తూండాలనిపించేది. సరూ నవ్వితే అదో విధంగా వుండేది.

తమాషాగా నవ్వేది. సరూ నాతో తప్ప యింకే పిల్లలతోనూ ఆడేదికాదు. ఓ రోజు దాగుడుబూచి లాడుతున్నాం. సరూ కళ్లు వెనకాలనుంచి వచ్చి గట్టిగా మూసేశా. "ఎవరో చెప్పుకో" అంటూ. 'అబ్బ తెలుసులే నొప్పెడుతోంది చేతులు తీసేద్దూ' అంది. చేతులు మెల్లిగా తీసి ఆ నల్లటి కళ్లల్లోకి చూస్తూ అలాగే నిలబడిపోయా. 'అదేమిటీ అలా చూస్తావ్. పిచ్చబ్బాయిలాగ'! అని నవ్వింది. నాకూ నవ్వొచ్చింది. ఇద్దరం మళ్ళీ చెయ్యీ చెయ్యీ కలిపి గెంతుకుంటూ పరుగెత్తాం. బాగా కుర్రాడినయినా ఆ నవ్వు ఎంచేతో ఎప్పుడూ చెవుల్లో వినిపించేది. నా కపుడు బొమ్మలెయ్యడమంటే బలే సరదాగా వుండేది. ఏవో పిచ్చి పిచ్చి గీతలు గీస్తుండేవాడిని. ఓ రోజు సరూ తన బొమ్మ గీయమంది. పరుగెత్తికెల్లి తన డ్రాయింగు బుక్కులోంచి కాయితం చింపుకొచ్చింది. వాళ్ళ నాన్నకి తెలీకుండా నీలం పెన్సిలూ, ఎర్ర రంగు పెన్సిలూ తెచ్చిచ్చింది. రంగులతో అవుతే చాలా బాగా వెయ్యొచ్చని సలహా యిచ్చింది. నేను పెద్ద ఆర్టిస్టులా కూచుని మొదలెట్టా.

ఆ బొమ్మని తనే తీసికెళ్లి పక్కింటి వాళ్లకీ, వాళ్ళ నాన్నకీ చూపించింది. వాళ్ళందరూ బొమ్మని చూసి నవ్వారు. సుబ్బారావుగారు 'కింద దాని పేరు కూడా రాసెయ్యరా లేకపోతే తెలీదు' అన్నాడు. అందరూ నవ్వినా సరోజ మాత్రం భలేవుందంది 'వాళ్ళంతా మంచివాళ్ళు కారు. వాళ్లకేం తెలీదు' అంది. తక్కిన పిల్లలతో 'మా బావలాగ బొమ్మలేశేవాళ్లు ఈ హోల్ మొత్తం ఇండియాలో లేరు. దొరలు కూడా అలా వెయ్యలేరు' అని చెప్పింది.

ఆ ఏడాది మా అత్తయ్య అన్నగారూ, వాళ్ల కుటుంబం సెలవలకొచ్చారు. వాళ్ళబ్బాయి శంకరం స్నేహమయ్యాడు. వాడికి వుంగరాల జుత్తు వుండేది. గిరిజాలబ్బాయి అనేవాళ్ళం. వాడు చాలా మంచివాడు. తగని మొహమాటం, సిగ్గూను. మొదట నే వెళ్లి మాటాడితేగాని మాటాడలా. సుబ్బారావూ నేనూ కజ్జా పెట్టుకున్నప్పుడు చూస్తూ నుంచునేవాడు. 'నాది న్యాయం ఔనా కాదా అంటే' ఔననేవాడు. వాడడిగినా ఔననేవాడు.

ఓ రోజు వూరి చెరువు దగ్గరకెళ్లాం. బాగా కింది మెట్టుమీద నుంచుని అంత దూరంలో వున్న తామరమొగ్గ తుంపడానికి చూస్తున్నా. సుబ్బిగాడు అల్లరి చేస్తున్నాడు నన్ను మొగ్గ తుంపనీయకుండా. నాకు కోపంవచ్చి వాడు రౌడీ సత్యంతో కలిసి

దుళ్ళపాకలో బీడీలు కాల్చాడని వాళ్ళ నాన్నతో చెప్తానని బెదిరించా. వాడు 'పోరా' అని ఓ తోపు తోశాడు. అసలే నాచుగా వుందేమో జారి డబుక్కున నీళ్లలో పడ్డా. సుబ్బిగాడింకేం చెయ్యలేక బిక్కమొహం వేసి ఏడుపు మొదలెట్టాడు. గట్టుపై నున్న శంకరం మాత్రం గభాలున నీటిలో కురికి జుట్టు పట్టుకుని ఒడ్డుకి లాగాడు. నేను లేచి గబగబా జేబు తడిమి చూసుకున్నా. నా గొడవేమిటంటే మావయ్య జేబు గడియారం లాగు జేబులో దాచా. నీళ్లు లోపలికెళ్లి అదెక్కడాగిపోతుందో అని. నిజంగానే ఆగిపోయింది.

మావయ్యేమంటాడోనని కంగారే తప్ప, కాస్తుంటే మునిగిచచ్చేదనన్న ధ్యాసేలేదు...

ఫోర్తుఫారం అయిపోగానే పట్నం చేరా. రెండేళ్ళదాకా మా వూరే వెళ్లలా. పబ్లికు పరీక్షలయిపోగానే శెలవులకి మళ్ళీ వూరికొచ్చా. సరోజ పెద్దదయింది. ఓణీలేస్తోంది. చాలా బాగా తయారయింది. మారిపోయింది కానీ మునపటి నల్లకళ్లూ, ఆ తమాషా నవ్వూ అలాగే వున్నాయి. మునుపటిలాగే ఎంతో చనువుగా మాట్లాడింది. ఆవేళ వాళ్లింట్లో ఏదో పేరంటం. నాకు తెలీలా. సరే ఎలాగూ వచ్చాకదా అని మావయ్య ఆఫీసు గదిలోకెళ్లి కూచున్నా, పేరంటాళ్లందరూ పోయేదాకా. పక్క గదిలో సందడంతా వినిపిస్తూనే వుంది. సరూని పాడమంటున్నారు. అది పాడనంటుంది. కానీ బలవంతం చేస్తున్నారు. అది 'లక్ష్మిని పాడమనండి బాగా పాడుతుంది' అంటోంది సరూ. ఇంతలో పాట వినబడింది గొంతుక వినగానే అలా కూచుండిపోయా ఒక్క నిముషం. ఎంతో తియ్యగా వుంది. అలాంటి గొంతుక ఎప్పుడూ వినలే. ఒళ్లొక్కమాటు వేడిగా అయిపోయింది. మెల్లిగా వరండాలోకెళ్లి తొంగి చూశా.

లక్ష్మి అంటే యీ అమ్మాయే గాబోలు. సన్నగా ఉంది. సరూ యీడే. అమ్మాయి మొహం చూస్తుంటే నా మీద ఒక సమ్మోనాస్త్రం పడ్డట్టయింది. ఆమె మొహం కోలగా వుంది సన్నటి కళ్లు. పాట అయిపోయింది. నేను గబగబా వెళ్లి మావయ్య కుర్చీలో కూచున్నాను. ఇంతలో ఓ చిన్నమ్మాయి పరుగెత్తుకుంటూ గదిలొకొచ్చింది. 'ఒసేయ్! ఒసేయ్! యిలారా అల్లరి చేయకు!' అంటూ లక్ష్మి కూడా పరుగెత్తుకుని గదిలోకొచ్చింది. నన్ను చూడలే. నేను తెల్లబోయి చూస్తూ నించున్నా. ఆ చిన్న పిల్ల నెత్తుకుని మళ్లీ వెళ్లిపోతూ నన్ను చూసింది. సిగ్గుపడింది. నవ్వొచ్చింది. పెదాలు నొక్కిపట్టి నవ్వుకుంటూ వెళ్లిపోయింది. నేనేదో అయిపోయి నట్టయిపోయా, ఎంచేతో కాళ్ళు వణికాయి. గబుక్కున కుర్చీలో కూచున్నా తరవాత సుబ్బిగాడు చెప్పాడు. లక్ష్మిదీ వూరు కాదట. వాళ్ల చుట్టాలింటికి శెలవలకొచ్చిందట. వాళ్ల వూర్లో ఏదో చదువుకుంటోందట.

ఇంగ్లీషు కథల్లోనూ, సినిమాల్లోనూ చూసేవాడిని. కథానాయిక ఎందరు యువకుల్నో చూస్తూ వుంటుంది. కానీ తన ప్రత్యేక పురుషుడు ఎపుడెపుడు తన జీవితంలోకి వస్తాడా అనే కిటికీలో కూచుని ఎదురుచూస్తుంటుంది. ఏదో

ముహూర్తాన ఒకడితో తాను పెట్టుకున్న ఆశయాలన్నీ అద్దంలో చూసినట్టు చూస్తుందట. అలాగ ఏ ముహూర్తాన చూశానోకాని నా జీవితంలో 'అమ్మాయి' లక్ష్మి అనిపించింది. ఏమిటో ఒక్కడినే కూచుని, లక్ష్మి, లక్ష్మి, అనుకునేవాడిని. ఓ రోజింట్లో కూచుని లక్ష్మి బొమ్మ గీస్తున్నా. సరూ అపుడే వచ్చింది ఆ స్కెచ్ చూపించి ఎవరిదో చెప్పుకోమన్నా. ఏమో నాకు తెలీదంది. సరిగ్గా చూడు ఆ ముక్కూ అన్నా. కాసేపు చూసింది ఏమోనబ్బా నాకు తెలీదంది. ఆవేళ పేరంటంలో పాడిన అమ్మాయని చెప్పా. సరూ అదోవిధంగా నావైపు చూసింది. మాటాడకుండా వెళ్లిపోయింది. కోపం వచ్చి వుంటుంది. తర్వాత లక్ష్మి గురించి సరూ దగ్గరెప్పుడూ ఎత్తలా.

లక్ష్మి మర్నాడే వాళ్ల వూరెళ్లిపోయింది. ప్రతిరోజూ వాళ్లింటి వైపెళ్లేవాడని. ఏమిటో ఆలోచన లొచ్చేవి. లోపల కెళ్లిపోయి అమ్మాయి అడ్రసడిగేద్దామనీ. వాళ్ళందరితోటి స్నేహం చేసుకుందామనీ, కాని ధైర్యం చాలేదికాదు.

మళ్ళీ నేను యింటరు మొదటేడు తర్వాత శలవలకి మా వూరెళ్లా. ఏమిటో యీ ఒక్క ఏడాదికే సరూ పెద్దదయిపోయినట్లనిపించింది. కాని నా దగ్గర చనువుపోలే. తన గదిలోకి తీసికెళ్లి తను కుట్టిన లేసులూ అవీ చూపించింది. బొమ్మలేస్తున్నావా అనడిగింది. నాకేమిటో దాని మాటల్లో మునుపటి చలాకీతనం పోయినట్టనిపించింది. అన్నీ పెద్ద మాటలూ కుశలప్రశ్నలూ అపుడపుడు సీరియస్‌గా మొహం పెట్టేది. మునుపటి సరూకీ, యీ పద్దెనిమిదేళ్ళ సరూకి ఎంత తేడా వుంది? ఆడవాళ్ళందరూ యీడురాగానే యిలా అయిపోతారు కాబోలు కానీ సరూ కళ్ళు నలుపూ, ఆ నలుపులో మెరుపూ పోలే. ఆ కళ్లలోకి చూస్తుంటే ఎన్నాళ్ళనుంచో చెప్పదలచుకున్న మాటల్ని చెప్పకుండా వుండలేకపోయా.

'సరూ మునుపటికన్నా అందంగా వున్నావు సుమా.'

'ఆహాఁ!' అంది నవ్వుతూ.

'నేనంత దూరంలో వుంటాకానీ నిజంగా మనసంతా యిక్కడే వుంటుంది. నేనెపుడేనా జ్ఞాపకం వస్తూవుంటానా?'

'జ్ఞాపకం రాకేం. పట్నంలో నువ్వు మీ కాలేజీ అమ్మాయిల్ని చూసి మరచిపోవాలి కాని'

సరూ చెయ్యి పట్టుకున్నా. ఎందుకో చెయ్యి వణికింది.

'సరూ! ఒక్కటడుగుతాగానీ కాదనవుకదా నన్ను....' అంటూండగానే ఈలోపుగా సుబ్బిగాడు లోపలికొచ్చాడు. – 'అక్కడ నాన్న అరుస్తుంటే

చెముడేమిటి పిలుస్తున్నాడు' అంటూ.

నే ననవలసిన దనలేకపోయా.

సరూ నాకు లేకపోతే నే నుండలేనని చెప్పలేకపోయా.

ఆ రోజు సాయంత్రం వీధివెంట వెడుతూంటే లక్ష్మి వాళ్ళ చుట్టాలిల్లు ఎదురొచ్చింది. అపుడెపుడో విన్న గొంతు వినిపించింది. సరిగ్గా చూశా. లక్ష్మి చిన్న ముక్కాలుపీట తీసుకుని గోడమీది పందిరి మల్లి మొగ్గలు కోస్తోంది మెల్లగా పాడుతూ. తెల్లటి వోణీ వేసుకుంది.

ఇంతలో లోపల పిలిచారు కాబోలు 'ఓయ్ వస్తున్నా' అంటూ లోపలికి పరిగెత్తింది. కదుల్తూంటే బంగారు తీగ మెరుస్తున్నట్టుంది. ఆవేళ నేను గాలిలో నడిచా. అసలీ ప్రపంచమే మరిచిపోయా.

మర్నాడు వాళ్లింటి వైపెళ్లా, కనిపించలా. పొద్దున్నే వెళ్లిపోయిందట వాళ్ళ వూరు. నాకు నిజంగా ఏడుపొచ్చింది. కితం ఏడాదీ సరిగ్గా యిలాగే మర్నాడెళ్లిపోయింది.

నా చదువు పూర్తయింది. మళ్లీ యిన్నాళ్ళకి మా వూరు కెడుతున్నా మా సరూని చూస్తా. నా కథ ఏమిటి? నే నెవర్ని నిజంగా ప్రేమిస్తున్నానో నాకే తెలీదు లక్ష్మినయివుంటుంది. కాని లక్ష్మి ఇపుడెక్కడుందో తెలీనేతెలీదు. నాకు లక్ష్మి యుందుండే ప్రేమని కమల ద్వారా పొందుదామనుకున్నా. కమలని నేను మొదటిసారి చూచినప్పుడు ఆ ముక్కు చూడగానే లక్ష్మి జ్ఞాపకమొచ్చింది. యిద్దరికీ మొహాల్లో పోలిక లుండవచ్చు కానీ ఎంత తేడా. లక్ష్మి నా దేవత. నా వూహాలో లక్ష్మి భూమి మీద తిరిగే మనిషికాదు. లక్ష్మి నాకోసం పుట్టింది. లక్ష్మి నా ఒక్కడిదే.

'మరి కమల నాజూకు మనిషి, షోకిల్లా, కార్లూ, అమెరికన్సులాగ మాడరన్ ఐడియల్సూ, సోషల్‌గా తిరగడం ఏర్పాటూనూ.'

ఈ విషయం యిలా ఉంది. సరూని చిన్నప్పటినించి ప్రేమించా. సరూలో వుండే అందం చిన్నప్పుడే గ్రహించా. ఎంతో స్నేహంగా చనువుగా మెలిగాం. అలాంటపుడు సరూని నేనెందుకు పెళ్లి చేసుకోకూడదు?

ఇన్ని ఆలోచనల్తో మా వూరు చేరా. మావయ్య ఇంటికి వెళ్లా. సరూ వాళ్లమ్మతోటి ఏదో మాటాడుతోంది. ఏవో సంగతులు. భోజనాలవగానే 'నాకు నిద్దరొస్తుంది బాబూ! పోయి పడుకుంటా'నని వెళ్లిపోయింది సరూ. నేనక్కడున్నానని మర్చేపోయిందేమో ననుకున్నా కాని వెళ్ళేటప్పుడు 'రేపు పొద్దున్న రా బావా! మళ్లీ యిన్నాళ్ళకు వచ్చావు మావూరు' అని వెళ్లిపోయింది. 39

ఇంతలో మా అత్త తమలపాకులూ వక్కా పట్టుకొచ్చింది. ఏవో కబుర్లు చెపుతూ 'ఏమోయ్ మా శంకరం తెలుసుగా? మా అన్నయ్య రెండోవాడు చిన్నప్పుడు గిరిజాలబ్బాయనేవారూ మా అన్నకి సరూని వాడికి చేసుకోవాలని చిన్నప్పటినుంచీ వుంది. సరే రేపు మంచి ముహూర్తం చూసి తాంబూలాలు పుచ్చుకుందా మనుకుంటున్నా.' నేను మావయ్య కేసి చూశా. తీరిగ్గా చుట్ట పొగ వదుల్తున్నాడు. నేనా విషయం గురించి యింకేమీ ప్రశ్నలడగలా. చీకటి పడిందనిచెప్పి లేచొచ్చేశా.

ఏమిటో ఈ వూర్లో వుండబుద్ధెయ్యలా. మర్నాడే పట్నం వచ్చేశా. నా బుర్రంతా అయోమయంగా, అల్లకల్లోలంగా వుంది. సరూ నాకు కాకుండా పోయింది. నా

లక్ష్మి ఎక్కడుందో కూడా తెలీదు. నా లక్ష్మిని కమలలో చూద్దామనుకున్నా కాని బయట చూస్తున్నంతసేపూ నా లక్ష్మిని చూస్తున్నట్టే వుంటుంది. కానీ మనిషే వేరు. నా లక్ష్మికీ ఈ కమలకీ ఆ విషయంలో పోలికే లేదు. నాకు కమలమీదవున్న మోజు నిజంగా కమల మీద ప్రేమ కాదు. నేను నిజంగా ప్రేమిస్తున్నదీ ప్రేమించబోయేదీ నా లక్ష్మే. కమలని కమలగా చూడను. కమలని లక్ష్మిగా చూసుకుని తృప్తిపడతా. యీ విధంగా అయితే కమలకీ నాకూ సంబంధం ఎలా కుదురుతుంది!

ఆ తర్వాత నేను పెళ్ళిమాట తలపెట్టలే. అపుడపుడు బొమ్మ గీసేవాణ్ణి. నా 'అమ్మాయిలు' అందరికీ కోలమొహాలూ సన్నటి కళ్ళూ, చిన్న పెదవులూ. నా ఆ 'అమ్మాయిల్ని' చూస్తుంటే లక్ష్మి చిన్నపిల్ల నెత్తుకుని కళ్లు కిందికి దించి పెదాలు నొక్కిపెట్టే నవ్వేది. మల్లి మొగ్గలు కోస్తూ తియ్యగా పాడేది. ఆ పాటలో కలిసిపోయి అలాగ ఎంతసేపో గాలిలోకి చూస్తూ కూచుండిపోయేవాడిని. ఏదో తెలీని బాధ అర్థం కానిది, కన్నీళ్ళ కతీతమయిన బాధ ఆవరించేది. మళ్ళీ నా లక్ష్మి పాట చల్లగాలిలా ఒంటిని ముట్టుకునేది....

శంకరం వెళ్ళగానే కాపరం పెట్టాడు. అపుడపుడు వాళ్లింటికెళ్లేవాడిని. సరోజ పిల్ల లిద్దరూ నేనొస్తే 'బాబయ్యొచ్చాడు. బాబయ్యొచ్చాడ'ని గంతులేసేవారు. సరూ 'బావా చూశావా! మావాడు నీలాగే బొమ్మలు గీస్తున్నాడు. పెద్దయ్యాక నీ అంతవాడవుతాడులే' అనేది. ఏదో జ్ఞాపకమొచ్చింది 'అపుడోమాటు ఒక ముక్కెత్తమ్మాయి బొమ్మవేస్తే నీకు కోపం వచ్చింది జ్ఞాపకముందా' అన్నా.

'అదా లక్ష్మి' అని నవ్వింది.

మళ్ళీ మామూలు ధోరణిలో 'ఆ! అన్నట్టు లక్ష్మి అంటే జ్ఞాపకమొచ్చింది నువ్వు నీ చదువు పూర్తవగానే మావూరు రాలే అదే నా పెళ్లి ముందర ఆ ఏడు క్రితమే చనిపోయిందట పాపం లక్ష్మి మశూచికం పడి' అంది.

*రమణ పేర బాపు రాసిన కథ - 7-1-1953*

# ధన్యవాదాయ - అన్యవాదాయ



సహస్రశీర్షా పురుషః
సహస్రాక్షస్సహస్రపాత్
సభూమిం విశ్వతోవృత్వా।
అత్యతిష్ఠత్ దశాంగులం॥



**తా.** ఈ భూమీ గీమీ అన్నీ కలిపి కొలిస్తే ఎంత ఎత్తో విష్ణుమూర్తి అంతకన్న పదంగుళాల ఎత్తు.

ఆర్యా,

శ్రీ ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక వారికి నమః! మీ టేస్తు యమః! ఇవాళ మీ పత్రిక జెండా ఎవరెస్టు కన్న ఏడడుగుల ఎత్తు కెదిగిపోయింది. ముఖ్యంగా సంపుటి 27 సంచిక 17 అయినట్టి 1993 జూన్ 25వ తేదీ గల పత్రిక. అన్నట్టు అందులో ప్రసిద్ధ కవి, మహాజ్ఞానీ, నిష్పక్షపాత విమర్శకుడూ, రసహృదయుడూ అయిన డా॥ శ్రీ ఆరుద్రగారు నా గురించి వ్రాసిన

ప్రత్యేక వ్యాసం అచ్చువేశారు. బొమ్మలతో.... అదీ. శ్రీ ఆంధ్రజ్యోతి సంస్థ వారికి నా అభినందనలు, ధన్యవాదాలు....

అన్నట్టు - కేవలం నా గురించి వ్రాసినందువల్ల ఇలా అంటున్నానని మీరు గాని, ఉత్తమాభిరుచి గల మీ పాఠకులుగాని అపోహపడరాదు. నాతో ఏకీభవిస్తూ ముక్కోటి దేవతలూ ఆరుకోట్ల ఆంధ్రులూ ముక్తకంఠంతో ఘోషిస్తూ అసంఖ్యాకంగా నాకు ఉత్తరాలు రాశారు. వాటిలో కొన్ని జతపరుస్తున్నాను.

ఇట్లు
రమణ

ఆర్యా,

శ్రీ ముళ్లపూడి వారిపై వ్యాసం అద్భుతం! వారం వారం ఇలాంటివే వెయ్యండి. వారి గురించి... ఇంకా చాలా రాయచ్చును.

ఇట్లు
పి. దక్షిణామూర్తి
(ఇది రమణ కలంపేరని గిట్టని వాళ్ళంటే నమ్మకండి)



ఎడిటర్జీ!

శ్రీ మూర్తిగారు చెప్పినట్లు అలాటివే మళ్లీ మళ్లీ రాయడం కష్టమైతే అవే పేజీల్ని మళ్లీ మళ్లీ వెయ్యండి.

ఇట్లు
సిహెచ్. వి. విజయలక్ష్మి
(ఇది కూడా పెన్నేమేనేమో అంటే కాబోసేమో అనుకోకండి)



మహారాజశ్రీ ఆంధ్రజ్యోతి సంపాదకుల దివ్య సముఖమునకు

ఉభయ కుశలోపరి.

మా వాడి మీద రాయించిన కబుర్లు చదివించుకు విన్నాము... మా వాడు - మీరన్నట్లు గొప్పవాడేన్మండీ!

ఇట్లు
మావాడి నాయనమ్మ
మరియు అమ్మమ్మ



డియర్ సర్స్,

రమణగార్ని గురించి వ్రాసి ఈ పత్రిక తనను తానే సన్మానించుకున్నదని నా భావము.

ఇట్లు
ఆర్కీకే

(ఆర్కీకే గారు విమర్శ కాంగ్రేసరుడు. ఆయన చచ్చినా ఎవ్వరి గురించి ఓఖ మంచిమాట అనడు వినడు.... ఆయనే అలా అన్నాడంటే.... ప్చ్ ఎందరో మహానుభావులు.)

ఇట్లు
నేనే




సర్,

రమణగారి రచనలను ఇండియా లోని అన్ని భాషలలోనే గాక ప్రపంచం లోని అన్ని భాషలలోకి అనువదించి కాపీలు ఉచితంగా గాని, చవగ్గాగాని సప్లయి చెయ్యాలి. ఈనగారు ఏ దేశపు ఏ భాషల్లోంచి ఏవేం కొట్టేశారో అనే నగ్నసత్యం తప్పక బైటపడగలదు.

నిత్యసత్యాన్వేషి
గిరీశం



మహాప్రభో!

శ్రీ రమణగారి గురించి (శ్రీరమణ కాదుస్మండీ - నేను వేరే) నూటొక్క వ్యాసాలు వారం వారం మీ/ మా అభిమాన పత్రిక - (ఇంకేది... అం... జ్యో)లో పడితే నూటొక్క కొబ్బరి కాయలు కొడతామని



మొక్కుకున్నాము. మా నోము చెడకుండా జాగర్తపడగలరని హెచ్చెరుక.

ఇట్లు

కంట్రీవైడ్ యండ్ వరల్డ్‌వైడ్ రమణా ఫాన్ క్లబ్



ఆర్యా,

పాదాభివందనములు. గిరీశంగాడు గారి వుత్తరాన్ని ఖాతరు చేయవద్దు. వాడు సత్యద్వేషి. సత్యదేవతని నగ్నంగా చూపిస్తానంటున్నాడు. మీ/మా పత్రికలో అలాంటిని పడవు గదా. తప్పు.... పాపం! సెన్సార్ చేసిపారెయ్యండి.

ఇట్లు

మళ్లీ నేనే

ఆంధ్రజ్యోతి కొని ఆరుద్రగారి ఆర్టికల్ అర్జంటుగా చదవాలి. ఓ ఫైవప్పిస్తారా? వాట్ దాని ఖరీదు నాలుగు రూ... లేనా! ఓఖే అలాక్కానీయండి. మూడే వున్నాయా?! మరీ మంచిది. నాలుగో రూపాయి ఖర్తీ పేరిట ఇంకోడి దగ్గర మరో నాలుగు లాగించేస్తాను - తంతే బూర్లె బుట్టలో పడ్డట్టు...



ఇట్లు

అప్పారావు

ఆంధ్రజ్యోతిగారూ,

మరేమో ఈ రవణగాడు నే చెప్పిన ముక్కలు రాసిపెట్టాడంతే. ఇందులో వాడిదేంలేదు. అయినా వాడి గురించి రాసి వాడి బొమ్మలే వేశారు. ఇదేం బాలేదు... ఇలా ఇంకో నాలుగు వారాలు తప్పు చేస్తే గాఠిగా ప్రెవేటు చెప్పేస్తా-



ఇట్లు
బుడుగు



ఏవండీ,

నిఝం, బుడుగు ప్రెవేటు చెప్తే లెక్కల మాస్టారుకన్నా గాఠిగా వుంటాయి. జాగర్త.

ఇట్లు
సీగాన పెసూనాంబ
(సిగ్గుపడుతూ)

*ఆంధ్రజ్యోతి సచిత్రవార పత్రిక - 9-7-1993*




ఇది భమిడిపాటి వారి రాజమండ్రి ప్రచురణల మీద తరచువేసేవారు. చూడగానే ఫలానా వారి పుస్తకం అని తెలుసుకునే వాళ్లం.

భ.కా.రా.కి నూరేళ్లు నిండాయి. ఆయన హాస్యానికి వెయ్యేళ్ల ఆయుస్సు. ఎవరీ భకారా? భమిడిపాటి కామేశ్వర రావు.

ఎందు కాయన్ని సభపెట్టి మరీ పొగుడు కోవాల్ట?

నా జాతి బహుగొప్పది అంటూ పొగిడి, పొగిడించుకున్న కవులున్నారు. కుంకల్లాలా! మీకు తెలుగు రాదు. నేర్చుకుని నా స్థాయి కెదగండి అని తిట్టి తిట్టించుకున్న వాళ్లున్నారు.

కాని సై అన్న కాణ్ణించి తన జాతి వాళ్లని వెక్కిరించి హేళన చేసి అడ్డంగా నిలువుగా ఐమూలగా చీల్చి చెండాడి పారేశి సదరు తిట్లు తిన్న జాతి చేత ఓహో శాభాస్ నువ్వురా వైతాళికుడివి అని పొగిడించుకున్న ఏకైక తెలుగు రైటరు మొనగాడు భకారా ఒక్కడే.

అదుగో ఆ యొక్క సంతోషం భరాయించుగోలేక ఇవాళ మనం నూరేళ్ల సభా సంబరం పెట్టుగుంటున్నాం. సభ ఎలా జరపాలని నిర్ణయించడానికి కచటతపలతో

ఒక కమిటీ అఘోరించింది. స్వీటు వరదరావు హోటల్లో గులాబీజామా, జిలేబీయా, శంకర విలాస్ కారబ్బూంది బుట్టా, నారాయణ బడ్డీలో ఉల్లిపాయ పకోడీయా, కిళ్లీలు



గ్రంథివాడి షాపే గదా? అధ్యక్షుడెవరూ - ఓపెన రెవడు అనే లైఫెండెత్ క్రొశ్నల మీద తీవ్రవాదం జరిగింది.

సరైన అధ్యక్షులే దొరక్క చూస్తూంటే మళ్లీ ఈ ఓపెనరుగా డెందుకు అన్నాడు క. (కమలాపతి). గోలీ షోడాకే ఓపెన రుండగా లేంది సభకి లేపోతే ఎలా అన్నాడు చ. (చలపతి). ఇగో! ఓపెనర్ను పెడితే బత్తేలు దండుగ. ఒద్దు అన్నాడు ట. (టస్సారావు). ఓపెనర్ని పెట్టకపోతే నేను వరదరావు గులాబిజామాకి ఓటెయ్యను అన్నాడు త. (తరణీరావు). నువ్వలా చేస్తే నేను బాంబేసి సభని పేల్చి పారేస్తాను. అజ్జాస్కో అన్నాడు ప. (పరంధామయ్య). తలకట్ల గాళ్లంతా శిఖపట్ల దాకా వచ్చి చివరకి ఓపెనర్ అనే మాట తొలగించి చీపు గెస్టుగా నన్ను ఖంజాయింపు చేశారు.

నేను బైరాగి టికట్టు మీద రైలుచవగ్గా వచ్చేశాను లెండి. నేను అంటే బాపూ నేనూ లెండి. ఎందుకంటే భకారా అంటే మాకు చచ్చే యిష్టం. ఎంతిష్ట మంటే ఆయన ఎదటికి వస్తే కాళ్ల మీద పూలతోటీ, లేపోతే ఫొటోకి దండలు వేసీ మురిసిపోతాం. మాకు యిష్టం కాబట్టి ఆయన్ని తల్చుగు తల్చుగు నవ్వుకోవాల్సిన ఈ సభలో మా సొంత కాకర పువ్వొత్తులు వెలిగించే సాహసం మానుకుని - మా

గుండెల్లో తెలుగు వాళ్లందరిలా ఆయన సెట్టి పెట్టిన నవ్వుల పువ్వుల మతాబాలే వెలిగిస్తాం. కాసుకోండి.

భకారాగారు మనకోసం తెలుగోపనిషత్ 'మహావాక్యాలు' నాలుగు ప్రతిపాదించారు.

తెలుగుల తెగులులను గురించిన ఆ వాక్యాలు చదివినవాడు మరిచిపోకుండా మరీ మరీ అనీ, అనుకునీ, చిరాకుపడీ, సిగ్గుపడీ ధరిమేనా బాగుపడీ లేవాలన్న దురాశ కొద్దీ - చప్పరించడానికై ఆయన మనకిచ్చిన పిప్పరమెంటు బిళ్లలివి.

మొదటిది: అహం బ్రహ్మాస్మి అన్నట్లుగానే 'నేనా? ఒహ గొప్పవాణ్ని'

రెండు: 'క-చ-ట-త-ప'లు దేని తలకట్టు దానికుండి కలిసి చావ్వు. అనైక్యత అని తాత్పర్యం.

మూడు: వాడు పైకొచేస్తున్నాడ్రోయ్! - అసూయ అంటే మన టెలుగులో చెప్పాలంటే నిఖార్సయిన జెలసీ.

నాలుగు: నామీదేనర్రోయ్!- అనుమాన ప్పిశాచం.

అయిదు: య్యాస్. అయామే టెలుగూస్! - వల్లమాలిన భాషాభిమానం.

❀ ❀ ❀ ❀

ఇద్దరు టెలుగూస్ రుషులు వందగజాల ఎడంలో కూచుని శివుడి గురించి ఘోర తపస్సు చేస్తున్నారు. ఆ యిద్దరిలో ఒహడికి ఓ కన్ను గుడ్డిది. పన్జేసేది ఒక్కటే. శివుడు వచ్చాడు. వత్సా అన్నాడు. మొదటి మనిషి దండకం ఆరంభించ బోయాడు. 'అస్సర్లేగాని, నీకేంగావాలో నాకు తెల్సు. ఓ కన్ను గుడ్డిది. దానికి చూపు కావాలంటావ్. అంతేగదా' అన్నాడు శివుడు.



'అబ్బే తమరు తప్పులో కాలేశారు. ఆ ఉన్న ఒక్క కన్నూ పోవాలి. అదీ' అన్నాడు రుషి.

'అదేం పొయ్యే కాలం?' అన్నాడు శివుడు ఆశ్చర్యంతో.

"ఆ మరేం లేదు. నా తరవాత అదుగో - ఆ రెండోవాడి కిస్తావు గదా వరం. వాడు సజావయిన మనిషిగాడు. నా కిచ్చిందానికి రెట్టింపడుగుతాడు-అందుకూ నేను ఓ కన్ను పోవాలన్నది."

మూడో కంటివాడికి ముచ్చెమటలు పోశాయి. భకారా వర్ణించిన అసూయ కిది పరాకాష్ట.



'నువ్వు నన్ను చెడ తిట్టి పోస్తున్నావట....?'

"రామ రామ. కల్లో కూడా తిట్టలేదు. నీ మీద ఒట్టు!"

"అయితే మనసులో తిట్టుగుని కుసిల్లి ఛస్తున్నావు."



మన హిందువులలో ఏ భాష ఏ తెగవాడిని చూసినా వీడు అరవ వాడు పంజాబీ వీడు బంగాళీ అని గుర్తుపట్టచ్చుగానీ తెలుగువాడిని చూసి వీడు తెలుగువాడు అని తేల్చుగుందికి బుద్ధి ప్రయోగించాలి. వాడు తెలుగు తప్ప అన్నిటినీ అనుకరిస్తాడు.

అనుకరణమే వాడి సొత్తు. ఒకడు బియ్యం మరెట్టి బాగుపడితే అంతా ఆ మరే తిప్పుతారు. ఒహడు మోటారు కారు వేస్తే అం-థా కారే. ఒహడు దివాలా తీస్తే అంథా అదే పని....

అనుకరణ మీద 'ఆవారా' చిత్రంలో ఒక చక్కని పాట ఉంది.

'మేరా జూతా హై జాపాని
మేరా పంత్లూం హై ఇంగ్లిస్థాని
సర్‌పే లాల్ టోపీ రూసీ (రష్యా)
ఫిర్ భీ దిల్ హై హిందూస్థాని'

భకారా గారు తెలుగువాడిని ఇలా పొగడాల్సి వస్తే కట్టూ బొట్టూ కాపీలంటూ చెప్పినా - చివర పంచ్‌లైను మాత్రం - 'బట్ పొగరూ హై టెల్గూస్థాని' అనేవారేమో!



వ్యాకరణం మీద విసుర్లు:-

అవ్యాకరణం కన్న కువ్యాకరణం మిన్న.

వ్యాకరణం రాయకపోతే భాష ఆగిపోతుందా?

పంచాంగం చింపేస్తే గ్రహణాలు ఆగిపోతాయా!

వ్యాకరణాలు పుట్టిన కొత్తల్లో ఆదికవి నన్నయ అథర్వణుడూ వాళ్లూ తెలుగు వ్యాకరణాన్ని సముస్కృతంలో రాశారు... ఎంచాత? తెలుగులో రాస్తే అట్టే నిలవుండవనీ - ట!

'శేషం తగాదా' అన్న నాటకంలో:-

సభ జరుగుతోంది. మొదటి అంశము దైవప్రార్థన అన్నారు అధ్యక్షులు.




సంగీతరావు:- నిటలాక్షుండి పుడెత్తి వచ్చినను గానీ....

శాస్త్రి: తెలుగుని ప్రార్థనేమిటి నీ మొహం. దేవుడికి తెలుగురాదు. సముస్కృతాన్నే గానీ

సంగీ: వృక్షాగ్రవాసీ.... నచపక్షి రాజీ....

అనగానే సభలో కల కలం - ఈ పొడుపుకథ లేవిటని.

అధ్య: కార్యదర్శిగారు ఇదంతయును ముమ్మందే నిష్కర్ష చేసి యుండవలసినదే!

అనంతం: జనగణమణ పాడవోయ్.

శేషు: అందులో ఆంధ్ర అన్నమాటగానీ కృష్ణా గోదావరీల స్మరణగానీ లేదు. కనుక వద్దు.

భావ: పోనీ వందేమాతరం పాడండి

శాస్త్రి: దేవుడు మొగాడు. వందే పితరం అని పాడాలి.

భావ: పితరం అంటే (ఛందస్సు) మాత్రలు చెడతాయి.

శాస్త్రి: మాతరం అంటే గోత్రాలు విడతాయి

ఇదీ వరస.

సభ ఆరంభమయింది.

బల: మిస్టర్ ప్రెసిడెంట్!

సభలో కొందరు: టెలుగూ - టెలుగూ ఓన్లీ - టెలుగూ ప్లీజ్ - వియార్ టెల్గూస్!

శాస్త్రి: శాంస్క్రీట్ - సంస్క్రీట్

అనం: పారాహుషార్

బల: లేడీస్ అండ్ జెం...

ఇదో వరస

'బాగు బాగు'లో భోగయ్యకి ఉత్తరం వస్తుంది. చింతామణి చదివాడు.

'ఈ మధ్య మా పిల్లకి జ్వరము వచ్చిపోయినది....'

శాంతమ్మ గొల్లుమని ఏడిచింది. 'మా పిల్లే మా పిల్లే! మంచివాళ్లు బతకర్రా! మంచిగా వుండకే అమ్మా అంటే వింది గాదండోయ్!'

బంగారు బ్బొమ్మ కూరొండితే ఒక్కతికే సరిపోయేదిగాదు.



చింతా:- మీరు పొరబడుతున్నారు. ఇక్కడ పిల్ల - 'కి' షష్ఠీ విభక్తి. జ్వరము ప్రథమా విభక్తి. జరమే కర్త. వచ్చింది జరమే. పోయిందీ జరమే. పిల్లకాదు.

సుద: నువ్వుండరా చవటలాగ. ఊరిఖే షష్ఠీ విభక్తి అని వల్లిస్తావేవిటి? - ఎవడిక్కావాలి ఆ షష్ఠీ? ఎవడిక్కావాలిరా యువర్ షష్ఠీ విభక్తీ?

'ఎప్పుడూ ఇంతే' నాటకంలో ఓ మచ్చు తునక:-



పానకాలు సావిట్లో కూచుని ఉండగా పర్వతాలు గొల్లున ఏడుస్తూ పరుగున వచ్చాడు.

పాన:- అదేమిరా - ఏమొచ్చి పడిందిరా?

పర్వ:- పానకాలూ - ఓ పానకాలూ

పాన:- చెప్పరా - ఎందుకు శోకన్నాలూ

పర్వ:- మొన్నీ మధ్యనేరా-

పాన:- ఆ! ఏవిటేవిటీ? ఎప్పుడు పోయాడూ-

పర్వ:- ఒకడు కాదురా - చాలా మందిరా.

పాన:- ఆ! ఎలారా! ఏమయ్యార్రా? పడవ గల్లంతా? లారీ బోల్తావా? ఎందరు చచ్చార్రా?

పర్వ:- చావులు కాదురా - గొప్పవాళ్లయి పోయార్రా-

పాన:- హు

పర్వ:- బాగుపడిపోతున్నార్రా

పాన:-హూఁ

పర్వ:-పైకొచ్చార్రా

పాన:- ఇంతకీ నీ ఏడుపేమిటి? మనం కూడా పైకి రాలేదనేగా

పర్వ:- కాదురా

పాన:- మరి?

పర్వ:- వాళ్లు పైకొచ్చేస్తున్నారనేరా-

'మాట వరస'లో మరికొన్ని:-

కొవ్వొత్తి తను కాలిపోతూ ఇతరులకి వెలుగిస్తుంది.

అలాగే - పొగాకు తను నాశనం అయిపోతూ తన్ని పీల్చేవాళ్లని కాల్చేస్తుంది.

ఇతరుల కోసం తగులడిపోతుంది. చుట్ట మహిమలెన్న శూలి తరమె!

అని అన్నప్పటికీ - చుట్ట వాసన పేరు కం-ప్పు

సిగరెట్ కంపు పేరు పరిమళం. అసలది ఇంగిలీషు వాసనండీ!

పైగా సిగరెట్టు మీద గొప్ప పద్యం వెలిగించారు.

నాగరికత లేని ప్రజ
సిగరెట్ చవి చూడకుండ సిగరెట్ పొగరెట్
సిగ సిగరెట్ పొగ పొగరెట్
సిగరెట్ పొగరెట్టటంట చెల్లదు 'న్యూర్లీ' ఇది 1930లోనే భకారా పలికిన పద్యం.



'వార్తలు' అన్న శీర్షిక కింద చిత్రచిత్రమైన కాలక్షేపం బటాణీలు విసిరారు. కొన్ని నమలగానే పళ్లు రాలగొట్టే రాలుగాయి బటాణీలు.

రైల్వేల గురించి:

రైలు ప్రయాణీకుల కష్టాల గురించి పరిశోధన చేసిన ఒక పెద్ద మనిషి కనిపెట్టిన సంగతేమిటంటే - రైల్వే కంపెనీ వారికిన్నీ - ప్రయాణీకులకున్నూ ఎంతో అన్యోన్యం ఉన్నదని. జనులు కంపెనీ మాట జవదాటడం లేదుట. రైలు పెట్టెలలో 'ఎంగిలి ఊయవద్దు' అని రాస్తే ఆ ప్రకారంగానే జనం అంతా పెట్టెల లోపలే - అవతల చెదరకుండా ఉమ్మి వేస్తున్నారు. మరిన్నీ కంపెనీ వారు దొంగలున్నారు జాగర్త అని బోర్డు వేస్తే - దొంగల్లేకపోతే రైల్వే వారు చిన్నబుచ్చుకుంటారన్న భయంతో - అయిష్టంగానే దొంగతనాలు యధాశక్తిగా చేస్తున్నారు.





ఒక్షపిల్లి నగరంలో చాలామంది చేరి ఒక సభ వేసి, భార్యాభర్తల విడాకుల చట్టం ఉంటేనే బాగుంటుందని ఏకగ్రీవంగా తీర్మానించారు. ఈ అభిప్రాయానికి ప్రతికూలంగా ఉన్నవాళ్లని లోపలకి రానియ్యలేదు. దూసుకువచ్చిన వాళ్లని నోరెత్తనివ్వ లేదు. ఈ తీర్మానం ప్యాసు చేసిన వారిలో చాలా మంది భార్యలూ కారు. ఆఖరికి భర్తలేనా కారు.

దుమ్ముని అణచివేయడం:

ఒక పట్టణంలోని కాఫీ హోటళ్ల ఎదట వీధి భాగాలున్నూ సోడా షాపులు ఎదట వీధి భాగాలున్నూ నాటక వగైరా శాలల చుట్టు పట్ల వీథులున్నూ ఇరుగు పొరుగు ఇళ్ల ఎదట వీధి భాగాలున్నూ అహోరాత్రస్యా తడిసే ఉండటం వల్ల లారీలతో నీళ్ల గొట్టాల ద్వారా నీరు చిమ్మి తడిపే అవసరం తప్పినందున, అంతమంది తమకు తోడ్పడుతున్నందుకు ఆ మునిసిపాలిటీ వారు తమ పౌరుల్ని (చిటికెన వేలెత్తి) అభినందించారు.



గోదావరీ తీర వాసులు పుణ్యజనులనిన్నీ, ఋషులు కూడా ననిన్నీ ఎక్కడివాళ్లూ అనుకుంటారు. పుణ్యజనులు అనడంలో ఆశ్చర్యంలేదు - ఈ

యుగంలో. ఎంచేతంటే మెయిన్ రోడ్డు మీద ఎక్కడ చూసినా జనం ముక్కుమూసుకునే నడుస్తుంటారు. స్మరించుకుంటూ వుంటారు.



**మం**త్రిపదవి

ఎవరి పని మీద వారుంటారు. కాంగ్రెసు మంత్రులు ప్రతిరోజూ ఉదయాన్ని టెలిఫోనులో 'నేను ఈ రోజూ మంత్రినేనా?' అని తమ పైవార్ని పిల్చి కనుక్కుని ఆ తరవాతే కాగితాల మీద సంతకాలు చేస్తుంటారని వింటాం.



ఇది 1937లో పరిస్థితి. ఈ నాటికి ఇన్ని ఏళ్లలో – ఈ నాటికే కాదు ఏనాటికైనా నేను మంత్రినే – నేనే మంత్రిని అని నోటి పురమాయింపులు చేసే అభ్యున్నతి సాధించాం – బాగులేదు గదూ – నవ్వు రాలేదుగదూ – అందుకే ఈ జోక్ నాది.

**చౌ**రుదత్తరపు ధోరణి'లో



ఒక చిన్న కెరటం పిల్ల:- నేను చేసే గానం తీసే రాగం వేసే విట్లూ కూసే నాదాలూ మహా మహా రసికుల వల్ల కూడా గావు. అబ్బో – నా విద్యలన్నీ ఇన్నీ కావు. నా ప్రతిభ ఇంతా అంతా కాదు. అందుకే నన్ను నా విద్యలన్నిటికీ టాకీ తీసి తీరాల్సిన బాపతే. తన్నిమిత్తం తక్షణం ఒక టాకీ కంపెనీ లేవాలనీ, లేవడం తోటే మొహం కడుక్కోడం మంచిదనిన్నీ....

చూశారా – ఎక్కడనించి ఎక్కడికో వెళ్లిపోయారు–లేవడం అన్న మాటమీద. చిన్నపుడు బాపూ, నేనూ చాలామంది టెలూగూస్‌లాగే ఇంగిలీషువాడి బుక్కులు హెచ్ అలెన్ స్మిత్, తర్బర్, పెరల్‌మన్, బెంచిలీ వాళ్లెంత సం–'పన్ను'లో అని పొంగిపోయే వాళ్లం.

ధరిమేణ భమిడిపాటి వారి 'పన్నా'గాలూ చమత్కారాల్లో మిరియాలూ చూశాక గుంజీలు తీసి లెంపలేసుకున్నాం.

మరో కెరటం..

ఈశ్వరాజ్ఞలు పదిట. నేను పదకొండోది నిలబెడుతున్నాను. ఏమిటది...

దేనికీ ఎవడి దగ్గరా పట్టుబడి పోకుండా వుండడం-

(ఈనాటి బడానాయకులు చేసిన ఘోరాలన్నీ నేరాలు కావుకదా. కేవలం పట్టుబడ్డవే అవుతాయి.)

మరి నేనో - ఛస్తే దొరకనూ-

ఎవడేనా నా ముందు తన ప్రజ్ఞని పేలిస్తే - అది నాకు తెలిస్తే - ఓస్ ఇదేట్రా అంటాను. తెలీకపోతే - ఓర్! అదేవిట్రోయ్ అంటాను. తెలుగైతే - బోడి ప్రజ్ఞ పోదూ అంటాను. అరవమైతే హా సాంబర్ అని కొట్టి పారేస్తాను. ఇంగిలీషయితే బొట్లేరు ముక్కలంటాను. పురాణం అయితే హా జనమేజయ! నవీనశాస్త్రం అయితే హా అపర అయిన్‌స్టీన్ అంటాను. ఎరుగున్నదయితే స్టేల్ అంటాను. ఎరగనిదల్లా ప్లేటు అంటాను. స్వంతం గురించి అయితే - కొయ్‌కొయ్. పరుల గురించినదయితే - శ్కాండల్, అవు టాఫ్ ప్లేస్ అంటాను. భౌతికం అయితే - పశుత్వం అంటాను. నైతికం అయితే బతకద్దుట్రా అంటాను. మతం అయితే బాష్ అంటాను. పని అయితే హంబగ్ అంటాను. ఎడమ అయితే కుడి అంటాను. ఎదుటివాడు చదువుకోనివాడైతే - యాస్ అంటాను. చదువున్న వాడయితే సాడిస్ట్ అంటాను. శ్రోత్రియుడయితే - గీతేశ్వర్ అంటాను. నవీనుడయితే మరమ్మతురావు అంటాను. పండితుడయితే దయచెయ్యరోయ్ అంటాను. పామరుడయితే నోరుమూసి మోసేస్తాను. నెగ్గి తీరతాను. విజయం దక్కి తీరుతుంది. కాదనలేదు. నాకు ఏది దక్కితే దాని పేరే విజయం.



నవ్వు:

నవ్వడం నవ్వించడం గురించిన చెణుకుల్లో - ముఖ్యంగా నవ్వించదలచే వాడికి హెచ్చరిక:

భోజనం వడ్డించేవాడు - వడ్డిస్తూ మధ్యలో తానూ రుచ్చూసి లొట్టలేస్తూ వడ్డిస్తే ఎంత అసయ్యమో-నవ్వించేవాడు - తనే నవ్వుతూ జోకులు చెప్పడం అంత



నికృష్టం - అని నవ్వు గురించి హాస్య శాస్త్రజ్ఞులు కొన్ని రకాలు చెప్పారు. స్మితం - హసితం - విహసితం వగైరా. కామేశ్వర రావుగారు తెలుగులో చక్కగా విడమర్చి మరీ వర్ణించారు.

తలకాయ నవ్వు - తలమాత్రం తెగ ఝూడిస్తూ వంచేసి కళ్లు మూసుకు నవ్వడం. లయద్దాటినవ్వు - తాళం వెయ్యడానికి వీలుగా వుండేది. తుపాకీ నవ్వు - పెదిమలు బద్దలు చేసుకుని ఠప్పున పేలేది. కొనవూపిరి నవ్వు - గుక్క తిరగని సమయం దాకా మాట్లాడి అప్పుడు ఇటు మాటా తెమలకుండా అటు నవ్వూ రాకుండా నవ్వటం. కోతినవ్వు-నవ్వేమో అని ఇతరులు భ్రమించేది. దాగుడు ముచ్చీ నవ్వు - పై అధికారి ఎవడేనా కనిపెడతాడేమో అనే భయం చొప్పున ఆపేసుగోడానికి ప్రయత్నించేటప్పటది. ఇకపోతే డోకునవ్వు, దగ్గునవ్వు, కొలిమి తిత్తి నవ్వు, గుడ్స్ బండీ నవ్వు - సరివిషపు నవ్వు నవ్వుజాతిలో చెడబుట్టి లోపలి ఏడుపుని ఓ పక్కనించీ వెళ్లగక్కేది. చివరాఖరిగా హాయినవ్వు. హాయిగా హాయిని పొందేలా హాయనిపించేలా నవ్వే అమృతపు నవ్వు. ఈ నవ్వే శతకోటి పువ్వులై మనం ఎప్పుడూ హాయిగా నవ్వుతూ నూరేళ్లూ బతకాలనే దీవెనలే ఈ భమిడిపాటి వారి హాస్య కదంబమాల.

నూరేళ్లంటే ఒక జోకు గుర్తొచ్చింది. ఒకడు తపస్సు చేస్తే నూరేళ్లు బతుకు అని దేవుడు దీవించాట్ట. చాలదూ - మరొక్క ఆర్నెల్లు కొసరు కావాలి అన్నాడు భక్తుడు. దేనికీ అన్నాడు దేవుడు. నూరేళ్లు పూర్తి చేసినందుకు సన్మానాలకి - అన్నాడు భక్తుడు. ఈ దగ్గు మాదే బాబూ! సర్వేజనాః హసినో భవన్తు.

**(ఇది విజయవాడలో జనవరి 1997లో జరిగిన పుస్తక మహోత్సవంలో భకారా శతజయంతి సభ నిమిత్తం వెలిగిన మతాబా-పు రమణ)**

# నవ్వితే నవ్వండి





దూరపు బంధువులంటే ఎవర్రా-

(పిల్లాడి గొంతుతో) ఎపుడూ ఢిల్లీలో వుండి మనింటి కస్సలు రానివాడు.

దగ్గర బంధువంటే?

(పిల్లాడి గొంతు) ఎపుడు మనింటో వుండిపోయే రకం.

చెడ్డ చుట్టాలంటే?

(లేచి పిల్లాడి గొంతుతో) చెడ్డ చుట్టాలు లేరండి - అంతా మంచివాళ్లే - కొందరు వచ్చి సంతోషపెడతారు. కొందరు వెళ్ళి సంతోషపెడతారు.

❀ ❀





పెద్దోడు:- మహాజనులారా! ఇటు గమనించండి:- ఈ మందు! ఒక్క బుడ్డి పుచ్చుకుంటే దీని మహాత్యం మీకే తెలుస్తుంది!

నన్ను చూడండి - ఈ మందు వల్లనే నాకిపుడు 726 ఏళ్ళు.

జనంలో ఒకడు:- మీ గురూగారు కోస్తున్నాడు - నిజమేనా-

శిష్యుడు: ఏమో తెలీదండీ నేనాయన దగ్గర చేరి నూటరవై మూడేళ్లే అయింది.




భర్త చొక్కా ఇప్పుకుంటున్నాడు -

భార్య (తలుపు గడియేస్తూ) ఇంత రాత్రి దాకా ఎక్కడి కెళ్ళారండీ?

(చొక్కాతో మొహం కవరు చేసుకుంటూ)

భర్త:- ఎందుకు అడుగుతావ్ నీకు తెలీదేవిటీ

భార్య (గడియ పూర్తిచేసి వస్తూ) తెలుసులెండి - మీరేం చెబుతారోననీ-

చొక్కాలోంచి చూస్తాడు.

(వెళ్ళిపోతుంది.)

❀ ❀




కుర్రాయన:- మా ఆవిడ పెళ్లయిన కొత్తలో హార్మనీ వాయించేది - పిల్లలు పుట్టాక మానేసింది.

పెద్దాయన:- సంతానం వల్ల కొన్ని సుఖాలు లేకపోలేదోయ్!

❀




ఒకటో వ్యక్తి:- మా వాడికేం! రాజా! అన్నీ రాజా బుద్ధులే.

రెండో వ్యక్తి:- గుర్రప్పందాలా?

ఒకటో వ్యక్తి:-(ఓ గుక్క తాగి లేదన్నట్టు తలూపి) రాణీలు!

(నాగార్జున సిమెంట్స్‌వారి నవ్వితే నవ్వండి టీవీ సీరియల్ స్క్రిప్ట్‌లోంచి - 1992)

# ముళ్ళపూడి వెంకటరమణ సాహితీ సర్వస్వం

రూ.

**మొదటి సంపుటం: కథారమణీయం-I** 150/-

సీతాకళ్యాణం, ఇద్దరమ్మాయిలూ-ముగ్గురబ్బాయిలూ, భగ్నవీణలూ-బాష్పకణాలూ, జనతా ఎక్స్‌ప్రెస్, సన్మానభంగం, రాజకీయ బేతాళ పంచవిశంతి - ఇతర కథలు.

**రెండవ సంపుటం: కథారమణీయం-II** 150/-

కానుక, రాధాగోపాలం లహరి, ఏకలవ్యుడు, ఋణానందలహరి, ఆకలీ-ఆనందరావు, జలప్రళయం, కృతజ్ఞత, సాక్షి, విమానం కథ - ఇతర కథలు.

**మూడవ సంపుటం: బాలరమణీయం - బుడుగు** 80/-

**నాల్గవ సంపుటం: కదంబ రమణీయం-I** 150/-

నవ్వితే నవ్వండి, పీఠికలు, వ్యాసాలూ, ఇతర రచనలు.

**ఐదవ సంపుటం: కదంబర మణీయం-II** 150/-

గిరీశం లెక్చర్లు, శ్రీకృష్ణలీలలు, వ్యాసాలు, ఇతర రచనలు.

**త్వరలో...**

**ఆరవ సంపుటం: సినీరమణీయం-I**

విక్రమార్కుని మార్కు సింహాసనం కథలు, చలనచిత్ర ప్రముఖులపై వ్యాసాలు, స్వదేశీ-విదేశీ చిత్రాలు సమీక్షలు.

**ఏడవ సంపుటం: సినీరమణీయం-II**

కథానాయకుని కథ (అక్కినేని నాగేశ్వరరావు జీవితచరిత్ర), చలనచిత్ర ప్రముఖులపై వ్యాసాలు, స్వదేశీ-విదేశీ చిత్రాల సమీక్షలు.

**ఎనిమిదవ సంపుటం: అనువాదరమణీయం**

ఎనభై రోజుల్లో భూప్రదక్షిణం, పిటి 109.

ప్రతులకు: **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**, విజ్ఞాన భవన్, హైదరాబాదు-1.
**విశాలాంధ్ర బుక్ హౌస్**, హైదరాబాదు (సుల్తాన్‌బజార్, అబిడ్స్), విజయవాడ, అనంతపురం, విశాఖపట్నం, హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.